శ్రీరస్తు

# కులదర్పణము.

## బ్రాహ్మణకుటుంబ చరిత్రములు.

ప్రథమ భాగము

గ్రంథకర్త:
శ్రీ రాజు సీతారామయ్య.
పెనుగొండ పోస్టు, పశ్చిమగోదావరి జిల్లా.

1937

[వెల రు 1—4—0
పోస్టు ఖర్చు 0—8—0

[Registered]

# అభిప్రాయములు.

గీ॥ సత్తిరాజు సీతారామ సచివు కరుణ । 'విప్రకులదర్పణం' బభివృద్ధిగాంచి
విప్రకుల భూషణంబై వెలయుగాత । సకలదేశంబులందు ప్రశస్తముగను.

ఏనుగు తమ్మిరాజు, తాపేశ్వరము.

ఆర్యా, ఈ ఉద్యమములో మీరమితమగుసంఘసేవజేయుటయేగాక, సంఘమునందలి భిన్నశాఖీయులు నేకీభవించుటకును తద్వారా అంతశ్శాఖావివాహములు ప్రోత్సహించుటకును, పూర్వుల ఆదర్శజీవితము యువకులకు, మార్గదర్శికముగా చూపుటకును, సంబంధ బాంధవ్యములకు దర్పణమువలె వివరములు తెలుపుకొనుటకును, ముందు తరమువారికి చరిత్రాత్మకముగా ఇంకను పరిశోధన కవకాశమిచ్చుటకును తోడ్పడుచున్నారు.

ఇట్లు,

డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తి. తాడేపల్లిగూడెం.

అయ్యా,

కులగోత్రములను మరచుచున్న నవయుగ ప్రజలకు తమ దర్పణము నిజస్థితిని దెలియపరచుచున్నది. ఇట్టి మహత్తర కృషి సల్పుచున్నతమకు శ్రీభాండాగార పక్షమున ఇంపుమూలముగా కృతజ్ఞత తెలియ పరచుచున్నాను. మీసంకల్పమునకు దైవ మనుకూలించును గాక.

ఇట్లు,

శ్రీ వెంకటేశ్వర పుస్తకభాండాగార కార్యదర్శి

పీతాంబరం వెంకటకృష్ణమాచార్యులు, ఉపమాక అగ్రహారం.

మధ్యరాష్ట్రములలోని ఖరగుపురమునం దుద్యోగమునందుండియుండి, ఆంధ్రులందరికి కృతపరిచయులగు శ్రీయుత భండారు దండపాణిరావుగారి నిచ్చితాభిప్రాయము. Every family should possess a copy of this ప్రతికుటుంబము వారు యీపత్రిక ఉంచికొనవలెను.

B. Dandapani

ఆయ్యా, మీరుచేయుపని మహోత్కృష్టమైనదియు, మహాకష్టసాధ్యమైనదియు, బహుధనసాధ్యమైనదియు ననితలంచితిని కాని. నలుబదేండ్లకు పూర్వము 'దేశోపకారి' స్థాపకమున దేశస్థులు కొనుకొండిన మీకది సుసాధ్యమె కాగలదను నాశతోనున్నాను. నిస్పృహుడను, నేత్రరోగిని నగునేను తమకట్టిసహాయమును జేయలేనుగాని నావంశచరిత్రమాత్రము బంపితిని.

ఇట్లు,

పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారు, కౌండిన్య నిలయము. పిఠాపురం.

తమ యుద్యమము కడుంగడు శ్రమ వ్యయములతోనున్నది మిగుల ప్రశంసనీయమై యున్నది. అతిశయమకీర్తిప్రదము.

ఇట్లు,

అభినవగౌరన గొల్లపూడి సుబ్బారావు, ఆదో

శ్రీరస్తు:
శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణే నమః

# విప్రకుల దర్పణము.

అను

## అన్నిశాఖల ఆంధ్ర బ్రాహ్మణ కుటుంబ చరిత్రములు.

**PART 1**

ప్రథమ భాగము.

గ్రంథకర్త
సత్తిరాజు సీతారామయ్య.

కంతేరు—పెనుగొండ పోష్టు. (పశ్చిమ గోదావరి జిల్లా.)

వెల రు 1–4–0, పోష్టు ఖర్చులు 0–8–0.

సర్వస్వామ్యసంకలితము.

1937

Printed at Dhanapati Press, Penugonda and
Published by S. Sitaramaiah,
Kanteru (West Godavary Dt.)

# పీఠిక.

దాదాపుగా ముప్పది సంవత్సరముల నుండి సంగ్రహి
వచ్చిన కుటుంబచరిత్రలు గ్రంథముగా వెలువరచక నిర
భూమి పాలుచేయుటకు మనసొప్పక మనవారిలో ఉదార
కొందరైన, నాకోరిక ఫలింప సాయపడకుందురా యను
ఇట్టిగొప్ప ప్రయత్నము నావలన నెరవేరునా యను సంశ
తావీయక నట్టేట దుమికిన చందమున ఈ విప్రకులమహార్ణవ
దుమికి 50 పుటలకు తక్కువగాని కుటుంబచరిత్రలు విడిసం
నెలకు రెండుసార్లు ప్రచురింప ప్రారంభించితిని. ఇప్పటికి 28
గ్రంథముప్రచురించితిని. రు 400 అప్పుచేసి 8 సంచికలు ప్ర
ఇంతవరకుచందాలవల్ల ఖర్చులకైన సరిపడలభించినదికాదు.
వరకు ఒక భాగము గ్రంథముగ ప్రచురించి స్వల్పక్రయము
టవలన మనవారి కిట్టి గ్రంథము రుచించి కొన్ని ప్రతు లమ్ము
చో యథాప్రకారము చరిత్రలు సాగించుచూ 300 పుటల
భాగముగ గ్రంథము వెలువరుచుచూ వచ్చిన అచ్చు ... స్థ
చేయక సమకూడి ఆంధ్రదేశములోని అని ... ఆత్రేయ ... హ
చరిత్రలు సాధ్యమైనంత ... ర్వలస ... గులు కాశ్యప ... చ
కొల్పుచుండుటచే యిప్పు ... హారితసగోత్రం
అన్ని కుటుంబములవారి చరిత్ర ... భారద్వాజ ,, ...
వీలు కలుగ గలదో లేదో ఈభాగవిక్రయ ... గోత్రం ... అల
గలదు. కాన సనాతన ధర్మపరాయణులు శాఖాభిమా ... అంద
ప్రోత్సాహమిచ్చెదరని నమ్ముచున్నాను. గోత్రములు ... ఇరు
భేదములు మున్నగు వివరము లుపా ... లు కౌండిన్య ... ఉప
రింపబడును. ... గులు వసిష్ట ... ఉప

శ్రీవత్సగోత్రీ ...

ఇట్లు, విధేయుడు, గ్రంథ ... గో ...
సత్తి శాస్త్రి సీతారామయ్య, కంతేరు, పెనుగొ ...
ప॥ గోదావరి జిల్లా. 1—2—19 ...

# వి ష య సూ చి క.


| ...పేరు | శాఖ | గోత్రము | పుట |
|---|---|---|---|
| ...క్కెనప్రగడవారు | ఆర్వేలనియోగులు | కౌండిన్యగోత్రం | 136 |
| ...స్త్యరాజువారు | ,, | కాశిక కాశ్యప ,, | 215 |
| ...సంశయచ్చుతునివారు, లేక అచ్చుతన్నవారు | ,, | కౌండిన్య | 154 |
| ...ర్ణ వవరపువారు | ఆ. నియోగులు | భారద్వాజ ,, | 2 |
| ...రపువారు | ఆ. నియోగులు | భారద్వాజ ,, | 94 |
| ...తంరాజువారు | ఆ. నియోగులు | కౌండిన్య ,, | 135 |
| | ,, | కాశికగోత్రీకులు | 135 |
| ...నాపురపువారు | యాజ్ఞవల్క్యనియోగులు | భారద్వాజ,, | 69 |
| ...లవరపువారు | ఆ. నియోగులు | వాధూలస ,, | 96 |
| ...రాలవారు | ఆ. నియోగులు | భారద్వాజ ,, | 62 |
| ...లమడక | గోల్లకొండవ్యాపారులు | డిటో | 62 |
| ...భొట్లవారు | తెలగ...నియోగులు ...వైదీకులు | హరితస ,, | 20 |
| చంట...లవారు | యాజ్ఞవల్క్యులు | ...ంఖ్యాయన ,, | 169 |
| ,, | ,, శైవులు | భారద్వాజ ,, | 178 |
| ...లమూ... | ,, నియోగులు | భారద్వాజ | 166 |
| అందుగులవారు, | బడగలనాటి కన్నడీలు, | శ్రీవత్స | 194 |
| ఇరువంటివారు | మద్దులు | కామకాయన విశ్వామిత్ర,, | 218 |
| ఉపద్రష్టవా... | ...వైదికులు | కౌండిన్య ,, | 14 |
| ( అనుబంధము ) | | | |
| ఉప్పలవారు | ...నియోగులు | శ్రీవత్స ,, | 209 |
| ,, | ...వల్క్యనియోగులు | కాశిక ,, | 210 |
| | బడగలనాటి కరణకమ్మలు | భారద్వాజ | 210 |
| | ఆర్వేలనియోగులు | హరితసగోత్రం | 86 |

18 ఎలకూచివారు వైదికులు కౌండిన్య ,, 100
19 ఏనుగువారు ఆ. నియోగులు వాధూలస ,, 90
(అనుబంధమునందు కొంతకలదు)
20 కనుపర్తివారు ఆర్వేలనియోగులు కౌండిన్య 113
2 కనుపర్తివారు ఆ. నియోగులు కాశ్యపగోత్రం 116
3 ,, ,, కౌశిక గోత్రీకులు 121
21 కందాళంవారు శ్రీవైష్ణవులు వాధూలసగోత్రం 247
22 కంభంమెట్టువారు ఆర్వేలనియోగులు భారద్వాజ 248
23 కళ్ళగుంటవారు వైఖానసులు గౌతమగోత్రం 64
24 కస్తూరివారు ఆర్వేలనియోగులు వాధూలస 122
(2) కరణకమ్మవ్యాపారులు విశ్వామిత్రి (అనుబంధముచూడు) 126
25 కామరాజువారు ఆర్వేలనియోగులు కాశ్యప ,, 207
(అనుబంధమునందు విశేషచరిత్ర గలదు)
26 కేశవరపువారు ఆర్వేలనియోగులు భారద్వాజ ,, 11
27 కొడమంచిలివారు వెల్నాటిఅర్చకులు ఆత్రేయ ,, 95
28 కొచ్చెర్లకోటవారు ఆర్వేలనియోగులు కాశ్యప ,, 25
29 కోటీవారు మా[illegible] హారితసగోత్రం 213
30 కొత్త[illegible] భారద[illegible] చరిత[illegible] భారద్వాజ ,, 19
31 కోనవారు ఆర్వేలనియోగులు హారితసగోత్రం 187
32 కొండముదివారు ,, కాశ్యపగోత్రం 227
33 గార్లదిన్నె వారు ఆర్వేలనియోగులు కౌండిన్య 256
34 గుమ్మరాజువారు నందవరీకనియోగులు వసిష్ట 184
2 ,, ,, శ్రీవత్సగోత్రీకులు 185
35 గూడావారు వెలనాటివైదికులు కౌశికగోత్రం 157
36 గోపరాజువారు ఆర్వేలనియోగులు భారద్వాజ ,, 137

2 ,, ,, శాండిల్యగోత్రం 139

3 ,, ,, కౌశికగోత్రం 139

4 ,, ,, చికితసగోత్రం 139

5 ,, ,, సాంఖ్యాయనగోత్రం 140

6 ,, ,, కౌండిన్యసగోత్రం 140

7 గోపరాజువారు ఆ. ని. శ్రీవత్సగోత్రం 142

8 యాజ్ఞవల్క్యనియోగులు కౌండిన్య ,, 141

37 గొడ్లపర్తివారు ఆర్వేలనియోగులు శ్రీవత్సగోత్రం 212

38 చలంచాలవారు ఆర్వేలనియోగులు ఆత్రేయస ,, 159

39 చాట్రాతివారు ఆ. నియోగులు కౌండిన్యస ,, 154

40 చిత్రకవివారు యాజ్ఞవల్క్యనియోగులు భారద్వాజ ,, 65

2 ,, శ్రీవైష్ణవులు ఆత్రేయసగోత్రం 67

41 చిల్లరవారు ఆ. నియోగులు కౌండిన్య—కౌశిక 195

42 చీమకుర్తివారు ఆర్వేలనియోగులు శ్రీవత్స , 219

43 జటప్రోలువారు వైదికులు కౌండిన్యసగోత్రం 113

44 [illegible]వల్లభులవారు కాసలనాటివైదిక్లు గౌతమ ,, 33

45 జమ్మలమడకవారు వెలనాటివైదిక్లు కౌండిన్య ,, 217

46 జొన్నాభొట్లవారు తెలనాటివైదిక్టు కాశ్యపగోత్రం 32

47 జోశ్యులవారు యాజ్ఞవల్క్యులు కాశ్యపగోత్రం 221

2 ,, శైవులు ఆత్రేయసగోత్రం 222

3 ,, వైదికులు భారద్వాజ ,, 222

4 ,, హరితస కౌండిన్య కాశ్యపగోత్రీకుల్లు 223

5 ,, ఆరామద్రావిడులు గోత్రం తెలియదు 223

48 తల్లాప్రగడవారు ఆర్వేలనియోగులు భారద్వాజ ,, 160

( అనుబంధమున కొంతచేర్చబడినది )

49 తాడికొండవారు ఆర్వేలనియోగులలో కౌశిక, శౌనక, శాండిల్య, కాశ్యప భారద్వాజగోత్రీకులుగలరు 226

50 తాతిరాజువారు ఆర్వేలనియోగులు కాశ్యపగోత్రం 100

51 తిరుపలవారు శ్రీవైష్ణవులు శఠమర్షణ ,, 16
52 తిరుమలపెద్దింటివారు వైఖానసులు భారద్వాజ ,, 87
53 తెడ్లపువారు ఆర్వేలనియోగులు కణ్వాసకశ్యపగోత్రిఘ్లు 225
54 దామెర్లవారు యాజ్ఞవల్క్య నియోగులు భారద్వాజ 252
55 నండూరివారు ఆ. నియోగులు కౌశికగోత్రం 74
2 ,, ,, శ్రీవత్సగోత్రికులు 79
3 ,, ,, కౌండిన్యగోత్రికులు 82-84
4 గార్గ్యగోత్రికులు (అనుబంధంచూడు.) 83
5 నండూరివారు, యాజ్ఞవల్క్యులు కౌండిన్య ,, 85
6 వైష్ణవులు విశ్వామిత్రగోత్రం. అనుబంధము:చూడుడు 85
56 నక్కలపల్లివారు, ఆర్వేలకమ్మెలు సాంఖ్యాయన 103
57 నల్లజర్లవారు, యాజ్ఞవల్క్యులు, కాస్యపగోత్రం 29
58 నారాయణంవారు, వైఖానసులు, భరద్వాజ 64
ఆరామద్రావిళ్ళు శైవగోత్రం అనుబంధముచూడు 64
59 పరిమివారు, ఆర్వేలనియోగులు, కౌండిన్య 224
2 వెలనాటివైదికులు, హరితసగోత్రం 224
3 యాజ్ఞవల్క్యులు, హరితసగోత్రం 224
60 పమ్మివారు, వెలనాటివైదిక్లు, కౌండిన్యసగోత్రం 228
61 ఫారసీవారు, మధ్వులు, వశిష్టగోత్రము 31
62 పంతంగివారు, తె| వై| మిత్రసగో బ. కన్నడీలు కాశ్యప 168
63 పెద్దాడవారు, ఆర్వేలనియోగి, గౌతమగోత్రం 38
64 పేరుకుంతలవారు, ఆ. నియోగులు, కౌండిన్య 167
65 పైడిపాటివారు, ఆ. నియోగులు. శఠమర్షణ 129
2 ,, ,, కౌండిన్యసగోత్రం 133
3 ,, ,, వాధూలసగోత్రం 133
4 ,, యాజ్ఞవల్క్య నియోగులు గౌతమ 134

66 పొగరువారు, ఆ. నియోగులు, భారద్వాజ 105
67 పెండ్యాలవారు, ఆ. నియోగులు; కౌండిన్య 201
2 ఆ. ని. కణ్వసగోత్రీకులు 203
3 తెలగాణ్యపు వైదిక్లు కౌండిన్యగోత్రం 203
4 వెలనాటివైదిక్లు, భారద్వాజస గోత్రం 206
68 ప్రియాగవారు, తెలనాటివైదిక్లు, కౌశికగోత్రం 97
69 బంకుపల్లెవారు, ఆరామద్రావిడ భారద్వాజ 88
70 బొల్లాప్రగడవారు, యాజ్ఞవల్క్య, నియోగ్లు, ఆత్రేయ, 6
71 భీమరాజువారు, ఆర్వేలనియోగులు, గౌతమగోత్రం 199
2 " కౌండిన్యగోత్రీక్లు 200
72 మండపాకవారు, ఆర్వేలనియోగులు. మౌద్గల్య 110
" వైదికులు, పరాశరగోత్రం 111
73 మలకపల్లివారు, ఆర్వేలనియోగులు, మౌద్గల్య 104
74 మల్లసముద్రమువారు, వైదికులు, ఆత్రేయ, 216
75 మరింగంటివారు, శ్రీవైష్ణవులు మౌద్గల్య, 189
76 మానూరివారు, మధ్వులు, భారద్వాజ, 181
77 మునుపల్లెవారు, ఆర్వేలశైవనియోగులు, కణ్వ. 5
78 రావులవారు ఆర్వేలనియోగులు కౌండిన్య 263
79 రామావఝులవారు, వెలనాటివైదికులు, హరిత, 107
80 రేవుణూరివారు, నందవరీక నియోగులు, శ్రీవత్స 178
2 నందవరీకవైదికులు, శ్రీవత్స 180
81 వల్లూరివారు, ఆర్వేలనియోగులు కౌండిన్య, 229
2 " శైవనియోగులు, భారద్వాజ 234
3 " ఆర్వేల నియోగులు, శ్రీవత్సగోత్రం 234
4 " పరాశరగోత్రీకులు, " 234
5 " కౌశికగోత్రిక్లు, 243

82 వాజపేయయాజులవారు, వెలనాటి వైదిక్లు పరాశర 105
83 వెలవెలపల్లివారు, శివద్విజులు, భారద్వాజ 104
84 శిష్టావారు, పేరూరి ద్రావిడులు వాధూలస, 35
(కాసలనాట్లు కౌండిన్య అనుబంధమున విపులముగా గలదు)
85 శ్రీపాదన్నవారు, ఆ. ని. ఆత్రేయ (చూడుఅనుబంధము) 71
86 శ్రీగిరిరాజువారు, ఆ. ని. భారద్వాజ. (చూడుఅనుబంధము) 1
87 సత్తిరాజువారు ఆ. నియోగులు, హరితసగోత్రం 43
88 సోదనపల్లెవారు ఆ. ని. కౌండిన్య 256

శ్రీ శ్రీ శ్రీ జయపురము మహారాజావారగు శ్రీ విక్రమదేవ వర్మగారి

ఆ శ య ము.

జయపురం ఫోర్టు

మకాము విశాఖపట్టణము. ౧౧—౨—౩౨

## ఆ శ య ము.

భారతదేశమందున్న సంస్థానముల యితిహాసములె యనుగ్రములై యుండ సాధారణ కుటుంబముల యితిహాసములు లేకుండుట వింతగాదు. ఆకొరంతను దీర్ప శ్రీయుత సత్తిరాజు సీతారామయ్య పంతులుగారు నియోగి కుటుంబముల యితిహాసములను "విప్రకులదర్పణ" మను పత్రిక యందుఁ బ్రకటించుచుండుట యెంతయుఁ బ్రశంసనీయము. వీరికిఁ దగు ప్రోత్సాహ మొసంగుటయేగాక పెరకుటుంబముల యితిహాసములు ప్రకటిత మగునట్లొనర్చుట యాంధ్రులకుఁ గర్తవ్యము.

ఇట్లు, శ్రీ విక్రమదేవవర్మ.

కేవలము నియోగులదే గాదు విప్రకుల దర్పణమున అన్ని శాఖల బ్రాహ్మణుల చరిత్రములు గలవు. [ ప॥ అ. ]

శారదా ప్రెస్, తెనుకు.

## విశాఖపట్టణము జిల్లాలోని శంఖవరమునుండి

ఆర్యా,

తమకుగల శ్రద్ధకు మిక్కిలి ఆనందముగనున్నది. తప్పక తమ కార్యము కొనసాగగల దని నమ్ముతాను. తమరు చాలకాలమునుండి శ్రద్ధవహించి పనిచేయుచున్నారు. ఈ కాలములో నిట్టి మహోపకార బుద్ధికల వా రెవరు వున్నారు. ఈ గ్రంథము సంచికలుక్రింద తయారు కావలెనుకాని ఒక్కసారి పూర్తి అగునని తోచదు. అందువల్లఉత్తర సంచికలకు మంచి భోగట్టా తెలియడము కలుగుచున్నది అని అనుకుంటాను. ఇంటిపేరు, స్థలనిర్దేశ్యం, గోత్ర సూత్ర ప్రవరలు, నిర్ధారణ చేయుటలో గడుదుస్తరము. ఇట్టి మహత్కార్యమునకు పూనిన తమ కీర్తి కొనియాడ తగియున్నది.

ఇట్లు,

శంఖవరమువద్ద జగ్గంపేట, విశాఖపట్టణం. మోగంటి కొండ్రాజు.

## చీరాలనుండి

ఆర్యా,

విప్రకులదర్పణ విషయ మొక్కింత డెలిసికొని పరమానంద భరితుండ నైతి. మీ రొనర్చుచున్న యీ మహత్కృతి సర్వజనహృదయంగమమై వెలయ గల దనుట నిర్వివాదాంశము. ఆంధ్రదేశమున కింతటి మహోపకృతిఁ గావింప బద్ధకంకణులైన మిమ్ముల నుతింప స్వల్పజ్ఞుండ నగు నాకుఁ బదములు స్ఫురింపమిఁజేసి పునః ప్రణామము లర్పించుచున్నాడ. మిమువంటి పుత్రరత్నములఁ గడుపారఁ గన్న యాంధ్రమాతయే గాక మిమువంటి సోదరుల ముదమార గన్న, షట్సహస్రనియోగి భూసురశాఖయు గర్వపడవలసి యున్న దను టతిశయోక్తి గానేరదు. మీ విప్రకులదర్పణమున కింకను జేర్పవలసిన వంశచరిత్రముల సంపాదించుటలో, నుడుతభక్తి నించుక నాచే నగు సహకార మొసర్పనుత్సహించుచున్నాను.

చీరాల, బద్దెపూడి రాధాకృష్ణమూర్తి.

## బెజవాడనుండి

ఆర్యా,

మీ ప్రయత్న మెంతయు ప్రశంసనీయమైనది. మీ ప్రయత్నమున కీశ్వరు డనుకూలించునుగాక! పెద్దలగు తమ ఆశయమున్ను శారీరకస్థితులున్నూ కాలపరివర్తనమున్ను విమర్శించిన యెట్టివారికయి నను విషాదమున్నూ తమ యత్నమునకు సాధ్యమగునంత చేయూత నొసగు నుత్సాహమున్ను కలిగించుచున్నవి.

బెజవాడ, 9–4–36 } ఆశుకవిశేఖర అవధానదురంధర, శ్రీపతి త్ర్యంబకరావు, శతావధాని.

## కర్నూలుజిల్లా బిలంనుండి

ఆర్యా, నమస్కారములు.

తాము విప్రకులదర్పణము అను బ్రాహ్మణచారిత్రమును సేకరించి గ్రంథరూపముగా ప్రకటించుట కుద్యమించుట సముద్రమున కేతా మెత్తినటు లుండు నని తలంచక శ్రీ శంకరాచార్యాది మతోద్ధారకులు సహితము విడనాడిన ఘనవిషయమును తాము భారవాహమని వెనుదీయక సాహసించుట విప్రుల పాలిటి కల్పతరువు వికసింప చేసిన వారగుదు రను నమ్మకముతో గ్రంథము పూర్తి అయిన తోడనే తమ ఏర్పాటుల ననుసరించి నాపేర నొక ప్రతిని పంపవలయు నని కోరెద.

బిలం. కరణం రామబ్రహ్మారావు.

## తెనాలి తాలూకా దుగ్గిరాలనుండి

అయ్యా,

యుష్మదుదార సంకల్పమున కభివందనములు.

[illegible] బ్రాహ్మణజాతి చరిత్రన

గ్రంథముచేసి అపూర్వోపకారము చేయ నున్న మీ సాయ మెన్నడును ఆంధ్రబ్రాహ్మణసమూహము మఱువజాలదు. తమరు 'విప్రకులదర్పణ' మను పేరిట పంచద్రావిడులలోని శాఖాభేదముల ననుసరించి వారి వారి కులగోత్రాది వివరములతో నొక గ్రంథమును తయారుచేయు చున్నట్లు విన నోచి కృతార్థుడ నైతిని.

తెనాలి తాలూకా, దుగ్గిరాల, సత్తెనపల్లి హనుమంతరావు.

## నెల్లూరునుండి

మహాశయా,

పూర్వకాలమునుండియు మన భారతీయులు తమ గురుపరంపరాగతమగు ఆధ్యాత్మికా జ్ఞానసుధాస్వాదనోన్మత్తలోలులై తమచిత్తంబు లనవరతము భగవచ్చింత నాయత్తముజేసి పంచభూతాత్మకమగు నీప్రపంచము కేవలము మాయాజనితమై మిథ్యయను తలంపున తమ ప్రాపంచిక జీవితాంశములనెల్ల ప్రాచీనాంధకారమున లయపరచిరి. అందు చేతనే శంకరాదిమహాపురుషుల జీవితరాజములు చారిత్రాత్మకములు గాక సందేహాస్పదమగుచున్నవి. ఆయినను ఆధునికప్రపంచమున సర్వమ్మానవసాభ్రాతృత్వోద్యమము నందేమి, మన నవ్యభారతోదయము నందేమి, లేక భావిభావౌన్నత్యమునకేమి, యిట్టిచారిత్రలు చాలాయావశ్యకములు, అందుచేతనే అనేక ప్రముఖులు, పండితాగ్రేసరులు, కేవల కవనా చాతుర్యజ గ్రంథముల దిక్కునకు, దృష్టులు బరపక చారిత్రాత్మకగ్రంథరాజసృష్టికే, తమ శక్తిసామర్థ్యముల ధారవోయుచున్నారు. అట్టిచో మీరు పూనిన సదుద్యమమెంతటి ప్రశంసార్హమో యెంతటి యానందజనకమో, యెంతటి యుపయోగకారియో యెంతటి యావశ్యకమో వేరుగ జెప్పనేల? కాన మీ యుద్యమమునకు నేను జాల యానందము చెందితిని. అచిరకాలముననే మీ గ్రంథరాజము లోక

మున నుదయించి తన సుదీప్తి పుంజములచే నాంధ్రావని ముంచి ప్రాచీనకాలానుగత అంధకారవిచ్ఛేదనాకారి యగు గాక! యని యీ పరమేశ్వరుని ప్రార్థించెద.

ఇట్లు,
నెల్లూరు. కామరాజు వాసుదేవముకుందరావు.

## తూర్పుగోదావరిజిల్లా రాజోలునుండి

విప్రకులదర్పణము:—౩౫ సం॥ క్రిందట మీరు నియోగిచరిత్ర మాత్రమే వ్రాయబూని, యిపుడు బ్రాహ్మణులందరి కుటుంబ చరిత్రలు వ్రాయబూనిరి. మీరు సముద్రమున కేత మెత్తిరి. అగుగాక, మీ ప్రయత్న మతి శ్లాఘనీయము. మీకు పరమేశ్వరుడు తోడుపడుగాక.

ఇట్లు,
రాజోలు. పొన్నాడ కృష్ణమూర్తి.

## తూర్పుగోదావరి జిల్లా గొల్లపాలెంనుండి

ఆర్యా, తమరు విప్రకులదర్పణమను పేర బ్రాహ్మణవంశచరిత్రములను వ్రాయఁ బూనుట కడుంగడు ప్రశంసనీయము. ఇట్టి మహోద్యమమునకు మున్నెవ్వరును బూనుకొనియుండలేదు. దేశౌన్నత్యమునకు చరిత్ర మూలము. మన దేశమునందు నిజమయిన చరిత్రకారులు చాల తక్కువ, ఇప్పు డిప్పు డుదారబుద్ధులును దేశభక్తి యుక్తులును నగు భవాదృశులు పూర్వచరిత్రనుగూర్చి పరిశోధించి శిలాశాసనాదులవలన గ్రహించి కొంత కొంత వారి బుద్ధికుశలతచే, నూహించి చరిత్రగ్రంథములను వ్రాయుచున్నారు. అట్టి అమూల్య ప్రయత్నములలో తమ యీ ప్రయత్న మొకటి. అట్టి మీ ప్రయత్నమునకు నేనుకూడ నా శక్తి కొలది తోడ్పడ నెంచి మా వంశవృత్తాంతమును లభించిన మట్టుకు సంగ్రహించి సంక్షేపముగా వ్రాసి యిందుతో జతపరచి పంపుచున్నాను. గొల్లపాలెం. ఇట్లు, బాలాంత్రపు వీర్రాజుపంతులు.

సాహిత్యవిశారద, చరిత్రరచనాధురీణ మహారాజశ్రీ కోన వెంకట రాయశర్మగా రిట్లు వ్రాసిరి:—

మీరు ప్రచురింపఁ దలఁచిన చరిత్రము 'ఆర్వేల వారినిగూర్చినంత మట్టుకు' ఎన్ని పొరటులైనను లెక్కజేయక ప్రచురింపఁ జేయుఁ డని కోరుచున్నాఁడను. 'ఆలస్యా దమృతం విష' మ్మను సూక్తి కలదు కదా! ప్రాజ్ఞుల కింతకన్న హెచ్చరింపఁ బనిలేదు.

ఎడిటరు ఆంధ్రసారస్వత పరిషత్పత్రిక, ఇట్లు,
స్టూవర్టుపురం బాపట్ల. కోన వెంకటరాయశర్మ.

## గుంటూరునుండి

ఆర్యా, తాము తలపెట్టిన యీ కార్యము మీకుగల కులాభిమానము వెలిబుచ్చుచున్నది. సర్వేశ్వరుఁ డగు శ్రీ మన్నారాయణుఁడు తమకు పరిపూర్ణాయురారోగ్యముల నొసంగి తమచే కూర్పబడిన 'విప్రకులదర్పణమును' బ్రాహ్మణులకు త్వరలోకన్నుల పండువుగా నందజేయుదురు గాత యని ప్రార్థించుచున్నాను. ఇట్లు,
గుంటూరు. కానుకొలను లక్ష్మీకాంతరావు.

## నడిగూడెంనుండి

ఆర్యా, ఇపు డున్నస్థితిలో తాము స్వతంత్రించి గ్రంథము ప్రకటించ వేడుచున్నాను. సాధ్యమైనంత త్వరలో విప్రకుల చరిత్ర లోకమున యశశ్చంద్రికలు వెదజల్లు నని యాశించుచున్నాను. అందులకై యీశ్వరుని ప్రార్థించుచున్నాను.

నడిగూడెం. ఆచంట రాజగోపాలరావు.

---

## నిడదవోలునుండి.

మిత్రమా, మీ ఆశయము మిక్కిలి విచారణీయము. ఎట్లయినను వంశ చారిత్రము ప్రచురణార్హ గ్రంథము. అదియెట్లైనను వెలువడ వల యును. మీరువ్రాసినటుల గ్రంథముగా ప్రచురించినయెడల వెల్లడియగు టయే కష్టము. తప్పులు సవరణ చేయుటయు దుర్లభమే. అందుచేత పత్రికా ముఖమున వెల్లడి యగుటయే సర్వదా, శ్రేయస్కరము.

నిడదవోలు. ఇట్లు, ఆచంట సూర్యనారాయణరాజు.

చెన్నపురినుండి శ్రీయుత వేమవరపు రామదాసు పంతులుగారు B. A. B. L. అడ్వకేటు అండు ప్రావిన్సియల్ కోఆపరేటివు బ్యాంకు ప్రసిడెంటుగారు ఇచ్చిన అభిప్రాయము:—

శ్రీయుత సత్తిరాజు సీతారామయ్యగారు ఆంధ్రులకు చిరపరిచి తులు. వారి 'దేశోపకార' పత్రిక చదివిన వారనేకులుందురు. చిర కాలమునుండియు వారు ఆంధ్రదేశ మందలి విఖ్యాత బ్రాహ్మణకుటుం బముల చరిత్రను వ్రాయుటకు కృషి చేయుచుండిరి. శాఖాభేదములు పాటింపక అన్నిశాఖల బ్రాహ్మణచరిత్రమును వీరు 'విప్రకులదర్పణ' మనుపేరుతో ప్రకటింపనున్నారు. ఇప్పటికి రమారమి ఆరువేల కుటుంబ ములచరిత్రసంగ్రహింపగలిగిరి. వారివ్రాతప్రతినుండి శ్రీయుత సీతారా మయ్యపంతులుగారు కొన్నిభాగములను నాకు చదివివినిపించిరి. ఆభాగ ములు మిక్కిలి చక్కగ విపులముగ వ్రాయబడియున్నవి. గ్రంథమం తయు అట్లే వ్రాయబడిన దనుటకు సందియములేదు. చక్కనివివర ములు సనిదర్శనములతో సమకూర్పబడి యున్నవి. గోత్రములును యింటిపేర్లనుగూడ భేదించి యున్నను కొన్ని కుటుంబము లెట్లు పూర్వ మొకప్పుడు ఒక్క సంతతిలోనివారైనట్లు నిరూపింప బడిన భాగ

ములు మిక్కిలి ఆహ్లాదమును గొల్పుచున్నవి. కొంత కాలమునకీ చరిత్రలకు గల ఆధారములు నశించి తమ కుటుంబ వృత్తాంతము తమకే తెలియని స్థితి సంభ వించుచున్నది. ఇట్టి ఆపత్తును అరికట్టు ఈచరిత్రను వ్రాసి ప్రచురింప సమకట్టిన శ్రీ సీతారామయ్య పంతులుగారు ఆంధ్రదేశమునకు చేయనున్న మహోపకారమునకు ఆంధ్రులు కృతజ్ఞులుగా నుండవలెను. వారి ప్రయత్నముల కన్ని విధముల తోడ్పడి వారి గ్రంథప్రచురమునకు ధనసహాయము చేయవలె నని ఆంధ్రలోకమును వేడుచున్నాను. చెన్నపట్టణం, ఇట్లు వేమవరపు రామదాసు.

మద్రాసు సర్వీసు కమీషను మెంబరుగారగు మహారాజశ్రీ రావు బహద్దరు మంత్రి ప్రగడ నరసింహము పంతులు బి. ఎ. బి. యల్ గారి అభిప్రాయము:—

శ్రీయుత సత్తిరాజు శీతారామయ్యగారు విప్రకులదర్పణ మను పేరున నొక యుద్గ్రంథమును తయారు చేయుచున్నారని విని చాలసంతసించితిని. వీరు చాలా వత్సరములనుండి దేశమంతయు దిరిగి యిప్పటికి అనేక వేలసంఖ్యగల విప్రకులములయొక్క చరిత్రలను సంపాదించి వానిని ప్రచురింప పూనుకొను చున్నారు. వీరు వ్రాయుచున్న గ్రంథమునుండి కొన్నిభాగములు నాకు చదివి వినిపించిరి. వంశముల యొక్క పూర్వ వృత్తాంతములను ఆయా వంశములయందలి ముఖ్యపురుషుల సంక్షేపమగు చరిత్రను సమకూర్చి వ్రాయుటచే యీ గ్రంథము చాలా అవసరమనియు ఉపయోగ కరమనియు నాఅభిప్రాయము. ఈ చరిత్ర రాబోవు సంతతివారికి చాలా ఆనందము కలిగింపక మానదు. వీరియుద్యమమున కందరును సహాయము చేయుదురుగాక యని నమ్ముచున్నాను. ఇట్లు

రాయపేట. మంత్రిప్రగడ నరసింహము.

చెన్నపురి యందుండు రివెన్యూబోర్డు సెక్రటరీగారగు
మ.రా.శ్రీ లక్కరాజు లక్కరాజు పంతులు బి. ఏ గారి అభిప్రాయము.

శ్రీయుత సత్తిరాజు సీతారామయ్య పంతులుగారు విప్రకులదర్పణమను పేరున నొక చారిత్రక సాంఘిక సంబంధమైన సద్గ్రంథమును చిరకాల శ్రమ ప్రయాసల కోర్చి వ్రాయుచున్నారు. అందులోని కొన్ని భాగములు నాకు శ్రుతపఱచినారు. హిందూదేశములో హిందువుల చారిత్ర విషయిక గ్రంథములు మిక్కిలి యరుదు. అట్టివేవైన యుండినను అతిశయోక్తులతోనూ అభిమాన వాక్యములతోనూ నిండి యుంటున్నవి. ప్రస్తుతపు పరిస్థితులనుబట్టి మన ఆంధ్రులు యిదివరకే మన పూర్వుల చరిత్రలను, వారి ప్రవర్తనా యోగ్యతాతిశయములు, విషాదకరముగ మఱచియున్నారు. ఇట్టి స్థితియే యుండినయెడల కొలంది కాలములోనే మన పూర్వు లెవరో వారి చరిత్ర యెట్టిదో, మనము పూర్తిగా తెలియని వారము. కావలసి వచ్చును. ఈ ప్రచురింపబోవు గ్రంథము విచారకరమైన పైలోపము ను సవరింపఁ గలదని నా నమ్మకము. కావున ప్రస్తుతపు కాలస్థితిలో విప్రకులాభివృద్ధికి నిట్టి గ్రంథము సహకారి యనుటకు సందియము లేదు. కనుక ఆంధ్రబ్రాహ్మణసోదరు లందరు ఈ గ్రంథప్రచురణకు యథాశక్తిని తోడ్పడి శ్రీయుత సీతారామయ్య పంతులుగారి ఈ సదుద్యమమును ప్రోత్సాహింతు రని నా నమ్మకము.

మదాస్సు, 6—2—36. } లక్కరాజు లక్కరాజు.

మహారాజశ్రీ దివాన్ బహద్దరు సర్ మోచెర్ల రామచంద్రరావు పంతులు B. A. B. L. ప్రెసిడెంటు, ప్రెసిడెన్సీ ల్యాండు మార్టుగేజి బ్యాంకు వారి అభిప్రాయము:—

శ్రీయుత సత్తిరాజు సీతారామయ్య పంతులుగారు ప్రచురింపం దల్చిన 'విప్రకులదర్పణ' మనే గ్రంథమునుగురించి మ॥రా॥శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారు మంత్రిప్రగడ నరసింహం పంతులుగారు, లక్కరాజు లక్కరాజు పంతులుగారు ఇచ్చిన అభిప్రాయములతో నేను ఏకీభవించుచున్నాను. క్రమమయిన కుటుంబచరిత్రలు ఈ దేశములో వ్రాసియుంచుట అరుదు. అందుచే అనేక మహాపురుషుల కుటుంబముల పూర్వచరిత్రలు తెలిసికొనుటకు వీలు కలుగుట లేదు. శ్రీ సీతారామయ్య పంతులుగారు చేయు ప్రయత్నమునకు అందరు తోడ్పడెద రని నమ్మెదను.

40 ఎడ్వర్డు ఎలియటు రోడ్డు,<br>మైలాపూరు, మద్రాసు. } మోచర్ల రామచంద్రరావు.

☞ వీరు ఈ ప్రథమ సంచికనయినను వెలువడక పూర్వమే పరలోక గతులగుట విప్రవంశముయొక్క దురాదృష్ట మనవలెను. వీరి చరిత్ర మోచర్లవారి కుటుంబచరిత్రయందు వ్రాయంబడినది. (ప. అ)

ఆదిశైవ పత్రికా కార్యస్థానమునుండి.

బ్ర॥ శ్రీ చిలుమూరు పురుషోత్తమ గురుక్కల్‌గారు వ్రాసినది.

తాము బూనిన మహత్కార్యము కొనియాడం దగియున్నదని ప్రత్యేకముగా వ్రాయనక్కఱలేదు.

చిలుమూరు.<br>26—2—36. } చిలుమూరు పురుషోత్తం<br>గురుక్కల్

రాజమహేంద్రవరములోని సుప్రసిద్ధాంధ్రకవులగు శ్రీయుతు వడ్డాది సుబ్బారాయఁడు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగార్ల అభి ప్రాయము.

మ॥ రా॥ శ్రీ సత్తిరాజు సీతారామయ్యగారిచే రచియింపఁబడి విప్రకులదర్పణమునందలి కొన్నిభాగములను గ్రంథకర్తగారి వల వీని మేమిరువురమును మిక్కిలి యానందించితిమి. సీతారామయ గారు చిరకాలము పరిశ్రమఁజేసి బహుగ్రంథములు, శాసనము శోధించి యీ గ్రంథము రచియించిరి. ఈ గ్రంథమందుఁ దెనుఁగుదే మందుఁగల నియోగులయు, వైదికులయు, శైవులయు, వైష్ణ లయు, మాధ్వులయు, యాజ్ఞ్య వల్క్యులయు వంశములింటిపేర్లతో గోత్రములతోఁ బ్రవరలతో విపులముగా వర్ణింపఁబడియున్నవి. ఆయా వంశములలోఁ బూర్వకాలమున నేఁటికాలమున బ్రసిద్ధినొందిన మహా పురుషుల జీవచరిత్రములు సంగ్రహముగా సోదాహరణముగా లిఖింపఁ బడి యున్నవి. ఆంధ్రబ్రాహ్మణుల కందఱకు నిదిమిక్కిలి యుపయుక్త మైన గ్రంథము. ఈ వఱలో నిటువంటి గ్రంథ మాంధ్రభాషలోఁ బ్రక టింపఁబడి యుండలేదు. సీతారామయ్యగారీ గ్రంథరూపమున నాంధ్ర బ్రాహ్మణలోకమునకు మహోపకారము జేసియున్నారు కావున నాంధ్ర దేశమునందలి విప్రులందఱు దీని నాదరించి గ్రంథకర్తగారికిఁ బ్రోత్సా హముఁ గలిగింతురు గాక.

రాజమహేంద్రవరము. 22—3—1936.

వడ్డాది సుబ్బారాయఁడు
చిలకమర్తి లక్ష్మీనరసింహం.

# గాండీవ పత్రికాధిపతిగారి వద్దనుండి.

బ్రాహ్మణ వర్ణమునందలి వివిధశాఖలకుఁ జెందిన కుటుంబముల విష యములు—గోత్రము, ఋషులు, ఇంటిపేర్ల మార్పులు, తరములవరుస, వంశమునందలి ప్రసిద్ధుల జీవిత శేషములు—మున్నగాఁ గూర్చినకృతియే ఈ 'విప్రకులదర్పణము' రూపమున వెలువడినది. ఇట్టి గ్రంథమొకటి ఆవశ్యకము. బ్రాహ్మణ వర్ణాంతర్గతమగు నుప శాఖ లెన్నెన్నిగలవు. ఒక్కొక్క ఉపశాఖలోని వంశములవారు కారణాంతరములవలన దిక్కు దిక్కుల చెల్ల చెదరలైనారు. ఒకరినిగూర్చి మఱియొకరికిఁ దెలియదు; తమ కుటుంబమునుండి చీలిపోయినవారిని గూర్చి దెలియదు. ఎక్కడి కక్కడికే మఱచిపోవుచున్న కుటుంబము లెన్నెని గలవు. ఇట్లగుట పూ ర్వము విస్తృతముగ నుండిన వంశములునేఁడు సంకుచితములైనవి. తమ తమ వంశమునందలి ఆనుపానులను, పూర్వ పరిస్థితులను దెలిసికొన వలయుననిన ఆకరములులేవు. ఇట్లే కాలము గడచునేని నేటికన్న ఇంక నొక శతాబ్దికి ఈ యంతశ్శాఖలును వానియందలి వంశములున్ను, మఱింత కృశించి పోవుననుటకు సందియములేదు.

ఈ దుస్థితికి వగచి, రమారమి ముప్పది సంవత్సరములనుండి శ్రీయు తులు సత్తిరాజు సీతారామయ్య పంతులుగారు, ఈ 'విప్రకులదర్ప ణము' ను రచింప సంకల్పించిరి; అందునకు వలయు సామగ్రి దొరకి నంతవరకు సేకరించి, ఇంకను కైవ్రాలిన ప్రాయమునేని లెక్కింపక, సేకరించుచున్నారు. ఈ కృతి తమ జీవితమునకుఁ బరమోద్దేశ్యముగాఁ దలంచినారు. ఈ వీరి కృషి తెలుఁగుసీమకు మహోప కృతియని చెప్పఁ దగును. తెలుఁగు సీమవారెల్ల వీరి కృషికి అతిమాత్రముగఁ దోడ్పడ వలయును.

శ్రీ పంతులుగారు ఈ గ్రంథము సంచికరూపమున వెలువరింపఁ

బూనిరి. రాష్ట్రమందలి బ్రాహ్మణ వర్ణాంతర్గత శాఖలవారెల్ల సద
పంచికలకు చందాదారులై తమతమ వంశముల వివరములను తమ బ
ధుమిత్రాదుల కుటుంబముల వివరములను శ్రీ వారికి ఎప్పటికప్పుడు
దెలిపి, ఈ దర్పణము సమగ్రమగునట్లు ఉపకరింతురుగాక యని
హెచ్చరించుచున్నాను. మున్నంగి శర్మ.

# మైసూరుస్టేటు గౌనిపల్లినుండి.

మ॥ రా॥ శ్రీ గుమ్మరాజు రామప్ప పంతులుగారి అభిప్రాయము.

తాము విశ్వాసముతో వ్రాయించిన పత్రిక చేరినది. తమ యుద్య
మము మిక్కలి శ్లాఘ్యమని భావించితిని. దానివలన నాంధ్రదేశమందలి
య శేష విప్రకులములకు ప్రయోజనము లభింపగలదు. దూరదేశస్థుల
మగుట మన మొంగోరుల కపరిచితులము. అట్లయ్యు నాకుఁ దెలిసినంత
వ్రాసి పంపగలను.

| గౌనిపల్లి, శ్రీనివాసపురం<br>తాలూకా, కోలారు జిల్లా<br>మైసూరుస్టేటు. | గుమ్మరాజు రామప్ప.<br>ల్యాండు హోల్డరు, మెంబరు;<br>డిస్ట్రిక్టుబోర్డు అండ్ స్కూలుబోర్డు. |
|---|---|

విప్రకులభూషణులారా! చూచితిరా?

ఏతద్గ్రంథప్రాశస్త్యమునుగూర్చియుఁ బ్రచురణావశ్యకతను
గూర్చియు మన వారంపిన లేఖలలోని అభిప్రాయములు అన్నియు
ననుకూలముగానే యున్నవి గాని 'పిల్లికి గంటకట్టు వారెవ' రన్నట్లు
సాహసించుటకు భయ మగుచున్నది. ప్రతిపనికి మాటుండ వలెను
గాని మాటలతో కాదు గద! చందాదార్లు అయినను కాకుండినను

బ్రాహ్మణు లుండియున్న ప్రతిగ్రామమున కొక్కొక ప్రతియైన బంప వలెను. లేనిచో అన్నికుటుంబములు పూర్తిగాఁ జేరినవో లేవో యను సందేహము బాధించుచునే యుండును. ఆంధ్రదేశము నందలి 15 వేల గ్రామములకు ఒక్కొక ప్రతి ఉచితముగాఁ బంపుట మిగుల వ్రయ ప్రయాసలతో కూడినది. నెలకు నాల్గువేలు పత్రికలు ముద్రించి పోష్టుద్వారా పంపుటకు సాలుకు 5 వేలు అంచనా తేలినది. మైసూరు, హైదరబాదు దేశములు గాక ప్రత్యేక మీ రాజధానియందు మనవారు 14 లక్షలమంది గలరు. అట్టి విషయములో ఈ గ్రంథము ప్రచురణకు నూరేసి రూపాయల వంతున సహాయము చేయు వారేబది మంది లభించిన అత్యంతానందముతో యాబది వేల సంచికలుచితముగ దేశమంత వెదజల్లి సంపూర్ణ చరిత్రి సంపాదించి ప్రచురించుటసంభవించునుకదా! అట్టి మహదైశ్వర్యము కలుగునా? వినోద సౌఖ్యములకు వేడుకలకు ఆడంబరములకు వేలకు వేలు వెచ్చించ మనసు పుట్టునుగాని శాశ్వతోపయోగముగల యిట్టి కార్యములకు సహాయము చేయుటకు మనసు బుట్టుట కష్టమె. కానిండు! సమస్తమున కీశ్వరుండే గలఁడు. ఏతదుద్యమాభివృద్ధికి కేవలము చందాదారులమీద ఆధారపడునట్లు చేయక ఉదారస్వభావులగు దాతలు ఏతదుద్యమాభివృద్ధికి తమకు తోఁచిన సహాయము చేయ కోరుచున్నాను. స్థితి నాకుటుంబవిషయము వినగోరితిమని అనేకులుత్తరములు వ్రాయుచుండుటచే నావంశచారిత్రము ముందుసంచికలో బ్రచురింపదలఁచితి. జీవనాధారమునకిది యొకవృత్తిగాఁ గల్పించుకొంటినేమో యని సందేహించువారి అభిప్రాయము తొలగించుటకై ముక్తసరుగ స్వీయచరిత్రమునుగూడ తదనుబంధముగ బ్రచురించెదను.

# వర్తమానములు.

గొప్ప వివాహము—భీముని పట్టణమునం దుపాధ్యాయులుగాను మద్దూరి కోదండ రామదీక్షితులుగారి కుమార్తెకును సూరతులో వ భాచార్య మఠాధిపతులగు శ్రీమహారాజా వజ్రరత్నలాలు గోస్వా గారి కుమారునికి మేనెల 22 వ తేదీని వివాహము జరిగినది. ఈ వి హామునకు నలుబది పీఠాధిపతులు ఆరువేలమంది శిష్యులతో వచ్చి ఆ వివాహము చూచుట కనేక వేలమంది ప్రేక్షకులు వచ్చిరి సూరతు మఠాధిపతులు పూర్వమునుండియు తెలుగు వెలనాడు బ్రాహ్మ ణకన్యలనే వివాహమాడుచుండిరట. వీరు పూర్వము గోదావరిమండ లము లోని కాకరపర్రు గ్రామమునుండి ఉత్తరదేశమునకు వచ్చి నియు, తమ యింటిపేరు కంభంపాటి వారనియు తమది భారద్వా గోత్రమనియు వజ్రరత్న లాల్ జిగారు సెలవిచ్చినటుల ఆంధ్రపత్రికక విలేఖరి వ్రాసియుండెను.

వర్ణాంతర వివాహ సక్రమత్వ నిర్ణయ శాసనము.

ఒకకులమువారు ఇంకొక కులమువారితో వివాహ సంబంధము చేసికొనేయెడల అట్టి వర్ణాంతర వివాహములు చెల్లతగినవే యని సక్రమమైనవేయనియు నిర్ణయించుటకొరకు చిత్తుచట్టము అసెంబ్లి స యందు 1935 సెప్టెంబరు మాసములో ప్రతి పాదింపఁబడెను.

ఈ చట్టములో హిందువులలో వధూవరులిద్దరును ఒక్క కులము నకే చెందియుండని కారణమున యే వివాహమున్న చెల్లకూడని వివా హము కాజాలదు. హిందూధర్మశాస్త్రములో ఇందుకు విరుద్ధముగా ఏ ఆచార సాంప్రదాయము చెప్పబడినప్పటికిని, యేవిధమైనఅన్వయమ చేయబడి నప్పటికిని దానితో నిమిత్తము లేకుండానే పైజెప్పిన నిర్ణయ ము వర్తించును అను సెక్షను చేర్చబడియున్నది. దీనిపై 1936 సం జూలై 15 వ తేదీనాటికి ప్రజాభిప్రాయము తెలియజేయఁబడవలెన కోరఁబడియున్నది.

గ్రంథస్వీకారము.

# శ్రీ చౌడేశ్వరీమహాత్మ్యము.

మ, రా. శ్రీ గుమ్మరాజు రామకవి గారిచే నూతనముగ రచింపబడిన చౌడేశ్వరీ మహత్మ్య మను గ్రంథమును వందన పూర్వకముగ నందికొనినారము. ఈ కవి కాపురము మైసూరు దేశము నందలి శ్రీనివాసపురము తాలూకాలోని గౌనిపల్లి గ్రామము. వీరు నందవరీక నియోగి బ్రాహ్మణులు. ఈ యన రచించిన గ్రంథమునందు

చ॥ పరివిమల వేదశాస్త్ర పరి • పాటికిఁ బెట్టిన పేరు నాంధ్ర స
త్కవితకుఁ బుట్టి నిల్లు బుధ • గణ్యత కెంతయు మేలు బంతి మా
ధవ పద భక్తికిన్నెలవు • ధర్మ గుణంబున కాట పట్టు నం
దవర మహీసురాన్వయము • తచ్చరితంబు రచించు టొప్పదే!

అని వ్రాసినపద్యము నందించుకైన అతిశయోక్తి గలదని ఎవరైనఁ ప్ప సాహసింపఁ గలరా? ఎన్నఁడో అల్లసాని పెద్దన మహాకవి కవిత్వ ుండ వలసిన రీతిని గూర్చి చెప్పియున్నారు. వారి వంశీకుల లోని వారగు వీరో ఆ రీతిని గ్రంథమంతయు రచించి చూపి యున్నారు. నుశ్రుతముగా నందవరీకుల రచనలయందే సరస్వతి సంచరించుచున్న ని చెప్పక తీరదు. లేనిచో యిప్పటి దినములలో నింతటి మాధుర్య ు గల కబ్బ మబ్బుట దుర్లభమే. కవి రచనా నైపుణ్య గ్రంథము నందలి భాషా సౌష్టవము అనర్గళకవితా ధార, భాషా ాధుర్యము చవి చూపుటకై వీరి గ్రంథమునుండి కొన్ని పద్యము దుదహరించుచున్నాను.

ఆ మెడఁ బైఁడి మేడల ల • తాంగుల గానము నాలకింప వా
తాయన పాళి చెంగట ము • దంబున సోముఁడు పొంచిచూడఁ బ
ద్మాయత నేత్ర లాతని మొ • యారమి సీయని కేలు దమ్ములం
ద్రోయఁగ దా కళంక సహి • తుండగుచున్ గృశియించు టిప్పుడున్

చ॥ సలలితమై విశాలమయి ♦ శాంతియుతంబయి పూజ్యమై యచ
చలమయి ప్రేమ పూర్ణమయి ♦ సత్యమయంబయి నిష్కళంక
యలరెడు చిత్త వృత్తిబడ ♦ యం దగు యత్నము సేయు వాసి
గలుగును గాక యన్యులకుఁ ♦ గల్గునె నిత్య సుఖప్రబోధముల్.

చ॥ ప్రకట నవీన సూన ఫల ♦ భారవినమ్రరసాల శాఖలన్
శుకములు పండ్లసారమునఁ ♦ జొక్కుచు ముద్దుగఁ మాటలాడ యఱ
పికములు పాడఁగా భ్రమర ♦ బృందము లెల్లెడఁ గూడి యాడ
సకల మనోభిరామము వ♦సంతము మోదముఁ గూర్చెఁజూడ

ఉ॥ చక్కని బ్రహ్మవంశమున ♦ జన్మముఁ గాంచి శుభ్రతుల్పతించి
యొక్కరి కష్టకాలమున ♦ నోపిన సాయము సేయ కుండినన్
నిక్కముగా నిరర్థకము ♦ నింద్యము నీచము వాని జన్మ మిం
కెక్కువ మాట లేమిటికి ♦ నీ విభునిన్ దయజూచు టొప్పగున్.

వెల ఒక రూపాయి మాత్రమే, వలయువారు గ్రంథకర్త గారికి వ్రాసి బడయవచ్చును.

## ప్ర క ట న.

అమర నిఘంటువు 12000 శబ్దములుగలిగి, రాయల్ సైజున 1000 పుటల క్యాలికో బైండుకానున్న ఈ గ్రంథము బహు ధనవ్యయమునఁగాని సాధింప లేదు. ఆంధ్రాభిమానముతో ప్రభువులు, ఉద్యోగులు, న్యాయమూర్తులు, వైశ్య గృహస్థులును ఇందుఁజాల్గొని తమ తమ సహాయసంపత్తుల నుపయోగింపఁ బ్రార్థి

అడగ్రిసు,

కొత్తపల్లి సుందరరామయ్యగారు,

అకారాది అమరనిఘంటు ప్రచారకుడు, సెక్రటరీ,

కవినాథవిలాసము, ఏలూరు.

శ్రీరస్తు,

శ్రీ సీతారామచంద్రపరబ్రహ్మణే నమః

# విప్రకులదర్పణము.

శ్రీ గిరిరాజువారు ఆర్వేల నియోగులు. ఆపస్తంబులు, యజుర్వేదులు, భారద్వాజగోత్రీకులు, ఆంగీరస బార్హస్పత్య భారద్వాజ అని త్ర్యార్షేయము. వీరి అనాది కాపురము బెల్లంకొండసీమ. పల్నాటి తాలూకాలో శ్రీ గిరిపాడు అను గ్రామము గలదు. గాని వీరి యింటి పేరు శ్రీ గిరిరాజు అను ఒక ప్రఖ్యాత పురుషుని నామమై యుండవచ్చును. వీరి కుటుంబము చాలా గొప్పకుటుంబము. ప్రఖ్యాత కుటుంబము అగుటచే గోపరాజు రామప్రధాని గారి కాలములో కొండవీటి రాజ్యములోచేరిన పదునాలుగు సీమలలో నూరు గ్రామములుగల బెల్లంకొండ సీమకు వీరికి పెత్తనపు గరిణీక మియ్యఁబడినది. మఱియు నర్సారావుపేట తాలూకాలోని దక్షిణ వేలూరు, యడవల్లి, పాలపాడు, మునుమాక గ్రామములకు ఈ కుటుంబీకులకు సంప్రతి కరిణీక మిప్పించఁబడినది. సత్తెనపల్లి—కంకణాలపల్లెలకు సంప్రతి కరిణీక మిప్పించిన వెనుక వీరు సత్తెనపల్లె వారుగా మాఱినారు. అటులనే ఆ తాలూకాలోని తొండపి రుద్రవరము గ్రామములకు సంప్రతు లియ్యబడిన శ్రీ గిరిరాజువారు తొండపి వారు గాను, వడ్డవల్లికి సంప్రతి యియ్యబడిన వారు వడ్డవల్లి వారు గాను, పిలువఁ బడుచుండిరి. రామ కృష్ణారావు పంతులు గారి కుటుంబము నర్సారావు పేటయందు గలదు. వీరిలో తిరుమలయ్యా పంతులుగారు ప్రఖ్యాత పురుషులు. ఇంకొక కుటుంబము వారు గురుజేపల్లి యందున్నారు. వీరికి కోనవారితోను, కోడెన వారితోను, కుందుర్తి వారితోనూ సంబంధములు గలవు. అందువల్ల శ్రీ గిరిరాజువారే ఇటీవల సత్తెనపల్లి వారుగాను, తొండపి వారు గాను, వడ్లపల్లి వారు గాను మాఱినట్లు స్పష్ట మగుచున్నది.

శ్రీ గిరిరాజు రామారావుగారు 'విజయవిక్రమ' నాటకం రచించిరి.

## అజ్జరపువారు.

శైవులైన ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదు
భారద్వాజ గోత్రికులు, ఆంగీరస బార్హస్పత్య భారద్వాజ అని త్రి
క్షేయము చెప్పుకొనుచున్నారు. వీరు పూర్వము శైవులుగా
అనంతరము లింగము త్యజించి ఆర్వేల నియోగు లైరి. వీరి పూ
ఇంటిపేరు 'ముగుళ్ళవారు.' వీరి కీవటూరి వారు గురువులు. వీ
పేరయ లింగము గారు కవులు. ఈ యన ఫలివెల మున్నగు ప్రదే
లలోని వారకాంతలను వర్ణించుటచే వీరి నివాసస్థలము రాజమహే
వరము తాలూకాలోని ముగ్గుళ్ళ యేమో అని కవిచరిత్రకర్తలూ
చిరి. ఈ ముగుళ్ళ వారి మూల పురుషుఁ డొకరు గజపతి
వీరనృపాలునిచే గోదావరీ మండలములోని అజ్జర మను గ్రామ
నగ్రహారముగాఁ బడయుటచే వీరింటిపేరు అజ్జరపువారుగా మారె
ఆ విషయము పేరయలింగకవి తాను రచించిన ఒడయనంబి వి
మను గ్రంథమున నీ దిగువ పద్యములో స్పష్టపఱచెను.

శా॥ శ్రీ రంజిల్లఁ జెలంగుచున్న గజరా ♦ ట్సింహాసనాధ్యక్షునిన్
ధారాళంబుగ వేదశాస్త్ర బహువి ♦ ద్యారూఢి మెప్పించి ర
వీరాగ్రేసరుఁ డియ్యఁ గొండన మహా ♦ విఖ్యాతిగా గౌతమీ
తీరక్షోణిని నజ్జరం బనగ దాఁ ♦ దెచ్చె న్మహాగ్రామమున్॥

ఈ ఒడయనంబి విలాసము ఒక స్థలపురాణము. ఒడయనంబి
వీర శైవుని యొక్కయు పరమ నాచి యను వేశ్యయొక్కయుఁ జ
మిందుఁ బ్రధానముగా వర్ణింపఁ బడినది. ఇయ్యది ఆచంట రా
గేశ్వరునకు కృతి నీయఁ బడినది. ఇందు తనను గూర్చియు తన
మును గూర్చియు వర్ణించుకొనిన పద్యములవల్ల పై సంగతులుఁ
య వచ్చుచున్నవి. ఆ పద్యము లిట నుదహ రించుచున్నాను.

సీ॥ శ్రీ కంఠు పదపద్మ • సేవచే నాదిమ
శివభక్తి రూఢిచేఁ • జెలఁగి నాఁడ
పెంపొంద నివటూరి • పెదరామ గురువర్య
దత్త మంత్రస్ఫూర్తిఁ • దనరెనాఁడ
మహిత భారద్వాజ • మౌని సద్గోత్రాంబు
రాశి చంద్రుం డనఁ • బ్రబలి నాఁడ
ఘనసాధ్వి బాపాంబ • కును గొండ మంత్రికిఁ
బుత్ర రత్నం బనఁ • బొల్చె నాఁడ
తే॥ సరవి నెల్లాఖ్య కుల సతీ • సదయ హృదయ
పద్మ పద్మాప్త మూర్తియై • ప్రబలినాఁడ
నజ్జరపు సత్కలాఢ్యుఁ • డనుచు బుధులు
లెస్సగా నెంచఁ బేరయ • లింగ కవిని.

ధరనా భారద్వాజుని
గురుగోత్రము నందుఁబుట్టి • కొండన ధైర్య
స్ఫురణయు సత్పక్షంబును
గరిమ మహోన్నతియుఁ గల్గి • ఘన సంగతుఁడై!

అతఁడు ముగుళ్ళవంశమున • నర్థిజనించియు రాజదత్తమై
క్షితిఁ జెలువొందు నజ్జరము • చేకొని పాలనమొప్పఁజేయు భా
సితగతి నజ్జరంపుఁ గుల • సింధు సుధాకరుఁడై చెలంగి నా
శ్రితులును బాంధవుల్ హితులు • ప్రేమ నుతింపగఁగొండ
మంత్రియున్॥

పై పద్యములవలన వీరు శైవులనియు, భారద్వాజ గోత్రులనియు, [illegible]ము ముగుళ్లవారనియు, నిపుడు అజ్జరపువారుగా మారినట్లు [illegible]మగుచున్నది. మఱియు నాగ్రంథమునందే తన వంశపువారి నిట్లు

గా: జెప్పెను. ఈ ముగుళ్లవారి మూలపురుషుడు కొండమంత్రి. ఈ
నకు మల్లన, అనంతర మీ అజ్జరపువారి వంశాధ్యక్షుడు హరిము
ఈయనకు కొండన పేరయ్య తిమ్మయ్య అను ముగ్గురు పుత్రు
ఇందు పెద్దవాడగు కొండనకు హర్యప్ప—వెంగళప్ప—వీరన్న-సింగము
ఇందు వీరన్న దండ నాయకుడుగా నుండెనట. ఈ యన పితతండ్రి
య్య 'బుధబంధు కల్పశాఖి' యని మెప్పొందెను. మూడవ వా
తిమ్మయ్యకు నరసింహమను కుమార్డు. పై నుదహరించిన పేరయ్యకు
వీరయ్య కొండయ్య వెంకటేంద్రుడు. ఇందు పెద్దవాడగు వీరయ్య
భైరయ్య మాచయ్య అను ఇద్దరు కుమాళ్లు కలిగిరి. రెండవ వా
కొండయ్యకు పేరయ్య లింగకవి జనించెను. పై గ్రంథమునందలి
యిట్లున్నది.

ఇది శ్రీ మది వటూరి పెదరామనాథ గురూపదిష్ట శైవ
క్షర జప పరాయణ లింగప్రాణి పాదారవింద వందనానంద భార్గ
గోత్ర పేరయామాత్యపౌత్ర కొండమంత్రి బాపమాంబా సుపుత్ర
మా కళత్ర అజ్జరపు కులపవిత్ర పేరయలింగ నామధేయ ప్రణీత
గొండయ నంబి విలాసము......ఈ కవి తనకప్పటికి పాతూరి వా
నూ కండెపు వారితోనూ వాడ్రేవు వారితోనూ బమ్మెర వారి
సంబంధములు గలవని వ్రాసికొనెను.

బమ్మెరపోతరాజుగారిమనుమడు కేసన్న. ఈయనకు 'ప్రౌఢసర
యను నామము గలదు. ఈ పేరయ్య లింగముగారు ప్రౌఢసరస్వ
అల్లుడగుటచే బమ్మెర కేసన్న మల్లన్నలకు భావమరిదియని చెప్పబ

ఇప్పటికిని ఈ అజ్జరపువారు తణుకు తాలూకా అజ్జరము
రాజమహేంద్రవరమున గలరు. ఈ వంశీకులలోని యిప్పటి
వె.....ప్పగారు మిగుల నియోగాభిమానము గలిగి నియోగ

జరిపించుటయందు నియోగి సంఘ మేర్పఱచుటయందు నియోగి పత్రి
కా ప్రచురణమందు ప్రస్తుతము నాచే వ్రాయబడుచున్న చరిత్రగ్రంథ
మునకు సహాయముచేయుట యందెక్కువగా పాటుబడిరి. రాజమహేం
ద్రవరమున నుండువారిలో రామన్నగారు చాలాప్రఖ్యాతిపురుషులు.
ఈయన తహాశ్శీలుదారుగా నుండెడు కాలమున అనుదిన మాయన
పజ్త్తిని నూరు నూటయేబదిమంది భుంజించుచుండెడి వారట! వీరి
కుమాళ్లు వీరయ్యగారి సంతతివారు. రామన్నగారి అన్న కుమాళ్లు
సుబ్బారాయుడుగారి సంతతివారు ఇపుడు రాజమహేంద్రవరమున
గలరు. వీరి కనుశ్రుతముగా బంధకవివారు, పెదప్రోలువారు, వల్లూరి
వారు, తటవర్తివారు, ఉసులుమర్తివారు, చామర్తివారు, కంచిరాజు
వారు, తురగావారు, బొమ్మిడివారు, రామాప్రగడవారు, రావులపర్తి
వారు, అడవివారు మున్నగువారితో సంబంధములు గల వని అజ్జరపు
నరసింహముగారు తెలియపఱచిరి. ఈ పేరయలింగకవి 1750 సంవత్స
రపు ప్రాంత్యపు వాడని కవుల చరిత్రయం దుదహరింపబడి యుండుట
చేతను వీరరుద్రగజపతి కాలము 1600 సంవత్సర మగుటచే ఈ అజ్జర
పువారి వంశము దాదాపుగా 300 సంవత్సరములకు పూర్వమునుండి
యీ అజ్జరపు గ్రామము నందుండి యుండును. వేమూరివారని పిలవ
బడు భీమరాజు వారికి వీరు చుట్టము లని భీమరాజువారు తెలియపఱ
చిరి.

## మునపల్లెవారు.

ఆర్వేలనియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, వెల్నాడు,
వాస గోత్రికులు, ఆంగీరస, అజామీళ, కణ్వ అని త్రయాఋషే
యము. వీరి అనాది కాపురము బాపట్ల తాలూకాలోని మునిపల్లె.
ఈ గ్రామనామము రామప్రధానిగారి కాలములో వీరికాగ్రామమునకు,
పొన్నూరు తా॥ కుంచెనపల్లి గ్రామమునకు సంప్రతికరణీక మియ్యబడి

నటుల కొండవీటి దండకలివెలో గలదు. ఈ కుటుంబము వారిపు తాలూకా మామిళ్ళపల్లియందు, చీరాలయందు గలరు. వీరి క తముగా రావులవారు, కామరాజువారు, పూసపాటివారు, కొ రితోనూ సంబంధములు గలవు. మునుపల్లె వెంకట సుబ్బయ్య కుటుంబము చీరాలలో గలదు. కొన్ని ప్రతులలో మునిపల్లి అని దు గాని గవర్నమెంటువారి లెఖలలో బాపట్ల తా॥ గ్రామము పల్లి యనియే ముద్రించబడినది.

## బొల్లాప్రగడవారు.

అనుమకొండ యాజ్ఞవల్క్య నియోగులు. శుక్లయజుర్వేదా కాత్యాయన సూత్రులు. ఆత్రేయస గోత్రులు. ఆత్రేయ అర్చన శ్యావాస్య అను త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరి అనాది పుర మెచటనో గాని వీరి చాల కుటుంబముల వా రిపుడు గోదా జిల్లా దిగమర్రు, మోరి, అంతర్వేది, అంతర్వేదిపాలెము, నరసాపు చార్జిపేట, కాకినాడ, జగన్నాధపురము, చింతలపూడి, ప్రగడవర నరసాపురం తాలూకా కొప్పర్రు, విశాఖపట్టణము, బరంపురము న్నగు గ్రామముల యందుండిరి. వీరి పూర్వులలో బొల్లాప్రగడ మమంత్రి చాల ప్రఖ్యాతి పురుషుఁడు. ఈయన గోటేటి సూరనా నివలన కృష్ణాభ్యుదయ మను అయిదాశ్వాసముల గ్రంథము కృతిన కృతిపతి యగు కామమంత్రి దైవరాయకుల క్షేమంకరుఁ డైన అ జీ పంతు లను నాతనికి దౌహిత్రుఁడుగా వర్ణింపఁబడెను. ప్రస్తు వారిలో సుందర గోపాలరావుగారు అపక్వాహారాద్వైత సిద్ధాంత థకర్తలు. కృష్ణాభ్యుదయ ప్రబంధమున బొల్లాప్రగడవారి వంశ యము గలదు. దాని నీ దిగువఁ బొందుపఱచుచున్నాను. ఆత్రే

గోత్రమున బొల్లాప్రగడవారి మూలపురుషుఁడు బొల్లాప్రగ్గడ. ఈయ నకు వెంకట కృష్ణయ్య. ఈయన కాలమునుండి ఈ వంశీకులు బొల్లా ప్రగడ వారైనారు. ఈయనకు వెంకన్న మంత్రి. ఈయన కేతరాజు వారి చిన్నదానిని వివాహముచేసికొనెను. వీరికి వెంకట నరసింహము, వెంకట రాముఁడు, రాయవిభుఁడు, అను ముగ్గురు కుమాళ్ళు. ఇందు పెద్దవాని కాదుర్తి కామాంబ నిచ్చి పెండ్లిచేసిరి. వీరికి శివయ్య మం త్రి బుట్టెను. ఈ శివయ్యకు ఆదుర్తి సావిత్రమ్మ నిచ్చిరి. వీరికి వెంకట నరసింహము, లక్ష్మీనరసింహము, అను కుమాళ్ళును, బుచ్చి రామమ్మ వెంకమ్మ అను పుత్రికలు గలిగిరి. పెద్దవాడగు వెంకట నర సింహమునకు వద్దిరాజువారి ఆడబడుచు నిచ్చిరి. లక్ష్మీనరసింహము ద్వేదొప్పర్తి రామశంభు కుమార్తె యగు పార్వతిని వివాహమాడెను. కృష్ణనయన పినతాత యగు వెంకట రాముఁడు తోలేటివారి పడుచును, నాడియున తమ్ముఁడగు రాయఁడు వెలిచేటివారి చిన్నదానిని వివాహ మాడిరి.

పుఁ ఆదంపతుల సుతు లధిక సుగుణు
డవరులైన వేంకటరెడ్డి రాజన్నమంత్రి
రము వలనుగా నర్థ మార్జింప నేలమి నింప
గడ సంపదల సొంపు వాటింప జనులఁ బెంప
రనా వలతు లలఁతులు సాటియే వారలకును.

తినఁ... అని ఆ కుమాళ్ళను వర్ణించెను.

న ఆ వెంకన్న పెద్దకుమారుఁడైన వెంకట నరసింహమునకు ఆదుర్తి కా మ్రస్తుమ్మ నిచ్చి పెండ్లిచేసిరి. వీరికి శివయ్య యను కుమార్డు. ఈయన ంత సమామ కుమార్తె యగు సావిత్రిని వివాహమాడెను. ఈ దంపతుల ంశ వెంకట నరసింహము లక్ష్మీనరసింహము అను యిద్దరు కుమాళ్లను అశోమాంబ, వెంకాంబ యను ఇద్దరు కుమార్తెలు గల్గి రని పైని దెల్పి

తి. శివయ్య పెద్దకుమారుఁడగు వెంకట నరసింహామునకు ద్వితీయ
దైవరాయకులక్షేమకరుఁడైన యప్పాజీ పంతులు కుమార్తె
వివాహముచేసిరి. ఈ దంపతులకు వెంకటరాయుఁడు కామయ్య
కుమాళ్లును లక్ష్మీదేవి యను కుమార్తె కలిగిరి. అం దగ్రజుం డగు
కటరాయుం డిట్లు వర్ణింపబడెను.

సీ॥ వేంకట రాయలు • వెసఁ జెట్లపలి రామ
లింగ పరిధాని కఁ•ర్థాంగి యైన
వెంక మాంబాత్మజా•లంకార దైవరా
యాఖ్య కామాఖ్య వీ•రాఖ్య జగ్గ
యాఖ్య సహోదర • యగు వెంకమాంబను
వినుతిఁ బెండిలియయి • తనియఁ దనియ
సంభవ సౌఖ్య వి•స్రంభ శుంభ త్ప్రౌఢిఁ
గుంభీన సేశ వా•గ్గుంభనమున

గీ॥ శంభు సద్భక్తిఁ బరిబల ద•శాపరిసక్తి
సువ్రతాసక్తి సత్యవ•చోనురక్తి
యుక్తి యుక్తజ్ఞతా శక్తి • నుదిత భక్తి
భావనాత్మోక్తి విలసిల్లె • బంధు లలర.

చ॥ తదనుజుఁ డైన కామవసు•ధామర తామరసాసనుండు సం
పదల నిలింపరాజునకు • భాగ్య మొసంగ నెసంగు మంగళా
భ్యుదయముతోడ వేడుకలఁ • బొల్పగు కల్పమహీరుహాస్ప
స్పదపద వీవిధాయియయి • భాసిలె నాశలెఱుంగు దాతయై

అని కృతినాయకుఁ డగు కామమంత్రిని వర్ణించెను. పై
రించిన వెంకటరాయునికి వెంకట నరసింహాము రాజన్న త్రియం
సదాశివరాయుఁడు అను కుమాళ్లు. కృతిభర్తయైన కామయ్య
నరసింహామునకు ... కుమార్తెయైన ... గారిని వివాహమై ఆమె

వెంకట నరసింహము, అను కుమార్డు కృష్ణవేణి యను కుమార్తె గల్గిరి. కృత్యవతరణికయందు కృతిభర్తయగుకామయ్యగారి నిట్లువర్ణించె ను-యాజ్ఞవల్క్యాన్వయపయఃపారావారరాకాసుధాకరుండును లోకరక్షా విచక్షణశిక్షాదక్షలక్ష్మీకటాక్షలబ్ధప్రాభవశోభావిభాసమాన భానుతను గుణ గణాభిరాముండును, రామానుజ కమనీయలక్షణలక్షితసౌందర్య కళాకాముండును కామిత ప్రదుండును, త్రిజగత్పవిత్రాత్రేయగోత్రోద్భవుండును, బొల్లాప్రగడ వంశభూషణుండును వేంకట నృసింహామాత్య పుత్రుండును, వేంకటాచలాంబికా గర్భముక్తాఫలప్రాయుండును, సుజన విధేయుండును నగు కామమామాత్య కంఠీరవుండు నిండోలగంబునఁ బండిత యోగ్యజటాపాఠ కవిబంధుమిత్రామాత్యపుత్ర సోదరభాగినేయ భావుకముఖనిఖిలాలును, సమస్త దేశాగత క్షితిపతులును, సామంత భటనట గాయ పాఠక నివహంబులుంగొలువ గొలువుండి

నను గోటుల సత్కులున్ జెలిమి నీనర్ దాను వీక్షించి సూరన నీ వక్కజమైన సత్కవివి యార్యశ్రేణు లగ్గింప భక్తినిఁ గృష్ణాభ్యుదయ ప్రబంధము జగద్గేయా ప్రమేయంబుగా, నొనరం జెప్పుము మెప్పు లుప్పతిల సద్యోగాను రాగంబునన్.

ఈ గ్రంథ మునం దొక్క బొల్లా ప్రగడ వారినే గాక ఈ వంశమువారితో సబంధములు చేసిన కేతరాజువారు ఆదుర్తివారు లేటివారు వెలిచేటివారు కొప్పర్తివారు, దేవరాజువారు, చెట్లపల్లివారు, నరిపల్లెవారు,సావడివారు, మైదవోలువారు, మున్నగువారికుటుంబములనుగూడ వర్ణించెను. ఈబొల్లాప్రగ్గడ పూర్వమేరాజులయొద్దమంత్రిగానుండెనో వీరి పూర్వపుఇంటిపేరేమైయుండెనో తెలియదు. ఈప్రగ్గడ మొక్క ఆర్వేల నియోగులందెగాక, అన్నాప్రగడ అయినా ప్రగడ వీర ప్రెగడ, నరసింగ ప్రెగడ వల్లాప్రగడ, బొల్లాప్రగడ అనః ఇండ్ల

వేర్లు యాజ్ఞ్యవల్క్యులయందును, రాయనప్రగడ, దాచన ప్రగడ
వేర్లు నందవరీక నియోగులయందును కనుపించుచున్నవి. వీరు
గర్నిప్రగడ, దుర్గాప్రగడ, సుందరపప్రగడ, ప్రగడా ప్రగడ వారు
తెలియుచున్నది గాని వారే శాఖ వారో యెచట నుండిరో
మింతవరకు తెలియలేదు. ఇంతవఱకు 47 ప్రగడలు కనుపించినవి.
థము పూర్తియగువర కెన్ని బయలుదేరునో తెలియదు.

ఈ కుటుంబము వారి కనుశుక్రతముగా పైనుదహరించిన సం
శ్రీ గాక నల్లజెర్లవారు, గోపరాజువారు, జోస్యులవారు, అయ్
వారు, మద్దూరి, అయినాపురపు, కోలవెన్ను, విప్పర్తి, దీ
మజ్జిపాటి మొదలగువారితో సంబంధములు గలవు.

ఇప్పుడు బొల్లాప్రగడ సుందరశివరావుగారి కుటుంబ
రాజమహేంద్రవరమున గలదు. పరబ్రహ్మానందరావుగారి కుటుం
రాజోలుతా॥ మోరియందు గలదు. ఇటీవల బొల్లాప్రగడ సూరయ
రను వారు అంతఃపుర సుందరీమణుల కథ-వేశ్యాస్తవరాజము
గ్రంథములు ప్రచురించిరి. ఈవంశీకులలో బొల్లాప్రగడ పట్టాభిరా
గారి కుటుంబము నీలపల్లియందున్నారు. ఆ గ్రామము అందుకు
ధించిన నాలుగయిదు గ్రామములకు వారు జమీందారులై యు

ఎచటివారో గాని బొల్లాప్రగడ చలమయ్యగారివల్ల వ్రాసు
డిన భాగవతగ్రంథము తాటియాకుల ప్రతియొకటి కనుపించు
కుంటూరు రాజ్యమునకు పాలకుడగు శ్రీమన్మహామండలీక గ
రి యుదయరాజుయొక్క మంత్రి పేరు 'బొల్లన' యని యాంధ్ర
త్రియందు కనుపించుచున్నది. బహుశా ఆ బొల్లన వీరి మూల
డేమో యని సందేహము తోచుచున్నది.

# కేశవరపువారు

ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు భారద్వాజస గోత్రీకులు, ఆంగిరస బార్హస్పత్య భారద్వాజ అని త్ర్యార్షేయమ్ము. కేశవర మను గ్రామము గోదావరి జిల్లా భీమవరం తాలూకా లోనిద్ది. ఈ వంశీకుల చరిత్రను తెలియ ప్రయత్నించుచుండగా రెడ్డిపల్లవరమున నుండు కేశవరపు వెంకట రాయుడుగారివలన నీ దిగువ సంగతులు తెలియవచ్చినవి. వారు వ్రాసి పంపిన కాగితము సందిగ్ధమున్నది. పూర్వ మెవ్వరో నెల్లూరు జిల్లానుండి వచ్చిరనుకొందుము. వారనే యింటిపేరు గల వారు యీ దేశము వచ్చి నిడమర్తియందుండి నిడమర్తి వారని యు అడవికొల్లు చేరిన వారడవికొల్లు వారనియు పిలువబడుచుండిరి. సూరపరాజను మరియొక పురుషుడు కేశవరము ప్రవేశించి కేశవరపు వారైనారు అని పెద్దలు చెప్పగా విని యుంటిని. నిడమర్తి వారు [illegible]అడవికొలను వారు కేశవరపువారు అను ప్రత్యేక గృహనామములతో [illegible]రువరికాలములో యెప్పుడు కలిగినవి అడవికొలను చిన సూరయ్య [illegible]ము గారి కుమార్తె చక్రపాణి రావుగారి నద్దనున్న వంశవృక్షము వల్ల తెలియ [illegible] దని శ్రీ నిడమర్తి జలదుర్గ ప్రసాదరాయుడుగారు నాతో చెప్పి [illegible]రు. కేశవరం ప్రవేశించిన వెంకట కేశవరపు సూరపరాజుగారి తమ్ము [illegible]యు దేవరాజుగారు కొంతకాలము కేశవరములో నుండి అనంతరము [illegible]వాసాపురమునద్ద లిమ్మాపురముతో భూవసతి సంపాదించుకొని ఆ కు [illegible]టుంబము వారచట నిలచిపోయిరి. వారా ప్రాంత్యములయందు [illegible] గర్రమిల్లివారు గోటేటివారు అను వారలతో సంబంధముచేసి అటు [illegible]పుల నుండిరి. ఇపుడు వీరవరములోనుండిన కేశవరపు సూర్యనా రాయణగారి కుటుంబ మా వంశములోనిదే.

కేశవరములో ప్రవేశించిన సూరపరాజుగారి కుమారుడు సర్వరాజు గారు కేశవరం గ్రామకరణముగా నుండిరి. ఆయన కుమారులు నలుగురిలో

పెద్ద వాడయిన కృష్ణమ్మగారు జ్యోతిష జాతక ముహూర్త సిద్ధా
ములయందు మిగుల ప్రసిద్ధులై అప్పటి ప్రభువులవలన నలుబది రె
యకరముల శ్రోత్రియం యీనాము సంపాదించిరి. కృష్ణమ్మగా
యిద్దరు కుమాళ్ళలో పెద్దవాడయిన వెంకటచలమయ్యగారు స్క
త్రయాత్మక జ్యోతిశ్శాస్త్రమునందు లీలావతి క్షేత్రగణితములయ
ప్రజ్ఞ కలిగి దినమున కొక వరహా జీతము పుచ్చుకొనుచు నిడదవో
యస్టేటు ధర్మాఅప్పారావు బహద్దరు జమీందారుగారివల్ల యివ్వబ
భూము లన్నిటిని మఘాతుచేసి విడదీసిరి. ఈయన తమ్ముడు మూయు
రాజుగారు మహాసాధు. సర్వదా తపోనిష్టాగరిష్టులై యుండెడివా
చలమయ్యగారి కుమాళ్ళలో బాపన్న దీక్షితులుగారు స్వాధ్యాయ
అశీతిద్వయము క్రమాంతముగా వ్యాకరణము సూత్రభాష్యము
యనంచేసిరి. వీరు ఔపోసనం వైశ్వదేవం స్థాలీపాకం యీశాన
బలులు అష్టకశ్రార్థమాసశ్రార్ధములు అను పాక యజ్ఞములు ఆధా
తుర్మాస్య సౌత్రామణ్యాది హవిర్యజ్ఞములు షణ్ణవతి శ్రార్థ
చేస్తూ అవిచ్ఛిన్నముగా యిరువది అయిదు సంవత్సరములు పం
గ్నిహోత్రము, యేకాదశరుద్రము, సహస్రనామపూజ చేయ
రెండు వందల యకరముల భూమి బ్రాహ్మణులకు ఈనా
గా నిచ్చెను. ఇప్పటికి డెబ్బది సంవత్సరముల క్రిందట రుధిరో
సంవత్సరములో స్వర్గస్థులైనారు.

వీరి తమ్ములు కనకరాజుగారు గణితశాస్త్రమునందు, జ్యోతి
నందు, సుబ్బారాయుడుగారు ధర్మశాస్త్రమునందు ప్రవీణులు.
తరము ఈ వెంకటరాయుడుగారి తండ్రిగారగు బాపన్న దీక్షి
గారు చాలా కర్మిష్టులు, దాతలు. ఈ కుటుంబములో చేరిన
రిపుడు గోదావరి జిల్లా కడకట్ల, రెడ్డి పోలవరము, అమలాపుర
పిఠాపురగను, [illegible] గ్రామములలో నున్నారు. బహాదు

57 గ్రామములలో నిడమర్తివారికి సగమున్ను క్రొవ్విడి కలిగొట్లవారికి సగమున్ను అందు క్రొవ్విడివారికి 7 భాగములు కలిగొట్ల వారికి 5 భాగములుగా నున్నట్టు వింటాను యిటీవల యీక్రొవ్విడి వారిలో కొందరు షాములపర్తివా రయినట్టున్ను కలిగొట్ల వారిలో కొందరు తాడినాడవారయినట్టు వింటాను అని తెలియ పఱచిరి. పమిడిఘంటమువారు అడవికొల్లు, కేశవరం, నిడమర్తి వారుగా మారినటుల వీరు చెప్పుచున్నారు. వీరిలో పమిడిఘంటము వారనియు, పైడిఘంటమువారనియు ద్వివిధము. రెండవ వారిది భార్గవ గోత్రము. కొత్తూరు, కృత్తివెంటి, తామరపల్లివారి కుటుంబముల చరిత్రలో కొంత తెలియగలదు. పైడిఘంటము వారి చరిత్రలో సంపూర్ణముగ తెలియగలదు. ఈ విషయములో నిడమర్తివారు అడవికొలను వారి చరిత్రలుకూడ చూచునది. ఈ కుటుంబమువారి కనుశ్రితముగా కలిగొట్లవారు, సూర్పూడి, చెరుకువాడ, క్రొవ్విడి, చామర్తి, సత్తిరాజు, కొచ్చెర్లకోట, ఉరమిల్లి, జానేటి, రెబ్బాప్రగడ, తాడినాడవారు మున్నగు వారితో బంధుత్వములు గలవు. కేశవరపు బాపన్న దీక్షితులుగారు కొంతకాల ము తాడేపల్లిగూడెమువద్దనుండు కడకట్లలో నుండెడి వా రనియు అచట నుండగానే వీరు దీక్షితులు అయి రనియు తెలియుచున్నది.

☞ ఈ వెంకట రామయ్య గారిపల్లనే నీ చరిత్ర విని ముప్పది యేండ్లయినది. పై నుదహరించిన వంశవృక్షమునుగూర్చి ప్రస్తుతము ఏలూరులో న్యాయవాదులుగా నుండియున్న అడవికొల్లు చక్రపాణి రావు పంతులు గారిని కనుగొనగా సరియగు ప్రత్యుత్తర మిప్పించియుండలేదు. ఈ వంశీకులవద్ద నేదియొద్దనైన యుండినచో నిడమర్తి వారు అడవికొల్లువారి చరిత్రయందు ప్రచురించెదను.

## ఉపద్రష్టవారు.

వేగినాటి వైదికులు, ఋగ్వేదులు, అశ్వలాయన సూత్రము, కౌండిన్య గోత్రము, త్ర్యార్షేయము వీరి పూర్వపు నివాస మె... గాని ఆన 1570 సంవత్సరంలో వినుకొండ సీమ పాలించుచున్న ... వెంగళనాథరాజు అనువారు తమయేలుబడిలోని చింతగుంట ... మములకు తిరువెంగళనాథరాజ పుర మను పేరుబెట్టి ఉపద్రష్ట ... శ్వర సోమయాజిగారి పౌత్రుడు జగన్నాథశాస్త్రిగారి ... రామాభట్టుగారికి దానము చేయబడినట్లు ఈ గ్రామము ... సమీపమున నున్నటులను చింతగుంట కైఫియ్యతులో వా... నది. తిరువెంగళనాథ పురము అను పేరుగల మూడు జమీ... గ్రామములు యిపుడు చిత్తూరు జిల్లాలోని తిరుత్తని డివిజనులో ... ఈ గ్రామములు పూర్వము అలంఘీరు పాదుషావారి పరమైన ... యీ అగ్రహారీకులు నయనారు వారను అర్వేల నియోగులను ... గ్రామము తీసుకొని వచ్చి వారికి మాన్యమిచ్చి వారిచే కొంత కా... గ్రామ వ్యవహారము నడిపించుచూ దరిమిలా కొంతకాలని... అగ్రహారమునకు పన్ను గట్టుటచే పన్ను చెల్లించుకొనలేక అగ్రహా... విడచి లేచి పోయిరి అని వినుకొండ దుడకలివెలో చింతగుంట ... కైఫియ్యతునందు కనుపించు చున్నది. 'చింతగుంట' ... గ్రామ మొకటి నెల్లూరు జిల్లా యందున్నది. ఈ గ్రామమున ... వెంగళనాథరాజ పురమని యున్నదో లేక వీరుదానముచేసిన గ్ర... చిత్తూరు జిల్లా లోనిదో తెలియదు.

ఉపద్రష్ట వారను యింటి పేరుగలవారిపుడు గుడివాడ ... గోదావరి జిల్లా ముంగండ అగ్రహారము నందుగలరు వీరిలో ... పాధ్యాయులవారు వెంకట శాస్త్రిగారు ప్రఖ్యాతి పురుషులు ...

ఈ వంశీకుల పూర్వీకులలో నీ ముంగండ కాపరస్థులు లక్ష్మీ పేరు భట్టుల పుత్రుడగు జగత్ప్రఖ్యాతిగల జగన్నాథ పండితు ళ్ళుం డెడివారు అలంకార శాస్త్రమునకు వన్నె తెచ్చెను. భట్టోజీ దీక్షితుల్లు అప్పయదీక్షితుల వారి గ్రంథములకు ఖండనగ్రంథములు ప్రచురించెను. ఈ యనకు ఢిల్లీ పాదుషాగారు గొప్ప ప్రాపకులు. ఈయన లవంగి ప్రేమించి భామినీ విలాసము, దారా ప్రభువును స్తుతించుచున్నా జగదా భరణమను గ్రంథమును, ఆసఫ్ఖాను తనకొనర్చిన ఉపకృతికై సఫా విలాసము, కరుణాలహరి, గంగాలహరి, సుధాలహరి, లక్ష్మీలహరి, ప్రాణా భరణము అను చక్కని గ్రంథము లనేక ములు రచించి సర్వజన వంద్యుడై వెలసినాడు. ఈ మహాకవి ఢిల్లీ పాదుషా యగు షాజహాన్ ఆస్థానమున నుండి పండిత రాయ లను బిరుదమును గాంచినాడు. ఈ యన జీవితమును గూర్చి అనేక విచి త్రమైన గాథలు గలవు ఈయన ప్రపథమున గర్ణాటక రాజ్యాధి పతుల యొద్దను అనంతరము జయపుర సంస్థాన మందును పిదప షాహజహాను చక్రవర్తి యాస్థానముఁ జేరి యచట లవంగియను యవన స్త్రీని వరిం చెనని భామినీ విలాసమున గలదు. ఈయన క్రీశ 1660 సంవత్సర ప్రాంత్యమున కాశీ పట్టణమున మృతినొంది యుండును. ఈయన విద్య తండ్రిగారి యొద్దనే గ్రహించుటచే రస గంగాధర మందా యన నిట్లు వ్రాసెను. ఆ సంస్కృత శ్లోకమునకు తెనుగు

గ్రహియించెన్నుత బ్రహ్మవిద్య విమల జ్ఞానేంద్ర యోగీంద్రుచే.
గహనంబైన కణాద గౌతముల వాక్యంబుల్ మహేంద్రార్యుచే
మిహి కాశీపురి ఖండ దేవు. నలననేమీ మాంస శేషాంకుచే
నహి రాడ్భాష్యము; పేరు భట్టుల విద్యాశాలిసామాన్యుడే ॥

ఈ యన చరిత్రనుగూర్చి విశేషముగా వినగోరువారు శ్రీ వడ్డాది సుబ్బారాయకవి తెనిగించి ప్రచురించిన భామినీ విలాస పీఠికలో చూడ వచ్చును.

పండితరాయ బిరుదాంకితులగు శ్రీ జగన్నాథ పండితు
రచించిన భామినీ విలాసమును చదివినచో యీయన విద్యాప్ర
తెలియగలదు. ఇప్పటి వారిలో నరసింహ శాస్త్రి గారు
లు. ఈ కుటుంబములోని వారొక కొందరు యిపుడు
తాలూకా దండమూడి గ్రామమునందుండి యున్నారు.
పండితుని సంతతివారిప్పటికిని ముంగండ అగ్రహారము నందు
తెలియు చున్నది.

## తిరుమలవారు.

శ్రీవైష్ణవులు. శఠమర్షణగోత్రికులు. వీరిలో అద్దంకి తిరు
రనియు, అయినంపూడి తిరుమల వారనియు ద్వివిధము.
రామచంద్రాచార్యులుగారు తిరుమలనుండి తమ యిద్దరి కుమా
కృష్ణానదీ ప్రాంత్యములోని శిష్యుల కోరికపై అవనిగడ్డ తా
అయినంపూడిలో స్థిరపడి అచట శ్రీ వేణుగోపాలస్వామివారి
ము ప్రతిష్టించి అచటనే నిలచి పోయిరి. అప్పటికి వీరు వడగల
ప్రదాయకులు. వీరి పెద్దకుమారుడు వెంకటాచార్యు
రెండవ కుమారుని పేరు నరసింహ దేశకా చార్యులు గారు
వెంకటాచార్యులు గారికి ఏడుగురు పుత్రులు. రెండవవారు
చారులుగానే యుండి యే కారణముచేతనో తెంగలి పీఠస్తులగు
మామల జియ్యరుగారి నాశ్రయించి గ్రంథకాలక్షేపము చేసి
అయినంపూడికి రాగా వీ రాచరించు తెగలి సాంప్రదాయ
అన్నగారు కోపించి యింటికి రానీయక పోవుటచే నరసింహ
ర్యులుగారు అచటి స్వామివారి ఆలయములో నివాస మేర్పరచు
ఈయన తల్లిగారు అనుదినము ఆలయమువద్దకు ప్రసాదము

ళ్ళి చిన్నకుమారున కిచ్చు చుండెడిది. ఒక దిన మీమె ప్రసాదము
టుకు వెళ్లు సమయమున ఆయన ఆలయములో నిద్రించుచున్న వారిపై
సర్పము పడగ విప్పి తలమీద నిలచి ఆడుచుండుట చూచి తల్లి
రు భయపడి యింటికి వెళ్ళి పెద్దకుమారునితో చెప్పగా వారందరూ
చ్చి చూచుసరికి సర్ప మదృశ్యమాయెను. ఆయన లేచి సుఖము
కూర్చుండెను. అప్పగా రది చూచి తన తమ్ము డొక యనతార
పురుషునిగా యోచించి తన కుమాళ్ళను తమ్మునికి వప్పగించి తాను
మ్మని మతమగు తెంగలి సిద్ధాంతము ననుసరించిరి. ఈ నరహరిదే
చార్యులువారు అనంతరము శ్రీ విష్ణుపురాణమునకు వ్యాఖ్య
చిరి. అది అముద్రితము. అయినంపూడినుండి, ఈ వంశస్థులు
ర్వముగా, గొల్లపాలెము, చామర్లకోట, సర్పవరము, పెంటపాడు,
మునూరుపాడు, అయినంపూడి, ఉమామహేశ్వరం, రావిగూడెము
లగు స్థలములయందును, నైజాము యిలాకా నల్లవిల్లియందు
నుచూ ఆ యా జమీందార్లచే పూజింపబడుచుండిరి. వీరిలో
రు సింగరాచార్యులువారు అతిమంత్రవేత్త. ఆయనకు సర్ప
వశవర్తినులుగా నుండెడి వనియు ఒక దినమున తన శిష్యులకు
పండ్లు ప్రసాదము పెట్టగా వారి శిష్యులాపండ్లను విప్పి చూచు
య్యవి అతి మనోహరమగు భక్ష్యములుగా మారెనట్లు ఒక
ప్పుదురు. తిరుమల భావనాచారిగారి కుమార్డు నరసింహాచా
గారు ముదునూరుపాడు అగ్రహారమున శ్రీ వెంకటేశ్వరస్వామి
లయము కట్టించి చుట్టూ పన్నిద్దరాళ్వారిని ప్రతిష్టించి దివ్య
చేయించి రట! వీరి కనుశ్రుతముగా కిళాంబివారు, విజమూ
కొమాండూరివారు, ప్రతివాదిభయంకరంవారు, కం...వారు,
పురోహితులవారు, గోమఠంవారు, వంగీపురంవారు, ఇయూణ్ణివారు, ఇరు
ము...రు, మాడభూషివారు మున్నగు వారితో సంబంధములు

చేయుచున్నారు. వీరు ప్రప్రథమమున అద్దంకి వచ్చుటచే అ...
మలవారైనారు. అయినంపూడి తిరుమలవారు వంశములు ... వీరి
తిరుమల వీరరాఘువాచార్యులు గారు పెంటపాడులో శ్రీ వైష్ణవస...
కా సంపాదకులుగా నున్నారు. తిరుమల తాతాచార్యులుగారు ...ట,
పురమునందు జన్మించి చంద్రగిరి రాజుల వంశగురువులై నాయకవి...
గొప్ప విద్వాంసులు, మంచికవులు. ఈయన స్వంతసొమ్ము ఖర్చు నూ...
అనేకమందికి వివాహములు చేయించుటచే వీరింటిపేరు తిరుమలబ...
రనుటకు మారుగా 'కన్యాదానము' వారని మారినది. ఈ తాను...
ర్యులుగారు వైష్ణవమతము నందత్యంతాభినివేశము గలవా...కార...
శిష్యులైన రాజుల బలముచే బలవంతముగా మనుష్యులను...
కర్ణాదుల చేయించుచూ వచ్చుటచే కాబోలు తాతాచా...
ముద్రభుజములు తప్పినా వీపు తప్ప దను సామెత జగత్ప్ర...
ఈయన సాత్త్విక బ్రహ్మవిద్యావిలాస మను గ్రంథము ...
ఈ తిరుమలవారిలో అయ్యలార్యులు మడికి సింగన్నగారి గురు...
టచే తన పద్మపురాణము నందిట్లు నుతించెను.

క॥ ధర నిహపరములకును గురు
చరణంబుల యాత్ర లగుట చర్చించి మదిం
బరవాది భద్రవారణ
హరి ముఖ్యులఁ దిరుమలయ్యలార్యుల గొలుతు...

కృష్ణదేవరాయల గురువగు తాతాచార్యులవారికి రామ...
జరిగిన చిత్రకథ లెన్నో చెప్పెదరు. ఈ తాతాచార్యుల...
శ్శృంగరాచార్యులు. ఈయన అనవేమా రెడ్డిగురువు. ఈ తి...
లో జగన్నాథాచార్యులు అనువారు శతానందోపాఖ్యాన మ...
మును, రాఘవాచారి గారు కుచేలోపాఖ్యాన గ్రంథమును

## కొత్తలంకవారు

వీరిని ఆదిశైవు లనియు, శివద్విజు లనియు బిలచెదరు. వీరిది బోధా
యనసూత్రము. భారద్వాజ గోత్రము. ఈ వంశీకు లిప్పుడు కోరంగి
కోట, కోటిపల్లి కోట యందున్నారు. వీరిలో క్రొత్తలంక మృత్యుంజ
యకవి గలడు. ఈయన విశ్వనాథుని పుత్రుఁడు. ఈత డించుమించు
నూరు సంవత్సరముల క్రిందట నుండిన వాఁడు. (ఇప్పటికి నూట
ఏబదేడులు కావచ్చును.) ఈతని మునిమనుమ లిప్పటికిని గోడి
గ్రామములో నివసించియున్నట్లు వినుచున్నాము అని కవుల చరి
త్రకారులు వ్రాసిరి. ఈయన బృహన్నారదీయము, నిరోష్ఠ్యనలచరిత్ర
కృష్ణవిజయము, మూర్తిత్రయోపాఖ్యానము, షట్చక్రవర్తుల చరిత్రము,
గ్రంథములురచించెను. ఈయనకాపురస్థలము గోదావరి మండల
లో కౌశికనదీతీరమందలి కొమరగిరి. అనంతరమువీరిసంతతివారు గోడి
గ్రామము వెళ్ళినటుల కనుపించుచున్నది. ఈయన రచించిన
భావ ... కలయం దితరులు వ్రాసినటుల వ్రాసి అందు వారి వారి
వర్ణనచేసి కృత్యాద్యవస్థయందు తన యూరిపేరును, తన పేరును
గద్యయందుమాత్రము తన పేరు వెల్లడిచేసికొనినటుల కనుపిం
చుచున్నది. కృష్ణవిజయమునకు విజయనగరం మహారాజుగారిని, మూ
ర్తిత్రయోపాఖ్యానమునకు ఉప్పాంగ దంతులూరి వారిని షట్చక్రవర్తుల
కు బిక్కవోలు మల్లారెడ్డిగారిని ధరాత్మజాపరిణయమునకు ఆళ్లారి
రాజుగారిని ప్రణీతకృతికర్తలుగా వ్రాసి బృహన్నారదీయమున
త్రము

గీ॥ సకల సారపురాణముల్ సరస కవులు
తెలుఁగు లొనరించి రిదియును దెలుఁగు సేయ
గనఁగ లేదైతి నాదు భాగ్యంబు కలిసెఁ
దెనుఁ గొనర్తు బృహన్నారదీయ మిపుడు.

అని కర్తృత్వము తాను వహించెను. అందు తన కుటుం
వర్ణించుకొనెను—

గీ॥ మహిత చర్య భారద్వాజ మౌనివర్య
గోత్ర బోధాయనాఖ్యాన సూత్రకలిత
క్రొత్తలంకవంశాంబుధి కువలయాప్తు
డగుచు వెలయుఁ బోతాపంతు లను ఘనుఁడు.

ఈయనకు సర్వాపంతులు, విశ్వనాథకవి యను యిద్దరు
విశ్వనాథ కవికి వీరభద్రయ్య, భగవంతయ్య, మృత్యుం
అందు కడపటి వాడగు మృత్యుంజయకవియే ఏతద్గ్రంథకర్త
థము నందలి గద్య యిట్లున్నది.

ఇది శ్రీమత్కౌశికీ తీరవాసి సర్వవర్ణవిరాజమాన శ్రీ
పట్టణసంస్థిత శ్రీలక్ష్మణేశ్వరమహాదేవ కృపాకటాక్షపరిలబ్ధ
థానబోధాయనాఖ్యక సూత్రపవిత్రశివద్విజోత్తమ క్రొత్తల
నాథపుత్రసకలసుకవిజనవిధేయ మృత్యుంజయనామధేయ
న బృహన్నారదీయం బను మహాపురాణంబునందు... అని

ఇంతకంటె వీరి కుటుంబచరిత్ర తెలియదు గాని ఈ కుటు
చేరిన క్రొత్తలంక సాం॥ శివుఁడుగారను వారిపుడు విశాఖప
గల రని తెలియుచున్నది.

## అవుడూరివారు

వీరునందవరీకనియోగులు. అశ్వలాయన సూత్రము. హారిత
ఋగ్వేదులు. వీరు హారిత అంబరీష యువనాశ్వ అని త్రా
చెప్పుకొనుచున్నారు. వీరి కాపురస్థలము అవుడూ రను గ్రామ
మండలములో నున్నది. ఈ వంశీకులలో కిచ్చయ్యగారు
యన రఘువంశమును తెలుగించుటయేగాక మాధవాభ్యుద
పేరిట ... కథలు ప్రబంధముగా ... వ్రాసెను. ఈ గ్రం

ల్వీటి నాగయామాత్యుని ప్రేరణమున తిరుపతి వెంకటేశ్వరులకు కృతి నిచ్చెను. ఈయన రూపావతార చెన్నకృష్ణశాస్త్రి శిష్యుడు. ఈ గ్రంథమునకు కృతిప్రేరకు డగు నూల్వీటివారు నందవరీకు లగుటచే నందవరీకుల వృత్తాంత మించుక దెలుపబడినది. అందు పదమూడు గోత్రములు గల ఏనూరిండ్ల విప్రు లీ దేశమునకు వచ్చినటుల చెప్పబడిన పద్య మీ దిగువ నుదహరించుచున్నాను.

ఉ॥ నందన చక్రవర్తి తన నందవరంబున నుండి కాశికిం
పొందఁగ యోగవాగమహిమోన్నతి నిచ్చలు నేఁగి గాంగ వా
రిం దగు నిత్యకృత్య మొనరించి శివున్ బ్రణుతించి వచ్చు న
చ్ఛంద మెఱింగి యా నృపతి జవ్వని తాఁ జనుదేరఁగోరినన్.

సీ॥ సతితోడఁ జని కాశిఁ • కతఁడు గంగావారిఁ
గృతకృత్యుఁడై యాత్ర • బుఱిమఱి యగు
లలనతో మరలి పోఁ • దలఁచి తద్దోషాన,
యోగవాగాలు రా • కున్కి వగచి
అచటి విప్రుల వేఁడ • నప్పుడే నూఱిండ్లు
పదమూఁడు గోత్రముల్ • పరగు బ్రాహ్మ
ణోత్తముల్ నిజశక్తి • యోఁగవాగాలు గ్రి
మ్మఱఁ బంపుగాఁ జేయు • మహిమ కలరి

తే॥ గీ॥ రాజు తన యేలు నందవ • రంబువారి
క గ్రహారంబుగా నిచ్చి • యరిగె వార
లటుల నందవరం బగ్ర • హారముగఁ బ
రిగ్రహించుట నంద వ • రీకులైరి.

అనంతరము కృతిప్రేరకుఁడైన నూల్వీటి నాగయామాత్యచంద్రుండు నిజాస్థాన మధ్యంబున సుఖాసీనుండై కవి నిట్లు సంబోధించి నటుల నీ దిగువ పద్యము చెప్పుకొనెను.

సీ॥ శ్రీ నందవర వంశ • సింధుసుధా భాను
భూరి విక్రమ పరా • భూతభాను
దిప్పమాంబా గర్భ • దివ్యాబ్ధి సంతాను
సౌడూరి చిన గుర్వ • యార్యసూను
సంగీత సాహిత్య • చతురత నసమాను
లనుచు బుధు ల్మెచ్చ • నవనిలోను
దనరు సూరయ మంత్రి • పిన సూరయామాత్యు
లన్నదమ్ములుగ బొ•ల్పగు సుధీను
జెన్న కృష్ణార్య పాద రా • జీవభక్తి
లబ్ధకవితాభి నిర్మాణ • లలిత బుద్ధి
వైభవ విధాను శ్రీ కిచ్చ • యాభిధాను
నన్నుఁ బిలిపించి యిట్లని • సన్నుతించె.

చ॥ చతురత హంసవింశతియు సత్కవినాయక కాళిదాస క
ల్పితరఘువంశమున్ మఱియుఁ బెక్కులు సత్కృతు లాంధ్ర
పతికి సమర్పణంబుగ శుభం బొదవన్ రచియించి సద్యశ
స్స్తుతి విస్తుతి గన్న ధన్యుఁడవు ధారుణి సౌడూరి కిచ్చయా
అని చెప్పుకొనెను.

గద్య యందు, ఇది శ్రీమదవుడూరి గురవయామాత్య పుత్ర
సగోత్రి పవిత్ర చెన్న కృష్ణ శాస్త్రి సద్గురువర పాదారవింద
సామాసాదిత కవిత్వనిర్మాణ చాతుర్యధౌరేయ కిచ్చయ నామధే
ణీతంబైన మాధవాభ్యుదయం బను మహాప్రబంధంబునందు
మాశ్వాసము అని యున్నది. వీరికి నూల్వీటువారు చుట్టు
ఈ యాడూరి కిచ్చయ్యగారి తండ్రి చినగురవయ్య తల్లి
మాంబ పెదసూరయ్య చినసూరయ్య ఈయన సోదరులు.
కుమార్తెను యీ కృతిభర్త సోదరుని కిచ్చి వివాహము జేసి

ఈ గ్రంథమునందు జెప్పబడినది- ఈ గ్రంథమునందు నూల్వీటి వారి వంశమును విశేషముగా వర్ణించెను గాని తనవంశమునుగూర్చి ఇంతకంటె ఏమియు చెప్పుకొనలేదు.

పై పద్యములవలన కాళిదాసు రఘువంశము దెనిగించినటులును దెలియుచున్నది. ఈ నందవరీకులను ఇళ్ళ పేర్లనుబట్టి కుటుంబముల వృత్తాంతము గ్రహించుట కష్టము. వీరికి యింటి పేరనునది యొకటి ఖాయముగాలేదు. ఎవరెప్పుడే యూరనుంటే ఆ యూరిపేరే యింటిపేరుగా వాడుకొనుచుందురు. పసిండికొండ వెంకటరమణార్య ప్రణీతంబైన లక్షణశిరోమణి యను గ్రంథము నందాకవి తన వంశము నిట్లు వర్ణించుకొనెను.

॥ నందవరంబున నలువొందగా దశగ్రంథాల వారన గణన కెక్కి-
పిమ్మట రాయన ప్రెగ్గడ వారనం దనరి తరువాత బొత్తపియనేటి
గామినామునం బ్రఖ్యాతిగాంచి యనంతరంబున ధరదుర్గరాజుపేర
పౌరుషేయంబుగం బ్రాశిగౌతమ గోత్రుం డగు పసిండికొండదుర్గ
రాజు వెంగన పౌత్రుండ రామఘనుని పుత్రుండ మదూరి
పుత్రుండైన కొండార్య యెలమి రఘునాథమంత్రి
దౌహిత్రుడగవి రాజ మిత్రుడ వెంకట రమణ కవిని.

అనుటచే దశగ్రంథాలవారు, రాయన ప్రగ్గడవారు, పొత్తపివారు, దుర్గరాజుగారు, పసిండికొండవారుగాను మార్పులు జరిగినటుల కనుపించుచున్నది. నందవరీకుల నెవరిని కనుగొనినను ప్రతివారు తమ యింటిపేరునందు చాలా మార్పు లున్నటుల ఒప్పుకొనుచున్నారు. అందువల్ల పైనుదహరించిన అవుదూరి వారిపు డెచట నుండిరో లేక మరియొక యింటిపేరుగా మారిరో వివరము తెలియదు. నందవరీకుల

చరిత్రి) వీరి గోత్రములు మున్నగు విషయము లుపోద్ఘాతమున జె
బడును. ఇప్పు డీ కిచ్చయ్యగారి వంశీకు లేరైన నుండిన పూ
వీరి కాపుర మెచటనో దరిమిలా నెటుల మారిరో తెలియ జె
ముందు ముద్రింపఁబోవు గ్రంథమునందు సంపూర్ణముగ సవరించి ఆ
రించెదము. శ్రీకూర్మములో ఔదూరి వేంకట శాస్త్రులు గారికులు
పండితులు గలరు. వా రేశాఖ వారో తెలియదు.

ఈ కిచ్చయ్యగారు యిప్పటికి నూట యెనుబది సంవత్సర
లోపువాడని కవుల చరిత్ర కారు లుదహరించిరి. ఈ కవి ప్రస్తు
ము రచించిన కాళిదాస మహాకవి కృత రఘువంశమును తెలి
టకు బ్రోత్సాహకుడు రాయప్రోలున కధిపతియగు కుందురు వీర్య
హ్వయక్షోణీ పాలకుని యాస్థానంబున మంత్రియు ఆర్వేల నియో
పుంగవుండగు కట్టకోల నరసామాత్యుడు

మ॥ అనఘు శ్రీమతిఁ జెన్న కృష్ణగురు పాదార్చా సమారబ్ధ శో
భన నానావిధ సత్కవిత్వ రచనా ప్రావీణ్య పూర్ణీకృత ।
ప్రణుత ప్రౌకృతివై తదా త్తమణి హైరణ్యాది సత్కార ము
దిన శ్రీ యాదుకి కిచ్చయాఖ్య సుక వీ ధీరుండ వీవన్నిటన్ ।

అని పొగడినట్లు వ్రాసుకొనెనే గాని తన వంశక్రమ మేమియు
ఇందునను జెప్పుకొనలేదు. ఈ గ్రంథ ప్రోత్సాహకులు రాయప్రో
లున కధిపతుల కడ మంత్రి పుంగవు లనుటచే యీ కవి వంశీకు
ప్రాంత్యము నందుండి యుండవచ్చును అని తోచుచున్నది.

# కొచ్చెర్లకోటవారు.

ఆర్వేల నియోగులు. ఆపస్తంబులు. యజుర్వేదులు. కాశ్యప గో
త్రికులు. కాశ్యప, అవత్సార నైధ్రువ, రేఫ–రైఫ–శండిల–శాండిల్య
సప్తార్షేయము చెప్పుకొనుచున్నారు. ఈ వంశీకుల నివాసస్థాన
పూర్వము కొచ్చెర్లకోట గ్రామము. అచటి కాపురస్తు లగుటచే
కొచ్చెర్లకోట వా రను పేరు వచ్చినది. కొచ్చెర్ల గ్రామ
వినుకొండ తాలూకాలోనిది. ఇందు చింతపల్లివారివలన కోట
ంచబడుటచే కొచ్చెర్లకోట యను నామ మా గ్రామమునకు కలి
. ఈ కొచ్చెర్లకోటవారు కొంతకాలమునకు పిమ్మట పులిపాక
రైనారు. అనంతర మద్దంకివారుగను, కడపట కామరాజువారు
, మారిరి. ఆ విషయ మా యా వంశీకుల చారిత్రములంద
డనగును. కొచ్చెర్లకోటవారి కుటుంబము గొప్పజమీందారీ
ంబము. రాజా కొచ్చెర్లకోట వెంకటాద్రియమంత్రి ఒక గొప్ప
న్ దారుడు. రాజమహేంద్రిపుర నివాసి. ఈయన చర్యలు
ల భయంకర మగుటచే ఈయన దౌష్ట్య ముడుపు తలంపున లక్ష్మ
యొకనాడు బడులుదేకి అతని హజారమున ప్రభునికై చేసి
మిన్న మసలందుపై గూర్చుండెను. దానికి గోపించి వెంకట్రాయ
యత్రి గొంతెత్తి ఆ తివాసీ నీది అనియే కూర్చుంటివా అని అడి
. దానికి లక్ష్మణకవి సమాన కంఠధ్వనితో నిది నీతివాసేనా?
వాసేనా? నీ లివా సేనా? అని ముమ్మారు కేకవేసి సమాధానము
చ్చెను. దానిని విని యిత డెవ్వరో అధిక ప్రసంగిలాగున నున్నా
తగినట్లుగా జరిపి పంపిన గాని బాగులే దని నిశ్చయించుకొని
వారిలో నీవే అధికుడవు లాగునున్నావే అని అడిగెను. అప్పు

డా కవి ఒకటి రెండు వర్ణము లెచ్చు తగ్గు కాఁగాఁ నందఱు
నులే అగుదు రనియెను. ఆ మాట కర్థముఁ దెలియక
చెప్పితి వేమి, దానిని స్పష్టీకరింపు డని వెంకటాద్రియ మం
గగా, లక్ష్మణకవి యిట్లుఁ బ్రత్యుత్తర మిచ్చెను.

ర్యాలివారికి వర్ణములు రెండు—పిండిప్రోలివారికి వర్ణము
కొచ్చెర్లకోట వారికి వర్ణము లైదు—ఇందు మొదటివారు
రెండవవారు చతుర్వర్ణులు—మీరు పంచమ వర్ణులు—అన
యోగివలె నర్థములేని మాటలు పల్కుచున్నాడు, ఎవ
డు, కవి యిట్లనియె. ఇపుడు మాటలాడు నతఁడు యో
వా డగు నియోగి. పిండిప్రోలి లక్ష్మణు డనువాడుఁ
లు విని వెంకట్రాయమంత్రి తా నా వఱకుఁ జేసిన ప్రసంగిచిన
ణకవి మనస్సు నొచ్చెనేమో యని శంకించి తా నతని పోటు
ననియు తన తొందరపాటును క్షమించవలయు ననియును బ్ర
పుడు లక్ష్మణకవి తా నట్టి తొందరపాటుగల ప్రభువులను
జేయవచ్చితిని గావున సెలవు గైకొనెద ననుచు, వెంకట
యతనిం గూర్చుండ బెట్టి యథావిధి సబహుమానంబుగా
పనిచెనట. అని కవి జీవితగ్రంథకర్తలు లక్ష్మణకవి చరి
దహరించిరి.

ఈ వెంకటాద్రియమంత్రి అత్తిలి, ఆచంట సంస్థాన
పూర్వము మొగలితుర్రు సంస్థానములో నుండెడివి.
యందు 84 గ్రామములు, ఆచంట పరగణా 54 గ్రామ
న్నియు ఆ 1766 వరకు మొగలితుర్రు సంస్థానముక్రింద
నట్లు తెలియుచున్నది. ఈ కొచ్చెర్లకోటవారి కుటుంబ
ము రాజమహేంద్రవరము, అన్నదేవరపేట, పెద్దేవము,
వాడపల్లి, మటంపల్లి, బిక్కవోలు, కలవలపల్లి, చీరాల

...మాదులయందు గలరు. కొచ్చెర్లకోట నరసింగ రాయడను అను
...రు ఉద్యోగరీత్యా విశాఖపట్టణము జిల్లా గజపతి నగరము నందుండి
...తాన్నదాత లని పేర్వడిరి. గోదావరి జిల్లా అన్నదేవరపేటలో వేం
...టేశ్వరరావుగారి కుటుంబమున, లక్ష్మణస్వామి, వెంకట్రామ స్వామిగార్ల
...టుంబములు విశాఖపట్టణమునందును, పోలవరము యస్టేటు ప్రభువు
...న శ్రీ రాజా కొచ్చెర్లకోట కామాయమ్మగారి కుటుంబము పోలవ
...మునందును, వెంకటనరసింగరావుగారి కుటుంబము విజయనగరము
...మును, వెంకటరామయ్యగారి కుటుంబము చీరాలయందును, గలరు.
... కుటుంబమువారిలో కొచ్చెర్లకోట రామకవి యనువారు శివ
...లీల యను 5 ఆశ్వాసముల గద్యపద్యాత్మకమగు శైవగ్రంథము
...ంచినట్లు తెలియుచున్నది. గాని ఆ గ్రంథ మిపు డెచ్చటను కను
...పోటలేదు. పోలవరపు జమీందారిణీగారి దత్తపుత్రుడు శ్రీ రా
... ఇంద్ర వెంకట కృష్ణారావు బహద్దరు జమీందారుగారు బి. ఏ పరీ
...ను దుత్తీర్ణులై చెన్నపురిశాసన సభలో కొంత కాలము సభ్యులుగా
...టు సేవ జేసిరి. వీరు కాకినాడ నివాస మేర్పరచుకొని 'సరస్వతి'
...ను మాంథ్రమాసపత్రికయందు చిరకాలము అనేకములైన అము
...గ్రంథములను బ్రచురించుటయే గాక వీరు స్వయముగ రచించిన
...త వీరసేన విజయము—పరమహంస. రామకృష్ణులు -సాహసిక కథా
...ము— రాజతరంగిణి,మిల్లరు దొరవారి జీవితము మున్నగు గ్రంథము
...న్ బ్రచురించి భాషాసేవ యొనర్చిరి. వీరి దత్తత తల్లి గారగు
...మాయమ్మ బహద్దరు జమీందారిణీగారు చిరకాలము తమ రాజ్య
...వ్యాపారములు స్వయముగ చక్కబెట్టుకొనుచు, అనేక ధర్మకార్య
...ము చేసి బ్రఖ్యాతి వడసిరి. ఈమె కోడలు వాడ్రేవువారి ఆడుప
...చు శ్రీ వెంకటకృష్ణారావుగారి భార్యయు నగు శ్రీ బంగారమ్మ
...రు తమ యవసానకాలమున 25 వేల రూపాయల వెలగల తన యూ

భరణములు మున్నగు వానినుండి చేకూరిన ధనము నియో
ర్థుల యుపయోగమునకై బంగారమ్మ ఫండు అను పేర
మేర్పాటుచేసెను. శ్రీ పెద్దాడ నాగరాజామాత్యునిచే
శకుంతలాపరిణయగ్రంథమును ముద్రించుచూ శ్రీ రామచం
ట కృష్ణారావుగారు వ్రాసిన పీఠికయందు తా మాయన
లుగా చెప్పుకొనిరి. పెద్దేవములో నుండు కొచ్చెర్లకోట
గారు ఆ గ్రామము నందొక విష్ణాలయమును బ్రతిష్ఠించిన
శీకులవల్ల తెలియవచ్చినది. వెంకటచలం పంతులుగారి
గో॥ జి॥ సిద్ధాంతమునందు గలదు. వీరి కనుశ్రుతముగ—
తెపు—అడిదము—కృత్తివెంటి—జీడిగుంట—వద్దిపర్తి—కూరాడ—కరిణ
మల్లాప్రగడ—రామాప్రగడ—మల్లంపల్లి—దేవగుప్తాపు—వరిగొ
వర్తి—నిడదవోలు—మంత్రిప్రగడ—ముళ్ళపూడి—కాదంబరి—సంస్థా
వాడ్రేవు—పెద్దిరాజు మొదలగు కుటుంబములతో సంబంధుం
ములు గలవు. ఇందు రామాప్రగడవారి సంబంధ విషయ
ర్పుః విశాఖపట్టణవాస్తవ్యు లగు కొచ్చెర్లకోట నరసింగరా
గారు వ్రాసి పంపిన వంశచరిత్రయందు గలదు. ఏ రిరువ
త్ర మగుటచే అన్యోన్య సంబంధ మెట్లు తటస్థించినదా
హము తోచుచున్నది. ఇందుల వివరము ఆ జిల్లాయందు
చేయుచున్న కొచ్చెర్లకోటవారుగాని రామాప్రగడవారుగాని
ముందుబ్రచురించు గ్రంథమున సవరణచేసి బ్రచురించెదము.
కోట వెంకటనరసింహారావుగారు వ్యవసాయశాస్త్రమును

✿ ✿
✿

# నల్లజర్లవారు.

—:o:—

అనుముకొండయాజ్ఞవల్క్య నియోగులు. కాత్యాయనసూత్రము శుక్ల యజుర్వేదులు. కాశ్యపసగోత్రము—కాశ్యప-వత్సార-నైధ్రువ-రేభ రైభ—శండిల శాండిల్యఅని సప్తార్షేయము చెప్పుకొనుచున్నారు. ఈ కుటుంబమువారు గోదావరి మండలములోని కాకినాడతాలూకా పెద్దబ్రహ్మదేవము, పెద్దాపురముతాలూకా కట్టమూరు, నరేంద్రపట్ట ణము గ్రామములలో నున్నారు. వీరి కా మూడుగ్రామములలోనూ కరిణీకములు గలవు. ఈకుటుంబమువారిలో నల్లజర్ల కన్నయ్యగారను వారు చాలాప్రఖ్యాతిపురుషులు. ఈ యన పూర్వము పెద్దాపురము సంస్థానములో చేసిన పెదబ్రహ్మదేవగ్రామమునకు మొఖాసాదారుగా నుండి అగ్రామమందన్నసత్రముంచి అమితాన్నదానముచేయుచూ పవ యన్యములచే పొగడ్త నొందుచుండెడుసమయమున తత్సంస్థానాధీశ్వరు లగు శ్రీవత్సవాయతిమ్మజగపతి రాజుగారు తమమంత్రులదురాలోచన వల్ల కన్నయ్యగారికి జరిగెడు మొఖాసా గ్రామము తీసుకొనిరట. కన్న య్యగారి పెదతండ్రియగు నారాయణరాజుగారు పెదబ్రహ్మదేవ గ్రామ ములో యొకధర్మచెర్వుత్రవ్వించిరి. యిప్పటికిని అయ్యది నారాయణరాజు చెర్వు అని వాడబడుచున్నది. ఈకుటుంబములో వినుతినొందిన సంస్కృ తాంధ్రకవియగు కొండయ్యగారివల్ల 250 సంవత్సరములకు పూర్వము నారాయణశతకము రచింపబడినది. అనంతరము ఆంధ్రకవియగు రంగరాజుగారు 100 ఏండ్ల క్రితము జగన్నాథశతకము—సుబ్రహ్మణ్యశత కమును రచించిరి. ఆ శతకము లిపుడుకనుపించవు. అందు వల్లనేకా బోలు శతక కవుల చరిత్రయందు వారి పేర్లు కనుపించుటలేదు. ఈ కన్నయ్యగారి దాతృత్వమును గూర్చి చెప్పబడిన పద్యము

లిప్పటికిని ఆ తాలూకాయందు వ్యాప్తిలోనున్నవి. అందు ప
మగు రెండు పద్యముల నిట నుదహరించుచున్నాను.

క॥ ధరబిక్కవోలు సీమకు
మురువగు కరణముల ముక్కు ముంగరవుగదా
నిరతాన్న దాతమహిమను
కరుణానిధి నల్లకర్ల కన్నయ మంత్రీ.

ఉ॥ నాలుగు కూరలన్నమును నాతి మనోహరమైన యాద్యముల్
మేలిమి తోటిసాటియన మించిన కమ్మని కందిపప్పుతో
జాలునుచాలు. చాలు, మరి చాలునటం గను వేడ్క మీసా
కాలము నల్లజర్లకుల కన్నయబెట్టునుభోజనంబిలన్.

ఇట్టివనేక పద్యములుగలవు

నల్లజర్ల కన్నయ్యగారి ఖ్యాతి శ్రీవిజయనగరము మహారాజుగారై
యరామరాజుగారు విని ఈమార్గమున కోటిపల్లి వెళ్లుచూ కన్న
రికి వర్తమానముచేశి తమడేరాకురప్పించి ఆయనను పూజించి మ
కనకాభరణంబులు మున్నగునవి సమర్పించి బహువిధముల వినుతి
చెప్పుదురు.

యీకుటుంబము వారికనుశ్రుతముగా దామెర్లవారితోనూ,
లవారి తోనూ, నందిగంవారితోనూ, తోలేటివారితోనూ,
పర్తివారిలోనూ, దిగుమర్తివారితోనూ, బొల్లా ప్రగడవారి
చెట్లపల్లి వారితోనూ, సరిపల్లెవారితోనూ, మద్దూరి వారిలో
రెంటాల వారితోనూ, సమయమంత్రి వారితోనూ, ఖ
వారితోనూ, దుర్గ వరపువారితోనూ, వాడపర్తివారితోనూ
ధబాంధవ్యములు గలవని కాకినాడ తాలూకా పెదబ్రహ్మ
కాపురస్తులగు నల్లజర్ల సాంబశివరావుగారివల్ల తెలియవచ్చినవి.

# ఫారసీవారు.

మధ్వులు, యజుశ్శాఖ, వసిష్ఠగోత్రము, త్రాహ్లేయము వీరిపూ
ర్వపు నివాసము ధార్వాడదేశములోని కలబరిగిగ్రామము. వీరుపూ
ర్వము నవాబుల సంస్థానములో ఫార్షి దుబాషులు నుండి యుండుటచే
వీరికంటెపేరు పార్షి వారని వాడుకవచ్చినది. వీరి మూలపురుషులు శేష
గిరిరావుగారు. వీరు కొంతకాలము కర్నూలుజిల్లా యందుండి వీరి
కుమార్తెకుమాళ్లు అగు ప్రొద్దుటూరి నరసింగరావుగారి ప్రోత్సాహ
మున బందరువచ్చిరి. అప్పటికి శ్రీనివాసరావుగారు బాలురగుటచే
బందరునందు విద్యాభ్యాసమొనర్చి తెలుగుజిల్లాలలో బి. ఏ. తరగతి
పరీక్షయందు త్తీర్ణులైనవారిలో ప్రథములుగ పరిగణింపబడి రాజమ
హేంద్రవరము కాలేజిలో పండితులుగ నియమింపబడి పిమ్మట పరీక్షా
ధికారిగానుండి ఉపకారవేతనము గైకొని కీర్తిశేషులైరి. ఈ కుటుంబ
మువారికి రాజమహేంద్రవరమే నివాసమైనది. వీరి చిన్నతన
మున వీరికి బందరులో విద్యగరపిన రాఘవేంద్రస్వామిగారియెడ, వీరికి
గల విశ్వాసము కొలది తమ ప్రథమ పుత్రునకు రాఘవేంద్రరావను
నామముంచిరి. ఈయనయువిద్యాశాలల పరీక్షాధికారిగా నియమింపబడి
ఉపకారవేతనము గైకొనుచుండిరి. వీరికుమారుడు శ్రీనివాసరావుపంతులు
ఈయన బి. యల్ పరీక్షయందు కృతార్థులై ప్రస్తుత మేలూరుపట్ట
ణమునందు న్యాయవాదిగనుండిరి.

వీరి కనుశ్రుతముగా కొక్కొండ, యలమర్తి–దర్భ్రాల–ఉప్పులూరి
పానుగంటి– పన్నాల–ధన్వాడ– ధార్వాడ–ప్రొద్దుటూరి– ధర్మాజి–
కందుకూరి– జూలూరి– సిడింబివారు– మెనలిగంటివారు– యినుగంటి
వారు మున్నగు కుటుంబములతో సంబంధ బాంధవ్యములుగలవు.
ఈ వంశచరిత్ర శ్రీనివాసరావు-పంతులుగారివల్ల తెలియవచ్చినం తప్ప

చురించితిని. ఈ గ్రంథమంతయు శేషగిరిరావుపంతులుగారియొక్క స్వ
ముకు మాత్రమే చెందియున్నటుల స్పష్టమగుచున్నది. ఈ వం
పూర్వపు కటుంబ నామమేమైయుండెనో ఈ వంశీకులింకను ఏ
వెచ్చటనుండిరో, కర్నూలుజిల్లాలో యిప్పుడెవరైన కలరేమో
యదు. ఈ వంశచరిత్రయందింకను జేర్చవలసిన విషయములు
వానినెవరైనదెల్పిన ఈ వంశచరిత్ర సవరించి పిమ్మట గ్రంథ
బొందుపరచెదము—

---

## జొన్నాభొట్లవారు.

తెలగాణ్య వైదికులు, యజుర్వేదులు ఆపస్తంబసూత్రులు
పగోత్రులు-కాశ్యప వత్సార,నైధ్రువయని త్ర్యార్షేయము చెప్ప
చున్నారు. వీరి పూర్వపు యింటిపేరేమైయుండెనో తెలియదు
పూర్వులు యజ్ఞము (జన్నము) చేయుటచే జన్నముభొట్లు అని
కపడి క్రమముగా జన్నముబొట్లవారని వాడుకపడి రానురాను
భొట్లుగామారి, తుదకు తలక్రిందై జొన్నాభొట్లవారైనారు. వీరి
కాపురము వైకుంఠపురము. ఈ కుటుంబమువారి పూర్వులు
రన్నదమ్ములు. బ్రహ్మయ్య, లక్ష్మయ్య. రామకృష్ణయ్య.
కడపటి వాడగు రామకృష్ణయ్య గారు షోడశకర్మాధికారి య
వీరిని గుంటూరు జిల్లా వినుకొండ తాలూకా కొచ్చెర్లగ్రామ
రు తీసుకు వచ్చుటచే ఈ కుటుంబము వారా గ్రామములో
పోయిరి. ప్రస్తుతము వీరి స్వగ్రామ మగు వైకుంఠపురము

కూటస్థు లెవ్వరు లేరు. ఈ యింటి పేరు గల వారిపుడు వినుకొండ తాలూకా కొచ్చెర్ల, నాగులవరము, ఈపూరు అను గ్రామములయందు గలరు. నాగులవరములో నుండు వీరయ్యశాస్త్రులుగారు మంచిసాహిత్యపండితులు. కీర్తి శేషులై నారు. కొచ్చెర్లలో నుండెడి వారు, నాగులవరములో నుండెడువారు కొంతకాలము దశరాత్రములు పట్టుచుండెడివారు గాని ఏ కారణముచేతనో త్రిరాత్రములుగా మార్చుకొని యిప్పుడు ఆ రెండు గ్రామములలోని వన్నిభొట్లవారు త్రిరాత్రములనే పట్టుచున్నారు. ఈ కుటుంబముతారు పులుపుల వారితోనూ, దారివేముల వారితోనూ, వఠెంవారితోను, పమిడినారితోనూ, సాగివారితోనూ సంబంధములుచేసి కొనుచున్నారు అని ఈ వంశీకులవల్ల తెలియవచ్చినది.

---

## జటావల్లభులవారు.

—:0:—

వీరు కాసలనాటి వైదికులు. యజుశ్శాఖ. ఆపస్తంబసూత్రము గౌతమ గోత్రము, ఆంగీరస, అయాస్య, గౌతమ అని త్ర్యార్షేయము. పూర్వము ఈ కుటుంబమువారి యింటిపేరు 'వెదురువారు' పడమర గుంటూరుజిల్లాలోనిది. ఈ కుటుంబమువారిలో నిమిది తరములక్రితము వెదురుచర్ల సోమయాజులుగారను వారు వల్లించుటచే జటావారైనారు. ఆయన కుమారుడు రామసోమయాజులుగారనువారు జటచక్కగా వల్లించుటచే జటావల్లభులవారని పేరువచ్చినది. వీరు యిప్పుడు గోదావరిజిల్లా మడికి, ఆత్రేయపురము గ్రామములయందుండియున్నారు. ఈ కుటుంబము రందరూ వేద

పండితులు ఆహితాగ్నులు వీరిలో వీరేశ్వర చైనులుగా
కృష్ణసోమయాజులుగారు వేదము శ్రౌతమునందు పాండిత్య
డించిరి. ఈ కుటుంబమువారిలో ననసేల ఈ కాలపు బ్రా
బములన్నిటిలో మేటియని యెన్నదగినవారు జటావల్లభుల దా
ము M. A గారు. వీరుప్రస్తుతము ఆంధ్రగీర్వాణవిద్యా పీఠము
లుగానుండియుండిరి. వీరి పాండిత్యమపారము. కేవలము చున
దనకొఱకుగాక విద్యావ్యాపనకొఱకే కొవ్వూరు సంస్కృత పాఠ
ఆంధ్రగీర్వాణ విద్యాపీఠాధ్యక్ష పదవినలంకరించిరి. వీరు వేద
పరిశీలించి వేదకాలపు స్త్రీలుఅను గ్రంథము ప్రచురించిరి. ఉ
పోద్ఘాతమున వీరు వ్రాసిన దిగువపంక్తులను చదివిన వీరి
కాగలదు. "మొత్తముపై హిందూదేశచరిత్ర కాలమును రు
ములుగ చేసి యొక్కొక్క భాగములోని స్త్రీలపరిస్థితులు
కొక్కొక్క గ్రంథమునువ్రాయుచున్నాను. వేదములను
చదివియే—నేనీగ్రంథము ను వ్రాసితినిగాని యితరుల వ్రా
మాత్రము నాధారపడలేదు. మూలవేదమునే చదివితినిగ్
రీకరణములపై నాధారపడలేదు * * * *
ములో నేమిచెప్పినను గూడ నేదో యొక వేదవాక్కు నాధా
నియే చెప్పియున్నాను." అనిన పైవ్రాతవల్ల వీరి విద్
కాగలదు.

ఇయ్యది కుటుంబచరిత్రగాని స్వీయచరిత్రవంటిది. కి
వీరివిషయమింతకెక్కుడుగా వ్రాయ వీలుకల్గినదికాదు. వీర
వారు, మర్లవారు, దీక్షితుల, వేలివెంటి, ఘట్ట్య కాశీ చిరి.
నూతలవారుమున్నగు వారితో సంబంధబాంధవ్యములు గలలో

# శిష్టావారు

ద్రావిడశాఖ; యజుర్వేదము; ఆపస్తంబ సూత్రము; వాధూలస గోత్రము; భార్గవ, వైతహవ్య, సావేదస అని త్ర్యార్షేయము చెప్పుచున్నారు. ద్రావిడులలో గాక వైదికులు కాసనాటులలో ఈవారు కలరు. నరసాపురము తాలూకా మొగలితుఱ్ఱు గ్రామమందును అమలాపురము శివారు బుచ్చెమ్మ అగ్రహారములోను మఱికొన్ని చోట్లను గలరు. వారిది కౌండిన్యస గోత్రము, ఈ కుటుంబీకులవారు ప్రస్తుతము వలంగిపూను: అమలాపురము తాలూకాలోని ...రుద్రి, ఇందుపల్లి, అగ్రహారములలో నున్నారు. వీరి కన్యాశ్రోత...తులు ఆయిల సోమయాజుల వారిలోను, తాతావారిలోను, నూకల...లనులోను, కర్రివారిలోను, అనుపిండివారిలోను, వీరివారిలోను, గా...త్రపు ఆత్రేయస, భారద్వాజస గోత్రజులలో గలవు. ... ...దినిగ్గురుదినంవల సంవత్సరముల క్రిందట వలంగిపూలోనుండి ఉద్యోగము

* ...లన వచ్చిన బ్రాహ్మణులలో వీ రొకరు. ఈ యింటిపేరు గలవా నాథునిత్ కుటుంబములవారు గలరు. వీరు విశేషముగ అమలాపుర విధా తాలూకాలో సాకుర్రు, ఇందుపల్లి మొదలగు గ్రామములో

...ఒక కుటుంబము సుమారు మున్నూరు సంవత్సరముల క్రిందట అను...పురము గ్రామము శివారు భావయ్య అగ్రహారములో నివసించుచుండిరి. అరువది సంవత్సరముల క్రిందట ధాత యీశ్వర సంవత్సరములలోని కఱవులలో ఈ కుటుంబములోని వారగు శిష్టా సీతాపతి ... మొలనిండా రూపాయల నిముడ్చుకొని ఆ యగ్రహారములోని ఇంటింటికి పోయి నేమ భోజనము చేసినారా లేదా యని విచారించి

చేయని వారి యింటిదగ్గఱ ఒక్కొక్క రూపాయి నిచ్చు
ఆ సమయమునందే పట్టిన గొప్ప గాలివానకు బీదసాదల
లెగిరిపోగా మూడు రాత్రులవఱకు వారందరు బ్రాహ్మ
దుర్గిలు, సెట్టిబల్జీలు, ఆది యాంధ్రులు వీరు వారు అనే
ములవారు శిష్టా సీతాపతి గారింటికి చేరిరి. ఆ మహా
రందఱకు అన్నము గంజి పోయించి ప్రాణములు నిలబెట్టి
మంది నేటికిని చెప్పుచుందురు. వారి కొమారుడు కాశీ
పుత్రుడు జోగయ్య అను నామాంతరముగల నరసింహా
రుద్యోగములు చేయ నప్పటికి తమ యింటియందే య
గౌరవముగా జీవయాత్రను గడపిరి.

పేహూరు గ్రామమునకు నాయకమణి యగు అయిల
గోపన్నగారు తమ ద్వితీయ కుమార్తెయగు శ్యామలాంబను
గారి కిచ్చి వివాహముచేసిరి. వారిరువురి తపఃఫలమే
లము. గోపాలముగారు చిన్నతనమునుండియు సదభ్యాస
బడిలోని తమ యుపాధ్యాయుల మన్ననల బడసి, Mat
F.A పరీక్షలంపు వీరు మొదటి తరగతిలో నుత్తీర్ణులై.
క్షలో నెక్కువ ఘనమైన జయము గాంచిరి. సుమారు
వత్సరములు వీరు కాకినాడలోని పిఠాపురము రాజావారి
పని చేసిరి. పిమ్మట సర్కారు ఉద్యోగములో 1906
లో బ్రవేశించిరి. నేటికి వారు సర్కారు ఉద్యోగములో
ప్రస్తుతము రాజమండ్రిలోని ట్రెయినింగు స్కూలులో హె
గా నున్నారు. వీరికి నలుగురు పుత్రికలు. కొడుకులు
చిన్నతనమునుండి భగవద్భక్తి కలిగినవారు. వీరు వ్రాసి

(1) ధర్మసూక్ష్మము—ట్రెయినింగు పరీక్షకు బఠనీయ
నిర్ణయించబడినది.

(2) నర్మదాపరిణయము—వివాహసమయములందు సంఘములో వ్యాపించిన దురాచారములను ఖండించును.

(3) జ్ఞానోదయ మను పేరుగల గీతాసారము—భగవద్గీతలోని 18 అధ్యాయముల సారము సులభమైన పద్యములలో వ్రాయబడినది.

(4) విజ్ఞాన లహరి—భగవద్గీతలోని యంశములే గద్యరూపమున వ్రాయబడినది.

(5) ఆనందలహరి—పంచదశలోని యంశములు సులభశైలిని పామరులకు సుబోధక మగునట్లు గద్యరూపమున వ్రాయబడినది. పండితుల మన్ననల గాంచినది. ఇవి గాక బడుల కుపయోగించు గ్రంథములు పెక్కులు రచించిరి. ప్రారంభవిద్యాపత్రికలో బ్రచురింపబడిన వీరి వ్యాసములు మిగుల ప్రశస్తి గాంచినవి. ఆంధ్రమండలములలో వీరి పేరు విననివారు గాని వీరి నెఱుగని వారు గాని యుండరు.

వీరు కొంతకాలము క్రితము ద్రావిడుల చరిత్ర వ్రాయుటకు సంకల్పించి యిటువైపుల నుండు ద్రావిడుల యిండ్లపేర్లు, గోత్రములు వారు చెప్పుకొను ప్రవరలు సంగ్రహించి విడికాగితములపై అచ్చువేయించి ద్రావిడకుటుంబముల కందరకిని పంచిపెట్టిరి. ఆ ముద్యోగము కొదుండుటచే ఆ యా చరిత్రలు సంపూర్ణముగా సంగ్రహించ వీలు లేమి ఆయుద్యమము విరమించితి మనియు నే వ్రాయు చరిత్రలో ద్రావిడుల విషయమగు కొంతభోగట్టా సంపాదించి సహాయము చేసెదమని సెలవిచ్చుటచే వారి దయకు మిగుల కృతజ్ఞుడను.

ఇంతవరకు పేరూరు ద్రావిడులసంఖ్య 88. దిమిల ద్రావిళ్ళ సంఖ్య 27. మొత్తము 115 యిండ్లపేర్లలో రెంటియందూ కనుపించుచున్న పేర్లు 13 గాక యిటువైపు ద్రావిళ్ల యిళ్ళపేర్ల సంఖ్య 102. వీరికి ...డు ఆరామ ద్రావిడులు. వీరిలో కళింగదేశీయులు కృష్ణాగోదావరి తీరస్థులు వేరు. వీరుగాక తుమ్మగుంట ద్రావిళ్లు అనియు పూడూరు

నగు గ్రామములు మొదలగు పెక్కు బహుమానములనంది సంస్కృ
తాంధ్ర భాషలయందును సంగీతమునందును నఖండ పాండిత్యమును
సంపాదించి యుభయభాషలయందును అనేక గ్రంథములు రచించి
వీరవాసరమున భద్రకాళీప్రతిష్ఠయు శృంగవృక్షగ్రామమున శివాలయ
మును, ఇరుసుమండలో ధర్మారామమును, వీరవాసరమున దన
సోదరుడగు గంటలరాయుడుగారి పేర నొకతటాకమును నిర్మించి
సప్తసంతానప్రాప్తిం గ్రామముగా వడసి వదాన్యశిఖామణియని ప్రసి
ద్ధిగాంచెను. ఈ కవి ఆ 1760 సంవత్సర ప్రాంతమున జన్మించి1825
వ సంవత్సరమునకు సరియగు వ్యయసంవత్సర జ్యేష్ఠ బ 4 దినమున స్వ
ర్గస్థులైరి. ఈ యన 'సూరిమండల' హిత ముఖ్యకార్య రచనాను
కలాత్ముండ నాగరాజు నావెలసినవాడ, నని వీరు రచించిన శకుంతలా
పరిణయగ్రంథమున వ్రాసికొనియుండుటచే రాజమహేంద్రవరమున
న్యాయవాదిగాఁ బ్రవేశించినతరువాతనే ఈ శకుంతలాపరిణయ గ్రం
థము రచియించెనని నిశ్చయింపవలసి యున్నది. ఈ కవి సంస్కృతాం
ధ్రములలో అనేకేతరగ్రంథములు రచియించెనుగాని యీయనపుత్రు
డు మల్లిఖార్జునుడుగారు బాల్యులగుటచే నవియన్నియు నశించిపోవు
టయేగాక నామమాత్రావశిష్టములైనఁ గాకపోయినవి. యెట్టెటులో
నీ గ్రంథము ప్రతియొకటి కృతికర్త సోదరుఁడు గంటలరాయునిమను
మఁడగు శ్రీ గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారికి లభించి .వారి
సరమువలన తమకీయబడుటచే, విద్వత్కవియు నమాత్య శేఖరుఁడునై
విఖ్యాతి వడసిన తమ ప్రపితామహుని గ్రంథము తాము ప్రచురింపగల్గి
నందుకు సంతసించుచూ శ్రీ రాజా కొచ్చెర్లకోట రామచంద్రవేంకట
కృష్ణరావు పంతులవారు వ్రాసిన పీఠికయం దుదహరించిరి. ఈ కవిస్వ
హస్తమున 'వత్స శుభదము పెద్దాడవంశ మతిపవిత్ర మభివందనీయ
మగ్రస్థలమున' అని ఈశ్వరుడు చెప్పినటుల చెప్పినమాట సత్యములే.

ఈ జిల్లాలోని నియోగి కుటుంబములవారిలో వీరి కుటుంబముకూడ పెద్దకుటుంబములలో లెక్కచాయబడినదే. ఈ నాగరాజామాత్యుడు తనశకుంతలా పరిణయములో తన వంశమునుగూర్చి చెప్పినవిషయముల నీ దిగువ నుదహరించుచున్నాను. ఈ కుటుంబమువారి మూలపురుషుడు పట్టసమంత్రి. ఈ యన కుమారుడు విశ్వపతి ఈ యనకు వీరరాజుగారు కలిగిరి. ఆయన నిట్లు వర్ణించెను.

క॥ నిరతాన్న దాన దీక్షా
పరతంత్రుడు భోగభాగ్య పరిహాసిత పురం
దరుఁడగు వీరనచే కొనె
గురుమతి లింగాంబఁ దనకుఁ గులసతి గాఁగన్.

ఈయనకు సూరమంత్రి, ఈ మంత్రి శిఖామణికి వీరరాజు, అచ్చయ్య, రామయ్య, శ్రీకృష్ణుడు, రాజన్న, నాగరాజు, శరభయ్య, బుచ్చెయ్య అని యెనమండుగురు బుత్రులు గలిగిరి. ఇందు వీరరాజుగారికి చినశరభయ్యగారు ఈయనకు అయ్యన్న, సూరన్న అను యిద్దరు కుమాళ్లు రెండవవారగు అచ్చయ్యగారికి నరసయ్య, గంగన్న, బాపయ్య, వీరయ్య అను నలుగురు కుమాళ్ళు. నాలవ కుమారుడైన కృష్ణయ్యగారికి అయ్యప్ప, వెంకయ్య, పేరయ్య, రామయ్య అను నలుగురు పుత్రులు గలిగిరి. వీరరాజుగారికి అయిదవ కుమారుడైన రాజన్నగారికి గంగయ్య, రామయ్య అను యిద్దరు కుమాళ్ళు. ఆరవవాడైన నాగరాజు యిట్లువర్ణింపబడెను.

మ॥ పరమ శ్రీ నిధి నాగరాజ సుయశః ప్రాంచత్సుధానిర్ఝరం
బరవింద ప్రభవాండ భాండమున నిండారంగ స్త్రాద్రితో,
వరహింగానక వెల్లి నీదుకొని పోవ న్నిచ్చ లంభోజి నీ
శ్వర పద్మారులకుం దరణ్యుడుప సంజ్ఞల్ సార్థ మయ్యెన్భువిన్.

ఈయనకు సూరన్న, నరసన్న, మల్లన్న, సుబ్బయ్య, వీరయ్య, బా పయ్య, శరభయ్య, అప్పన్న అను యెనమండ్రు కుమాళ్లు గలిగిరి. వీరరాజుగారి ఏడవ కుమారు డగు శరభయ్యగారికి రామయ్య, వెంకట రాయుడు, యజ్ఞన్న అను ముగ్గురు కుమాళ్ళు. ఈయన తమ్ము డగు బుచ్చయ్యగారికి సూరన్న, సుబ్బయ్య అనుయిద్దరు కుమాళ్లు కలిగిరి. వీరరాజుగారి ఆరవ కుమారుడైన నాగరాజుగారి కుమారుడు సూరన్న గా రిట్లు వర్ణింపబడిరి.

మ॥ ఘనపెద్దాడ కులామృతాంబు నిధి రాకాచంద్రుఁడౌ నాగ రా
ట్తనయగ్రామణి సూరయాఖ్య సచివేంద్రస్వామి యొప్పెఁ జనా
ఘనచింతామణి కల్పభూరుహ శిబిక్ష్మాభృద్ది నాధీశ నం
దన విశ్రాణ నపోషితార్య జన నానాబంధు సందోహుఁడై.

మ॥ కృతదక్షాధ్వరకార్య వర్ధనుఁడు సాంద్రీభూత భూతి ప్రభా
శ్వేతుఁ డార్యానుమత ప్రవర్తనుఁడు భాస్వద్గోత్ర ధర్మప్రియుం
డతులానంత గుణాన్వితుండ తనుమాద్యద్వైరి నిర్భేదన
ప్రతిభాయుక్తుఁడు సూరమంత్రిమణి సర్వజ్ఞుం డనం జాలఁడే.

మ॥ ఇలపై సూరయమంత్రిపుంగవ సమాఖ్యేందుం డహో రేవగ
ల్లను పొందున్ బహురాజశేఖర శిరోలంకార పాదాప్తి వ
ర్థిలి నానాఁట మహాబుధానుగతమైత్రిన్ నిష్కళంక ప్రభా
కలితుండై యతమః పరిగ్రహణ రేఖాస్ఫూర్తి గీర్తింపఁగన్.

అని వర్ణించెను. ఈయనకు ముంజులూరి పద్మరాజుగారి కుమా ర్తె సావిత్రి నిచ్చి వివాహము చేసిరి. వీరి కయిదుగురు కుమాళ్ళు. అందు పెద్దకుమారు డగు వెంకటప్పగా రిట్లు వర్ణింపబడిరి.

ఉ॥ మందత నాస్తి లే దనెడు మాట హుళక్కి, మదంబు మిథ్యచు
ల్కంతన మిథ్య, కుత్సితము కల్ల, యసత్యము సున్న, లోభపుం

బొందన్నృతంబు, చిట్టకపుఁబోకలు దబ్బఱ లౌర, కీర్తిమి
న్నందిన వెంకపాఖ్య సచివాగ్రణికిం బరికించి చూడఁగన్.

ఈ యనతమ్ముఁడు నాగరాజుగారు ఈ యనయే శకుంతలాపరిణయ
గ్రంథకర్త. తనగ్రంథమునందు ఈ నాగరాజుగారు తన విషయమిట్ల
చెప్పుకొనిరి.

చ॥ అల సుగుణాబ్ధి వెంకప మ హాసచి వాగ్రణిసోదరుండ ని
ర్మలనిగమాగమాదికపురాణ క ళాచతురుండ సూరి మం
డలహిత ముఖ్యకార్య రచ నాకుశలాత్ముఁడ నాగరాజు నా
వెలసినఁవాఁడ నిచ్చ. లరవిందహిత ప్రతి మానతేజుఁడన్

వీరికిలక్ష్మీపతి— సుబ్బారాయుడు— గంటులరాయుఁడు, అను మ
గ్గురు సోదరులుగలరు. వీరిసంతతివారు పైవంశ వృక్షములో చె
చిన శాఖలవారియొక్క కుటుంబములవారు చాలామందియిప్ప
గోదావరి జిల్లాలోని వీరవాసరమునందు గలరు. యిపుడు పెద్ద
వారెచటనున్నను ప్రప్రథమము వారందరిది వీరవాసరమే. ఈ కుటు
బమువారిలో చిట్టిరామయ్యగారి కుటుంబమువారు పిఠాపురమున ను
డిరి. వీరికుమాళ్లు ఉన్నతోద్యోగము లలకరించిరి. ఈ చిట్టిరామయ్య
గారే ప్రప్రథమమునన మంత్రిశిఖామణులగు ముప్పదియిద్దరు మంత్రు
లచరిత్ర వ్రాసిప్రచురించి నియోగికుటుంబముల ఖ్యాతి వెదజల్లిన మ
హనీయుఁడు. ప్రప్రథమమున రాజమహేంద్రవరమునందున అగనలరను
ఏలూరునందు ఉన్నత న్యాయవాదిగానుండి ప్రజాక్షేమమున కత్య
ము పాటుపడిన సాంబశివరావుపంతులుగారి కుటుంబమువారే. ఈయనత
డు వేంకట కృష్ణారావు పంతులుగారు డిప్యూటీ కలక్టరుగపని
ఉపకారవేతనముపొంది రాజమహేంద్రవరమునన్యాయవాదిగనున్నా
ఈ కుటుంబమువారి కనుశ్రుతముగా దేశరాజువారు, రేబ్బా ప్ర
వారు, చెంగల్వలవారు, గురుజాడవారు, [illegible]లూరివారు,

భూరివారు, అగస్త్యరాజువారు, తేతలివారు, తటవర్తివారు, ఆచంటవారు, అమిరపువారు, పెమ్మరాజువారు, కలిగొట్లవారు, అడవివారు. తల్లాప్రగడవారు, మున్నగువారితో సంబంధములుగలవు.

---

# సత్తిరాజువారు

---

షుమారుగ నేటి కిర్వదిరెండు తరముల క్రితము సత్తిరాజు అను స్మార్త నియోగి పురుషపుంగవు డొకడు, గోదావరిజిల్లా గోస్తన దీతీరమునందలి జుత్తిగ గ్రామము రాగా, ఆ కాలమునం దా యూర నుండిన యొక నియోగి తనయేకపుత్రికనిచ్చి వివాహముచేసి అల్లు న్నిల్లరి కముంచుకొని నటులను, తదాది ఆ సత్తిరాజు సంతతి సత్తిరాజు వారైనట్లును, అ పురుషుని నివాసస్థలము ప్రప్రథమమున జుత్తిగ యగుటచే సత్తిరాజు వారి జుత్తిగ యని యూరికిని, జుత్తిగ సత్తిరాజు వారని ఆ కుటుంబము వారికిని పేరు వచ్చినది. వీరు ఆర్వేల నియోగులు— ఆపస్తంబులు యజుర్వేదులు హరితస గోత్రికులు. ఆంగీరస, అంబరీష, యావనాశ్వ యనిత్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరికి గౌతమగోత్రీకులతోను. భారద్వాజగోత్రీకులతోను సంబంధములు హెచ్చుగానున్నవి. ఆంగీరసఋుషి కలసినను, యెట్లు అగుచున్నదని అనేకులు సంశయించుచున్నారు గాని ఆంగీరసులలో గౌతమాంగీరస భారద్వాజాంగీరస శుద్ధాంగీరస యని ఆంగీరసులు ముగ్గురు భిన్నులగుటచే 'ఆంగీరసఋుషి కక్కరలేదు' అను లోకవాడుక. పై మూడు గోత్రముల వారికి పరస్పర సంబంధములు యథేచ్ఛగా జరుగుటకు కారణ మైనది.

పై నుదహరించిన సత్తిరాజునకు కుమారుడొ, మనుమడో ఈ కూ

టస్థుల మూలపురుషుడు సోమేశ యుద్భవించెను. సోమేశ యను
ను కారణము సోమేశ్వరాలయమున కెదుటి భాగమున గోస్తనది ఉత్త
మునా ప్రవహించుటయు ఆలయములోని లింగము పశ్చిమాభిము
మగుటయు, ఆ ప్రదేశమునకు దక్షిణకాశీ యని ప్రసిద్ధికెక్కిన భూ
కాపురం (జుత్తిక) లోని స్వామిపేరు వాసుకి రవిసోమేశ్వరు డగుట
ఆ పుట్టిన కుమారున కా పే రుంచియుండురు. అది మొదలు
వంశమునందు సోమేశ, సోమయ్య అను పేర్లు తరుచు వాడుక యు
న్నవి. ఆ మూలపురుషు డగు సోమేశకు యిద్దరు కుమాళ్లు గల
పెద్దవాని పేరు భుజబలశంభుడు; రెండవ వారు మల్లపరాజు. భుజ
శంభు డను పేరు యీ ప్రాంతములలో నెచ్చటను వినియుండకపోవు
యట్టిపేరుపెట్టుటకు కారణమేమైయుండునని విచారించగా గుడి
తాలూకాయందు దొక భుజబలపట్టణ మను గ్రామము క
పించినది. అందువల్ల యీ కూటస్థుడు ప్రప్రథమమున ఆగ్రామ
నుండి యిటు వచ్చియుండుటచే తద్వాత్సల్యమున, కుమారున క
మనామము, యిచటి ఈశ్వరనామము చేర్చి పేరుపెట్టి యుండిరేమో
అను సందేహముతోచుచున్నది. అచ్చటి వంశీకుల వంశవృక్షము
పరిశీలించినగాని ఇదమిత్థమని నిర్ణయించ సాహసింపవీలులేదు.
భుజబలశంభునకు పదునొకొండవతరమువాడు మహాపాత్రుడు.
యుకు కిద్దరుభార్యలు పెద్దభార్యకు పెదబాపిరాజు చినబాపిరాజు
వారును. రెండవభార్యకు రాముడుఅనియు ముగ్గురు పుత్రులు
యిందు పెద్దబాపిరాజు సంతతివారందరు జుత్తిగయుండును, చిన
రాజు ... పాలంకి సోమయాజి–బాపిరాజులను యిరువు
... కందేపులోను. బాపిరాజు సంతతివారు ...
... నివాసము ఏర్పరచుకొని కరిణీకములు సంపాదించుకొ
... మహాపాత్రునియొక్క మూడవకుమారుడు అయిన రామచంద్రుడు

సంతతివారు కొవ్వ్యేటిపాటియందు వృత్తులు సంపాదించుకుని అచటనే నిలచిపోయిరి, ప్రధానపురుషుడైన సోమేశ రెండవకుమారుడైన మల్లపరాజుకు పదునొకొండవతరమువాడు వెంకన్న. యీ యన కిద్దరు కుమాళ్లు పెదబాపనాయ చినబాపనాయ యిందు పెదబాపనాయ కుటుంబమువారు వేలివెంటియందును చినబాపనాయ కుటుంబమువారు కట్టుంగయందును వసతులేర్పరచుకొనిరి. భుజబలశంభుడు, మల్లపరాజుగార్లయొక్క సంతతివారిలో కొందరు బారాఫసలీకిపూర్వము యేబదిసంవత్సరములక్రిందట అప్పటి నవాబులవల్ల దేశపాండ్య, దేశముఖ స్థలకరిణీఅను హోదాలుకలిగియుండిరి. ఆకాలమునం దధికారులుగానున్న శివాదత్తువప్పి, మీర్ అబ్దుల్ మీర్‌గార్లు యిచ్చినహుకుములిప్పటికిని గలవు. దేశపాండ్యాఅనునది యిప్పటి ట్రెజరీ డిప్యూటీకలక్టరు ఉద్యోగమునంటిది. దేశముఖిఅనునది యిప్పటి జిల్లాకలెక్టరు పదవినంటిది. వీరిపై అధికారి—ముజుందారు, గవర్నరువంటివారు. స్థలకరిణీఅనునది కరిణీకమువంటిది అయి వుండవచ్చును.

ఈ భాగము నవాబు యేలుబడినుండి స్వదేశప్రభువుల వశమయినప్పుడు, నిడదవోలు పరగణా యిలాకాగ్రామాదులు నూజవీటి జమీందార్లకును కట్టుంగ వగయిరా వుభయగోదావరి మధ్యస్థమయిన గ్రామములు పెద్దాపురం సంస్థానాధీశ్వరుల యేలుబడికి లోనైయున్నవి. ఆకాలములో భుజబలశంభుని సంతతివాడగు మహాపాతుడికి అయిదవ తరమువాడు వెంకన్న. అయన పుత్రపౌత్రప్రపౌత్రులుగా నుండు పేర్రాజు—వెంకటరాయుడు అప్పకొండు—అయ్యమ్మ— వీరవెంకు మొదలగు వారికి సన్ [illegible] ఫసలీసరకు కొంత రోఖ— వసతిన్నీ నిడదవోలులో నాలుగుపుట్లు, యిరగవరములో అయిదుపుట్లు, [illegible]లో అయిదుపుట్లు, గోపవరములో 3/4 పుట్టి పందలపఱ్ఱు 1 మోస్తు చివటం, గుంపఱ్ఱు, మద్దూరు, ఉండ్రాజవరం, [illegible], 1/3, సేమ

వరం, 1/2, మునిపల్లి 1/2, పెండ్యాల 1/2, కొత్తపాడు 1/2వొగ్గ 1/2 అయినపర్రు 3/4 పుట్టి మొత్తం పై గ్రామము లన్నింటిలోను యిరువది అయిదుపుట్ల భూవసతియున్నూ జరుగుచుండెను.

మల్లపురాజు సంతతిలోని సుందరరామయ్య, సుందరశివుడు, భా న్న మున్నగువారు శ్రీ వత్సవాయ గజపతి మహారాజులుంగారి సంస్థానములో దివానుమున్నగు వుద్యోగములుచేసి, కట్టుంగ—నార్కెడమిల్లి—అంకంపాలెం—లొర్లపులిదిండి—వెలిచేరుమున్నగుగ్రామాదులలో పదునె దిమిపుట్లభూమి సంపాదించుకొనుటచే భుజబలశంభునివంశమువారు జ గ—కంతేరు—కొయ్యేటిపాడు—పందలపర్రు గ్రామములలో నుండు కున్నూ మల్లపరాజు సంతతివారు కట్టుంగ—వెలిచేరు—వేలివెన్ను గ్రామాదులలో నుండుటకున్నూ కారణము కలిగియుండవచ్చును. వ శవృక్షమును బట్టి చూడగా పదునొకొండవ తరమువారైన మహా త్రుని పెద్దకుమారుని మనుమడైన పాలంకిరాజు, రెండవకుమారుని మ నుమలైన పాలంకి సోమయాజి బాపిరాజు, మూడవకుమారుని మను డయిన వెంకప్ప యీనలుగురు క్రమముగా జుత్తిగ—కంతేరు—పంద పర్రు—కొయ్యేటిపాడు కుటుంబములకును సోమేశరెండవకుమారుడై మల్లపరాజుయొక్క పదునొకొండవ పురుషుడైన వెంకన్న పెద్దకుమా రుని మనుమలు బాపిరాజు, చిన్నకుమారుని మనుమడు ముత్తంరా క్రమముగా వేలివెన్ను కట్టుంగశాఖలకు వంశకర్తలయినటులను కను చుచున్నది. పీఠార్గురు కూటస్థునికి పదునారవ తరమువారు య్యింత రకు యీ శాఖలవారందరు జాతాశౌచ మృతాశౌచములపట్టుచువచ్చి రిగాని వీరికుమాళ్లో మనుమలో దేశపాండ్యామున్నగు వుద్యోగము సంపాదించుకొనుటలో పై మన్యములు పెంచుకొని కుటుంబముల పన్నల కారణమ్యములు మూపుటకు, వంశవృక్షములు పూర్వో అంచనములు చేపనిపోవుటవల్ల కుటుంబములు వేరుగా కనుచున్న

దురుద్దేశముతో యిటీవల తరములు విడగొట్టుకొని నటులను అనంతర
ముమహాపాత్రునితెగవారిలోని నాలుగు గ్రామాదులలోనివారిలోచాల
మంది వెంటనేనశించుట తటస్థించిన కారణమున తిరుగ మూడుదినము
లు అశౌచము తెచ్చిపెట్టుకుని శాంతిబడినటుల పెద్దలుచెప్పుదురు.
కట్టుంగ వేలివెంటి కుటుంబములవారు కూటస్థునికి పదునాల్గవతరము
దాటినవారవుటచే వారు విడిగానేయుండిరి. కొదువ నాలుగుకుటుంబ
ములవారి వంశకర్తయగు మహాపాత్రునికి నాలుగయిదు తరములలో
నే యుండుటచే తిరుగ కలుపుకొనుటకు కారణము కలిగియుండవచ్చును.
యిందు పందలపర్తివారు కూడ కలియవలసినదేగాని వారు దూరమునం
దుండు కారణముచే కాబోలు తిరుగకలసినవారుకారైరి. యిదిజరిగి
యిప్పటికి 150 సంవత్సరముల కాలము పైగాకాగలదు.

ఈ వంశీకులలో పేరిసోమయాజి, వెంకట సోమయాజి, లక్ష్మీపతి
సోమయాజి, వెంకట దీక్షితులు; రఘుపతి దీక్షితులు, వెంకటనృశింహ
దీక్షితులు. వెంకట సోమయాజి మనుమడు వెంకటసోమయాజి వీర
వెంకట దీక్షితులు మొదలగు వారనేకులు యజ్ఞయాగాది క్రతు
వులు చేసిన వారు ఆధానము, వైశ్వదేవము చేసిన వారును గలరు.
ఈ వంశమున కిలవేల్పు సోమేశ్వరుడగుటచే వీరిలో శివపూజా ధురం
ధరు లనేకులు గలరు.అందుముఖ్యముగా సత్తిరాజు ఉద్దండరాయుడుగారి
శివపూజా విధానము చాలా మహత్తరమైన దని అప్పటి వారు చెప్పు
కొనెడి వారు. వీరి దేశపాండ్యా హోదాలు వసతులున్న 1214
ఫసలీ వరకు జరిగినవి. అప్పుడు శ్రీ జమీందార్లవారు యీ వుద్యో
గములు తగ్గించి యిచ్చిన వసతులు లాగుకొనుటచే అప్పటిలో దేశ
పాండ్యాలుగా నుండి తగ్గిన సూరయ్య, కామయ్యగార్లు వ్యాజ్యములు
దాఖలుచేయగా మామూలు ప్రకారము జరిగించెద మని సమాధాన
పరచుటచే వ్యాజ్యములు [illegible] అప్పుడు [illegible] జరుగుచుండు

డబ్బదివరహాలు మనవర్తికి అయివజు కామయ్య, కృష్ణమ్మ, వీరయ్య, సుబ్బారాయుడు యీ నలుగురి భాగములక్రిందను 7 పుట్లభూమి పుట్టి 1కి 40 రూపాయలు కట్టుబడి కట్టి యిప్పించిరి. ఈ కుటుంబము వారికి స్న 1179 లగాయతు 1203 ఫసలీవరకు సాలుకు 300 వరహాలు మనవర్తి 25 పుట్ల పండుమః భూమియు జరుగుచుండెడివి. వీరిలో సిత్తిరాజు వెంకన్న, పేరాజు, వెంకటరాయుడు, అప్పకొండు; వెంకట రావు, వెంకయ్య, రామలింగం, అయ్యమ్మ, చినవెంకటరాయుడు, రఘుపతి, జగన్నాయకులు, కామయ్య, కృష్ణమ్మ, వీరయ్య, సుబ్బా రాయుడు మున్నగు వారు దేశపాండ్యా, దేశముఖ, స్థలకరిణి మొదలగు ఉద్యోగములు చేసియుండిరి. తుదకు సెటిల్‌మెంటు వచ్చుకాలమున 8 పుట్లభూమి కరిణీకపుకట్టుబడి మాన్యముగా జరుగుచున్నది. అందు జుత్తిగలోని వారు 4 పుట్లు కొయ్యేటిపాటివారికి 2 పుట్లు, [illegible] లేటివారికి 2 పుట్లుగాను పంచుకొని అనుభవించుచుండిరి. ఈ [illegible] దాలు గలించినతోడనే యీ కుటుంబములవారు క్రమక్రమముగా [illegible] త్తిగ ప్రక్క గ్రామములలో వసతు లేర్పరచుకొని జుత్తిగ విడువ నా[illegible] భించిరి. 24 జూలై 1809 సంవత్సరమునకు సరియగు శుక్లసంవత్సర ఆషాడ శుద్ధ ౧౪ (చతుర్దశి) సోమవారం రోజున మా పెదతా[illegible] రగు సుబ్బయ్యగారు యిపుడు మేము కాపుర మున్న కంతేరు గ్రా[illegible] వచ్చి కరిణీకం సంపాదించుకొని కాపుర ముండిరి. అనంతరము [illegible] యన తమ్ములు మా పినతాతగారు మా గ్రామ సమీపములో [illegible] పొదలాడ అగ్రహారముకు క్రీ. శ. 1818 లో కరిణీకము సంపాదిం[illegible] అటుపిమ్మట కంతేరు గ్రామకాపురస్థులై కంతేరులోని శ్రీ వేణుగో లస్వామి వారి ఆలయము కట్టించిరి.

తరువాత జుత్తిగలో నున్న మరికొందరు యే యే కారణములచే [illegible] మెప్పుడు [illegible] తెలియదు గాని తెలిసినంతవరకు [illegible]

చెద. పైన నుడివిన పెద్దభార్యసంతతివాడగు పెదబాపిరాజునకు లింగరాజు. ఆయనకు పాలంకి రాజు. వీరికి వెంకన్న యీ వెంకన్నకు వీర్రాజు, పేర్రాజు అను యిద్దరు కుమాళ్ళు. అందు వీర్రాజునకు పేర్రాజు, పద్మరాజు, అయ్యమ్మ, యజ్ఞరాజు అను నలుగురు కొడుకులు. పద్మరాజుగారి పెద్దకుమారుడు లక్ష్మీపతి. ఈయన సంతతివారు యిప్పుడు రాజోలు తాలూకా పొదలాడ యందున్నారు. ఈయన తమ్ముడు వెంకయ్యగారి సంతతివారు చెఱుకువాడలో నున్నారు. వీర్రాజుగారి మూడవ కుమారుడు అయ్యమ్మ సంతతివారు పోలవరం వెళ్ళిరి. ఈ యజ్ఞరాజుగారి సంతతివారు వీర్రాజుగారి తమ్ముడు పేర్రాజుఅను పేరిసోమయాజులు వారిసంతతి వారిలోను ఉద్యోగ రీత్యా కొంద రితర గ్రామము లందున్ననూ జుత్తిగ యందున్నటులే భావించ వచ్చును. ఈ కుటుంబము వారిలో జగన్నాయకులుగారి సంతతివారు తణుకుగ్రామమునం దున్నారు. లక్ష్మీపతిగారి దత్తత కుమారుడు వెంకటసోమయాజులుగారుతమ బాల్యముననే పరమపదించిననూ ఆయన . అర్థాంగి సుందరమ్మగా రను సాధ్వి తన మానవజీవము మొడతెరిపిలేని అన్నప్రదానముచేసి జుత్తిగ సత్తిరాజువారియొక్క పేరుప్రతిష్టలు కాపాడి కొద్దివత్సరములక్రిందట కీర్తి శేషు రా లాయెను.ఈమె కుమార్తె నరసింహాముగారను వెంకటసోమయాజిగారు వీరికుమాళ్లు ఉద్యోగరీత్యా పలు తావులనున్నారు.

మహాపాత్రుని రెండవ కుమారుడు చినబాపిరాజు మనుమలు పాలంకి సోమయాజి—బాపిరాజు. ఇందుపాలంకి సోమయాజిగారి ముని మనుమని మనుమడు రామన్నగారి సంతతి వా రందరు కంతేరు నందున్నారు. బాపిరాజు మునిమనుమడు మనుమడు వెంకటరాయుడు. నరసన్న శరభరాజుగార్ల సంతతివారు పందలపర్తి నందున్నారు. మహాపాత్రుని చిన్న భార్య సంతతి వా రందరు కొత్తపేట నందున్నారు.

వీరి మూల పురుషుడు రాముడు. ఈయనకు యేడవతరము వాడు పరమేశ. ఈయనకు ఏడుగురు కొడుకులు. అందయిదవ కుమారుడు రామలింగమునకు బుచ్చిపరమేశ చిన్నంరాజు—లక్ష్మీపతి—వీరవెంకట దీక్షితులు. ఈయన వేలివెంటినుంచి పట్టాభిరామయ్యను దత్తతచేసి కొన్నారు. ఇప్పుడీ నాలుగు కుటుంబములవారు కొయ్యేటిపాటి యందున్నారు. ఇక్కడ కీ శాఖ వారలైనారు—మూలపురుషుడు సోమేశ రెండవకుమారుడైన మల్లపరాజునకు పదియవ తరము వాడగు వెంకన్నకు పెదబాపిరాజు, చినబాపిరాజు అని యిద్దరు కుమాళ్ళు. అందు చినబాపిరాజు మనుమడు ముత్తంరాజు. వీరి కెన్నవతరము వారో గాని సుబ్బన్నగారి కుమారులు రామయ్య సుందరశివుడుగారి సంతతిలో బాపిరాజుగారి కుమాళ్ళు వెంకట సుబ్బారాయుడు, లక్ష్మీపతి, కృష్ణమూర్తి అనువారు కట్టుంగలోను యీ బాపిరాజుగారి నాలుగవ కుమారుడు నరసయ్యగారి సంతతివారు పోలవరం యిలాకా అన్నదేవర పేటలోను, శ్రీ గిరిరాజువారి సంతతిలో పేరాజు, అచ్యుతరామయ్య వాసుదేవుడు, నారాయణమూర్తిగార్లు కట్టుంగలోను యీయన పినతండ్రి సంతతివారు కొవ్వూరులోను, వీరు గాక పేరరాజుగారి సంతతి యని మఱియొక వంశీకులు గలరు. వారి తాలూకు వారిలో సుందరరామయ్యగారు చాలా ప్రఖ్యాతి పురుషులు. వీరు పెద్దాపురం సంస్థానములో శ్రీ వత్సవాయి తిమ్మగజపతిమహారాజులుగారివద్ద దివానుగా నుండి నూరు వరహాల జీతము పుచ్చుకొనుచు పదునెనిమిది పరగణాలకు అధికారి అయి కట్టుంగ, నార్కడమిల్లి, అంకంపాలెం, లొల్ల, పుల్దింపి, వెల్చేరు మున్నగు గ్రామాదులలో పదునెనిమిది పుట్లభూమి సంపాదించినారు. ఇందు 6 పుట్లభూమి సుమాణము, దూర్వాసుల, దేవరపల్లి, పొదిలి, ఆకెళ్ళ, ఓగేటివారు అను యిళ్ళపేర్లుగల బ్రాహ్మణకుటుంబముల వార్లకిచ్చి అగ్రహారం కట్టించినారు. ఆ వసతు

ప్పటికిని ఆ యీ యిన్ని పేర్లవారికి జరుగుచున్నవి. ఈ కట్టంగవారు పేరాజు మూలపురుషుడుగా గలిగిన వంశవృక్షము 1, సుబ్బన్న మూలపురుషుడుగా గలిగిన వంశవృక్షము 1, లింగరాజు మూలపురుషుడుగా గలిగిన వంశవృక్షము 1 న్ని 3 వంశవృక్షములు వేరువేరుగా పంపించినారు. ఆ కారణముచేత వారి ముగ్గురకు కూటస్థుడగు ఆ సోమేశకు 14 తరము వాడగు సుత్తమరాజుతో కలిపి చెప్పుటకు సాధ్యమైనది కాదు. ఇప్పుడైనను పై మూడు వంశముల వారి కూటస్థుల పై వంశవృక్షము సంపాదించి పంపినచో మొత్త మన్ని గ్రామముల వారి వంశవృక్ష మేకముగా అచ్చువేయించ ప్రయత్నించెదను. ఈ కూటస్థు డయిన చినబాపిరాజుగారి అన్నగా రగు పెదబాపిరాజుగారి వంశము. ఈయన కుమార్డు వీర్రాజుగారు. వీరు వేలివెంటి కుటుంబము వారి మూలపురుషుడు. ఈయన ముగ్గిరి కుమాళ్ళలో జగ్గరాజు సంతతివారిలో అచ్యుతరామయ్యగారు వేలివెంటియందును, రామన్నగారి సంతతివారు వెల్చేటియందును, వెంకటకృష్ణారాయుడుగారు సంతతివారు ఏలూరునందును, రెండవకుమారుడు బాపిరాజు తాలూకు కడపటి కుమారుడు కామరాజు సంతతివారు వేలివెంటి యందుండిరి. పై బాపిరాజు మనుమడు లక్ష్మీపతిగారు. ఈయన కుమారుడు వెంకటశాస్త్రిలుగారు. ఈయన గొప్పశాస్త్రపండితులు. వీరికుమాళ్ళు శేషయ్య, రామకృష్ణయ్యగార్లు సంస్కృత పాండిత్యము సంపాదించి జ్యోతిశ్శాస్త్రమునందు మిగుల ప్రవీణు లనిపించుకొనిరి. పందలపాక వారిలో శరభరాజు అప్పకొండు, వెంకటరాయుడు మున్నగువారు ప్రఖ్యాతి పురుషులుగా పరిగణింపబడిరి. పోలవరము వెళ్ళిన వారిలో సూర్యనారాయణ రామచంద్రుడు అను వారు మంచిఐశ్వర్యము కలవారై నిరతాన్న ప్రదాతలని ప్రఖ్యాతి నొందిరి. ఆకాలములో పోలవరమునందు జన్మి[illegible] కామరాయమ్మగారి

సత్తరువుప్రకంటె యీ సూర్యనారాయణగారి సత్తువ ఎక్కువగా ను
డెడి దని చెప్పుకొనెడివారు. ఈ సూర్యనారాయణగారు పెక్కుధర్మ
ములు చేసి మంచి త్యాగి యనిపించుకొనెను. బ్రతికి యున్నంతకాల
ము సవారీలోని కాలు క్రింద నుంచ లే దని చెప్పుదురు. ఈయన
త్యాగమునకు సరియగు భోగము ననుభవించెను. ఈయన త్యాగ
భోగములు నేనును చూచియున్నాను.

అదృష్టవశమున జుత్తిగ గ్రామములోని శ్రీ సోమేశ్వరాలయము
లోని రాతిస్తంభములపై చెక్కబడినశాసనములు కొన్ని తీయబడినవి.
అందు శ్రీ పార్వతీదేవిమెదుటనున్న నందిరాతిపై చెక్కబడిన శాస
ములో శాలివాహన శకాబ్దంబులు 1505 క్రీ. శ 1583 ప్రాంత్యము
స్వభానుసంవత్సర ఆశ్వయుజ శు ౧౦ శనివారమునాడు అప్పుడు న
బు గానుండిన మహమ్మదు ఇబ్రహీం పాదుషావారికుమార్డు మహమ్మ
దు ఖుల్లీపాదుషా రాజ్యము చేయుచుండుకాలమున సత్తిరాజు సో
రాజుకొడుక్కు పెద్దిరాజు యీయన కుమార్డు సోమేశ అనుపురుష
జుత్తిగదేవస్థానములన్నిటిని పునర్నిర్మాణముచేయించినట్లు వ్రాయ
యున్నది. ఇదివరకు నాకులభించిన వంశవృక్షములలో సోమ
కొడుక్కు పెద్దిరాజుగాని పెద్దిరాజు కొడుక్కు సోమేశగాని కనుపించు
లేదు. ఆవంశవృక్షములో సోమేశకు 7 వ తరమువాడగు సో
తండ్రులు ఏడుగురిలో ఒక్కని కుమారుడగు సోమేశనుండి ద
వారిని వ్రాసుకువచ్చిరిగాని కొదువ ఆర్గురిసంతతిమాట యే
చెప్పలేదు. పేరిరాజుఅనే పేరిసోమయాజుల కుమారుడు వెంక
యుడుఅనే వెంకటసోమయాజులు సన్ 1149 ఫసలీ ప్రాంతము
చెప్పుటచే (క్రీ. శ 1730 ప్రాంత్యము) ఈ యనకు పైన మొని
పురుషుడుగానుండు పైనుదహరించిన సోమేశకాలము క్రీ. శ 15
కావచ్చునెమ్మాన ఈ శాసనములో ... తండ్రుల స

లోనివారెవరో కావలెను. ఈ విషయమసలు శాసనములు ఇంకను తెప్పించి పరిశోధించవలసియున్నది. అపుడైనను పునర్నిర్మాణముచేసి నట్లుండుటచే అప్పటికింకను 3–4 పందల సంవత్సరములకు ముందు ప్రతిష్ట జరిగి యుండవచ్చును. ఇపుడు జుత్తిగలోనుండు ఆలయము లలో దుర్గాలయము సత్తిరాజు పరమేశంగారివలననూ సుబ్రహ్మణ్యే శ్వరుని ఆలయము ఉగ్దండ రాయుడుగారివలనను ప్రతిష్ట చాయబడినటు లను ఈ యాలయములన్ని స్తూపికలతోడనే యుండుటచే 1-2-1907 పరాభవ నామసంవత్సర ఫాల్గుణ శు॥ ౫ ఆదివారమునాడు నాతండ్రి గారైన రామన్నగారివలన అన్ని ఆలయములకు శిఖరప్రతిష్టలు చేయ బడినవి. ఆయన నిరతాన్న ప్రదాతయగుటచే ఆయనకు అన్నపురా మన్నగారని పేరువచ్చినది. ఆయన భార్యయగు శీతమ్మగారు రాత్రి 10 గంటలకు దీపము చేతబూని వీధిఅరుగులపై నిద్రించుచున్న బాట సారులనులేపి బలవంతపెట్టి అన్నము తినుపించుచుండెడిదని చెప్పుకొనె డివారు(7–5–1924) రక్తాక్షి సంవత్సర వైశాఖ శు॥ 3 బుధవారము నాడు జుత్తిగలోని ఆలయావరణలో నాచే పునర్నిర్మాణము చాయబ డిన కాలభైరవాలయము నా అన్నగారగు వెంకట సుబ్బారాయుడు గారిచే ప్రతిష్టింపబడినది. శ్రీ జనార్దనస్వామివారి ఆలయము శ్రీ వంగూరి నారాయణమూర్తిగారివల్లనూ ప్రాకారములు మున్నగునవి అనుబాపురం తాలూకా రావిపాటి కాపురస్థులగు రామభట్ల అప్పన్న శాస్త్రులను ద్రవిడ వంశీయులవల్లను ప్రతిష్టింపబడినవి. వాటివివరము ఆయా కుటుంబములవారి వంశచరిత్రయందు చెప్పబడును. ఈ సత్తి రాజువారు విశేష కర్మిష్టులు జ్యోతిష్కులు శాస్త్ర పండితులు కలరు గాని సాహిత్యపరులు కనబడరు. భాస్కరరామాయణమను తాటా కుగ్రంథము కష్టపడి వ్రాసుకొని పఠించిన సూరయ్యగా రొక్కరుమా త్రము సాహిత్యవేత్తగా కనుపించుచున్నారు. ఈ సూరయ్యగారి

సుందరకాండ ప్రతినసనుసరించి 'వికృతి నామసంవత్సర ఆషాడ శు॥ ౧౧ సోమవారం వరకు యర్రమిల్లి బాపిరాజుగారివల్ల, వ్రాయబడిన వ్రాత ప్రతియొకటి ప్రస్తుతము చెన్నపురియందలి ప్రాత్యలిఖిత పుస్తకభాండాగారమునందున్నది.

ఈ కుటుంబమువారి కనుశృతముగా యీా దిగువవారితో బంధుత్వములుగలవు. భారద్వాజగోత్రీకులగు—అయ్యదేవర— గోటేటి— పెమ్మరాజు— పరకాళా— తల్లాప్రగడ— నందిరాజు— నిడుమోలు— పువ్వాడ— రాపాక— కాళ్లకూరి— ర్యాలి— అజ్జరపు— గోపరాజు— నిడమర్తి— పోడూరి— వంగూరి— పాలపర్తి— తేతలి— పాలకోడేటి— వల్లూరి— వేమూరి వారితోడను, కౌండిన్యగోత్రీకులయిన

కలిగొట్ల— కానూరి— తటవర్తి భారతము— పెండ్యాల— వెలిచేటి— ముంజులూరి— పోతాప్రగడ తాడిమేటివారితోడను, గౌతమగోత్రీకులగు

కొమరగిరి— కామరాజుగడ్డ— మల్లవరపు— చెరుకువాడ—సిరిపురపు వారితోను— కాశ్యప గోత్రీకులగు

చామర్తి-రామాప్రగడ—కామరాజు—కొవ్వలి కల్వచర్ల వారితోను—

శ్రీ వత్సగోత్రీకులగు, చెంగల్వల, తాడిమళ్ల, మునమర్తి, నండూరివారితోడను

కౌశికగోత్రీకులగు పుణ్యమూర్తుల— శివరాజువారితోను మౌద్గల్యగోత్రీకులగు బంధకవివారితోను లోహిత గోత్రీకులగు—మద్దాలి—లింగరాజువారితోను— శౌనకగోత్రీకులగు తురగా వారితోను

భార్గవ గోత్రీకులగు— కృత్తివెంటి— ద్రోణంరాజువారిలోను ఆత్రేయగోత్రీకులగు— ఉప్పులూరి—పోణంగి— సూరంపూడివారితోను శాండిల్య గోత్రీకులగు ఈడూరివారితోను

వాధూల గోత్రీకులగు— అయ్యగారి— కస్తూరి— బాలాంత్రపు వారితోను

సాంఖ్యాయన గోత్రీకులగు ఆచంట— అడివివారితోను సంబంధము లుకలవు.

## గ్రంధకర్తవంశావళి.

ఇంతవరకు క్లుప్తముగా సత్తిరాజువారి వంశవివరము చెప్పబడినది ఇపుడు ప్రత్యేకము గ్రంథకర్తయొక్క కుటుంబవిషయము చెప్పెద.

మూలపురుషుడు సోమేశకు పదియారవతరమువాడు ముత్తంరాజు ఆయన భార్య నందూరివారి ఆడపడుచు పాపమ్మ వీరికి పద్మరాజు— కొండలరాయుడు లక్ష్మీనారాయణయను ముగ్గురుకుమాళ్లు. ఇందు పద్మరాజుకు ముత్తయ్య ఈ యనకు పద్మరాజు అంతటితోసరి. రెండవ కుమార్డు కొండలరాయుడుకు బుల్లి పద్మరాజు. ఈ యనకు కొండలరా యుడు వీరితోసరి. మూడవ కుమార్డు లక్ష్మీనారాయణ యీయన భార్య కలిగొట్లవారి ఆడపడుచు వెంకమ్మ. వీరికి ఏడుగురు కుమాళ్లు అందు పెద్దకుమార్డు సుబ్బయ్య భార్య కామమ్మ యీమె బంధకవి వారి ఆడపడుచు, యీ యనకు శేషయ్య భార్య ఆదెమ్మ వీరికి యర్రివెంకమ్మయను కుమార్తె. సుబ్బయ్య రెండవకుమార్డు శేష య్యగారి తమ్ముడు గంగరాజు ఈ యనకు పోతాప్రిగడవారి చిన్నది సుబ్బమ్మనిచ్చిరి. వీరికి పురుషసంతతిలేదు కుమార్తె వెంకమ్మ ఆమె నుబంధకవి కామరాజుగారి కిచ్చిరి. వీరికి ఆదినారాయుడు నిస్సంతు లక్ష్మీనారాయణగారి రెండవకుమార్డు వెంకన్న భార్య వియ్యమ్మ కాళ్ళ కూరివారి ఆడపడుచు నిస్సంతు. మూడవకుమారుడు పాపయ్య గారు భార్య అచ్చెమ్మ ఉప్పులూరివారి చిన్నది. ఈ మెకుసూరమ్మఅను కుమార్తె. ఈమెను కొవ్వలి వారి కిచ్చిరి. నాలుగవ కుమారుడు ముత్తయ్యగారు నా తాతగారు. ఈయన భార్య పరకాళా కామే శ్వర్డుగారి కుమార్తె వేంకమ్మ వీరునకు ముగ్గురు కుమాళ్ళు గలరు.

పెద్దకుమార్డు వెర్రి సుబ్బరాజు అవివాహితుడు. రెండవ కుమార్డు రా మన్నగారు. ఈయనకు పరకళా కామరాజుగారి కుమార్తె సీతమ్మ గారి నిచ్చి వివాహముచేసిరి. వీరికి మా అన్నదమ్ము లయిదుగురము, ముగ్గురు కుమార్తెలు మాలో పెద్దవాడు వెంకట సుబ్బారాయుడు. ఈయనకు మద్దాలి అప్పన్నగారికుమార్తె నరసమ్మగారి నిచ్చి వివాహము చేసిరి. ఈయన కుమారుడు శీతారామయ్య. ఈయనకు చెరుకువా డ శ్రీరామారావుగారి కుమార్తె రాజేశ్వరి నిచ్చి వివాహముచేసిరి. ఈయన కుమార్డు శ్రీరామారావు. ఈతనికి తేతలి వెంకట్రామయ్యగారి కుమార్తె సీతాసుందరమ్మ నిచ్చి వివాముచేసిరి. రామన్నగారి రెండ వ కుమారు డను నేను. శీతారామయ్యను నాకు పెండ్యాల శీతా రామయ్యగారి కుమార్తె వెంకటరత్నమ్మ నిచ్చి వివాహము చేసిరి. నా దత్తత కుమారుడు శీతారామయ్య. ఇతనికి పాలపర్తి శివరావు గారి కుమార్తె సూర్యకాంతమ్మ నిచ్చి వివాము చేసితిని. ఇతనికి హను మంతరావు అను కుమారుడు కలిగెను. నా తమ్ముడు రామన్నగారి మూడవ కుమారుడు సూర్యనారాయణ. ఇతనికి ప్రథమము కొమ్మ గిరి రామజోగయ్యగారి కుమార్తె శీతమ్మ నిచ్చిరి. ద్వితీయము పెమ్మరాజు సుబ్బారాయుడుగారి కుమార్తె వెంకట రత్నమ్మ నిచ్చి వివాహముచేసిరి. ఇతని పెద్దకుమారుడే నాకు దత్తుడు. రెండవ కు మారుడు వేణుగోపాలరావు బి. ఏ. బి. యల్. ఇతనికి నిడుమోలు లక్ష్మీనారాయణగారి కుమార్తె సూరమ్మ నిచ్చి వివాహము చేసిరి. ఇతనికి ముగ్గురు కుమాళ్ళు కొమార్తె. సూర్యనారాయణ, లక్ష్మీనారా యణ, శంకరనారాయణ. ఇతనితమ్ముడు మృత్యుంజయరావు బి.ఏ.యల్. టి. ఇతనికి కస్తూరి శివశంకరశాస్త్రుల్లగారి కుమార్తె మాణిక్యాం నిచ్చి వివాహముచేసిరి. యితనికి దత్తుడు పందలపర్తి సత్తిరాజు లక్ష్మీపతిగారి కుమార్డు కామేశ్వరరావు. యితనికి ప్రథమము కస్తూరి

మాణిక్యారావుగారి కుమార్తె కామేశ్వరమ్మనిచ్చిరి. ద్వితీయము నం
దూరి రాధాకృష్ణమూర్తిగారి కుమార్తె మాణిక్యమునిచ్చిరి. యితని
కిపుడు శీతారామ హనుమంతరావు అను కుమారుకలడు. రామన్న
గారి అయిదవకుమార్డు కామేశ్వరారావు బి.ఏ.యల్.టి. యితనికి ప్రథ
మము చంగల్వల పరదేశిరాజుగారి కుమార్తె సుబ్బమ్మనిచ్చిరి. ద్వితీ
యము చెంగల్వల శివరావుగారి కుమార్తె ఆదిలక్ష్మినిచ్చిరి. యిత
నికి శేషగిరిరావను కుమార్డు గలడు. మాతోబుట్టువులు ముగ్గురిలో
కాంతమ్మయను రెండవసోదరి అవివాహితగానే చనిపోయినది. పెద్ద
సోదరిని పెమ్మరాజు అచ్యుతరామయ్యగారికిచ్చి వివాహము చేశిరి.
మూడవసోదరి శేషమ్మను మునమర్తి వెంకటసుబ్బారాయుడుగారి
కిచ్చిరి. మా చినతాతగారైన కామరాజుగారు మాగ్రామములోని
శ్రీ వేణుగోపాలస్వామివారి ఆలయప్రతిష్ఠ చేశిరి. యిటీవల మా
తండ్రిగారు ఆలయమునకు ప్రాకారముకట్టించుటయేగాక జుత్తిగగ్రామ
ములోని వాసుకి రవి సోమేశ్వర స్వామియొక్కయు. తదావరణము
లోని యితరఆలయములకు శిఖరప్రతిష్ఠలు చేశిరి. అనంతరము అసో
మేశ్వరస్వామివారి ఆలయములోనే జీర్ణించియున్న కాలభైరవాలయ
ము నాచే పునర్నిర్మాణము చేయించబడినది. తదాలయ ప్రతిష్ఠసమ
యమున యీ దిగువశాసనము కాలభైరవాలయమునకు ముందుగా
స్థాపించబడిన ధ్వజస్థంభపురాతిపై చెక్కించబడినది. ధూళికవా
నుకి రవి సోమేశ్వరక్షేత్రపాలకులగు భైరవాలయమెన్నడో శిథిలమయి
నామమాత్రావశేషముగనున్న దానిని "స్వస్తిశ్రీ శాలివాహన శకాబ్ద
ములు ౧౮౪౬ కల్యబ్దంబులు ౫౦౨౫ హూణశకాబ్దంబులు ౧౯౨౪
అగు నేటి రక్తాక్షి సం॥ వైశాఖ శు॥ 3 బుధవారము(7—5—1924)
న ఆర్వేల నియోగి కులదీపక ఆపస్తంబసూత్ర హారితసగోత్ర పవిత్ర
సత్తిరాజువంశ [illegible] తర

మునాడగు మహాపౌత్రునిమనుమడు ముత్తంరాజు కుమారుడు పాలు
సోమయాజి ప్రపౌత్రులగు లక్ష్మీనారాయణశర్మ ప్రపౌత్రులు
ముత్తయ్య మంత్రిపౌత్రులును నిరతాన్నదాన తత్పర ప్రసిద్ధరా
ప్రధాని పుత్రులగు వెంకటసుబ్బరాయ, సీతారామ, కామేశ్వరశర్మ
చే కీర్తిశేషులగు తండ్రి రామప్రధాని తల్లి సీతమాంబ సోదరులు సూ
ర్యనారాయణ మృత్యుంజయులకు మరియు ఏతద్వంశీయులందఱికి స్వ
కలుగునటుల కాలభైరవాలయము పునర్నిర్మాణముగావించి ప్రతిష్ఠ
బడినది. ఆలయము కట్టుబడికి 1000 రూపాయిలు ఆలయములోని ప
మానులు200లు ఆలయప్రతిష్ఠకు517మొత్తం 1718రూపాయలు వ్యయ
మయినవి. ఈ మొత్తమంతయు నా స్వార్జితములోనే ఖర్చుపెట్టి
నది. నాతాతగారితమ్ముడు అనగా లక్ష్మీనారాయణగారి
పుత్రుడు కామయ్యగారికి మా పినతండ్రి పట్టాభి రామయ్య
గారిని దత్తతచేసిరి. గాని వారు నిస్సంతుగా చనిపోయిరి
ఆరవ తాత కొండయ్యగారు నిస్సంతు. ఏడవవారగు సూ
య్య గారవివాహితులు కాగా మా తాత లేచ్చరసంతతిలోను యి
టికి నిల్చియున్నది మా తండ్రిగారి సంతతివారమగు వారము మే

ఇకనాస్వవిషయము క్లుప్తముగా వివరించెద:—

నేను కొంతకాలము ఏలూరునుండి దేశోపకారియను అర్ధవార
యు లావర్తమానియను పత్రికయు ప్రత్యేకము స్త్రీలకుపయుక్త
హిందూసుందరి పత్రికను ప్రచురించితిని. 6 సంవత్సరములకాలు
ఏలూరు మున్సిపలు కౌన్సిలరుగను ఆ తాలూకా బోర్డు మెంబరు
అనంతరము నరసాపురము తాలూకా బోర్డునకు పిమ్మట తణుకు తా
లూకా బోర్డునందు కొంతకాలము గోదావరిజిల్లా బోర్డునందు అ
ము కృష్ణాజిల్లాబోర్డునందు కృష్ణాజిల్లా ఎడ్యుకేషనల్ కవున్సిలరు
యింకను గవర్నమెంటువారిచే నియమింపబడిన ఛారిటబిల్ ఎం

మెంటు బోర్డు ప్రెసిడెంటుగను డిస్ట్రిక్టు పోల్జర్సు కమిటీ మెంబరుగను, పబ్లిసిటి బీరో విలేఖరిగను కంటోన్మెంటు సమయమున కొన్ని సంస్థల మెంబరుగను యేర్పాటు కాబడితిని. జనోపయోగమగు కో ఆపరే టివు సొసయిటీలోను, గ్రామపంచాయతీబోర్డులోను, ప్రెసిడెంటుగాను, పెనుగొండ ల్యాండు మార్టుగేజి బ్యాంకు డైరక్టరుగాను యిట్టి సంస్థ లెన్నటిలోనో పనిచేసితిని. భుక్తి కొరకు ఏజన్సీ ప్లీడరుగను, నిడదవో లు యస్టేటు ముక్త్యారు యేజంటుగను పనిచేసియుంటిని. నా పత్రిక కొరకు స్వంతముగ ముద్రాయంత్రము నొకటి స్థాపించితిని. ఆ కాలములోనే పాటల భారతము, చింతలపూడిపేరమ్మ, పంటలక్క-వినోదవాహిని, చక్రవర్తి చరిత్ర మున్నగు గ్రంథములు ప్రచురించితిని. నే నేలూరు విడచి 1905 లో మా స్వగ్రామము చేరితిని. కుగ్రామ మగు మా గ్రామములో 1906 లో అగ్నిప్రమాదము తటస్థించి స్థల ము లేక యిరుకు సందులలో క్రిక్కిరిసి కట్టుకొనిన తాటాకుల యిండ్లు అంటుకొని లోపలనుండు మనుష్యులు వెలుపలకు వచ్చుటలో పడిన శ్రమను కండ్లతో చూచుటచే మా గ్రామము నంటియున్న 4 ఎకర ముల భూమి కొని వీథు లేర్పరచి యిండ్లుకట్టుకొను వారికి అనుకూలము గ నుండు నటుల చ॥ గ 1కి 0-1-0 ఖరీదు కిచ్చివేసితిని. క్రమక్ర మముగా అచట యిండ్లు బయలుదేరి గ్రామముకంటె సౌఖ్యముగ నుం డుటచే దినదినాభివృద్ధియై యిపుడు గ 1కి 2-0-0 ఖరీదుకు వచ్చినది. అచట యిండ్లుకట్టుకున్న వారా పేటకు శీతారామపేట యని పిలుచు చుండిరి

ఆ కాలము సం ద్రాక్ష స్వాములవారు తరచుగా మా గ్రామము దయచేయుచు మా యింటనే భిక్షచేయుట కంగీకరించుటచే క్రమక్రమ ముగా నాయం దాయన కొక విధమగు దయగలిగి నిరంతర మన్నోయిం వరిసంగమున కాలము గడుపుచుండెడివారము. ఆ కారణము నిత్రుడు

గప్పిన నిప్పుపై గాలి శోకిన తోడనే దుమ్మొగిరిపోయి తేజోమయ
మగు ప్రకాశము గనుపించి నటుల తద్గోష్టియం దనేకాద్భుత రహస్య
ములు గోచిర మగుచుండెడివి. అనంతర మా ప్రకృతిపై చిత్త
మునందు బుద్ధి శోకి వైద్య, వేదాంత, సాముద్రిక, స్వర, జ్యోతిష,
ఆరోగ్య, సంగీత, ఛందో విషయము లన్నిటిని ప్రకృతికి సమన్వయము
చేసి ప్రకృతి విలాస మను గ్రంథమును రచియించితిని గాని యేలనో
అది అచ్చువేయించుట కుపేక్ష జరిగినది.

ఇపుడు పెద్దవాడనై దారుఢ్యహీనుడనై వూరుకొనలేక చిరకాల
మునుంచి కృషిచేసి సంపాదించిన కుటుంబచరిత్రగ్రంధము పూర్తిపరచి
ముద్రింప నభిలషించుచుంటిని. స్వహస్తము ద్రాయంత్ర మున్న రోజులలో
గడించుటకు శక్తిగలిగియున్న కాలములోను యిట్టి గ్రంథప్రకటన
లక్ష్యములో నుండెడిది కాదు గాని యిపుడీ గ్రంథము ముద్రించు
టకు 4 వేల రూపాయలు పెట్టుబడి పెట్టవలసివచ్చుటచే అంత సొమ్ము
ఒక్కసారిగా సర్దుబాటుచేసుకొనలేక దాతలను యాచించుట కభిమా
నము తోచి యిట్లు సంచికలుగా ప్రచురించి చందాదార్ల సహాయ
ముచే నా జీవితకాలములోనే యీ గ్రంథము ప్రచురింప సంకల్పించి
తిని. అడిగితే దనిపించుకొనుట అభిమానహేతువు. మతాభిమా
నులు దాత లగువారు ఎవరేని అభిమానించి తోచినకొలది, సహాయ
ముచేసినచో వందనపూర్వకముగ శిరసావహించి గ్రంథ మతిత్వరలో
పూర్తిపరచి ప్రచురించి పాఠకమహాశయులకు అందించెదను. నా వి
య మింత విపులముగ వ్రాసుకొనుట అవసరము లేకున్నను యీ న
మ వచ్చినలేఖలలో డబ్బుకొరకిదొక వృత్తినవలంబించిన ట్లనుమాన
నటుల కనుపించుటచే నా విషయ మంతయు స్పష్టముగ తెలుపుటకై
వ్రాసితిని గాన నియ్యది ఆత్మస్తుతిగా నెంచకు డని విప్రవంశోద్ధారక
సందర ప్రార్థించుచున్నాను.

పల్లిరాజువారిలో, గ్రంథకర్తవంశపు మూలపురుషుని పదియారవతరమువాడు ముత్తంరాజు భార్య (నందూరి)పాపమ్మ.

పెదపద్మరాజు | కొండలరాయుడు | లక్ష్మీనన్నారాయణ భార్య [కలిగొట్ల] వెంకమ్మ
--- | --- | ---
ముత్తయ్య (దత్తు) | బుల్లి పద్మరాజు |
పద్మరాజు (నిస్సంతు) | కొండయ్య (నిస్సంతు) |

లక్ష్మీనన్నారాయణ సంతతి:

- సుబ్బయ్య భార్య (బందకవి) కామమ్మ
  - శేషయ్య భార్య ఆడెన్నకుమార్తె (... మరి) వెంకమ్మ
  - గంగరాజు భార్య (పోతాప్రగడ) సుబ్బమ్మ కుమార్తె వెంకమ్మ భర్త బందకవి కామరాజు
- వెంకన్న భార్య (కాళ్ళకూరి) వియ్యమ్మ
- పాపయ్య భార్య (ఉప్పలూరి) అచమ్మ కుమార్తె సూరమ్మ భర్త కొవ్వలి రామయ్య
- ముత్తయ్య భార్య (పరకాళ) పేరమ్మ
  - రామన్న భార్య (పరకాళా) సీతమ్మ
- కామయ్య భార్య (నందూరి) కనకమ్మ
  - పట్టాభిరామయ్య (దత్తు)
- కొండయ్య భార్య చివటం (చామర్తి) గవరమ్మ
- సూరయ్య అవివాహితుడు

సుబ్బరాజు (నిస్సంతు) | రామన్న భార్య (పరకాళా) సీతమ్మ | పట్టాభిరామయ్య (దత్తుడైనాడు)
--- | --- | ---

రామన్న సంతతి: వెంకట సుబ్బారాయుడు. సీతారామయ్య. సూర్యనారాయణ. మృత్యుంజయరావు. కామేశ్వరరావు.

## అవసరాలవారు.

తెలనాటి ఆర్వేల నియోగులు. ఆపస్తంబులు, యజుర్వేదులు, భారద్వాజ గోత్రీకులు, అంగీరస, బార్హస్పత్య, భారద్వాజ అని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. ఈ కుటుంబము వారిపుడు గోదావరి మండలములోని వీరవరం, రామచంద్రపురం తాలూకా వెలగతోడు, మండపేట, వాకతిప్ప అను గ్రామాదులలో గల రనియును, వీరు తెలగాణ్యపు ఆర్వేల నియోగు లనియును వీరిలో గోలకొండ వేపార్లు గల రనియు శంఖవరమువద్ద నుండు జగ్గంపేట కాపురస్తు లగు మాగంటి కొండ్రాజుగారు తెలియపరచిరి.

2 గోలకొండ వ్యాపారులుగానున్న అవసరాలవారు.

వీరిని తెలగాణ్యులనియు, గోలకొండ వ్యాపారులనియు పిలచెదరు. వీరిమతము విసిష్టాద్వైతము. ఆపస్తంబసూత్రము, భారద్వాజగోత్రము. ఆంగీరస బార్హస్పత్యభారద్వాజ అని త్ర్యార్షేయము చెప్పుకొనెదరు. ఈవంశమువారు ప్రస్తుతము గోదావరిమండలములోని పెద్దాపురం, పిఠాపురం, తుని, రామచంద్రపురము, వెలగతోడు, కోరుమిల్లి, బిక్కవోలు, వాకతిప్ప, అంజూరు గ్రామములలోను, ఏలేశ్వరము, వడ్డిలింగంపర్తి గ్రామములలోను ఉన్నారు.

పూర్వమెప్పుడో గోల్కొండలో నుండెడివారనియు, వ్యాపారరీత్యా యీజిల్లాకు వచ్చి అక్కడక్కడ గ్రామమిరాశీలు సంపాదించి యిచట స్థిరపడినటుల పెద్దలు చెప్పెదరు. ఈకుటుంబమువారిలో అవసరాల నరసన్నగారనువారు పెద్దాపురసంస్థానమునందు చిరకాలము దివాన్‌గా నుండియున్నారు. రామచంద్రపురముతాలూకా వెలగతోడు కాపురస్తులగు సీతారామయ్యగారు, ఆయనతమ్ములు వెంకటరాయుడు పిచ్చిరాయుడుగార్లు నూతనముగా ఆగ్రామమునందు శ్రీ కోదండరామస్వామి

వారి ఆలయము కట్టించి ప్రతిష్టించి స్వంతభూములు శ్రీస్వామివారికి శాశ్వతముగా జరిగే యేర్పాటు చేసినారు. వారికుమాళ్లు రథములు కట్టించి ఏటేట రథోత్సవము చేయించుచున్నారు. వెంకటరత్నముగారను వారు ధనుర్ధరశతకమును రచించి ప్రకటించి. అనంతరము లోకశంకరశతక మొకటియు, అధ్యాత్మరామాయణము తెనుగున రచించిరి. రామమూర్తిగారు సద్గురురామశతకము రచించిరి. భక్తి జ్ఞాన వైరాగ్యసూచితమగు మ రొకశతకము రచించుచున్నారు. ఈకుటుంబము వారి కనుక్రమముగా కాళ్ళ వారితోను, మైలవరపువారు, నిడసనమెట్లవారు, పున్నమరాజువారు, అనంత్సవారు, తుళ్ళపాటివారు, విహాలవారు మొదలగువారితో సంబంధములు గలవు అనియు వెలగతోడు వాసులగు నస్మల్పితామహులు సుబ్బన్న అనంతరాయుడు గార్లు కరిణీకముచేయుకాలములో దొంగలు దొంగిలించుట అను మాటలు వినిపించెడివికావు. ప్రకాశరాయుడుగారి కుమారుడు వెంకటాచలపతియను నేను ఆత్మచరిత్ర రచించితిని. అందలి పద్యంబు లిట్లుండును.

సీ॥ చిన్నతనంబున గన్నపుత్రుని బోలె
మార్గంబు జూపె స్వతంత్ర మొసగి
యది దప్పిపోకుండ పిదప ముందై వచ్చి
పదిలపరచెను జగద్భద్రముగను
పోవపోవగ నందు పొలుపారు
చిన్నెల వన్నె లెన్నేనియు నరుస జూపె
చూడ చూడగ తుది చూడ నేమియు లేక
యున్న దున్నటులె యుండ జూపె
గుట్టు గా దిది తెలిసితె బట్టబయలు
పట్టరా దిది సద్గురు పట్టులేక
యట్టి యనుభవ మొసగిన
పట్టభద్రుని సద్గురు రామునకు నతులు.

ఒక శతకము కోదండ రామకృతిగాను, ఉత్పలమాలా శతకము శంకరుని పరముగాను రచించితిని. అధ్యాత్మరామాయణములోని సుం దరకాండ తెనిగించితిని. ఇది మా వంశచరిత్ర మని వెలగతోడు కాపురస్థులు అవసరాల వెంకటాచలపతిగారు చిరకాలము క్రిందట వ్రా సిపంపిరి. శేషగిరిరావుగారు చంద్రికాంత నాటకము, దమయంతీ, భీష్మప్రతిజ్ఞ మున్నగు చాలాగ్రంథములు రచించిరి. ఈ కుటుంబము వారిలో అధునికులగు రామారావు పంతులుగారు అడ్వొకేటుగానుండి ప్రఖ్యాతి సంపాదించుచున్నారు. 'రావుబహద్దూరు' అవసరాల రా మారావు పంతులు గారు ప్రఖ్యాతి పురుషులు. వెంకటరావుగారు పాఠశాలల పరీక్షాధికారిగా నున్నారు.

## కంభ్లగుంటవారు

వైఖానసులు తైత్తరీయశాఖ కృష్ణయజుర్వేదము, విఖనససూత్ర ము, గౌతమగోత్రము, అంగిరస, అయాస్య, గౌతమ అనిత్ర్యా ర్షేయము. ఈ ఇంటిపేరుగలవారిలో కంభ్లగుంట తిరుమలాచార్యులు గారి కుటుంబము గుంటూరుజిల్లా సంగం జాగర్లమూడి గ్రామమునం దుండియున్నారు.

## నారాయణంవారు.

వైఖానసులు, తైత్తిరీయశాఖ కృష్ణయజుర్వేదులు, విఖనససూ త్రులు, వీరిది భారద్వాజగోత్రము. అంగీరస, బార్హస్పత్య, భార ద్వాజ అను త్ర్యార్షేయము. వీరిలో ఒకకుటుంబమువారు గుంటూరు జిల్లా సంగం జాగర్లమూడియందుండియుండిరి. గోదావరిజిల్లా అరట కట్ల రాయకుదురు గ్రామములయందును ఉన్నారు. నారాయణం వెంకటాచారిగారి కుటుంబమువారు ఇంకొల్లునందును, శేషాచారిగారి కుటుంబమువారు ఉల్లిపాలెమునందునుగలరు. ఈ నారాయణంవారి లో శైవగోత్రీకులుకూడా కలరట. వీరిలో కొందరు సంగం జాగర్ల మూడియందును కలరని తెలియుచున్నది.

## చిత్రకవివారు.

యాజ్ఞవల్క్య నియోగులు కాత్యాయనీ సూత్రము శుక్లయజుర్వేదులు— భారద్వాజసగోత్రులు— పూర్వ మీయింటిపే రేమైయుండెనో యిపుడీ యింటిపేరుగలవారెచటనుండిరో తెలియదు. ఈ వంశీకులలో పెద్దన్న పెద్దవాడు. ఈ యన కుమార్డు అనంతకవి. ఈ యనకు రమణకవి. ఇంను పెద్దన్నగారు సర్వలక్షణ సారసంగ్రహమను గ్రంథమును రచించిరి. ఈ యన కుమారుఁడు అనంతకవి రామరాజ ప్రణీతంబైన హరిశ్చంద్రి నలోపాఖ్యానమునకు టీకవ్రాసెను. అందు తన్నుగూర్చి యిట్లు చెప్పుకొనెను.

సీ॥ శ్రీహనుమద్వర శ్రీలబ్ధ సుకవిత్వ చ
తురుండ లక్షణ సారసంగ్ర
హంబొరించి యుద్యత్కీర్తిఁ బ్రఖ్యాతుఁ
డగు చిత్రకవి పెద్దనార్య సుతుఁడ
విష్ణుచిత్తీయాది వివిధ కావ్యార్థముల్
దెలిసి వక్కాణించు ధీరనుతుఁడ
గండికోటాఖ్య దుర్గస్థలాధ్యక్షుఁడై
పృధివి మంతున కెక్కు పెమ్మసాని
గీ॥ చిన్నతిమ్మక్షమాపాల శేఖరుండు
గారవింపంగ బహుమాన గౌరవమున
మనినధన్యుండ, సభ్య సమ్మతగుణైక
గరిమ వెలయు ననంతాఖ్య కవివరుండ.
క॥ ముఖ్యంబై భూస్థలి భూ
రిఖ్యాతింగాంచి తగుహరిశ్చంద్రి నలో
పాఖ్యాన కావ్యమునకున్
వ్యాఖ్యానమొనర్తు విబుధ వర్యులుబొగడన్.

అందలివ్యాఖ్యాతగద్య ఇట్లున్నది.

"ఇది శ్రీ హనుమద్వరప్రసాదలబ్ధ సారస్వతపాత్రి, భారద్వా
జగోత్ర పవిత్ర చిత్రకవి పెద్దిరాజతనూజ, పురాతనాధునాతన క[illegible]
ప్రబంధార్థ బోధనసమర్థ మానసాంభోజ, సుధీజన విధేయానంత నా[illegible]
ధేయ విరచితంబైన— హరిశ్చంద్ర నలోపాఖ్యాన వ్యాఖ్యానంబునం[illegible]
తృతీయాశ్వాసము"

ఇతఁడు గండికోట దుర్గాధీశ్వరుఁడగు పెమ్మసాని చినతిమ్మ[illegible]
పాలుని యాస్థానమందుండెడివాడు. ఈ యనకుమారుఁడు రమణక[illegible]
ఈ యన సాంబవిలాసమను గ్రంథమును రచించెను. ఈ యన 16[illegible]
సంవత్సరపువాడని కవుల చరిత్రకారులు వ్రాసిరి. ఈ రమణ[illegible]
తన గ్రంథమునందు తన తాత తండ్రులనుగూర్చి యిట్లుచెప్పుకొన్న[illegible]

సీ॥ సర్వ లక్షణసార సంగ్రహం బొనరించి
తనరె మాతాత పెద్దన కవీంద్రు
డలహరిశ్చంద్ర నలాధీశ సత్కథా
శ్లేషసత్కృతికిఁ బ్రసిద్ధికాఁగ
గవి హితంబైన వ్యాఖ్యానంబు నొనరించి
నిందుమతీ పరిణయంబు
మొదలైన సత్కావ్యములుచేసి రహిగాంచె
నరయ మాతండ్రి యనంత సుకవి

గీ॥ చిత్రకవి మంజులాన్వయ క్షీరవార్ధి
చంద్రమూర్తివి సద్బుద్ధి శాలివీవు
రమణసత్కవి, నీవొనర్పంగఁబూను
కృతి వతంసంబు సతనికంకిత మొనర్పు.

కవులచరిత్ర కర్తలగు శ్రీ వీరేశలింగము పంతులవారు [illegible]
వైష్ణవులగు చిత్రకవి [illegible]చార్యులు, ఈ కవిత్రయము [illegible]

కలిపి ఆశ్వేలనియోగులని వ్రాసియుండిరిగాని, వారీ సాంబవిలాసము లోని గద్యచూచి యుండలేదు ఆగద్య ఇట్లున్నది.

" ఇది శ్రీ హనూమద్వరప్రసాద లబ్ధసార, సారస్వతపాత్ర, భారద్వాజ గోత్రపవిత్ర, ప్రథమ శాఖా వంశసంభవ సముజ్వల కాత్యాయన సూత్ర లక్షణ సారసంగ్రహ రచనావిశారద, చిత్ర కవి పెద్దనార్యపౌత్ర హరిశ్చంద్ర నలోపాఖ్యాన వ్యాఖ్యాన, హరిహర శ్లేషోదాహరణ సకలజీవసంజీవన ప్రబంథబంధుర, వంశావళి స్వజనా ధురంధరానంత సత్కవీంద్రపుత్ర, దయాదాక్షిణ్యాదికసమస్తసద్గుణకదం బాంబాసమానోబళాంబికా గర్భక్షీర వారాశికుముద బాంధవచరిత్ర శ్రీ సుబ్రహ్మణ్యేశ్వ రాంజనేయాంక నవరంజుల త్రిలోకసంజీవ న్యభి మన్యువిలాస సకలవర్ణనా పూర్ణ రామాయణ కుమారగురు విలాసాదిక దివ్యకావ్య కరణాతిధురీణ, శేముషీ విశేష పారీణ రాఘవపాండ వీయ విష్ణుచిత్తీయ వసుచరిత్రప్రముఖ దివ్యకావ్యార్థ బోధన సర్వ మహృదయకమల సకలవిద్వత్కవీంద్ర విధేయ వేంకట రమణనామధే య కవీశ్వరవిరచితంబైన సాంబవిలాసంబను మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము. " ఇందువలన ఈ చిత్రకవివారు యాజ్ఞవల్క్య నియోగులనుటకు సందేహింపవలసిన పనియుండదు. వీరి వంశీకులు గాని వీరి బంధువులుగాని యెచటనైనయుండిన ఈ చిత్రకవివారి కుటుం బవిషయములు తెలిపిన వందనములతో సంపుకొని ప్రచురించెదము.

(2) శ్రీ వైష్ణవులుగానుండు చిత్రకవివారి విషయము:— వీరువైష్ణవ కుటుంబములోచేరినవారు వీరింటిపేరు పూర్వము క్రొత్తప ల్లివారు, యజుర్వేదులు, ఆపస్తంబులు, ఆత్రేయసగోత్రులు, ఆత్రేయ అర్చనానస, శ్యావాస్య, అని ప్రవరోక్తయము, వీరికాపురము చుండిసీమలోని మద్దికెర. ఈ వంశీకులలో సింగనార్యులను కవిరాఘవ వాసుదేవీయమను ద్వ్యర్థిప్రబంధము రచించిరి. అయ్యది చుండిపు

రాధిపతియగు కామినేని బంగారంక భూపాలునకు అంకితమీయబడి[illegible]
అందు కవి తన వంశవివరము నిట్టుల దెలుపుకొనెను.

గీ॥ అజహరీశార్క వర్ణ నీయాత్రిలబ్ధ
యోగమహిమల వాణి రమాగభూతి
సంజ్ఞలుగణింప ద్విజరాజ సన్నుతాంకఁ
దత్రి మహితా నసూయాను మైత్రిసలరు.

వ॥ ఆమునివంశంబందు, ద్వయాను సంధాన ధురీణుండగు నారాయ
ణదేశికుం డుదయించె; అప్పురుషునకు భాగ్య భగవద్విషయ విశా
దుండగుచు నభినవ నారాయణ దేశికుండుద్భవిల్లె; ఆఘనునకు న[illegible]
విద్యావిచక్షణ దక్షుండగు అప్పకొండాచార్యులు జనించె; అమ్మ[illegible]
భాగునకు అనర్గళ పాండిత్య ప్రవీణుండగునో బళాచార్యుండు[illegible]
విల్లె; ఆదేశికాగ్రిణికిఁ దిరుమలాంబకు విమతగజ సింహులగు నారసిం
హులును, నృపులచే మెప్పుగాంచిన అప్పలాచార్యులును, నాటకాలం
కారనయ విశారదుండగు నోబళదేశికుండును జన్మించిరి. వారలు మ[illegible]
కర పట్టణమందు శ్రీమంతులై ప్రవర్తిల్లుచుందురు—ఆనృసింహాచార్యు
లకు, అభినవ రామానుజులగు రామానుజులును, ప్రబంధ కవితా
ధురుండగు నప్పలాచార్యులును పుట్టిరి. ఆ యహోబలపతికి శైలా[illegible]
యందు విష్ణుదేవునకు బంచాయుధంబులు కైవడి రంగప్ప—తాతయ్య
నారసింహులు—వెంకటప్ప—అప్పలాచార్యులను దేశికాగ్రేసరు లు[illegible]
దుగురు సముద్భవులైరి. వారల కనుజయై యచ్చమ్మజన్మించె. ఆ[illegible]
దేశికోత్తములలో రంగాచార్యులకుఁ గోనమాంబకు సింగరాచా[illegible]
సమాఖ్యుండనగు నేనాదిగా, నలుగురముద్భవించితిమి. అట్టి సింగ[illegible]
చార్యులనుగూర్చి బంగారంక భూపాలుడు.

మ॥ సనునారాయణ పానిపాద విలసన్నాళిక సేవాధురం
[illegible] శ్రా[illegible]వ్యాంధ్రవా

గ్గనితా నేకవిచిత్ర కావ్యఘటనా శ్లాఘ్యున్ మహాశ్లిష్ట క
ల్పను శ్రీవైష్ణవవంశవార్ధి శశిఁబిల్వంబంచి పల్కెన్ గృపన్.

ఈయనచేయు కృతి తమ కంకితము చాయగోరి నటులింకొకప ద్యముచెప్పి అనంతరము కృతిభర్త వంశమునువర్ణించెను, గాని తన వంశవివరమును సంపూర్తిగజెప్పక గద్యలో— "శ్రీ మదళఘుసింగరి స్వరూప శ్రీమన్నారాయణ మునిగురుచరణయుగళ సేవాసంలబ్ధ సం స్కృతాంధ్ర కవితాధౌరేయాత్రేయ గోత్రపవిత్ర క్రొత్తపల్లి రం గయాచార్య సత్పుత్ర చిత్రకవి సింగరార్య ప్రణీతంబైన" యని చెప్పెను. గాని క్రొత్తపల్లివారనునది చిత్రకవివారుగా యెవరివల్ల నెపు డుమార్చబడినదో వీరు శ్రీవైష్ణవులో ఆంధ్రవైష్ణవులో వివరము కనుపించదు.

బిల్హణీయమనుకావి యితరకృతియనియు, పండి పెద్దికృష్ణస్వామి కృతమని ప్రసిద్ధిఁజెందినదిగాని, అందుండు చక్రబంధమునందు సింగరా ర్యకృతమని తేటబరచుచున్నది (చెన్నపురిరాజకీయ ప్రాచ్యలిఖిత పుస్తకనిలయమువారు ప్రచురించిన డి. క్యా. నుండి గ్రహింపబడినది) ఈ సింగరాచారి కుమారుడు నరసింహకవి. ఇంతకుమించి శ్రీ వైష్ణ వులుగానుండు చిత్రకవివారి కుటుంబవిషయము లేమియుదెలియవు.

## ++ అయినాపురపువారు ++

యాజ్ఞవల్క్యనియోగులు. కాత్యాయనీసూత్రము, భారద్వా జగోత్రము. అంగిరస బార్హస్పత్య భారద్వాజ అనితార్షేయము.

వీరి అనాదికాపురము గోదావరిజిల్లా రామచంద్రపురము తాలూకా నీరపల్లిపాలెపులంకయనియు, నచ్చటనుండి సుమారు 200 సంవత్సరములక్రిందట కోటిఫలితీర్థము నచ్చి, యచటికి తీర్థమునకు వచ్చియున్న శ్రీ రాజావారి యనుజ్ఞవడసి అయినాపురమను గ్రామము

నకు కరిణీకము సంపాదించినపిమ్మట అయినాపురపువారైనట్లు కొందరు పెద్దలు చెప్పుదురు. అది నామతమునకు కల్లగా దోచుచున్నది. ఏలన, యిప్పు డావీరవిల్లిపాలెపులంకయందు నొక్కకుటుంబమైనను అయినాపురపువారిది కనుపించదు. బహుశా పూర్వము వీరవిల్లిపాలెపులంకలో యున్నప్పుడు మరియొక యింటిపేరై యుండి, అయినాపురము వచ్చిన వెనుక అయినాపురపువారని బిలువ నారంభించియుందురని తలచెదను. లేదా వీరికాపురస్థలము ప్రథమమునుండియు అయినాపురమే అయి యుండవలెను. అయినాపురమనునది గోదావరిజిల్లా అమలాపురము తాలూకాయం దున్నది. ఈ కుటుంబమువారి ఆదిపురుషుడు యర్రంరాజు. ఈతనికి బాపిరాజు, యల్లమరాజు అని యిద్దరు కుమారులు. అందు పెద్దకుమారుడైన బాపిరాజుసంతతి అయినాపురమం దుండిరి. రెండవకుమారుడయిన యల్లమరాజుసంతతి చెదరి అనేకచోట్ల నుండిరి. వంశవృక్షమునుబట్టిచూడ యీవంశము 200 సం॥ నుండి యున్నటుల గాన్పించుచున్నది. ఈకుటుంబీకు లిప్పుడు అయినాపురము రామచంద్రపురముతా॥ఏరుఫలి, కృష్ణాజిల్లాలోని బందరు, బోలి. విశాఖపట్నముజిల్లాలో విశాఖపట్నం, విజయనగరము, గుడివాడ తాణాయిలాకా భోగిపాలెం నగయిరా గ్రామములయందు గలరు. పైగ్రామములలోనుండు వారిలో ఒకటి రెండు కుటుంబములవారికి మాత్రము పురుడు పుణ్యాము లున్నవి. పూర్వము మాకుటుంబమునం దొకరు ఉత్తరముననున్న కొంకణదేశమునకు జమీందారు అని మావంశవృక్షమునందు గలదు. ఇప్పుడచ్చట మావంశీకు లెవరయిన నుండిరో లేదో తెలియదు. అని రామచంద్రపురముతాలూకా కొమిరిపాలెమునుండి అయినాపురపు సుందరరామయ్యగారు డెలియబరచిరి. ఈసుందరరామయ్యగారు కవులు. వీరు ఊర్వశీశాపవిమోచనము- కృష్ణగోపికావిలాసము- పద్మిని- జయచంద్ర- చంద్రరేఖావిజయము- గర్వభంగము- భువనమోహిని- శ్రీ

కృష్ణవిలాసము- సుందరసునీతి మున్నగు గ్రంథము లనేకము రచించిరి. సోమేశ్వరరావుగారను మఱియొకరు నవరత్నచింతామణి- సతీఅనసూయ- ప్రమదామనోహరము- విచిత్రచిత్రమాల- ప్రహ్లాదపుండరీక- భోజరాజచరిత్ర మున్నగు గ్రంథములు రచించి ప్రచురించిరి.

ఈకుటుంబములోనివా రొకరు కొంతకాలమునకు పూర్వము అయినవప్రు అను గ్రామము వెళ్ళియుండుటచే వారైనవర్తివారని బిలువబడుచుండిరి. ఆవివర మయనవర్తివారి వంశచరిత్రమున కననగు. వీరి కనుశ్రుతముగా బొల్లాప్రగడవారితో సంబంధము గలదు.

సుందరరామయ్యపంతులుగా రూహించినటుల అయినాపురపు వారికి పూర్వ మింకొక యింటిపేరేదో యుండియుండును. క్రీ॥శ 1088 సంవత్సరమునకు పూర్వము కృష్ణ గోదావరిజిల్లాలలో బ్రాహ్మణకుటుంబము లుండినటుల నిదర్శనములు కనుపించవు. ఇచటివా రందరు కాశీనుండి పశ్చిమతీరముదరే హైదరాబాదులోని తెలంగనాప్రాంత్యమునుండి కడప, కర్నూలు, బళ్ళారిమీదుగా క్రమముగ కృష్ణ గోదావరి, విశాఖపట్నం ప్రాంత్యములకు వ్యాపించినటుల కనుపించుచున్నది- ముందు ప్రచురములగు వంశచరిత్రములు చదివిన పైసంగతులు వెల్లడి కాగలదు.

## శ్రీ పాదన్నవారు

ఆర్వేలనియోగులు. ఆపస్తంబులు. యజుర్వేదులు ఆత్రేయస గోత్రీకులు. ఆత్రేయ—అర్చనానస—శ్యావాస్య అన్నిత్యార్షేయము వీరి ప్రస్తుతనివాసస్థలము గోదావరిమండలములోని బొండాడ. వీరిలో కొందరు భీమవరమునందు కలరు. వీరి కీయింటిపే రెట్లువచ్చినదో వీరి అనాదికాపుర మెచటనో డెలియదు. ఇట్టిపేరు వచ్చినవారి మూ

లపురుషుడు ఎజ్జప్పగారు. ఈయన చాలాపరోపకారియును, దాతయు ని యు, వీరికి పూర్వము దేశపాండ్యా హోదా యుండెడిదనియు, అనంత రము కరిణీకములు సంపాదించి యీజిల్లాయందు స్థిరపడిరని చెప్పెదరు. ఈయజ్జప్పగారికి లింగరాజుగారను కుమారుడుగలడు. వీరు నివసించు బొండాడగ్రామముయొక్క పొలిమేరతగవులో యీయనను మధ్యవర్తి గా కోరుకొనుటచే యీయన ఆగ్రామ పొలిమేరచుట్టు తిరిగి హద్దుచే సిరట. ఈయన కిద్దరు కుమారులు. అందు పెద్దకుమారుడు బుచ్చివెం కటరాయుడు. ఈయనకు లక్ష్మీనృసింహం. ఈయనకృపవలననే బొం డాడగ్రామములోని శ్రీజనార్దనస్వామియొక్కయు, భోగేశ్వరస్వామి యొక్కయు ఆలయములు దురస్తు చేయించబడినవి. వీరు మంచి ఆస్తి పరులగుటచే మంచిపేరును సంపాదించిరి. వీరికుమారుడు విశ్వేశ్వర రావు. ఈయనకు వీరరాఘవరావు, కోటివరప్రసాదరావు, శ్రీరామ కోటేశ్వరరావుగారు అను ముగ్గురు కుమారులు గలరు. వీరు ప్రస్తుతము బొండాడలోనుండిరి.

లింగమూర్తిగారి రెండవకుమారుడు లక్ష్మీనారాయణరావు గారు. ఈయనకు భగవన్నారాయణరావు, ఈయన న్యాయశాస్త్రపరీ క్షయం దుత్తీర్ణులై భీమవరమునందు న్యాయవాదిగ నుండిరి. ఈయన కుమారుడు సూర్యనారాయణగారు. ఈకుటుంబమువారి కనుశ్రుతముగ కాళ్ళకూరివారు— చెన్నాప్రగడవారు— వడ్లమన్నాటివారు— అమిరపు దుగ్గిరాల— కృత్తివెంటి— కొండేపూడి— జీడిగుంట— సంపర— వెన్నేటి- మోచర్లవార్లతో సంబంధబాంధవ్యములు గలవు.

# నండూరివారు.

ఈ నండూరివారిలో ఆరువేలనియోగులు, ఆదిశైవులు, యాజ్ఞవల్క్యులు, శ్రీవైష్ణవులు అను నాలుగు తెగలవారుగలరు. ఇందు ఆర్వేలనియోగులలో, కాశిక, శ్రీవత్స- శాండిల్య- కౌండిన్య గార్గ్యగోత్రికులును- ఆది శైవులలో భారద్వాజగోత్రికులు- యాజ్ఞవల్క్యులలో కౌండిన్యగోత్రీకులు- వైష్ణవులలో విశ్వామిత్ర, కాశిక, కాశ్యపగోత్రికులును కనుపించుచున్నారు. నండూరివారు నాల్గువిధములని లోకప్రతీతికలదు. ఇట్లగుటకు గలకారణము నండూరివారిలో నాలుగుశాఖలుగలవనియా? లేక ఆర్వేలనియోగులలో నాలుగు గోత్రములుమాత్రమె గలవనియా; గోత్రములనుబట్టియే ఈ వాడుకవచ్చినదనిన ఆర్వేలనియోగులలో అయిదుగోత్రములు కనుపించుచున్నవి. బాపట్ల తాలూకా నండూరునందుండు నండూరివారు ఆర్వేలనియోగులేనా? వారిది కౌండిన్యగోత్రిమేనా? బాపట్ల తాలూకా పెదపాలెముకు ప్రస్తుత కరణములు నండూరి వారనియు, వారిది కౌండిన్యగోత్రిమనియు, వీరు ప్రథములనియు, కొండవీడు సామ్రాజ్యమున వ్రాయబడియున్నది. ఈ కారణమున నండూరివారిలో కౌండిన్యగోత్రికులు ప్రథములేమో; వెలనాట్లని కొండవీటి దండకవిలెలో వ్రాయుట పొరపాటై యుండెనేమోనని, సందేహించవలశి వచ్చుచున్నది. లేదా, కౌండిన్య గోత్రికులున్నటుల యిటువైపున తెలియకనో, కౌండిన్యస గోత్రీకులలో ప్రథములు ఆర్వేలవారుండుట గుర్తించక ఆగోత్రికులందరు ప్రథములేనని యనుకొనుటచేతనో, నండూరు నాలుగువిధములను ప్రతీతి యిటువైపులవిపరీతముగ వ్యాపించియున్నది. ఒకేగోత్రిము ఒకేయింటిపేరుగల బ్రాహ్మణులు వివిధశాఖలలో నుండుట తటస్థించునాయనిన, కశ్యప గోత్రికులగు కామరాజువారు ఆర్వేల నియోగుల

లోను, యాజ్ఞవల్క్యులలోనూ, అదేగోత్రముగల మరిపూడివారు, ఆ॥ నియోగులలోనూ, వైదికులలోనూ, కౌశికగోత్రికులగు చావలివారు నియోగులలోనూ, వైదికులల్లోను, నుండినటుల చరిత్రములు తెలుపుచున్నవి. గాన ఈ సందేహము బాపట్లతాలూకాలోని నండూరివారైన చెల్విన ముందుప్రచురించు గ్రంథమున సవరించుకొందుము.

## 1 కౌశిక గోత్రీకులు:--

వీరు ఆర్వేలనియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు: విశ్వామిత్ర అఘమర్షణ కౌశిక యనిత్రార్షేయము చెప్పుకొనుచున్నారు. పూర్వము రమణపరాజుగారనువారు మధ్యపరగణాలనుండి వచ్చినట్లు శ్రీ॥ శ పదకొండువందలప్రాంత్యమున ధనదుపురము రాజధానిగా రాజ్యమేలిన గొంకరాజు నొద్ద ఈ వంశీకులలో గోవిందన్నమంత్రిగా నుండెను. ఈ యన మనుమడగు గుండమంత్రికి కృతియిచ్చి రచించిన కేయూరబాహు చరిత్రమునందు మంచకవి యిట్లువర్ణించెను.

క॥ ఆవిభునకుఁ బ్రెగ్గడమై
భూవలయంబున యశో విభూషణుఁడయ్యెన్
గోవిందన ప్రధానుం
డావాసము కౌసికాన్వయంబన సిరికిన్.

ఈ యన కుమార్డు కొమ్మన– ఈ యన గొంకరాజు కుమారుడగు రాజేంద్రచోడవిభునియొద్ద మంత్రిగా నుండెను. ఆవివరమీదిగువ పద్యమునగననగు.

సీ॥ నవకోటి పరిమిత ద్రవిణమే భూపతి
భండారమున నెప్డుఁ బాయకుండు
నేకోన శతదంతు లేరాజునగరిలో
[illegible]

బలవేగరేఖ నల్వదివేల తురగంబు
లేనశేద్రుని వాగెనెపుడు దిరుగుఁ
బ్రతివాసరంబు డెబ్బది యేనుపుట్లనే
యేవిభుమందల నెపుడుగలుగు.

గీ॥ నట్టి శమధికవిభుఁడగు కులోత్తుంగ రా
జేంద్ర చోడనృపతి కిష్టసచివ
తంత్రముఖ్యుఁడనఁగు మంత్రిగోవింద నం
దనుఁడు కొమ్మనప్రధానుఁడొప్పు.

ఇట్టి మహదైశ్వర సంపన్నుఁడగు మహారాజుకడ మంత్రిగానుం డిన కీర్తిచంద్రుడగు నీ కొమ్మమంత్రి, కూర్మపురము- గుణభా త్రిపురము- క్రొత్తచర్ల- త్రిపురాంతకము- కొట్టియదొన- కళింగరా ష్ట్రములలోని యలమంచిలి మొదలగుస్థలములలో ముప్పదిరెండు విష్ణా లయములు కట్టించి ప్రతిష్ఠలుచేయుటయేగాక, నిత్యము వేయిమంది బ్రాహ్మణులకు పాయసము పంచదారతో భోజనముపెట్టుట జన్మవ్ర తముగా నడుపుకొనుటచే, 'గుణగరిష్ఠుడైన కొమ్మనపెగ్గడ బోలగలరె ధర్మపురుషులెందు' అనివర్ణించుటయే గాకరాజేంద్ర చోడుననుమతినిరు వది యొక్క-వేయి గ్రామములుగల పాకనాటిసీమను పరిపాలించి క్రొత్త చర్ల పరిసరప్రాంత్యమున నీతడు కటక సామంతులతోబోరినటుల నీదిగువపద్యము వ్రాసెను.

క॥ చలము మెయిఁ గటకసా మం
తులు గరిహయబహుళ సేనతోనే తేరన్
దలపడిమెఁ గొమ్మసచివుఁడు
బలియుండై క్రొత్తచర్ల పరిసరభూమిన్.

ఈ యుద్ధమునందీ కొమ్మనామాత్యుఁడు చూపిన యుద్ధనైపు ణ్యమును, మంచనకవి తన కేయూర బాహుచరిత్రమునం దతిమనోహర

ముగా వర్ణించియున్నాడు. ఆపద్యమిట్లున్నది.

సీ॥ నెలకట్టె వాటునఁ జెలగిరెంటినిమూటిఁ
గూడగుజ్జుంబులు గుదులుగ్రుచ్చు
బ్రితి మొగంబగు నరపతులకత్తళమునఁ
వడిమిమై వీఁపులు వెడలఁ బొడుచుఁ
బందంపు గొఱియల పగిదినేనుంగుల
ధారశుద్ధిగ నసిధారదునుముఁ
జదియించుఁ బగిలించుఁ జేతుల తీట వో
వడిఁగాండమేసి మావతులతలలు.

గీ॥ తలపుడికి వేసిమావంతు తలలు శత్రు
రాజశిరములు ద్రొక్కించు రాఁగిఁదిరుగ
వాగెనుబ్బెడు తనవారు వంబుచేత,
మహిత శౌర్యుండు కొమ్మనామాత్యవరుఁడు.

ఈ యనకుమారుడు కేతన. ఈ యన రాజేద్రిచోడుని కుమారుడగు పృథ్వీశరాజు నొద్ద మంత్రిగా నుండెను.

ఈ కేతనకు, బంధుజాత విజ్ఞాత వినీతభావుఁడన జాలిన కొమ్మనదండనాథుఁడు— తేజశ్శాలియగు మల్లశౌరి— సర్వసజ్జనప్రియుఁడగు భీమనప్రెగ్గడ, యను ముగ్గురు కుమాళ్లుకలిగిరి. ఈ భీమనామాత్యునకు కేతన దండనాథుడు, అత్యంత ధైర్యశాలియగు చినకేతనయు, గుండమంత్రియు కలిగిరి. ఈ గుండ మంత్రియొక్క దాతృత్వ మిట్లున్నట్లు చెప్పఁబడినది.

చ॥ నలువుగఁ గాకుళేశు తిరునాళులలోపల గుండమంత్రి ని
ర్మలమతిఁ బెట్టువేగముగ మాడలు రత్నచయంబుఁ జల్లఁగా
నలవసు హేమవృష్టి క్రియనర్థులు చాతక కోటిగాఁగలోఁ
గలగొన రాలుముత్యములు గాఁగఁబడున్ వడగండ్ల కైవడిన్.

ఈయన కనేకభాషలయందు పాండిత్యముగలదనియు అన్నిభాషలయందు వ్రాయను జదువను సమర్థతగలదనియు, అనేకవిద్యలయందీయనకు బుద్ధికుశలతగలదనియు, ఈయనమాటలు మిక్కిలిమృదువై వదన వికాసముతో గూడియుండుననియు, నిర్వంచకుడనియు వర్ణింపబడెను. ముప్పది యిద్దరుమంత్రుల చరిత్రలో వర్ణింపబడిన గుండమంత్రి ఈయనయే— ఈయన పైపద్యములో నుడివిన దాతృత్వ సంపదగలిగియుండుటచేతనే 'గురుజగత్రియదాన గురుమూర్తియైమించె నందూరి భీమన్న గుండమంత్రి.' అని ప్రసిద్ధినొందెను— ఈ వంశీకులలో కొందరు నూజవీడు— గొల్లపల్లి— మల్లవోలు— కానుమోలు—ఆరుగొలను-పుట్టచెరువు— జక్కులనెక్కలంలోనున్నారు. ఈ జక్కుల నెక్కలంలోనివారిలో కొందరు వైష్ణవమత ప్రవిష్టులైనారు. ఈ నందూరివారిలో ఒకశాఖవారు బసవరాజు వారైనారు. (ఆవివరముబసవరాజువారి చరిత్రలో వ్రాయబడినది). ఈ నందూరివారిలో గొల్లపల్లిలో నుండువారు నిలువుబొట్టు, గుడివాడవద్ద ఆరుగొల్లు అజ్జంపూడి— అడవినెక్కలం ఎల్లాపురములోనున్న కౌశిక గోత్రికులగు నందూరివారిది అడ్డబొట్టు నూజవీడు తాలూకా ఎల్లాపురములోని నందూరి రాజయ్యగారి కుమాళ్లు సీతయ్యగారు, వేదాంతదర్పణమను గ్రంథమురచించిరి. అయ్యది వారి సోదరులగు వెంకయ్యగారిచే 1893 లో ప్రచురింపబడినది—

వీరందరూ గుండమంత్రి వంశీకులమనియే చెప్పుచున్నారు. వీరికి గొల్లపల్లి, నున్నస్థలం పరగణాలకు దేశ పాండ్యాహోదాగలదు. కొందరు నైజాముయిలాకా మల్లవిల్లిలో దేశపాండ్యాలుగా నుండియున్నారు. సుదర్శనరావు గారనువారు నైజాము యిలాకా తహశీలుదారుగానుండి యిటీవల పెన్షపుచ్చుచ్చువా,రినాకిర్నుకు న్బొట్టు నందూరిఅడ్డ నున్నస్థలం దేశపాండ్యాహోదాయున్ను, ఆకునూరివారి చుట్ట

ములగు నండూరివారికి, నూజవీటివద్ద బాపుల పాడుగ్రామము మొఖాసాయను గలదు. వీరిని గొల్లపల్లి నండూరివారని పిలిచెదరు. వీరభద్రయ్యగారికి అజ్జంపూడి మొఖాసాగలదు. కాపురం అడవినెక్కలం వీరికి నుశృతముగాపెనమకూరివారు-కలపర్తివారు-పూరగర్ణంవారు.మల్లాప్రగడ-చాట్రాతివారు- గొల్లనపల్లి-ప్రత్తిపాటి-భావరాజు- గోవిందరాజు-దామరాజు- వామరాజు-కూరాడవారు-దాసువారు-పెనమకూరు-పింగళి-మెట్లపల్లి- పర్వతం- రామాప్రగడమున్నగు కుటుంబముల వారితో సంబంధమ్లు గలవు. గుండమంత్రి చరిత్ర ముప్పదియిద్దరు మంత్రుల చరిత్రలలో విపులముగా గలదు. ప్రాత్యలిఖిత పుస్తక భాండాగారాధ్యక్షులు. టి. క్యా—137 పుటల్లో ఈ గుండయ్య ప్రగ్గడనుగూర్చి ఈ దిగువ విధముగ ప్రచురించిరి.

## కృతిపతివిషయము.

'ధనదుపురము రాజధానిగా రాజ్యమేలిన గొంకరాజునకు గాత మాన్వయుడు గోవిందన ప్రెగ్గడగానుండెను. ఈ తని కుమార్డు కొమ్మన— ఈ తడు గొంకరాజుకుమారుడగు రాజేంద్ర చోడనిభునకుఁ బ్రెగ్గడగానుండెను. రాంజేంద్రచోడుని ధనాగారమున నెల్లపుడును దొమ్మిదికోట్ల ధనముండెడిది. తొంబదితొమ్మిది యేన్గులు, పదివేల గుర్రములుండెడివి. ఆల మందలనుండి 75 పుట్లనేయి ప్రతిదినమును జేకురుచుండెడిది. కొమ్మనమంత్రి కూర్మగ్రామమున, గుడభాత్రీపురమున, క్రొత్తచర్ల పురమున, త్రిపురాంతకమునందు, కొట్టెయదొనపురమున, కళింగ రాష్ట్రములోని యలమంచిలి, 'మొదలగుస్థలములందు 32 విష్ణుప్రతిష్ఠలు జేసెను. రాజేంద్రచోడు ననుమతిచొప్పున 21 వేల గ్రామములతోఁ గూడిన పాకనాటి సీమను ఈ కొమ్మన పరిపాలించెను. క్రొత్తచర్ల చెంత సితేఁడు కటకసామంతులతోఁ దలపడి పోరొనర్చెను.

గొమ్మనప్రెగ్గడకుమారుఁడు కేతనపెగ్గడ— ఈ తఁడు రాజేంద్రచోళుని కుమారుఁడగు పృథ్వీశరాజునకు మంత్రి. ఈ కేతన ప్రెగ్గడకు గొమ్మన దండనాథుండు, మల్లశౌరి, భీమనపెగ్గడయనువారు పుత్రులు— భీమన పెగ్గడభార్య పోలమాంబ— వీరికి కేతన— చినకేతన— గుండనయను వారు ముగ్గురుపుత్రులు. వీరిలో గుండయపెగ్గడ, యేతత్కృతినాథుండు. ఈ కథాసందర్భములగు పద్యములను పైనుదహరించితిని.

అతిశయోక్తియో నిజమోకాని గుండనామాత్యుని నగరమగు ధనదపురమిట్లు వర్ణింపబడినది.

గీ॥ మంటికడవ, నులక మంచంబు, పూసెల్లు,
నూలిచీర, రత్నకీలితంబు
కానితొడవుఁ బుడమిఁగలుగు టెఱుంగరు
ధనదుపురములోని జనములెల్ల.

2 శ్రీవత్స గోత్రీకులగు నండూరివారు.:—

ఈ గోత్రీకులు భార్గవ,చ్యవన, అప్నువాన, ఔరవ, జామదగ్ని యని పంచార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరి అనాది కాపురము గోదావరి మండలములోని ద్రాక్షారామము వద్దనుండు రామచంద్రపురంతాలూకా వెంటూరు. అనంతరము వీరు కాకినాడ, ఇరగవరము, పాలతోడు, వేమగిరి, తాపేశ్వరము వగయిరా గ్రామములలో నున్నారు. ఈ వంశీకులలో కామమంత్రి ప్రసిద్ధపురుషుఁడు. ఈ యన ప్రేరణముచేతనే ఏనుగులక్ష్మణకవి వెంటూరి సోమనాథునికి కృతియిచ్చి జాహ్నవ మహాత్మ్యము అను గ్రంథమును రచించెను. అందు నండూరి కామమంత్రి 'జగనొబ్బగండ' 'రాయవేశ్యా భుజంగా'ది బిరుదులతో రాజమహేంద్రవర దుర్గాధిపతులగు వారి వంశమునబుట్టి చిరకాలము కాకినాడ— శలపాకసీమలదండనాథుఁడై పరిపాలించెనని చెప్పుచూ ఈ యన తాతముత్తాతలొనరించిన దానధర్మములు, సంపాదించిన

బిరుదులు, మున్నగునవి వర్ణించెను. ఈ గ్రంథము క్రీ॥ శ 1730 ప్రాంత్యమున రచింపబడినటుల కవుల చరిత్రకారులు నిర్ధారణచేసిరి. ఇటివల క్రీ॥ శ 1816 వ సంవత్సరమున ఈ వంశీకులలోని బాపిరాజుగారు విఘ్నేశ్వరచరిత్రము అను గ్రంథమును రచించి వెంటూరి సోమేశ్వరుని కంకితముచేసిరి. ఈ సోమేశ్వరస్వామి తన స్వప్నమునందు కను పడి తాను రచించుగ్రంథమును కృతినీయగోరినట్టు చెప్పినపద్యములో తాను జాహ్నవీ మాహాత్మ్యగ్రంథ ప్రేరకుడగు నందూరి కామరాజు సంబంధీకుడైనటుల నీదిగువ పద్యములో చెప్పుకొనెను.

సీ॥ నీతాతతండ్రి లోకాతీత విశదవి
ఖ్యాత యశస్కుండు కామరాజు
నీతాత భూసుర నివహబంధు వ్రాత
పరిపోషణుండు బాపప్రధాని
నీతండ్రిసేతుకా శీతలమధ్య భూ
విభు సభాపూజ్యుండు వేంకమంత్రి
నీతల్లి భువనవర్ణిత దాన ధర్మ పవి
పూత గుణాలంబ బుచ్చమాంబ

గీ॥ నీవనేక భవార్జిత నిర్మలాస్మ
దీయపదభక్తి సంజాత దివ్య సుకృత
వాసనా వాసితుండవు శ్రీవత్సగోత్ర
పావనుడ వెన్న నందూరి బాపమంత్రి.

అని సంబోధించెనని చెప్పుటచేతను, ఈ రెండుగ్రంథముల నడిమికాలము నూరు సంవత్సరములగుటచేతను, ఆకామయ్యగారే బాపయ్యగారి తాతగారి తండ్రియనుటకు సందేహముండదు. ఈ పాపయ్యగారి సంతతి వారిలో రామచంద్రపురముతాలూకా వెంటూరునందు నందూరి వీరరాజుగారి కుటుంబము వారున్నారు. బాపమంత్రి రచించి

విఘ్నేశ్వర చరిత్ర తాళపత్రగ్రంథము పులిపాక వెంకటరావు గారియొ ద్దగలదట. ఇయ్యది శా॥ 1739 ఈశ్వరలో అనగా ఆక 1816 లో రచింపబడినట్లు చెప్పెదరు. ఈ వంశీకులలోని వారగు మూర్తిరాజు కవిగారు కాకినాడయందుండి యున్నారు. ఈ యన సోమరాజుగారి కుమారుడు. వీరికాపురస్థలము రామచంద్రపురం తాలూకా పాల తోడు. వీరు బి. ఏ. పరీక్షయందు కృతార్థులై చాలగ్రంథములను రచించిరి.

క్రీ॥శ 1856 లో మిక్కిలి మల్లికార్జున కవి రచించిన విప్ర మార్కండేయ చరిత్రమును, ఏనుగు లక్ష్మణ కవిరచించిన జాహ్నవీ మాహా త్మ్య ప్రోత్సాహ కర్తయగు కామమంత్రి మునిమనుమడగు కామ మంత్రికి కృతియిచ్చినటుల శతకకవుల గ్రంథకర్తలు వ్రాయుచున్నారు ఈ కామమంత్రి విఘ్నేశ్వరచరిత్ర రచించినసంభూరి బాపయామాత్యుని సోదరుడో కుమారుడో కావలెను. పైగ్రామములలోనుండు శ్రీవత్స గోత్రికులందరు వీరికి సంబంధీకులే. ఈ కుటుంబమువారికి అనువ్ర తముగా బుద్ధిరాజు- పోతాప్రగడ- బంధకవి- పాలకోడేటి- వెలిచే టి- అక్కిన ప్రెగడ- గోటేటి- కేశిరాజు- అత్తిలి- అయ్యగారి- అడవి- పెమ్మరాజు- సత్తిరాజు- కొవ్వలి- చామర్తి- పెద్దాడ-కోమ రగిరి- బలిజేపల్లి మున్నగు కుటుంబముల వారితో సంబంధములుగలవు. మెనుబది సంవత్సరములకు పూర్వము ఇరగవరములో నుండు కృష్ణ య్యగారు. మయ్యగారు- ప్లగుమగారు చాలా ప్రఖ్యాతిపురుషు లుగా గణనకెక్కిరి. సంభూరి అచ్చుతరామయ్యగారి కుటుంబమువారు అమలాపురము తాలూకా ఊబలంకయందున్నారు. పాలకోడుకా పురస్థులగు సోమరాజుగారి కుమార్డు మూర్తిరాజుగారు పలు భాషా గ్రంథము లనేకములు భాషాంతరీకరించుటయేగాక రామానందమను నాటకమొకటి నూతనముగ రచించిరి. ప్రస్తుతపువారిలో సంభూరి

శ్రీరాములుగారు పాల శంకరము మున్నగువారనేకులు ప్రాణ విద్యా
సంపన్నులుగలరు. నండూరి వారిలో శ్రీరాములు గారనువారు స్వ
విద్యా సంపన్నులై కొవ్వూరునందుపాధ్యాయులుగా నున్నారు. వెంకట
సుబ్బారావుగారను వారు భావకవిత్వమునందు పేరుపొందిరి. వీరు
చించిన వెంకిపాటలను గ్రంథము చదివి అనేకులానందించుచుండిరి.
ఈ గ్రంథప్రాశస్త్యము వినుటయేగానికనుభాగ్యము లభింపమిచే అందలి
పాటలెట్టివో మా చదువరులుచూచి యానందించుట కిందుదాహరింప
లేకపోతిమి. ఈ వంశవివరము లింకను డెలియవలసి యున్నవి. ముందు
దు తెలియవచ్చినవి గ్రంథము ముద్రించునపుడు చేర్చిప్రచురించెదము.

శ్రీ కౌండిన్య గోత్రికుల గు నండూరి వారు:—
ఆర్వేలనియోగులు— ఆపస్తంబులు— యజుర్వేదులు ఈ గోత్రికులలో
కొందరు కశ్యప— దైవల— అసితయనియు— శాశ్యప— అవత్సార
శాండిల్య అనియు రెండువిధములుగ ప్రవర చెప్పుకొనుచున్నారు.
వీరి అనాది కాపుర మెచటనోగాని ఈ కుటుంబములోని. వారిలో కొం
దరు గోదావరి జిల్లా తణుకుతాలూకా చెరుకువాడ— చెరుకువాడ
ము— అను గ్రామములలో రెండుకుటుంబముల వారున్నారు. వీరికి
శ్రీవత్స గోత్రము కాకపోయినను ఈ శాండిల్య గోత్రికులగు నండూరి
వారికి శ్రీ వత్స గోత్రికులగు ఏకకుటుంబమువారితోనూ సంబంధబాంధ
వ్యములు లేవు. ఈ వంశీకుల నెవరినడగినను "మాకు శ్రీ వత్సగో
త్రికులకు" సంబంధములు లేవనెదరుగాని కారణము చెప్పజాలకున్నా
రు. నండూరివారిలో శ్రీవత్స గోత్రీకులుండుటచే ఈ శాండిల్య గోత్రి
కుల వంశము నిస్సంతైన కాలమునందెప్పుడో శ్రీ వత్స గోత్రికులైన
నండూరివారి పిల్లవానిని దత్తతజేసుకొని యుండవచ్చుననియు, ఆకారణ
మున శ్రీ వత్స గోత్రీకుల సంబంధములు నషేధించి యుండవచ్చుననియు
యు నూహించుచున్నాము. వీరికి మద్దులపాటివారితోనూ, పరకాల

రితోనూ, సత్తిరాజువారితోనూ అను శ్రుతముగా సంబంధబాంధవ్య ములగలవు. ఏ గోత్రీకులోగాని నండూరి కనకయ్యగారనువారు భాగవ తకలాపమను గ్రంథము రచించిరి. బహుశా వీరు కొమ్మేటిపాడు నందుండు నండూరి బుచ్చిరాజుగారి కుటుంబముకు చేరినవారై యుం దురు.

గార్గ్య గోత్రీకులగు నండూరివారు:—

ఆర్వేలనియోగులు— అపస్తంబులు— యజుర్వేదులు— గార్గేయ గోత్రీకులు— వీరిలో కొందరు ఆంగీరస— సైన్య— గార్గ్యయని త్ర్యా ర్షేయము మరికొందరు ఆంగీరస— బార్హస్పత్య— భారద్వాజ— గార్గ్య శైన్యయని పంచార్షేయమును చెప్పుకొనుచున్నారు.

బాపట్ల తాలూకా పొన్నూరు అను గ్రామమున కాశీభట్లు అను బ్రాహ్మణుని తోబుట్టువ నండూరివారి కోడలు— ఈ మెకుగూనె గోవిందులని చిన్నతనముననె గూనుతోనున్న కుమార్డు పుట్టెను ఈ య నకెవ్వరూ పిల్లనీయలేదు. కాశీభొట్లకు పిల్లలులేక కొంతకాలమునకు బిమ్మట తన మేనల్లునితో కాశీయాత్రకు వెల్లెను. అచట గంగాస్నా నము చెయుసమయమున తనకు కుమార్తెకలిగిన మాగూనెగోవిందున కిచ్చి పెండ్లి చేసెదనని గంగాభవానికి మ్రొక్కుకొనుట వినినతోడనే ఆగూనెగోవిందు తన మామగారి నోటివెంట వెడలినమాటలు ధృవపర చుట కచటిగుడియందుండిన భావన్నారాయణస్వామిని, తత్సమీపము నందలి వృక్షములను సాక్ష్యము పెట్టెను కొంతకాలమునకు బిమ్మట కాశీభట్లకు ఆడపిల్లకలిగెను. అనంతరమాపిల్లను గూనెగోవిందునకిచ్చు టకు నిరాకరించగా నాడుగంగయొద్దున తన మామగారనిన మాటలను ధృవపరచుటకు సాక్ష్యముపెట్టుకొనిన సాక్షులను ప్రార్థించగా నాటి రాత్రి కలలో కాశీభట్టునకు శ్రీభావన్నారాయణస్వామి ప్రత్యక్షమై తనకుమార్తెను గూనెగోవిందునకిచ్చునటుల నిర్బంధించటచే ఆబ్రాహ్మణు

బావిన్లను మేనల్లునకిచ్చి పెండ్లిచేసెను ఈ మాటవిని ఆ ప్రదేశము రాజ్యముచేయుచున్న కుళోత్తుంగ భోఘునివల్ల క్రీ॥ శ 1119 లో ఆ ప్రదేశము నందు భావన్నారాయణస్వామివారి ఆలయము కట్టించబడినది అనువృత్తాంతము కృష్ణాజిల్లా మాన్యూలునందున్నది.

ఈ గూనెగోవిందు ఏగోత్రీకుడో వీరి సంతతి వారెవరో తెలియుటలేదు గాని కొండపేటి సామ్రాజ్య గ్రంథమునందు బాపట్ల తాలూకా యిటికంపాడులోని నండూరివారిది గార్గేయసగోత్రమని కొండపేటి దండకవిలే యందు ఉన్నటుల ప్రచురించుటచే ఆతాలూకా యిటికంపాడు సమీపవృత్తాంతమగుటచే ఈ గూనె గోవిందు గార్గ్య గోత్రీకులైయుందురని ఆవృత్తాంతమిచట నుదహరించితినిగాన అట్టునైన పూర్వాపరములైన ఇంకలిసత్యమును దెలుపుడు చాయగోరుచున్నాను.

## కౌండిన్య గోత్రీకులు:—

ఈ గోత్రీకులగు ఆర్వేలనియోగులకు గోపరాజు రామప్రధాని కాలములో బాపట్లతాలూకా నండూరు గ్రామముకు సంప్రతి కరణీకము ఇప్పించబడినటుల కొండపేటి దండకవిలె యందు గలదు. యిటీవల ప్రచురింపబడిన కొండపేటి సామ్రాజ్యమునందును— బాపట్ల తాలూకా నండూరుకు ఆర్వేలనియోగులు కౌండిన్య గోత్రులు అని యున్నది. నాయొద్దనున్న కొండపేటి దండకవిలి యొక్క 4—5 ప్రతులలో నండూరుకు వెల— భారద్వాజ వెల— కౌండిన్యఅని వ్రాయబడియున్నది. ఇందు భారద్వాజ గోత్రకుల యింటిపేరు అన్నంరాజువారనియు. కౌండిన్య గోత్రకుల యింటిపేరు నండూరి వారనియు స్పష్టపరచినగాని ప్రస్తుతము నండూరుకు కరణములుగా నున్నవారు కౌండిన్య గోత్రీకులగు ప్రస్తుతము లేదేమో అని సందేహము కలుగుచున్నది. అట్లుకానివో నండూరి వారి వంశములకు కీ భంగమువచ్చుచున్నది.

## నండూరివారిలో యాజ్ఞవల్క్యులు:—

కౌండిన్య గోత్రీకులు బాపట్ల తాల్లూకా పెదపాలెము కరణము లుగా నున్నారు ఈ వంశీకులలో సూర్య ప్రకాశరావుగారి కుటుంబము విశాఖపట్టణము జిల్లా జోడుగియందున్నట్లు తెలియుచున్నది తూర్పు కనుండు వారిలో విజయ రామయ్యగారనువారు దాతలనియు, విజయ గోపాలరావుగారు పాలేపల్లి కాపురస్తులనియు వీరు కవులనియు, వీరి గోత్రము శ్రీవత్సమో లేక కాశ్యప మైయుండుసని చిరకాలముక్రిం దట భీముని పట్నమునసుండిన అయ్యగారి కృష్ణమూర్తి పంతులు గారు వ్రాసి బంపిరి.

## నండూరి. వారిలో వైష్ణవులు:—

వీరిది విశ్వామిత్ర గోత్రము. వీరిలో వీరరాఘవా చార్యులు గారి కుటుంబము రామచంద్ర పురము తాలూకా కొత్తకోటయందును కాశిక గోత్రీకులగు శేషాచార్యులుగారి కుటుంబము కృష్ణాజిల్లా కోను మోలునందు గలవనియు, నరసింహాచార్యులుగారి కుమారుడు సంగీతము నందు సాహిత్యమునందు ప్రవీణుగా నుండెనసియు, ఈ వైష్ణవులలో కాశ్యప గోత్రికులు కూడ గలరనియు, వీరు గోదావరి జిల్లా తణు కుగ్రామమునందు గలరనియు వీరికి సాతులూరివారు చుట్టములనియు వలురకముల చరిత్రలు వినవచ్చినవి గాని నండూరివారిలో యాజ్ఞ వల్క్యులు, వైష్ణవులయొక్క సరియగు చరిత్రలు తెలియలేదు గాన యిప్పుడైనను బుద్ధివంతులేరైన సమగ్రమగు చరిత్ర వ్రాసి పంపెదర నినమ్మెదను. లేనిచో నండూరి నాల్గు విధములనుటకంటెనానా విధము లనుట మేలేమోనని తోచుచున్నది.

## ఉలిచివారు.

ఆశ్వలాయనినియోగులు ఆపస్తంబులు, యజుర్వేదులు, హరితసగోత్రి కులు, వీరు హరిత, అంగీరస, అంబరీష యని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. ఈ గోత్రికులకు హరితఋషి ప్రవరయందు చెప్పగూడదని చెప్పబడినను చాలామంది హరితఋషిని చెప్పుచున్నారు. యజుర్వేదులుగానుండు గృహస్థులయందిట్టి ప్రవరసకృతుగా కనుపించుచున్నది గాని ఋగ్వేదులుగానుండు వారు చాలమంది హరితఋషినికూడాకలిపి చెప్పుచున్నారు హరితస గోత్రికుల ప్రవర భ్రంశ విషయ ముపోద్ఘాతమున వ్రాయబడినది. ఉల్చివారి విషయము— ఈ కుటుంబమువారి పూర్వపుపేరు రంపాలవారు. దాదాపుగ 200 సంవత్సరములకిత్రము వీరెచటినుంచివచ్చిరోగాని— ఒంగోలు తాలూకా ఉల్చి వచ్చిచేరిన వారిని ఉల్చివారనియు. చేజర్లలోనిలచిన వారికి చేజర్లవారనియు పేర్లువచ్చినవి. రంపాలవారని పిలువబడువారిపు డెచటనుండిరోగాని ప్రారంభములో ఉల్చిచేరినవారిపుడు ఉల్చియందు, ఒంగవోలు, బెజవాడ తాలూకా పెదవడ్లపూడి— బాపట్ల తాలూకా పేరాల— వాడరేవు— కర్నూలు జల్లాలోని పత్తికొండయందును—చిత్తూరు జిల్లాలోను—తిరుపతి సమీపమున చాలా కుటుంబములుగలవు—వీరాకనుశ్రుతముగారామచంద్రినిరు. వారురావులపాటివారు, చుండివారు, ఘాలివారు, నేలటూరివారు, బద్దెపూడివారుచిలకపాటివారు, పాలపర్తివారు, పొందూరివారు, రాచపూడివారు, కారుమూరివారు, బిట్రగుంటవారు, మునెపల్లి వారితోనూసంబంధముగలవు. వీరిలో సిద్ధయ్యపంతులుగారు సుప్రసిద్ధులగు శ్రీరామభక్తాగ్రేసరులు. ముప్పదినాలుగేండ్లు ఏకదీక్షగా లక్ష్మీదేవి నుద్దేసించి శుక్రవారపు పూజచేయించి నాటిదినమొక బ్రాహ్మణునకు ముత్తైదువకు షడ్రసోపేతముగా భోజనము పెట్టి సదక్షిణతాంబూలములతో సత్కరించిన నియోగివంశభూష

ణుఁడు, ఈ యన పద్ధతి నియోగి. ఈ యన అనేకగౌరవోద్యోగములు చేసి తుదకు శ్రీరామ సప్తాహదీక్షబూని తత్కార్యనిమగ్నులై తమ 72 వ ఏట భౌతికశరీరత్యాగులైరి. వీరిఅనంతరము వీరిదౌహిత్రు లగు బద్దెపూడి రాధాకృష్ణమూర్తికవి వీరిస్మృతినిగూర్చి ఒకగ్రంథము పద్యకావ్యముగ రచించిరటగాని అదిఅచ్చుపడినట్లు తోచదు. ఆ పిచ్చయ్యగారి కుటుంబమువారిపుడు బాపట్లతాలూకా పేరాలయందుగలరు. అనివాడరేవునుండి ఉలిచి లక్ష్మినారాయణగారు దెలియపరచిరి.

## తిరుమల పెద్దింటివారు

వీరువైఖానసులు, యజుర్వేదులు, భారద్వాజగోత్రికులు. ఆంగీరస బార్హస్పత్య భారద్వాజ యని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. ఈకుటుంబముచారు కృష్ణ, గుంటూరు, విశాఖపట్నము జిల్లాలలో నివసించుచున్నారు. వీరిలో సంపత్కుమార వెంకటాచార్యులుగారు గొప్ప పండితులు. కవిశేఖరుఁడు. గోగులపాటి కూర్మనాథకవిగారీయన శిష్యుడు. ఆయన రచించిన "మృత్యుంజయవిలాస" మునందీ వెంకటాచార్యులుగారిని గూర్చి యిట్లు చెప్పెను.

ద్విపద. శ్రీసింహాభూధర శ్రీరామతీర్థ
భాసురస్థలముఖ్య బహుదేశములకు
నాచార్యు లుభయ వేదాంత రహస్య
ధీచాతురాత్ములు తిరుమలవంశ
కలశాంబురాశి రాకాచంద్రమూర్తి
సలలిత పెద్దింటి సంపత్కుమార
శ్రీవేంకటార్య దేశికుల శిష్యుఁడను.



అని చెప్పుటవలన వీరు విశాఖపట్నము జిల్లాలోని సింహాచలము

క్షామక్షేత్రములను పరిదేశపువారుగా తోచుచున్నది. వీరిలో కోనయ్యగారను మఱియొకపండితులు గలరు. బందరువాస్తవ్యులగు కాన్కొలను వేంకటదాసుగారు రచించిన "శ్రీకృష్ణనాటకమను" యక్షగాన ప్రబంధమున కోనయ్యగారి నిట్లు వర్ణించెను.

సీ॥ సద్భరద్వాజ వంశాబ్ధి సుధాకరు
కరుణాంతరంగు రంగద్విశేషు
శేషత్వ దీపక శ్రీనివాసాత్మ సంభవు
భవచకిత మద్భావవాసు
వాసుదేవస్వరూప కథామృతాసారు
సారార్థ పంచక జ్ఞానమహితు
హితరహస్య త్రయిగలి బోధకాసము
సమధిక శృతియు గాంచ న్నిశాంతు
శాంత సౌశీల్య వాత్సల్య శమదమాది
సద్గుణానందు నందాత్మ జాత్మకగురు
గురిగ తిరుమల పెద్దింటి కోనసార్యు
పదయుగము మత్కులధనము మది భజింతు.

అని చెప్పుటచే వీరు కృష్ణాజిల్లాలోని బందరువైదికులవారుగా వచ్చును. ఇంతకంటె వీరివంశచరిత్ర తెలియలేదు. తెలిసినవారెవరైన వ్రాసి పంపినచో ముందు ముద్రించు గ్రంథమున జేర్చెదను!

## బంకుపల్లెవారు

ఆరామద్రావిడ శాఖాబ్రాహ్మణులు. యజుర్వేదులు. ఆపస్తంబసూత్రము. భారద్వాజసగోత్రులు. ఆంగీరస, బార్హస్పత్య భారద్వాజ అని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరి పూర్వులు

కాపురము టెక్కలితాలూకా సంతబొమ్మాళి. అనంతరం ఉర్లాం, పురుషోత్తపురం, గుగ్గిల, ఘాటీలకమ్మపురం, బుసినిడి. ముఖలింగం, సత్యవరము అనే గంజాముజిల్లా గ్రామములలోను, కాగాం, మిడి ఛాం, నీలంపేట అను విశాఖపట్టణపుజిల్లా గ్రామములలోను యీ యింటిపేరుగలవా రున్నారు! వీరి కనుశృతముగా తేనేటి వారు, మా మిడూరువారు, బూరాడవారితోను సంబంధములు గలవు. వీరుగాక ఉపమన్యు, శఠమర్షణ, కౌండిన్య, ఆత్రేయ గోత్రులతోకూడా సంబం ధములు చేయుచున్నారు రావివలస– కోటబొమ్మాళి, పర్లాకిమిడి, శింగుపురము, సత్యవరము, సైలాడ మొదలగు గంజాముజిల్లాలోని, పారంపేట, రావివలస, బొబ్బిలి మున్నగు విశాఖపట్నంగ్రామముల యందు వీరి బంధుగు లున్నారు. ఈకుటుంబీకులలో బంకుపల్లె సూ ర్యనారాయణ సిద్ధాంతిగారు పదిసంవత్సరములు సోపాడలోనుండి పం చాంగ మడుద్దరించిరి. తుదకీయన సోపాడయందే గతించిరి.

వీరిలో రెండుకుటుంబములవారు చాలాతరములనుండి పర్లాకి మిడియందుండి యుండిరి. వెంకటనృశింహ సిద్ధాంతిగారు ఉర్లాంసంస్థా న సిద్ధాంతి. పురుషోత్తపురములోని కామశాస్త్రుర్లుగారు తర్క ము, సాహిత్యము చక్కగా నభ్యసించి, సంస్కృతపురాణములు చెప్పు చుండెడివారు. ప్రస్తుతపువారిలో మల్లయ్యశాస్త్రిగారు గొప్ప పండి తులు. ఉర్లామసంస్థాన విద్వాంసులగు శ్రీశ్రీ భళ్ళమూడి లక్ష్మణ శాస్త్రిలవారివద్ద కావ్యపంచకము వారిసోదరులగు వెంకటశాస్త్రిల వారియొద్ద నైషధశాకుంతలములు. తునిలోని శ్రీ పరవస్తు మహామ హోపాధ్యాయ వెంకటరంగాచార్యులుగారియొద్ద సిద్ధాంతకౌముది చది విరి. వీరు ఉర్లాము సంస్థాన శ్రావణి పరీక్షలో కృతార్థులై, వార్షిక ము సంపాదించుకొనిరి. అనంతరము శ్రీకూర్మములో సౌమూరి వెం కటశాస్త్రిలుగారియొద్ద శేఖరాంతగ్రంథములు చదివి, మున్నగు కూ రెళ్ళ

సూర్యనారాయణ శాస్త్రులవారియొద్ద ముక్తావళివరకు తర్కప్రకరణము చదివినారు. అనంతరము రెండుసంవత్సరముల కాలము శ్రీకాకుళములో ఆంధ్రపండితులుగ నుండిరి. అనంతరము శ్రీపర్లాకిమిడిరాజాగారి కళాశాలలో ప్రధానాంధ్ర పండితులుగానుండి యిరువదియెనిమిది సంవత్సరములచట పనిచేసి పూర్వోత్తర మీమాంసా ధర్మశాస్త్రములు పెద్దలవల్ల తెలిసికొని, అనంతరము కలకత్తాయందు జరిగిన కావ్యతీర్థ పరీక్షయం దుత్తీర్ణులై సంస్కృత ప్రధానోపాధ్యాయులై యేబది నాలుగవయేట కళాశాలలో ఉపకారవేతనము పుచ్చుకొని, స్వస్థలమగు ఉర్లాముచేరి. శారదావివాహ శాసనమునుగూర్చియు అస్పృశ్యతనుగూర్చియు, అప్రాంత్యముల ప్రచారముచేయుటయేగాక అక్షత పునర్వివాహ మశాస్త్రీయము కాదనియు, దేశమున కుదాహరణ పూర్వకముగ యట్టి వివాహ మొకటి తమయింటనేచేసి చూపిరి. శారదాశాసనము అస్పృశ్యతనుగూర్చి శాస్త్రుల్లవారు రచించిన గ్రంథములచ్చుపడినవి గాని, "వివాహతత్త్వము"ను గూర్చి వ్రాసిన గ్రంథ మచ్చుబడుచున్నటుల తెలసినది. ఈవంశీకులలో సత్యనారాయణ రావుగారనువారు సంగ్రహరామాయణము, రాజవీధి యను గ్రంథములు రచించిరి. వీరును పర్లాకిమిడి కాపురస్థులే. మల్లయ్యశాస్త్రుర్లుగారు శ్రీకృష్ణచైతన్యచరిత్రము,రుక్మిణీకళ్యాణనాటకము రచించిరి.

## ఏనుగువారు

ఆర్వేలనియోగులు ఆపస్తంబులు యజుర్వేదులు, వాధూల గోత్రీకులు. భార్గవ వీతహవ్య సావేత అని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. అనాదికాపురము గోదావరిజిల్లా పెద్దాపురము సంస్థానములోని పెద్దాడగ్రామము. వీరింటిపేరు పూర్వము పైడిపాటివారు కందుకూరుజిల్లాలో [illegible] అచట పైడిపాటియను స్వగ్రామము గలదు.

పాటివారిది శతమర్షణ గోత్రము. ఆవివరము పైడిపాటివారి చరిత్రయందు వ్రాయబడినది. ఈపైడిపాడు యనునది యచ్చటిదో యీ కుటుంబమువా రిటువైపుల కెపుడువచ్చిరో తెలియదు. ఈవంశము వారి మూలపురుషుడు సింగన. ఈయన కెన్నవతరమువాఁడో జల పాలమంత్రి. ఈయనకు శ్రీ పెద్దాపుర సంస్థానాధీశ్వరులై న శ్రీ వత్సవాయ గజపతి రాజుగారొక ఏనుగను, సోమేశ్వరాగ్రహారమును బహుమతిచేయుటచే వీరింటిపేరు ఏనుగువారుగా మారినదట. ఆవివ రము ఏనుగు లక్ష్మణకవి యీక్రిందిపద్యమున చెప్పెను.

సీ॥ పరమేష్టితుల్య ప్రభావుండు వాధూలుఁడను
మునీంద్రుండొప్పు ననఘమూర్తి
యమ్మునినాథు వంశమ్మను క్షీరాంబునిధి
సుధాకరుఁడు జన్మించినట్లు
ప్రభవించె శ్రీపైఁడిపాటి సింగనమంత్రి
వంశాగ్రగణ్యుఁడై వరలు నతని
మహిత సంతాన క్రమంబున జలపాల
సచివుఁడొప్పె బలారి సచివసముఁడు
గీ॥ గజపతి క్షితిభర్తచే గజముతోడ
నగ్రహారం బితండు పరిగ్రహించె
నెలమి నేనుగువారన్న యింటిపేరు
గలిగె నతనికి సకలార్థ కలనములను!

ఈజలపాలమంత్రి "గజపతి దత్త సోమేశ్వరాగ్రహార శాసనము" గా వర్ణించెను. ఈయన కుమారుడు గరికరాజు. ఆయనకు సుబ్బ మూర్తి, సుబ్రాజు అని యిద్దరు కుమారులు. అందు సుబ్రాజునకు లక్ష్మణమంత్రి పుట్టెను. ఈయన గొప్పకవి గా నీక్రిందిపద్యములో చెప్పబడెను.

ఉ॥ దండి మనోజ్ఞశబ్దకవితాధురిచే నుపమా సమృద్ధిచే
రెండవకాళిదాసు రసరీతి తరంగితసూక్తి సత్కవీం
ద్రుండని ధీరు లెంచగ గృతుల్ రచియించిన ధన్యునిన్ మహా
పండితమాన్యు లెన్నఁదగు భాజితసూర్యుని లక్ష్మణార్యునిన్.

ఈయన ద్రౌపతీపరిణయము, ధ్రువచరిత్ర, తులామాహాత్మ్యము అను కృతుల రచించి పెద్దాపురము సంస్థానాధీశ్వరులకు కృతి యిచ్చుటచే 20 పుట్లభూమి, తురగ, మణి, భూషణాంబర ఆందోళికాది సత్కృత్యులనంది పెద్దాపుర శాసనుడుగా చాయబడెను. ఈయనకు తిమ్మరాజు, గురురాజు అను యిద్దరు కుమాళ్ళుగలరు. పెద్దవాడగు తిమ్మరాజును మాచిరాజు నరసింహముగారి కుమార్తె పేరమ్మనిచ్చి వివాహము చేసినారు. ఈయనకుమాళ్ళు అనంతయ్య- లక్ష్మణకవి- వీరభద్రుడు. ఈఅనంతయ్యగారు గౌరీపరిణయమను గ్రంథమును రచించెను. ఈయనకు గురవయ్య, తిమ్మయ్య అను యిద్దరు కుమారులు. ఇందు గురవయ్యకు వీరేశ్వరుడు కలిగెను. రెండవకుమారుడగు లక్ష్మణకవి. ఈయనయే భర్తృహరి సుభాషితగ్రంథ మాంధ్రీకరించి, రామేశ్వరమాహాత్మ్యము, గంగామాహాత్మ్యము, గీర్వాణ సూర్యశతకము మొదలయిన గ్రంథములు రచించెను. ఈయనకు తిమ్మయ్య, పేరయ్య అను యిద్దరు కుమాళ్ళు. అందు పెద్దవానికి వీరభద్రయ్య, లక్ష్మణమంత్రి యను యిద్దరు కుమాళ్లు కలిగిరి. ఈలక్ష్మణ కవి తమ్ముడగు వీరభద్రుని సంతతివారి నెవరిని చెప్పియుండలేదు. ఈలక్ష్మణకవి రామవిలాసమను మరియొక గ్రంథమును రచించెను. అందు కృతిపతియగు శ్రీవత్సవాయి గోపరాజుగారు తమ్ము బిలపించి యిట్టుల చెప్పినపద్యములో పై విషయము లన్నిటిని క్లుప్తముగ నిరూపించి చెప్పెను. ఇట్టిపద్యమే మరియొకటి రామేశ్వర మహాత్మ్యమునందు గలదు. ఆపద్యమిట్లున్నది.

సీ॥ సురుచిరాపస్తంబ సూత్రుపావనాల స
గోత్రు సద్వినయాది గుణ సమేతు
ఏనుగు లక్ష్మణకవీంద్రుని పౌత్రుని
శ్రీ మాదిరాజు నృసింహమంత్రి
దౌహిత్రు భావరాజ్ఞాన పూజ్యుడం లి
మ్మ మంత్రికిఁ బేరమాంబకు సుపుత్రు
ధన్యు ననంతాభిధానానుజుని వీర
భద్రమన కగ్రజు భాగ్యవంతు
లలిత కవితా కళాధుర్యు లక్ష్మణార్యు
నన్నుఁ బిలిపించి యుచితాసనమునునుంచి
చాల గరుణించి తన ముఖాబ్జమున మంద
హాస మొసరంగ నిట్లని యానతిచ్చె.

ఈలక్ష్మణకవిగారి ముత్తాతయగు తిమ్మరాజుతమ్ముడు గుర్రా జుగారే గుర్వమంత్రియై యుండవచ్చునేమో! వెలుతురుపల్లి విశ్వనాథకవి రచించిన క్షేమధర్మములో తిమ్మజగపతి రాజుగారిని వర్ణించుచూ నిటులచెప్పెను.

“ గుణవిభూషణు డేసుగు గుర్వమంత్రి
ధీరుఁడగు పోలప్రెగ్గడ సూరమంత్రి
కడమరెండు భుజంబులు గాఁగ బ్రబలె
మహిఁ జతుర్భుజుండనగఁ దిమ్మనృపుడు ”

అనుటచే ఈ గుర్వమంత్రి తిమ్మజగపతి రాజుగారి ఆప్తమంత్రు లలోనివాఁడుగా కన్పించుచున్నారు.

ఈ లక్ష్మణకవి మనుమఁడగు వీరభద్రమునకు పేరొజచు సమర్థు కలడనియు, అయిన పెద్దాడను కరణముగా నుండియు సాహిత్య కవిత్వ సంపదగలవాడై పెద్దాపురసంస్థాన... సంస్థానములచే రచించుచుగా

కాలక్షేపము చేయుచుండెడివాడనియు, శౌర్య ధైర్య సాహసౌదార్యాది గుణములుగలవాఁడనియు, రసజ్ఞుఁడనియు నిప్పటికి 112 సంవత్సరముల క్రిందట ఒకవేశ్య యీతని పేరనువ్రాసిన ప్రేమలేఖకనుపించినటుల ఈ యన తమ్ముడు లక్ష్మన్న ప్రపౌత్రుడు రామన్నగారున్నటుల ఆనందాశ్రమ గ్రంథరత్నమాల సంపుటములలో శ్రీపురాణం సూర్యనారాయణ తీర్థలవారు రచించిన పీఠికలో నుదహరింపబడినది. ఈ విషయములుకొన్నిటి నుదహరించుచూ యిప్పుడు తమ కుటుంబములో నున్నవారు కరిణీకము మొదలగు గ్రామోద్యోగములు చేయుచున్నారనియు, తమ కుటుంబమువారి కనుశ్రుతముగా వాడ్రేవువారు—వాకాయలపాటివారు— చాగంటివారు— మాచిరాజువారు—భావరాజువారు—పులుగుర్తవారు— మున్నగువారిలో సంబంధములు గలవనియు ది 12 జనవరు 1904 వ తేదీని పెద్దాడ గ్రామవాస్తవ్యులగు ఏనుగు స్సియ్య గారు వ్రాశియున్నారు. ముప్పది సంవత్సరములకు బిమ్మట నైననేమి చరిత్రం బ్రచురింపగలిగితినని సంతసించుచున్నాను.

## అమిరపువారు.

ఆర్వేలనియోగులు, ఆపస్తంబులు, యజుశ్శాఖీయులు, భారద్వాజగోత్రకులు, ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ అని త్ర్యార్షేయము. అనాదికాపురము కృష్ణాజిల్లా పెదఅమిరము అను గ్రామము. ఈ వంశములో రామయ్యగారి కుమారుడు శివరామయ్యగారు చిరకాలము వాడపర్తికులకరపున ఆయుతుదార్లుగా నుండి, బందరుసమీపములో నుండు ఈడేపల్లిలో అగ్రహారం కట్టించి,చాలామంది బ్రాహ్మణులకు వసతులు కలుగచేసి కాపురముంచి చాలా ప్రసిద్ధినొందిరి. గంగరాజుగారు యీగ్రామములో కాపురముండి చాలసత్కార్యములు చేసి [illegible]

వడసిరి. వీరి అనాదికాపురము పెదమిరము అయినను పూర్వపుకరువు కాలములో యచట నిలువలేక కొన్నికుటుంబములవారు బందరునైపు లకు, మరికొందరు యానాము మేఘపాక- భారువ- గంజాము- కాకి నాడ మున్నగు ప్రదేశములకు వెళ్లి, పిమ్మట అచటనే స్థిరపడిరి.

ఈకుటుంబమువారి కనుశ్రుతముగా అక్కరాజువారు, కృత్తివెం టివారు, వడ్లమన్నాటివారు, దినవహి- కాసరబాద- యద్దనపూడి- కానుకొలను- ద్రోణంరాజువారు, గుడిపాటివారు, అయ్యగారివారు, మొదలగువారితో సంబంధములు గలవు. అని భీమవరము తాలూకా అమిరపు కాపురస్తులు అమిరపు నారాయణమూర్తి పంతులుగారు తెలి యపరచిరి. వీరుగాక గుడిపాటివారు- కొండెపూడివారు కూడా అమి రపువారు తమకు చుట్టములైనటుల వ్రాయుచున్నారు.

## కొడమంచిలివారు.

వెలనాటిఅర్చకులు- యజుర్వేదులు, ఆపస్తంబులు, ఆత్రేయస గోత్రికులు, ఆత్రేయ,అర్చనానస శ్యావాశ్య అని త్రయాఋషేయము. ఈ కుటుంబమువారు కడియం వీరవరం జుత్తిగ- తేతలి-వడ్లూరు- కంతే రు- సీతానగరం- బందరువద్ద కోసూరు-పలివెల మున్నగు గ్రామముల యందున్నారు. వీరి కనుశ్రుతముగా ర్యాలివారు కొండవీటివారు సన్ని ధిరాజువారు- శంకరమంచి మద్దిరాలవారు- దంభ్యాలవారు- కందుకూ రివారు- కౌతరపువారు- కైతేపల్లివారు- కొంతేటివారు- శ్రీఖాకుళపు వారు- చేబ్రోలువారు- దమ్మేటివారు- కోటవారు- శివకోటివారు- మోగంటివారు- ఘంటసాలవారు- దమ్మపేట కల్లెపల్లి- జెందులూరు వారు-చెరుకూరివారు-బుద్దవారు మున్నగువారితో సంబంధమ్ములుగలవు.

# ఆయలవరపు వారు

ఆర్వేలనియోగులు. ఆపస్తంబులు, యజుర్వేదులు. వాధూలసగోత్రము. భార్గవ వైతహవ్య సావేదస అని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరికాపురస్థలము అయలవరము. వీరింటిపేరు పూర్వం కస్తూరివారు. విశాఖపట్టణముజిల్లాలో కస్తూరి అప్పయ్యగారు జిల్లాశిరస్తాదారుగా నుండు కాలములో వీరిని విశాఖపట్టణము తీసుకువెళ్ళి కాపురగ్రామమగు అయలవరము యింటిపేరుగా మార్చి, కొండయ్య పంతులుగారి కచట ఉద్యోగమిప్పించిరి. పిమ్మట యీకుటుంబము వారచట వృత్తులు కల్పించుకొని నివాసస్థులై, తదాది అయలవరపు వారని పిలువబడుచుండిరి. వీరికి కౌండిన్య కాశ్యపగోత్రీకులగు వల్లూమూడివారితోనూ, భారద్వాజగోత్రీకులగు యల్లాప్రగడ, చెరుకుపల్లి, వుల్లిపాలెము వారితోనూ సంబంధములు గలవు. వీరివివరము కస్తూరి వారి పైరిత్యా యల్లాప్రగడవారి చరిత్రములందు కొంత గలదు. విశాఖపట్టణప్రాంత్యములనున్న ఉప్పాడి బాపిరాజు పంతులుగారివల్లను చెరుకుమిల్లి సూర్యనారాయణరావు పంతులు, కనగాల వెంకటరావు పంతులుగారివలన తెలియవచ్చినది. ఈకుటుంబమువారిపుడు విజయనగరము, పాలకొండ తాలూకాలయందున్నారు. ఇప్పటికిని యీకుటుంబమువారు కనగాలవారు, తోటపల్లివారు కలసి పురుడు పుణ్యములు పట్టుచున్నారు. పూర్వము రామప్రధానిగారి కాలములో కనగాల, తూములూరు, తోటపల్లి యను మూడుగ్రామములకు వాధూలసగోత్రీకులగు కస్తూరి గంగరాజుగారికి కరణీకము యిప్పించినట్లు కొండవీటి దండకవిలెయందున్నది. ఈమూడుగ్రామములలోని కస్తూరివారిదొక కుటుంబమైయుండి అందొకరు అయిలవరము చేరియుండవచ్చును. అందుననే యీకస్తూరివారనేక యింటిపేర్లుగా మారినను మిక్కిలి దగ్గర సంబంధీకులగు యీమూడింటివారు పురుడు పుణ్యములు పట్టుచుండుటకు కారణము కావచ్చును.

# ప్రయాగవారు

వీరు తెలుఁగాణి వైదికులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, కౌశికగోత్రీకులు. విశ్వామిత్ర, అఘమర్షణ, కౌశిక అని త్ర్యార్షేయము. వీరి అనాదికాపుర మెచటనోగాని ప్రయాగయందు కాపుర ముండుటచేతనో, లేక విద్యాభ్యాస మచట చేసియుండుటచేతనో వీరిలో వెంకటాద్రికవి రచించిన ద్విపదకృత్యనంతరము వీరికి ప్రయాగ వెంకటాద్రియని పేరువచ్చి క్రమక్రమముగా ఏతద్వంశీకులు ప్రయాగ వారైనట్టు కన్పించుచున్నది. అందుకు నిదర్శనముగా ప్రయాగ కామేశ్వరకవి తాను రచించిన, 'గోపాలలీలాసుధాలహరి' యను గ్రంథము యొక్క కృత్యాదిని "విద్వజ్జనమండనమగు మద్వంశంబెట్టిదనిన మఱి వర్ణింతుఁగా." అని చెప్పుచుప్రథమమున,

క. గంగాసరస్వతులు యము
నం గలిసినచోటు త్రిదశనాయక పురికిన్
సంగాతియనబెడంగై
రంగైన ప్రయాగమను పురము రంజిలున్.

అని ప్రయాగపట్టణమునువర్ణించి, అనంతర మీకుటుంబమువారి, మూలపురుషుడు కొండయ్య, ఈయనకు కన్నభొట్లు వీరికి వెంకన్న నరసన్న యను యిద్దరు కుమాళ్ళు అందు నరసన్నకు సర్వేశ— ఈ యనకు కామేశ్వరకవి యనిచెప్పెను ఈయనయే తన పెదతాతయగువెంకన్న [వెంకటాద్రి) రచించిన గోపికాంశుకాపహరమను ద్విపదకావ్యమును పద్యకావ్యముగా మార్చుచు ఆయన నిట్లు వర్ణించెను.

సీ. శ్రీధరేంద్రస్వామిచేఁ జతుర్దశవిద్య
లభ్యసించిన వినయాన్వితుండు
ప్రత్యక్షమై చోరభయము మాన్చిన రామ
లక్షణుల నుతించు లక్షణజ్ఞుఁ

డారోహణావరోహణముగా నొకసారి
విని పారసీ వచించిన ఘనుండు
మెచ్చి ఢిల్లీశ్వరుండిచ్చిన పచ్చల [illegible]
పల్లకీ గొనిన కృపాసమగ్రుం[illegible]
డగు ప్రయాగ వేంకటాద్రీంద్రకృత గోపి
కాంశుకాపహార మనెడి ద్విపద [illegible]
కావ్య మేను బద్యకావ్యంబ సల్ప క[illegible]
ల్పనలఁ జేయఁదలచి భక్తి వలని: [illegible]

అని చెప్పినపిదప తనతాతగారి విషయమేమియు జెప్పక
గాని తనతండ్రినిగూర్చి

గీ॥ అనుచు బాంధవులెన్నఁ జెన్నలరు నిఖిల
ధారుణీనాథ దత్తాగ్రహార నిలయ
బాడబస్వాంత కువలయ పర్వయామి
నీశ్వరుఁడు ప్రయాగ సర్వేశ్వరుండు.

అని వర్ణించెను. అనంతరము గద్యయందు ప్రయాగ నా[illegible]
హ పౌత్ర, సర్వేశ్వరపుత్ర, కౌశికగోత్ర పవిత్ర నిఖిల సుధీజన వి[illegible]
కామేశ్వర నామధేయ ప్రణీతంబైన అని వ్రాసుకొనెను [illegible]
పూర్వమీయన సుదంతాపరిణయమను గ్రంథమున్ను రచించి [illegible]
సీతారామస్వామికి కృతియిచ్చెను. ఇయ్యది విశాఖపట్టణమున [illegible]
రామతీర్థస్వామి కంకితమిచ్చెను. అందువలన ఈవంశీకులు [illegible]
నుండి ప్రప్రథమమున గుంటూరుమీదుగా గోదావరిజిల్లాకు వచ్చి [illegible]
డి కొంతకాలమునకు పిమ్మట విశాఖపట్టణప్రాంతమునకు వెళ్ళియ[illegible]
వచ్చెను. గావుననే యీప్రయాగవారిపుడు గోదావరిజిల్లాలోని [illegible]
మూర్లంక, భీమవరము, తామరాడ, పోలవరము మున్నగు ప్రదే[illegible]
లయందుండియున్నారు. ప్రయాగ రామమూర్తిగారి కుమా[illegible]

ప్రకాశరావుగారు విశాఖపట్నముజిల్లా ఎలమంచిలి సమీపమున నుండు కొత్తపాలు అను గ్రామమునం దుండియున్నారు. వీరు బహుశా పై నుదహరించిన కామేశ్వరకవిసంతతివారై యుండవచ్చును. ఈప్రకాశరావుగారును కవులే గాని వీరు రచించిన గ్రంథములు కనుపించవు. ప్రయాగ కామేశ్వరకవిగారిచే రచింపబడిన శ్రీరామప్రభుశతక మొకటి శ్రీహావిళ్ళ రామస్వామిశాస్త్రిలవారి శతకసంపుటములలో కనుపించుచున్నది. అందలి మూడవపద్యములో

శా॥ శ్రీమత్కాశ్యపగోత్ర సంభవుఁడ సుశ్రీ దేవవంశ్యుండ ని
ష్కామాసక్తుఁడ సత్కవి ప్రియమతిం గామేశ్వరాభిఖ్యుడన్
బ్రేమన్ నీకొక వృత్తసత్కృతి సమర్పింతు న్వచోదోషముల్
స్వామీ సత్కృపచే క్షమింపు హరి నీలశ్యామ రామప్రభో.

అనుప ద్యమును చూచి శతకపీఠికలో కాశ్యపగోత్రులని వ్రాసిరి పాశ్చాత్యలిఖిత పుస్తకభాండాగారాధ్యక్షులవల్ల ప్రచురింపబడిన ఈకవిగారి గ్రంథములలోని పద్యములయందును, గద్యయందును కౌశికగోత్రమె చెప్పబడియుండుటచేతను, యీజిల్లాలోనుండు వీరిజ్ఞాతులందరు కౌశిక అనియు చెప్పుచుండుటచేతను, శతకములో కనుపించిన కాశ్యపగోత్రమనునది తాళపత్రగ్రంథము వ్రాసిన వ్రాయసగాని పొరపాటు అయి యుండవచ్చును. ఈప్రయాగవారి కనుశ్రుతముగా మొక్కపాటివారితోను, వేలూరివారితోను, వారణాసివారితోను, కందర్పవారితోడను సంబంధములు గలవు. క్రొత్తపల్లిలోనుండు ప్రయాగ సోమన్నగారు యజ్ఞయాగాది క్రతువు లనేకములు చేసిరట. ప్రయాగ సీతారామశాస్త్రిగారు గుంటూరునం దున్నారు. వెంకటసోమయాజిశర్మగారు కవులు. తెనాలితాలూకా కొలకలూరునందుండు హనుమంతరాయుడుగారి కుమారుఁడు సంగమేశ్వరశాస్త్రిగారి కుటుంబము గలదు. వీరు వంగరవారి చుట్టములు. ఈయనకు గానవిద్యయందు జెక్కువ కౌశ

లము కలిగియుండుటచే ఈయనకు 'హరికథా కేసరి' యని బిరుదీయబడి
నది. మార్కండేయులుగారను మహాపురుషు డొకడు గుంటూరు
కోనేరుప్రక్కను కాళింగమర్దనస్వామిగుడి కట్టించిరి. 173 సంవత్సర
ములకు పూర్వము పన్నాల పరదేశి సోమయాజులుగారిచే నిర్మాణము
చేయబడిన శ్రీమల్లేశ్వరస్వామివారి ఆలయకంట్రాక్టులో ప్రయాగ
లక్ష్మయ్యగారి వ్రాలుగల కాగితము కొండవీటి సామ్రాజ్యగ్రంథము
ప్రచురింపబడి యుండుటచే 200సం॥పూర్వము ప్రయాగవా గుంటూరు
ప్రాంత్యములయం దుండియుండునటుల స్పష్టమగుచుండుటచే అందరు
బ్రాహ్మణులవలె వీరును కాశీవైపులనుండి నైజామునుండిగా పడమ
రనవచ్చి, తూర్పుకు వచ్చినవారుగా తోచుచున్నది.

## ఎలకూచివారు.

వైదికులు, కౌండిన్యగోత్రీకులు— వాసిష్ఠ— మైత్రావరుణ—కౌం
డిన్య అని త్ర్యార్షేయము. వీరిఅనాదికాపుర మెచటనో వీరికి ఎలకూచి
వారనుపేరు ఎట్లువచ్చినదో తెలియదు. వీరికి బాపట్లతాలూకా మంచా
ళ్ళగ్రహారము రెడ్డిరాజులచే దానమిప్పించబడుటచే యీ కుటుంబము
వారేలైన యిప్పుడు బాపట్ల తాలూకా యందుండిరేమో తెలియదు
ఈకుటుంబమువారిలో గొప్ప సంస్కారి ఎలకూచి బాలసరస్వతిగారు
ఈ యనగొప్పకవి. ఈ యన రంగకౌముది, చంద్రికా పరిణయము
ఆంధ్ర చింతామణి వ్యాఖ్య భాషా వివరణము,రాఘవ యాదవపాండ
వీయము మొదలగు గ్రంథములనేకములు రచించిరి. ఈ యన
శతాగ్రప్రబంధకర్తయనియు, వేదశాస్త్రపురాణ వివిధసంగీత సాహి
త్యాది విద్యోపబృంహణుండనియు, బహుతంత్రీకర్మ చరణుడనియు
చెప్పెదరు. అందువలననే ఈయనకు భట్టార మహోపాధ్యాయ బిరు
దమొసంగబడినది ఈ యన రచించిన గ్రంథములనుబట్టి చూడగా కీర్తి

1700 సాటివాడైనట్లు కవిచరిత్రకారులు తమ గ్రంథమునందుదహరించిరి. ఈ యనతాత భైరవుడు తండ్రి కృష్ణదేవుడు. ఈ వంశీకులను గురించి ఈ కవిరాఘువ యాదవ పాండవీయమునందిటు వర్ణించుకొనెను.

సీ॥ కవిసమీహిత రంగ కౌముదీనామ నా
టకవిధాన ప్రతిష్ఠాఘనుండ
సారసారస్యసచ్చంద్రికా పరిణ య
ప్రిముఖశతాగ్ర ప్రబంధకర్త
నాంధ్రచింతామణీవ్యాఖ్యాన భాషా వి
వరణాది బహుతంత్ర కరణచణుడ
వేదశాస్త్ర పురాణ వివిధసంగీత సా
హిత్యాది విద్యోప బృహణుండ
ననఘ కౌండిన్య గోత్రుండ హరిపదాబ్జ
భక్తిశీలుఁడ నెలకూచి భైరవార్య
కృష్ణదేవు తనూజుఁడనే విచిత్ర
కావ్య మొక్కటి నిర్మింపగాదొడంగి.

తే॥ ప్రిజ్ఞకును సాక్షి యరయ గబ్బంబకాన
నద్భుతంబైన నాప్రిజ్ఞ కనుగుణంబు
గానితర దుష్కరంబైన కబ్బమెద్ది
నేయువాడనొ యంచు యోజించిమదిని.

శా॥ మెండైనట్టి విచిత్ర వైఖరులచే మీదౌమహాకావ్యముల్
దండిందొల్లియ చేసిరాదియులు తత్కావ్యాధి కశ్లాఘమై
నుండన్ రాఘువ కృష్ణపాండవ కథాయుక్తప్రబంధంబు వా
క్పాండిత్యంబల రారశ్లేష రచనైకప్రౌఢి నేఁజేసెదన్.

అని చెప్పుకొనుటవలన కవివంశవర్ణనమిం చుకయుజేసినట్లుల

కనుపించదు ఆదిత్య పురాణమురచించిన చిన ఆదిత్యు డీయనసోదరు డని చెప్పెదరు. చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునందలి లోకల్ రికార్డులలో బాపట్లతాలూకా మంచాళ్ళ కయఫియ్యతునం దిట్లున్నది.

శ్రీవేమారెడ్డిగారి రాజ్యకాలములో కౌండిన్య గోత్రీకులగు యలమూచి శ్రీసర్వేశ్వర సోమయాజులుగారి కుమాళ్లు శ్రీవల్లభశిష్టు గారికి ముప్పాళ్ళగ్రామము దానము చేయబడెను. శాలివాహనశ౧౩౩౩ విక్రమ సం|| చంద్రగ్రహణకాలమున ప్రోలయ వేమారెడ్డిగారు యల మూచి వల్లభ శిష్టుగారికి మంచాళ్ళయను గ్రామము అగ్రహారముచేసి యిచ్చినారు ఈ యనకుమార్తు సాక్షి సోమయాజులు. ఈ యనకు కృష్ణసోమయాజులు ఈ యనకుమార్తు మాధవ దీక్షితులు. ఈ యనకు నరసింహావధాని (అని 1811 లోని కయిఫియ్యతు) మాధవ దీక్షితులు గారి కుమారుడు కామేశ్వరసోమయాజిగారికి ౧౭౨౯ లోని అప్పటి జమీందార్లు అయిన వెంకటరాయనింగారు వగయిరాలు సాలు 1కి 15 వరహాల శిస్తుకట్టి యిచ్చినారు గాని ౧౭౭౮ వరకు కామేశ్వర సోమయాజిగారి అన్న లక్ష్మీపతి సోమయాజి జగన్నాథ సోమయాజి అనంతరం కుమాళ్లు మాధవసోమయాజులు దక్షిణామూర్తి శాస్తుర్లు గంగాధరుడుగారు కామన్నగారు అనుభవించిరి. వీరికుమాళ్లు పార్వతీశ్వర సోమయాజి జగన్నాథవాజ పేయులయాజులుగారు అనుభవించిరి. పిమ్మట యేమైనదో తెలియదు. ఈవంశములో మహావిద్వాంసులైన బాలసరస్వతిగారి పేరెచటను గనుపించదు. ఆయనరచించిన గ్రంథము లయం దెచటను ఈ యనపేరు కనుపించదు. అందువలన ఈ కుటుంబము బాలసరస్వతిగారి కుటుంబము వేరైయుండునని తోచుచున్నది.

# నక్కలపల్లి వారు

ఆర్వేల నియోగులలోచేరిన ఆర్వేలకమ్మలు, ఆపస్తంబసూత్రము, యజుర్వేదము, సాంఖ్యాయనగోత్రము. విశ్వామిత్ర- దేవరాత- ఔదల యని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరి ప్రస్తుతకాపురము వెంకటగిరి సంస్థానములో చేరిన నక్కలపల్లి. ఈకుటుంబీకులు కొందరు తిరునల్వేలిజిల్లా పరుత్తికుళం గ్రామములోనున్నారు. ఆదేశము ద్రావిడదేశమగుటచే అక్కడకు వెళ్ళినవారు వెంకటకృష్ణయ్యగారి కుటుంబమువారు, ఆయనకుమారుడు వెంకటసోమయాజిననియు, తాము యిప్పుడాదేశమున తన నివాసస్థలమగు పరుత్తికుళం గ్రామమునందు గ్రామమునసబు హోదాయందుండి యుంటిమనియు, పరుత్తికుళంగ్రామమునుంచి వ్రాసిరి. ఈవంశీకులలో చేరినవారు కొందరు వెంకటగిరి సంస్థానములోచేరిన నక్కలపల్లి యను గ్రామమునందుండి యున్నారనియు, ఆంధ్రదేశమునుండి వెళ్ళియుండుటచే నక్కలపల్లివారని పేరువచ్చినదనియు చెప్పుచున్నారు. ప్రస్తుత మాకుటుంబచరిత్ర యింతకంటె యేమియు తెలియదు.

ఆర్వేలకమ్మలనియు బడగలనాటి కన్నడీలనియు ఆర్వేల కుటుంబములలో చేరినవారి వివరము ఉపోద్ఘాతమున వివరముగా వ్రాయదలచితిని. ఆర్వేలనాడు నందుండినవా రార్వేలవారైరనిన నడుమ "కమ్మలని" మరియొక కొమ్మ బయలుదేరినది. కమ్మలని వచ్చుటకు గల కారణమింకను ఆరయుచున్నారము. ఈశాఖీయు లెవరయిన తెలిసినవారుండిన తెలుప ప్రార్థన. [మా-ల.]

## మలకపల్లివారు

అర్వేలనియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, మౌద్గల్యస గోత్రీకులు. వీరు ఆంగీరస, భార్మ్యాశ్వ, మౌద్గల్య అని త్ర్యార్షే యము చెప్పుకొనుచున్నారు. వీరు రామచంద్రపురంతాలూకా మలక పల్లి, కడుపూరు గ్రామములయందున్నారు. వీరికి వాడరేవు రంగనా యకమ్మగారి కుటుంబమువారితో సంబంధము కలదనియు, ఒక్కరామ చంద్రపురము తాలూకాగాక మరెచ్చటను మలకపల్లివారనువారు లేరనియు, రామచంద్రపురము తాలూకా కడుపూరు కాపురస్థులు మిరాశిదారు మలకపల్లి వెంకటరాజుగారు వ్రాసిరి గాని ఈకుటుంబము వారు కొందరు విశాఖపట్నంజిల్లాయందు గలరు. వారు అయ్యగారి వారి చుట్టములని తెలియుచున్నది. మలకపల్లి చినశేషగిరిరాయకవి అయినాపురపు సోమేశ్వరరావు గురువట. మలకపల్లి శేషగిరిరావు గారు శతావధాని— వేములవాడ భీమకవిచరిత్ర రచించిరి.

## వెలవెలపల్లివారు

వీరు శివద్విజులు, యజుర్వేదము, బోధాయనసూత్రము. భా రద్వాజగోత్రము. త్ర్యార్షేయము. వీరు పూర్వము గోదావరి తీరమునందలి వానపల్లిప్రాంత్యమున నుండెడువారు. అటునుండి కొంద రు గుడిమూల రామేశ్వరము వచ్చిరి. పిమ్మట కొంతకాలము పేరూ రునందుండిరి. కొందరు తణుకుతాలూకాక త్తవపాడు గ్రామమునందు చట అర్చకత్వము చేయుచున్నారు.

## వాజపేయయాజులవారు

వెలనాడు,వైదికులు,ఆపస్తంబులు,యజుర్వేదులు, పరాశరగోత్రీకులు, వాసిష్ఠశక్తి పరాశర అని త్ర్యార్షేయము. వీరి అనాదికాపురము కృష్ణా జిల్లాలోని తాడేపల్లి. వీరియింటిపేరు పూర్వము తాడేపల్లివారని పిలచెదరు. తాడేపల్లివారనువారు యిప్పుడును గలరు. వీరు హారిత అత్రేయ, పరాశర గోత్రీకులయందు గలరు. అందువల్ల పూర్వము వీరు పరాశరగోత్రీకులైన తాడేపల్లి అయి యుండును. వీరు తాడేపల్లి వదలి గోదావరితీరమగు కొవ్వూరువచ్చి కొంతకాలమచట నివసించి అనుదినము గోదావరిస్నానము చేయుచుండగా ఒకదినమున ఆనదిలో ఒకకాగు దొరకెనట. అనంతర మాధనముతో ఆగృహస్థు వాజపేయయాగము చేయుటచే యింటిపేరు వాజపేయయాజులవారని వాడుక వచ్చినది. ఆకాలములో చేసిన క్రతువులో సోమిదేవమ్మగారి కేదో లోపము జరిగినదనియు,అందుకామె కోపించి ఈవాజపేయయాజులవంశమునందు ధనముండకపోవుగాక యని శపించెననియు, ఆకారణమున యిప్పటికిని యీవంశమున భాగ్యము నిలచుటలేదనియు వాడుక. ఈ వంశీకులు ప్రస్తుతము గోదావరిజిల్లా, తాడిపత్రు, ఉంగుటూరు, కొండుప్రోలు, జుత్తిగ మున్నగు గ్రామాదులయందుండిరి. వీరికనుశ్రుతముగా భమిడిపాటివారితోనూ, గుంటూరువారితోనూ, వడ్డేవారు, పెంటపాటివారు, గుళ్ళపళ్ళివారు, చామర్తివారు మున్నగువారితో బంధుత్వములు గలవు. వీరిలో వాజపేయయాజుల సుబ్బయ్యభాగవతార్ వారు హరికథాకాలక్షేపమునందు నిపుణులు.

## షాగరువారు

ఆర్వేలనియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, భారద్వాజ గోత్రులు. హారిత,ఆంబరీష, బార్హస్పత్య అని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. ఈప్రవర వ్యాలాపింపగా నున్నది. ఈవిషయము

కుటుంబచరిత్ర ముగిసినపిదప వ్రాయుచున్నాను. వీరికీ యింటిపేరు వచ్చెనో, యెచ్చటనుండి ప్రిప్రథమమున గోదావరిజిల్లాకు వచ్చి తెలియదు, ఇటనుండి దాదాపు 200 సంవత్సరములకు పూర్వ కుటుంబమువారు విశాఖపట్టణపుజిల్లా, చీపురుపల్లితాలూకా లా అను గ్రామముచేరి అచట నివాసమేర్పరచుకొని, మరికొన్నిదినము కుద్యోగరీత్యా బొబ్బిలిజమీందారువారి ప్రాపకము సంపాదించుకొ వీరి మూలపురుషుడు పొగరు వీర్రాజుపంతులుగారు కరకవలస దివానుగా పనిచేసినారు. ఆసమయములో యీకుటుంబమున కొన్ని గ్రామములకు కరిణీకములిప్పించి 12 గరిశెల యీనాము భూ యిప్పించినారు. ఆభూమి యిప్పటివరకు యీవంశజు లనుభవి చున్నారు. ఇప్పుడీ యింటిపేరుగలవారు చీపురుపల్లితాలూకా లా సుబాం, దేరసాం, బొబ్బిలి, పాలకొండతాలూకా వానిశీవలస, ఉ ప్పినవలస, కనిమెట్ట, తమ్మాపురం మొదలగు గ్రామాదులలోనున్నా

సుమారు 150 సంవత్సరములక్రిందట శ్రీబొబ్బిలివారి యీ కా దివానుగానున్న పొగరు వీర్రాజుగారి వంశములో చాలా ప్రఖ్యా పురుషులు. కరకవలసతాలూకా బొప్పడాంలో ధర్మార్థముగా కొబ్బరితోట వేయించి మార్గస్థుల కుపకరించుటకు మంచినీళ్ళనూ త్రవ్వించిరి. ఈకుటుంబమువారి కనుశ్రుతముగా అడిదమువారితో మామిడన్నవారితోడను, ప్రాణంగిపల్లివారితోడను, ముళ్ళపూడి తోడను, వడ్డాదివారితోడను, అయ్యగారివారితోడను, అచ్చుతన్న తోడను సంబంధములు జరుగుచున్నవి. అని ఉప్పినవలసయందు పొగరు వెంకటరావు పంతులుగారివల్ల తెలియవచ్చినది.

☞ఇందు మామిడన్నవారు, ప్రాణంగిపల్లి, వడ్డాది, ము పూడివారు హరితస గోత్రీకులు. హరితసగోత్రీకులకు భారద్వా గోత్రీకులకు తరుచుగా సంబంధములు కలవు గాని ఆభారద్వాజగో

కుల ప్రవర, ఆంగీరస, బార్హస్పత్య, భరద్వాజ అని చెప్పుకొనెదరు. ఇందు ఆంగీరస ఋషికలసెనని తగాయిదారగా భారద్వాజగోత్రీకుల లోని ఆంగీరసుడు భారద్వాజాంగీరసుడనియు, హరితసగోత్రములోని ఆంగీరసుడు శుద్ధాంగీరసుడనియు, గౌతమగోత్రములోని ఆంగీరసుడు గౌతమాంగీరసుడనియు, వీరు ముగ్గురూ వేరువేరు కుటుంబములవారు గాన సంబంధములు చాయవచ్చునని సిద్ధాంతపరచిరి. వీరిగోత్రము లో హరిత, బార్హస్పత్య యని చెప్పుకొనుచు యెట్లు సంబంధములు చేసిరో దురూహ్యము. అశ్వలాయన ప్రవరకాండములో "భారద్వాజాగ్నివేశ్యానాం— ఆంగీరస— బార్హస్పత్య— భారద్వాజేతి" అని యును, ఆపస్తంబ ప్రవరకాండములో "భారద్వాజానాం త్ర్యార్షేయ, ఆంగిరస, బార్హస్పత్య, భారద్వాజేతి" అని. ఈభారద్వాజ గణము 17 గోత్రములలో త్రయార్షేయము చెప్పినప్పుడు, ఆంగీరస బార్హస్పత్య భారద్వాజ అనియు, మరికొందరు ఆంగీరస బార్హస్పత్య భారద్వాజ కాత్య అక్షీల అనియు, ఆంగీరస బార్హస్పత్య భారద్వాజసైన్యగర్గలనియు ఆంగిరస, మాంధన, మాతవచన అనియు మరికొందరు సైన్యగర్గలకు మారుస్థశాంగ గర్గలనుచేర్చి చెప్పుకొనుచున్నారు.

ఈగోత్రము ప్రవర అన నేమిటో, యెట్లువచ్చినవో ఆవివరము ముందుసంచికలలో క్రమక్రమముగా ప్రచురించుచుందుము. ఈవిషయము తెలుసుకొనుట కాత్రతపడువారించుక ఓపికబట్ట ప్రార్థన.

(ప॥ల)

## రామావధ్ఘుల.

నెలనాటివైదికులు, ఆపస్తంబులు, యజుశ్శాఖులు, హరితస గోత్రీకులు, త్ర్యార్షేయం వీరి పూర్వులు యింటిపేరు కొమరోత్త వారియు అనంతరము రామావధ్ఘులవారైనట్లు ఈ కుటుంబములో పెద్దల కవిచుగు రామావధ్ఘులకొంటు భట్లు అన ... తరము తానుర

చించిన కపిల గోసంవాదమను గ్రంథమునం దుదహరింప బడి
లగ్రంథము నందు మదీయ వంశావతార మభివర్ణించె " అని
ముందు గాగోత్రఋషియగు హరితుని వర్ణించెను. పిదప

క॥ ఆమానీంద్రు కులంబున
శ్రీమత్కొమరో శివంశ శేఖరుఁ డనుచున్
రామా వఝ్ఝలుఁ డనగ సు
ధీమాన్యుఁ డుదయమయ్యెఁ దేజంబెసఁగన్.

అని చెప్పుచూ తమ యింటిపేరు మారుటకుగల కారణమి
గువపద్యములో చెప్పెను.

శా॥ రామా వఝ్ఝలుఁ డాత్మసత్య వచనారంభ ప్రచారంబునన్
రామాధీశ్వరుఁ జేయసంగఁ దనపేరన్ వంశముప్పొంగను
ద్దామపేర్మిఁ జెలంగ వ్యాసముని ప్రత్యక్షంబునై సద్వర
స్తోమంబీయనొసంగె సర్వజన సంస్తూయ ప్రభావంబునన్.

అనిచెప్పెను. అనంతరము రామావఝ్ఝలవారి సంతతిని
డెలిపెను.

ఆరామావఝ్ఝలకు వెంకటార్యు డుద్భవించెను. ఆ వెంక
ర్యునకు— పెద్దకొండుభట్టు— చిన్నకొండుభట్టు అని యిద్దరుకుమా
ఇందు రెండవవారగు చిన్నకొండుభట్టునకు— బుచ్చన్న—పెదయల్లయ్య—
చినయల్లయ్య— చిన్నయ్య— వెంకన్నఅని అయిదుగురు కుమాళ్లు. అం
చినయల్లయ్యకు కొండుభట్టు-పాపయ్య-ముసలయ్య- రమణయ్య- శా
య్య-చెన్నయ్య-సరసయ్య అను ఏడ్గురు కొడుకులలో కడపటివాడగు
సయ్యకు అక్కాంబవలన కొండయ్య— కృష్ణయ్య— సుబ్బయ్య— మ
ఁయ్య అను నలుగురు కుమాళ్లు వీరిలోపెద్దవాడగు కొండయ్య క
ఈ కపిల గోసంవాదమను గ్రంథకర్త యొక్క తండ్రిగాడుకూడ క
నట్లు ఈ దిగువ పద్యములవలన కనుపించుచున్నది.

సీ॥ గీ॥ వీరిలోపల నాత్మవిచారపరుఁడు
సత్యవాక్యుండు బుధకోటి సన్నుతుండు
సరసకావ్య కవిత్వ విశారదుండు
సరసయాఖ్యుండు దనదు విస్ఫురణ మెఱయ

అని చెప్పెనుగాని తన తండ్రి యేమి గ్రంథములు రచించెనో చెప్పలేదు. తన విషయములోన దిగువపద్యము చెప్పుకొనెను.

సీ॥ గోవింద గురుసర్య పావనాంఘ్రిసరోజ
భక్తుండ ముక్తుండఁ బటుగురూక్తి
సరసకావ్యకవిత్వ చాతుర్యకల్పనా
కలితుండ లలితుండ ఘనులలోన
సకలాత్మ విద్యా విచారానుసంధాన
సహితుండ విహితుండ సభలయందు
నిఖిలార్య సమ్మత నీతినిర్మలలస
ద్వచనుండ రచనుండ నైద్యవిద్య
సత్య వాక్యాభిలాషుండ సర్వసుజన
సహ కృతాశేష సజ్జన సముదయుండ
వినయ ధుర్యుండ జనలోక విశ్రుతుండఁ
గొండయాఖ్యుండ హారితస గోత్రజుండ.

ఈ గ్రంథ మహోబల నరసింహస్వామి కంకితముచేయుటచే ఈ కుటుంబమువా రటునైపులయుండి యుండవచ్చును. ఈ కుటుంబ మువారి చరిత్ర యింతకంటె తెలియదు. ఈ కుటుంబములోని వారగు రామావధానుల రామశాస్త్రులను వారు కైకేయీ దుస్తంత్రమనుగ్రంథ మును రచించిరి.

## త్రాతి రాఖి వారు.

ఆశ్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, కాశ్యప గోత్రికులు, కాశ్యప, వత్సార, నైధ్రువ, రేభ, రైభ, శండిల, శాండిల్య అనిసప్తాఋషేయము చెప్పుకొనుచున్నారు. వీరి అనాదికాపురము గోదావరిజిల్లా కోరుకొండ. అటునుండి కొందరు పోగేశ్వరపురము

మధురపూడి— గాదరాడ— పాలకొండతాలూకా గీతనపల్లి—
పార్వతీపురము— గ్రామములకు చేరిరి. గోదావరిజిల్లానుండి 150 వ
రములకు పూర్వము విశాఖపట్టణముజిల్లా చేరిరి. వీరిలో బుచ్చి
గారు పాలకొండ జమీందారిలో మజుందారుగానుండి అచట స్థిరవసతి
సంపాదించుకొనిరి. బాపిరాజుగారు పర్లాకిమిడి సంస్థానములో మజుం
దారుగానుండి స్థిరవసతి సంపాదించుకొని ఆకుటుంబమువారచటనే ని
చిపోయిరి. వీరు గంజాముజిల్లా సార్వకోటగ్రామములో భీమేశ్వరస్వా
మి ఆలయముకట్టించి ప్రతిష్ఠించిరి. గోదావరిజిల్లా కోరుమామిడి
నుండు వెంకట సుబ్బయ్యగారు ఆ గ్రామపాలకుడైన శ్రీచక్ర
దేవునిపేర కొన్ని గ్రంథములు రచించినారు. వాటివివరము
లేదు పార్వతీపురమున నుండిన వరహాలు పంతులుగారు మంచి
[illegible] సమర్థులుగా నుండుటచే [illegible]
మనరుగా నుండెడివారు. ప్రస్తుతము కోరుమామిడిలో వెంకట కృష్ణ
రాయుడు— వెంకట శేషయ్యగార్ల కుటుంబములున్నవి. వీరికి
శ్రుతముగా నందినాడ— రాచిరాజు— మంత్రిప్రగడ— దేశరాజు—
కోడేటి— పాణంగిపల్లి— ఆచంట— వారితోసహా సంబంధములు గలవు.
పైకుటుంబములవారందరూ విశాఖపట్టణము జిల్లాయందుకూడా
రుగాన ఆజిల్లాకు వెళ్ళినవారచటనె సంబంధములు చేసుకొనుచున్నారు.

## మండపాక వారు.

ఆర్వేలనియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు,
సగోత్రికులు. ఆంగీరస—బార్హస్పత్య— [illegible]
ము చెప్పుకొనుచున్నారు. వీరి అనాదికాపురము గోదావరి
ములోని [illegible] తాలూకా మండపాక. అనంతరము [illegible]

వీరరాఘవ స్వామిగారి కుటుంబము విశాఖపట్టణముజిల్లా నడుపూరు నందుగలదు. వీరు వీరరాఘు వీయమను "చరిత్రోపత్తి చంద్రిక యనుఒక నిఘంటు గ్రంథమును వ్రాసిరి. ఈ యనతమ్ముడు రామదాసు పంతులుగారు విజయనగరమునందున్నారు. గోదావరిజిల్లా మండపాకలో ప్రస్తుతము వీరి కుటుంబములు రెండు మూడుగలవు వీరికి అయ్యగారి వారితోనూ— చంగల్వలవారితోనూ— మద్దాలవారితోనూ— కందిమళ్ల వారితోనూ— కాశిరాజువారితోనూ— తణుకువారితోనూ— కొండేపూడివారితోనూ బంధుత్వములుగలవు. కేశవ రాయశర్మగారు— జార్జి మ్మూరు చరిత్ర— మధుపాన నిషేధబోధిని శాంఫర్డుదొరసాని చరిత్రయనుగ్రంథములు రచించిరి— యీ గోత్రీకులు వేల్పూరువారనికూడా పిలువబడుచుండిరట.

## 2. మండపాక వారు వైదికులు.

ఈ పేరుగలవారిలో వైదికులు గలరు వీరిది పరాశరగోత్రము త్రయార్షేయము పార్వతీశ్వర శాస్త్రుర్లుగారు బొబ్బిలిసంస్థానమునందాస్థాన పండితులుగా నుండెడివారు. ఈ యనఅనేకగ్రంథములు వ్రాసెను ఈయన రచించిన చాటుకృతులే యనుబది వరకుగలవట. వానిపేర్ల నన్నిటిని కొంతకాలమునకుపూర్వము నెల్లూరునందు ప్రచురింపబడుచు వచ్చిన అముద్రితగ్రంథ చింతామణియందుదహరింపబడినది ఈ యన యిప్పటికి 100. క్రితము జన్మించి 60 సంవత్సరములు జీవించెనట ఈ యనతండ్రి కామేశ్వర పండితుడు ఈ యన జన్మస్థానము విశాఖపురి మండలములోని పాలతేరు పేరయ్య సూరి పుత్రుడు. ఈ యన అనేకమందికి విద్యగరపి కవులనుచేసెనని చెప్పుదురు ఈ యన బ్రహ్మోత్తర ఖండము, బలరామక్షేత్ర మహాత్మ్యము కార్తికమాస మహాత్మ్యము అనుపురాణములు జానకీరామశతకము, సూర్యశతకము, రామప్రభుశతకము మరికొన్ని శతకములు రచించెను. తన తాతతండ్రులిద్దరు కవు

లేనట. ఈ యనచే రచింపబడిన రాధాకృష్ణ సంవాదమను గ్రంథసం
దిష్టు తనను సంబోధించి నటులచెప్పెను.

సీ॥ శ్రీమీఱ నుభయభాషామిశ్ర సత్కృతుల్
తద్జ్ఞులెన్న మదంకితములు చేసి
యశము గాంచిన పేరయ మనీషిమణికిఁ
బౌత్రత్వంబుఁ గార్తిక వ్రతమహత్త్వ
శివ మహత్త్వాద్య నేకవిధ ప్రబంధంబు
లొనరించి సత్కవి వినుతిఁగనిన
పారశరసగోత్ర పావనుండగు మండపాక
కామేశ్వర పండితునకు
మహిత పుత్రత్వమునుగాంచి బహువిచిత్ర
చిత్రశతిముఖ్య సత్కృతుల్ చెప్పి మెప్పు
వడసెతివిగద కులకీర్తి వర్ధిలంగ
సరస గుణసాంద్ర పార్వతీశ్వరకవీంద్ర.

ఈ యనను గూర్చి— కవులచరిత్రమునందును శతకకవుల చరిత్ర
మునందును కొన్ని వివరములు దెలుపబడినవి. ఈ యన రచించిన
హరిహరేశ్వర శతకమునందీయన స్వీయచరిత్రగలదట. ఈ యనరచి
చిన గ్రంథములలో సుజనామోదిని, కృష్ణాభ్యుదయము, జగద్రక్షక
శతకము, రాధాకృష్ణసంవాదము, త్రైపదేంద్ర గురుచంద్రచరిత్ర
సావిత్రీచరిత్ర- సావిత్రీ సత్యవంతము— ప్రేమము— అను గ్రంథములు
ముద్రింపబడినవి. ఈ యన కుమార్డు కామశాస్త్రిగారు ప్రస్తావిక
పద్యావళి, పతివ్రతా ధర్మబోధిని, కృష్ణజలక్రీడఅను గ్రంథములను
కామశాస్త్రిగారుఆంధ్రమహానాటకమను గ్రంథమును రచించిరి.

## జటప్రోలువారు.

వైదికులు, తైత్తరీయశాఖ. కృష్ణయజుర్వేదులు. ఆపస్తంబసూత్రము- కౌండిన్యసగోత్రము- వాసిష్ఠ- మైత్రావరుణ- కౌండిన్య. అని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు.

అనాదికాపురము నైజామునందుండు జటప్రోలు సంస్థానము. ఈ జటప్రోలువారిలో అన్యగోత్రికులు గలరట. వారికాపురము రామచంద్రపురము తాలూకా బోడవరమని తెలియుచున్నది. వీరిలో సుబ్బరామయ్యగారను వారు కర్నూలు జిల్లా మార్కాపురమునందు గలరు. సర్వభద్రముగారు మంచి పండితులు వీరు గోదావరి జిల్లాలోని పాఠశాలల పరీక్షాధికారిగానున్నారు. వీరికిమంచిసాహసౌదార్యములు గలవు. వీరి జన్మస్థలము తణుకు తాలూకా నెగ్గిపూడిగ్రామము అనిచెప్పెదరు. వీరికి మైలవరపువారిలోనూ, చాడవారితోనూ సంబంధములు గలవు. పూర్వము ఈ యింటిపేరు గలవారిలో ప్రతివారి నామముచివరను 'యోగి' యను బిరుదముచేర్చి నాడుచుండెడివారట. సర్వభద్రముగారి మాతా మహులగు చాడలక్ష్మణ చయనులుగారు సాలూరు సంస్థానమునందు విద్వాంసులుగా నుండెడువారు. వీరు వేదఘన దర్పణమను లక్షణగ్రంథమును రచించిరట. వీరిలో రెండవ గోత్రీకుల వివరం తెలియులేదు.

## కనుపర్తివారు

### మూడు గోత్రములవారు గలరు.

ఆర్వేలనియోగులు, ఆపస్తంబులు, కౌండిన్యగోత్రీకులు, వాసిష్ఠ మైత్రావరుణ, కౌండిన్య అని త్ర్యార్షేయముచెప్పుకొనుచున్నారు. వీరి సంతతివారిప్పుడు నరసరావుపేటతాలూకా కనుపర్రు అను గ్రామ

మునం దున్నారు. కనుపర్తి రాఘవయ్యగారు, సంజీవరావుగారు అని ప్రసిద్ధివడసిన పురుషులీ కౌండిన్యగోత్రీకులే. వీరి మూలపురుషుడు బసవన్నగారు. ఈయన పూర్వము కొండవీటిరాజులయొద్ద మంత్రిగా నున్నటుల కవిరాజమనోరంజనమను గ్రంథమున కనుపర్తి అబ్బయామాత్యు డిట్లు వర్ణించెను.

శా॥ శ్రీపేర్మిఁ శశివోలె బ్రహ్మకులవార్ధింబుట్టి కౌండిన్యగో
త్రాపస్తంబ పవిత్ర సూత్ర కలితుండై రాయసింహాసనా
ఖ్యోపేత స్ఫుట కొండవీటిపుర రాజ్యోర్వీశ్వరు ల్మంత్రిగాఁ
జేపట్టం బసవప్రధానుఁ డిల మించెన్ భాగ్యసంపన్నుఁడై.

ఈ బసవన్నగారికి అమరప్ప, ముమ్మనమంత్రి, పెద్దన్న య్యల్లప్ప అని నలుగురు కుమాళ్లు గలరు. ఇందు ముమ్మనామాత్యునకు నిమ్మనయను కుమారుడు గలడు. ఈనిమ్మన కుమారుడే జగత్ప్రసిద్ధివడసిన అబ్బయ్యగారు. ఈయన కవిరాజమనోరంజనము, అనిరుద్ధచరిత్రము వ్రాసిన అబ్బయామాత్యుని తాతగారగుటచే యీఅబ్బనామాత్యుడు తన తాతగారి నిట్లు వర్ణించెను.

ఉ॥ నిండుగుణంబు సత్యమును నీతియు శాంతముఁగల్గి కీర్తి వం
తుండయి భోగభాగ్యములతోఁ జెలువొందుచుఁ గొండవీటి భూ
మండల నాయకుల్మిగుల మన్ననసేయగఁ బెంపుమీరె, స
త్పండితుఁ డబ్బమంత్రి కనుపర్తి పురాన్వయవార్ధిపూర్ణచం
దు్రండని లోకులందరు నెరుఁగుటకు న్నుతిసేయ నేటికిన్.

ఈఅబ్బయ్యగారి కిద్దరు కుమాళ్లు. పెద్దవాడు రాయన, రెండవవాడు నిమ్మన. ఇందు పెద్దవాని నిట్లు వర్ణించెను.

ఉ॥ వేయనవచ్చుఁగాక సుభువేయనపాయ వదాన్య వైభవం
బాయనవద్యబుద్ధి తగు నాయనకే యన గీర్తిచంద్రికల్
గాయన యస్వగీతికలు గాయన శీలురు వాడనొప్పు నా
రాయనమంత్రి మేలు భళిరాయన సూరిజనాభివంద్యుఁడై.

అని కవిరాజమనోరంజనమునందు

క॥ ధీనిధి రాయనమంత్రికి
మానవతీమణికి సరసమాంబకు జనసం
బైనార మిరుపురము మో
గానందుడు నబ్బనార్యుఁ డనందగు నేనున్.

అని కనుపర్తి అబ్బయ్యగారు అనిరుద్ధ చరిత్రమునందు చెప్పుకొని, మరియు కనుపర్తి బసవప్రధానిగారిని—

క॥ ఆమంత్రిమణి ప్రకాశ న
భోమణి కనుపర్తి బుక్కపుర ముఖ్య బహు
గ్రామస్వామ్యస్థభవ
గ్రామణి బుధనుతులఁ గాంచె నలువురన్.

అని చెప్పుటచే కనుపర్తి బుక్కపురి మున్నగు చాలాగ్రామములకు వీరికి మిరాసీ యుండి యుండవచ్చును. కొండవీటి దండకవిలెయందు గోపరాజు రామప్రధానిగారివలన కొండవీటిసీమలోని పడమటి కనుపర్తి అను గ్రామమునకు కౌండిన్య, కాశ్యపగోత్రీకులగు యీకనుపర్తివారికి సంప్రతి కరిణీక మిప్పించబడినట్టున్నది. ఈయబ్బనామాత్యునకు శ్రీమంగళగిరి నృసింహస్వామి యిలవేల్పగుటచే యీగ్రంథమాయనకు కృతియిచ్చుచు నిట్లు చెప్పుకొనెను.

క॥ శ్రీమంగళగిరి నరసిం
హామేయకృపా విజృంభితాద్భుత కవితా
శ్రీమంతుండ గానకళా
ధీమంతుండ దేవశాస్త్రి పరుడన్.

ప్రస్తుతము నర్సారావుపేట సమీపమునందు రాఘవయ్య, సంజీవరావుగారి కుటుంబములు వీరి పెద్దవతరమువారో, వీరి బంధువులెవరో వివరము తెలియుటలేదు.

కౌండిన్యగోత్రికులగు కానుపర్తి యోగానందంగారికి రామప్రభ
కాలములో స॥ తా॥ పడమటి కనుపర్రు గ్రామముకు సంప్రతియిచ్చి
నటుల కొండవీటి దండకవిలెయందు గలదు. కనుపర్తి వెంకట
గారికి ఆ 1793 లో శ్రీరాజా మలార్రాజు గుండారాయణంగారు దే
వరంగార్రిమ సంప్రతికరణములు సఃంచగా పైవారికి విక్రయించిన
టుల కొండవీటిసామ్రాజ్యము నందు గలదు.

## 2. కనుపర్తి వారు, కాశ్యపగోత్రికులు—

ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, కాశ్య
పగోత్రికులు. కాశ్యప- అవత్సార- నైధృవ- అని త్ర్యార్షేయము
గోత్రములో కాశ్యప- అవత్సార- నైధృవ- రేభ- రైభ- శండి-
శాండిల్య అని సప్తార్షేయము చెప్పుకొనువారుకూడ గలరు.
అనాదికాపురము బాపట్ల తాలూకాలో చేరిన పడమరకను పర్రు
గ్రామము. ఈ గ్రామముకు గోపరాజురామప్రధానిగారి కాలములో
కౌండిన్య గోత్రికులగు కనుపర్తి యోగానందంగారికి కాశ్యపగోత్రి
లగు మరియొక కనుపర్తివారికిని రెండు సంప్రతికరణికము లిచ్చి
న..టుల కొం. సా. నం దున్నది. అచటనుండి సుమారు 250 సం
త్సరములకు బూర్వము బాపట్ల తాలూకాలోచేరిన లిమ్మనముద్రము
చేరి అక్కడి రెడ్డిరాజుల నాశ్రయించి పందిళ్లపల్లియను గ్రామములో
మిరాసీ సంపాదించుకొని నాటనుండి యాప్రాంత్యముల నుండినటుల
దెలియుచున్నది. ఈ వంశీకులను గూర్చి శ్రీకనుపర్తి వేంకటరామ
విద్యానంద నాథునిచే రచింపబడిన కైవల్యనవనీతము యొక్క భూమి
కయందు ఈ దిగువ వివరములు గలవు. ఈ యన గుంటూరు జిల్లా
బాపట్ల తాలూకాలోని పంచెళ్ళపల్లియను గ్రామమునందు శాలి 17..
సరియగు రుధిరోద్గారి సంవత్సరమున జన్మించిరి. వీరి. జీవచరిత్ర

ణదేశమునందే గడపిరి. వీరు పరమ హంసాశ్రమమును స్వీకరించి శాలి. శక. 1820 కిసరియగు హేవిళంబి సంవత్సర కార్తీక బహుళ ప్రతిపద్ది నంబున సిద్ధినొందిరి. వీరికి సంస్కృతాంధ్ర— ద్రావిడ— కర్ణాటక భాషల యందు గొప్ప పాండిత్యముగలదు. ఈ యనకొక సోదర్లుగలరు. ఈ వేంకటరామ విద్యానందులవారి తండ్రి చిన్నతనముననే గతించుటచే ఏకాకిగా బయలుదేరి యెట్టులో కొన్నినాళ్ళకు చెన్నపురిచేరి అచటి జాగీరుదారులగు పెద్దినాయని వంశీకుల ఆదరణకుపాత్రులై కొంతవిద్యాభ్యాసము చేసినవెనుక మేనమామలు తమ పిల్లనిచ్చి వివాహముచేయుటయు, పిమ్మట మధురాపట్టణమున తర్క— వ్యాకరణశాస్త్రము లభ్యసించి కొన్ని పుణ్యక్షేత్రములు చూచి నలుబదియవ సంవత్సరమున దక్షిణదేశమున కాలక్షేపము చేసిరి. వీరికి త్రిపురసుందరి యిష్టదేవత వీరు భూపుర కైలాస మేరు ప్రస్తారాది భేదములతోనుండు శ్రీచక్రము నర్చించుచు, సర్వదా తదుపయోగములగు గ్రంథముల బరిశోధించుచుండెడివారు.

అష్టాదశ పురాణములందును చారిత్రభక్తుల చరిత్రములందును, వీరు చదువని గ్రంథములేదు. శ్రీ విషయమును వేదాంతవిషయమును సమన్వయించి చెప్పుటలో వీరికిగలచాతుర్యము వాచామగోచరము. బాపట్ల తాలూకాలోనినియోగులలో శ్రీనందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితులవారి అనంతరము శ్రౌతస్మార్త విద్యను ప్రపంచమున వ్యాపింప చేసినది వీరే. అటు పిమ్మట వీరు తమ డెబ్బదియైదవయేట తిరుగ చెన్నపురి చేరి తామొనర్చిన కైవల్య నవనీతము, సంభావ్యార్థనామ ప్రకాశిక, త్రివర్గదీపిక మున్నగు గ్రంథములు ముద్రింపించుచూ. వాశిష్ఠరామాయణము, సీతారామాంజనేయము అను గ్రంథములకు విస్తారముగా వ్యాఖ్యానముచేసి ప్రకటింప చేసిరి. వీరు తమ 96 వ యేట చెన్నపురియందే సిద్ధి నొందిరి. వీరిని గురించి ఇంకను తెలుసుకొనగోరు

వారు కైవల్య నవనీతగ్రంథమునందలి పీఠికజూచునది. ఈ వంశము
మూలపురుషుడు ప్రసన్నప్పగారు. వీరు చాలప్రసిద్ధపురుషులు వీరు
పేర యిప్పటికి ప్రసన్నప్పచేను, ప్రసన్నప్పతోట, ప్రసన్నప్పచెర్వు
అని వాడుకలోనున్నవి. ఈ ప్రసన్నప్పగారు పైనుదహరించిన వేం
కటరామ విద్యానందనాథులవారికి నాలుగైదు పురుషాంతములవారు.
పండుళ్ళపల్లి యందిప్పటికిని కరిణీకము చేయుచున్నవారు ప్రసన్నప్ప
వారి సంతతివారే. వీరి కారవ సంతతివారైన కనుపర్తి శ్రీరాము
లుగారుండెడివారురాజమహేంద్రవరమున న్యాయవాదిగనుండిరి. వేంకట
రామ విద్యానందనాథులవారుతమగ్రంథమునందుతమ వంశవివరమీరు
క వివరించిరి. దానినీదిగువ నుదహరించుచున్నాను. 'కృష్ణకు దక్షిణ
మున ఏడు యోజనముల దూరముననుండు తూర్పుసముద్రప్రాంత్యమున
న పండుళ్ళపల్లియను గ్రామమున అపస్తంబులు, కాశ్యపగోత్రులు
ఆర్వేలనియోగులనువారిలో మూలపురుషుడు నారాయణుడు ఆ
తదాది మీసవరకు చెప్పుచువచ్చిరి. ఈ నారాయణమంత్రి ప్రసన్నప్పగారి
కుమారులై యుండవచ్చును తన గ్రంథమునందు తన వంశీయులగు నా
ర్వేలవారి నిట్లువర్ణించెను.

శా॥ ఆచంద్రార్క యశః ప్రధానములచే నార్వేల వారెల్లడన్
వాచస్పత్య జరుద్విశేషులన గీర్వాణాంధ్ర కావ్యంబులన్
భూచక్రంబు వెలుంగఁజేసి బహునైపుణ్యంబులం బుణ్యమా
ర్గాచారంబుల విప్రసంతతిని సత్క్యాత్యైశ్వర్యులై రందరున్.

ఈ నారాయణ మంత్రికి వేంకట నారసింహ ప్రధాని రఘునా
యకులు అను నిద్దరు కుమారులు వేంకట నరసింహ మంత్రి
అయినకుడు కుమారులు గలరని చెప్పుచూ లింగమవెంకన్న, రామయ్య
అను యిద్దరు ప్రఖ్యాత పురుషులని వర్ణించెను అందు వెంకన్నగారి
అప్పులన్న శేషాద్రి సోమయాజులవారి కుమారులైను యిచ్చినట్లు వారి
[illegible] తాను [illegible]ముల [illegible]ములో చెప్పె

క॥ ఆయిరువురి లోనరస య
నాయను సంభవుఁడు ధర్మ నయగుణ ధైర్య
శ్రీయుతుఁ డఖిలజనచయ స
హాయుఁ డగుచు వెలసెఁ బ్రజ్ఞ నతిమోదమొదవన్

అని చెప్పుటచే తన తమ్ముడును, ధర్మ నయగుణ ధైర్యశ్రీ యుతుడు గా కనుపించుచున్నాడు. పెద్దవాడు వెంకటరామ విద్యానాథులనియు, ఈ యనకు రాజేశ్వర సోమయాజిగారి కుమార్తెనిచ్చి వివాహముచేసినట్టు యిదివరకు చెప్పియున్నాను ఈ యన మాతామహుడు శేషాద్రి సోమయాజి. మాతృప్రపితామహుడుయజ్ఞేశ్వరసోమయాజి ఈ యనకు నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితులుగారు గురువట. వారినిట్లు వర్ణించెను.

శా॥ శ్రీనాథార్చిత దక్షిణాననకలం జెన్నొంది యద్వైత ల
క్ష్మీనారాయణ దీక్షితుండనఁగు లశ్రేయంబు సాంకర్యతన్
హీనంబై నశియింప బావనముగా హేయంబు ఖండించి ని
త్యానందుండగు నస్మదీయగురు పాదద్వంద్వముం గొల్చెదన్.

పైమూడుసంగతులను బట్టిచూడగా ఈ కనుపర్తి వారెట్టిశ్రోత్రీయులో ఎట్టిమేధావులో ఎట్టికర్మాసక్తులో ఎట్టిమతాభిమానులో వేఱుగ చెప్పవలెనా? కైవల్యనవనీతగ్రంథముపతద్గ్రంథకర్తపుత్రుడగుమార్కండేయశర్మచేతప్రకటింపబడినది. అని యుండుటచేతను, ఈయన సోదరుడు కామరాజు కోటీశ్వరశర్మశాస్త్రిగారగుటచేతను ఈమార్కండేయశర్మశాస్త్రిగారు వేంకటరామ విద్యానందనాథులవారి దత్తులు. మార్కండేయశర్మ శాస్త్రిగారి జననం 1895 తారణ, విద్యానందనాథులు 1898 సిద్ధినొందిరి. అప్పటికి మార్కండేయశర్మగారికి 13 సంవత్సరములు. లోకములో మహామేధావంతుని కుమారుడు దేవానాంప్రియుడుగాను గొప్పపండితుని కుమారుడు పండితపుత్రుడనియు హేళనచేయు ఆచార

ముకలదు. ఈకుటుంబవిధ మటులగాక ఈయన దత్తుడయినను జన్మ సోదరుల సహాయమున వేంకటరామ విద్యానందులవారు—చెప్పినటుల "సుగుణకదంబమెల్ల నొకచోట నె కాపురమున్నయట్లుగా" ఈ పుణ్యపురుషుడు పాలక మాతామహస్థానమునకు పితామహస్థానమునకు వన్నె తెచ్చునటుల ఉపనిషద్భాష్యాద్యనేక యుత్కృష్టగ్రంధములను నాంధ్రీకరించి శ్రౌతస్మార్తాధ్యయనపరులై, స్వధర్మప్రకాశిక సంపాదకులై, సనాతనధర్మోద్ధరణార్ధము దేహ, ధన, బుద్ధి బలముల సంపూర్ణముగా వినియోగించి, నియోగిపత్రిక నుద్ధరించిన వీరిపాండిత్య మపారము. ప్రచురించినగ్రంధములు వందలకొలది గలవు. ఇట్టి మహాపురుషుడు బాల్యదశయందే 12-8-1935 తేదీని స్వర్గీయులై రని వ్రాయుటకు విచారముగ నున్నది. నియోగి చరిత్ర సంపాదించి ప్రచురించుటకు నియోగిమహాజనసభవారిచే పేర్కొనబడిన సభ్యులలో ఈయనతో నలుగురు గతించిరి. ఈగ్రంధము పూర్ణముగ ప్రచురమగు యోగమున్నదో లేదో యెవరు చెప్పగలరు? ఇక నీకాశ్యప గోత్రీకులైన కనుపర్తివారు, అద్దంకి, జీడిగుంట, నీలంరాజు, అచ్చుతన్న పోలంరాజు, రాచబండి, రాచపూడి, పాటిబండవారు మున్నగు వారితో సంబంధములు గలవుప్రాసినది..

కీర్తిశేషులగు శ్రీకనుపర్తి మార్కండేయశర్మగారి స్మారక చిహ్నము నెలకొల్పుటకు గుడివాడ నియోగి మహాశయులు ప్రయత్నించుచు ఇటుల శ్రీయుత లక్కరాజు గోకర్ణేశ్వరరావు పంతులుగారు త్రివిజ్ఞ పత్రికయందు ప్రచురించుటజూడ ఇంకను మన శాఖీయులకు శాఖాభిమానము కలదాయని సందేహించుచున్నాము— ఇట్టి మహాపురుషులు గతించినను వీరి కీర్తి చిరస్థాయిగ భూమిపై నుండునటుల ప్రయత్నించుట బ్రాహ్మణశాఖవారి కర్తవ్యమని విన్నవించుచున్నాము.

## 31. కనుపర్తివారు.

కనుపర్తివారిలో మూడవశాఖవారి గోత్రము నిశ్చయముగా దెలియలేదు గాని కౌశికగోత్రీకులని కొందరు చెప్పగా విన్నాను. వీరి మూలపురుషుడు దక్షిణాదిని తామ్రపర్ణి నివాసులైనటులను, యిప్పటికిని వారిసంతతివారా తీరమున గలరనియు వినికి. వీరిలో కొందరు చినగంజామనయను గ్రామమునకు సమీపముననుండు కనుపర్తియను గ్రామములోను, తిరువూరితాలూకా రేపూడి గ్రామములోను కనుపర్తి సుబ్బారావుగారు గోదావరిజిల్లా, యర్నగూడెము తాలూకా తిరుమలాపురమున కరణీకము సంపాదించి అచటనున్నటుల తెలియుచున్నది. కనుపర్తివారి మూడుగోత్రముల వివరము రాజమహేంద్రవరమున న్యాయవాదిగానున్న కనుపర్తి శ్రీరాములు పంతులుగారి వల్ల కొంత తెలియవచ్చినది. కొదువభాగము కైవల్య నవనీతగ్రంథమునుండియు, అబ్బయామాత్యుడు రచించిన అనిరుద్ధచరిత్ర కవిరాజ మనోరంజనమను గ్రంథములనుండి గ్రహింపబడినది. కాశ్యపగోత్రీకులైన కనుపర్తివారిది నిలువుబొట్టు. వీరి పూర్వులకు వైష్ణవగురుపులు. వీరుశిష్యులకు చక్రాంకణములు చేయుచుండెడివారు. విద్యానందనాథనాథుల మేనమామలు అచ్చుతన్నవారగుటచే చిన్నప్పటినుండియు వారింట పెరిగిన కారణమున ఈయన విభూతి, రుద్రాక్షధారణ కలవాటుపడి వైష్ణవచిహ్నములు త్యజించిరి. ఈగాథ కొంత కైవల్యనవనీతములో గలదు. మార్కండేయశర్మగారు అవశ్యం పితురాచారమ్మని విభూతిధారణులైరి. కాని రాజమహేంద్రవరమునందు శ్రీరాములుగారి కుటుంబమువారింకను నిలువుబొట్టె పెట్టుచున్నారు.

---

# కస్తూరివారు

ఆర్వేలనియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, వాధూల గోత్రీకులు. వీరిలో కొందరు త్ర్యార్షేయము, కొందరు పంచార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరికీపేరెట్లు వచ్చినదో కారణము తెలియుటలేదు. వీరి ఆనాదికాపురము కొండవీటిసీమలోని కనగాల, తూములూరు అను గ్రామములు. వీరిలో కొందరు ప్రస్తుతము తూర్పుగోదావరిజిల్లా బేతమల్లిపూడి. సావరము, పాలగుమ్మి వగైరా గ్రామములలో నున్నారు. మరికొందరు విజయనగర ప్రాంత్యము యందు కృష్ణాజిల్లా, రేపల్లెతాలూకా యిసుకపల్లెలోను వున్నారు. కనగాల కాపురస్తులగు కస్తూరి వీరమునిగారు గోదావరిజిల్లాలోని స రమువచ్చి దొడ్డంపేటలోని వాడ్రేవు పర్వతచైనులుగారి కుమార్తెను వివాహముచేసుకొని తాటిపాకసీమకు దేశపాండ్యాహోదా సంపాదించినారు. ఈయన కుమారుడు రాయలుగారు. ఈయన కుమారుడు నరసప్రధానిగారు, యీయన గొప్పదాతగా ప్రఖ్యాతినొందినారు. ఈయన కట్టించిన దేవాలయములు, త్రవ్వించిన చెరువులు, యేర్పాటు చేసిన ధర్మసత్రములు అనేకములు గలవు. ఈయన గోల్కొండ పాదుషాగారివల్ల నాలుగుపందల పుట్లభూమి సర్వదుంబాలా మాన్యముగా సంపాదించిరి. ఈవంశములోనివాడే సోమరాజుగారు. ఈయన జ్యేష్టభార్య కిద్దరుకుమాళ్లు. వీరు పాలగుమ్మి కస్తూరివారైనారు. కనిష్టభార్యసంతతివారార్గురు. వీరందరు సావరం కస్తూరివారైనారు. ఈసోమరాజుగారి కుమాళ్ళలో నొకరగు దక్షిణామూర్తిగారు యజ్ఞముచేయుసమయమున భార్గవ— వీతహవ్య— అయాస్య— మానమాకస— అని పంచార్షేయము చెప్పుకొనుటకు బదులుగా భార్గవ— వీతహవ్య— సావేదస— అని త్ర్యార్షేయము చెప్పినారు. తదాది

పాలగుమ్మివారు త్ర్యార్షేయము, సావరమువారు పంచార్షేయము చెప్పుకొనుచున్నారు. ఈసోమరాజుగారి కుమారుడు శివశంకరంగారు, యీయనకుమారుడు సోమరాజుగారు, యీయనకుమారుడు శివశంకరశాస్త్రిగారు. ఇటీవల వీరు రాజమహేంద్రవరము సర్వకళాశాలలో సంస్కృతపండితులుగానుండి ఉపకారవేతనము పుచ్చుకొనిరి. ఈయన సర్వశాస్త్ర పారంగతులు. నియోగులలో నింతటి విద్వాంసులు కనుపించరు. ఈయన మహాభాష్య చతుర్దశ సూత్రాంతరార్థ ప్రకాశిక దక్షిణామూర్త్యానందలహరి, గులాముఖాదరు చరిత్ర సర్వశాస్త్రసామరస్యబోధ కౌస్తుభము, భక్తిముక్తాసుధానిధి, విగ్రహారాధన స్థాపక గ్రంథము, వేదాంతడిండిమము, వేదభాష్యార్థ ఖండనము మున్నగు విశేషగ్రంథములను రచించి, మహామహోపాధ్యాయ బిరుదమందిరి.

ఈయిన పెద్దకుమారుడు మాణిక్యాలరావు. ఈయన తహశ్శీలుదారుచేసి ఉపకారవేతనము పుచ్చుకొనిరి. ఈయనకుమాళ్లు శివశంకరముగారు ఏలూరులో సోమేశ్వరరావుగారు రాజమండ్రిలోను సుబ్బారావుగారు ప్రస్తుతము రాజామః లో డిస్ట్రిక్టుమునసబుగా నున్నారు. కస్తూరి నారాయణమూర్తిగారు సావరములో కరణముగా నున్నారు. పూర్వము కొంతకాలము మేజస్ట్రేటు యుద్యోగమునందున్న సూర్యనారాయణమూర్తి. ఈయన కుమాళ్ళు నరసింహారావుగారు కొంతఖ్యాతి గడించిరి. వీరికుమారుడు కస్తూరి రామారావుగారను వారు యింగ్లీషుపద్ధతిని హస్తసాముద్రికశాస్త్రమునందు గొప్పప్రఖ్యాతి గడించుచున్నారు. వీరు పూర్వము డిస్ట్రిక్టు మునసఫీచేసిన వక్కలంక కామరాజు పంతులుగారి దౌహిత్రులు. ఇది గోదావరిజిల్లాకు వచ్చిన కస్తూరివారి చరిత్ర.

కనగాలనుండి విశాఖపట్టణముజిల్లాకు వెళ్ళినవారిలో కస్తూరి అప్పయ్యపంతులుగారు ముఖ్యులు. వీరు విశాఖపట్టణమున సిరస్థా

దారు ఉద్యోగమునందుండు కాలమున కృష్ణాజిల్లాలోనుండు తమ్ముల బిలిపించి వారికందర కుద్యోగము లిప్పించుటలో నితరుల పడకుండునట్లుల వారువచ్చిన గ్రామనామమే వారివారి గృహనామములుగా మార్చినైచి, అందరికి ఉద్యోగము లిప్పించెనట. అప్పుడు విశాఖపట్నముజిల్లాకు వెళ్ళినవారు ఉప్పాడి, కనగాల, బాపట్ల, చెరుకమిల్లి, ఉల్లిపాలెము, అయిలవరము, తోటపల్లి గ్రామాదులలో కస్తూరివారు. వీరియింటిపేర్లు కస్తూరివారనుటకు మారుగా ఉప్పాడివారు, కనగాలవారు, బాపట్లవారు, చెరుకుమిల్లివారు. ఉల్లిపాలెమువారు, అయిలవరపువారు అను యింటిపేర్లుగా మార్చివేసిరి. ఈయింటిపేర్లుగలవారందరిప్పుడు విశాఖపట్టణజిల్లాయందున్నారు. ఇప్పటికీ యీకుటుంబములవారికి పురుడు పుణ్యములు వచ్చినప్పుడు పట్టుచున్నట్లు తెలియుచున్నది.

గోపరాజు రామప్రధానిగారి కాలములో యీకస్తూరివారికి కొండపేటసీమలోచేరిన కనగాల, తూములూరు,తోటపల్లి అనుగ్రామములు వాధూలసగోత్రీకులు తెలనాడు కస్తూరివారికి మిరాసీలు యిచ్చినట్టు కొండపేటి దండకవిలెయందు వ్రాయబడియున్నది. అందువల్ల యీమూడుగ్రామముల పేర్లుగల కస్తూరివారు అన్నదమ్ములైయుండి యొకరి అయిలవరము వెళ్ళియుండుటచే అయిలవరపువారు, తోటపల్లివారు, కనగాలవారు విధిగా పురుడు పుణ్యములు పట్టుటకు కారణమైయుండవచ్చును. ఈ కస్తూరి అప్పయ్యగారు కలెక్టరుకచేరీ సిస్తాదారుగానుండి యుద్యోగము లిప్పించినట్లు యీవంశీకులు చెప్పుచున్నారు.

ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందు "త్రిపుటదండక" మను నొకగ్రంథ మెవరో బ్రాహ్మణుడు రచించినట్లులను, అందు విజయనగరసంస్థానమున జూనపాటివారు బ్రాహ్మణుల కొసగిన భూములకు

గస్తూరి అప్పయ్య యనునాతడు విఘాతము గలిగించుచుండగా నెవరో తిట్టుచు చెప్పిన దండకము అని వ్రాయుచు ఆందీదిగువపద్య ముదహ రించినారు.

ఉ॥ శ్రీయుత పూసపాటి కులసింధు సుధాకరులైన భూపతుల్
వేయుతరాలనుండి కడువేడ్క నొసంగిన యట్టి మాన్యముల్
న్యాయముతప్పి ఘాతకొడిగట్టిన ............ ;
................యదార్థము నమ్ముము కస్తురప్పయా. ;

అనిరట— కలెక్టరు కచెహరి సిరస్తాదారుగానున్న ఆకస్తూరి అప్పయ్యగారికి పూసపాటివారిచ్చిన మాన్యముల ప్రశక్తి కలుగుటకు తగు కారణము కనుపించదు. ఆయనయందుగల ద్వేషభావమున యిటీవల యెవరిచేతనయినా కల్పించబడినదో లేక యీయప్పయ్యగారు మరియొకరో తెలియదు. ఈవంశీకులలోనివారగు ఉప్పాడి బాపి రాజుపంతులుగారు, చెరుకుమిల్లి సూర్యనారాయణపంతులుగారు, కన గాల వెంకటాద్రిపంతులుగారు మున్నగువారి కుటుంబము లిప్పటికిని విశాఖపట్నముజిల్లాయం దున్నవి. వారిచరిత్రలు ఆయాకుటుంబముల చరిత్రలయందు విపులముగా వివరించబడును. ఈవంశీకులలోని పూ ర్వుడు కస్తూరి గౌతన్నయను నొకలేఖరి గలడు. వీరు రాజమహేం ద్రివరమున నుండెడివారని వాడుక. ప్రస్తుతము చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారమునందు గోదావరిజిల్లాలో సంపాదించిన తాళ పత్రగ్రంథములలో యనేకములు గౌతన్నగారివలన వ్రాయబడినట్టు కనుపించుచున్నది. రాజోలుతాలూకాలోని విశ్వేశ్వరాయపురమున కస్తూరి శివశంకరకవియను నొకబాలకవి యుండెడువారు. ఆయన కొంతకాలము సుదర్శనియను పత్రిక ప్రచురించుచు వచ్చిరి. చిన్నవా డయినను సంస్కృతాంధ్రములయందు మంచి పాండిత్యము సంపాదించి బలజాసౌభద్రీయము, మాధవీ మధుకరము, శంకర రామాయణము,

జ్యోతిష్ఫలచర్చ, వరకట్నములు మున్నగు గ్రంథములను రచించి బాల్యముననె ఆకాలమృత్యువు పాలైనారు. ఈకస్తూరివారి క్షేత్రప్రాంత్యమునందు పోడూరివారు, గిడుగువారు, అయ్యగారివారు, అడవిగొలనువారు, నిడమర్తివారు, వాడ్రేవువారు, గురజాలవారు, మంచిరాజువారు, వక్కలంకవారు, తల్లాప్రగడవారు, గాదివారు, కొమరగిరివారు పత్తిరాజువారు, రెబ్బాప్రగడవారు, కందికొండవారు మున్నగువారితో సంబంధములు గలవు. బాలాంత్రపువారిలో కొందరు కస్తూరివారైనారు. ఆవివరము బాలాంత్రపువారి చరిత్రలో కననగు. కుటుంబరావుగారు, చినపున్నయ్యగారు మున్నగువారి కుటుంబములు రేపల్లెతాలూకా గ్రామాదులయం దున్నారు. కస్తూరి గోపాలరాయడుగారు రామేశ్వర యాత్రాచరిత్రము, నరసింహారావనువారు హరిశ్చంద్రచరిత్ర గ్రంథమును వ్రాసిరి. కొండపేటి దుడకవిలెలో రేపల్లెతాలూకా యిసుకపల్లికి వాధూలసగోత్రీకులయిన కస్తూరివారికి సంప్రతి యివ్వబడినట్లున్నది. డాక్టరు నారాయణమూర్తిగారి కుటుంబము చెన్నపట్టణమందును, మరికొందరు గుంటూరు, అనపర్రులలోను గలరు.

## 2 కస్తూరివారిలో కరణకర్మ వ్యాపారులు.

కరణకర్మలుగా నుండు కస్తూరివారిది విశ్వామిత్ర గోత్రము విశ్వామిత్ర, అఘమర్షణ, కౌశిక, అని త్ర్యార్షేయము ఆపస్తంబసూత్రము, యజుర్వేదము, అద్వైత మతస్థులగుటచే శ్రీశంకరాచార్యులవారి శిష్యులైనారు వీరికి చక్రాంకణములు లేవు. పూర్వము వ్యాపారులను పేరుగల మూడు తెగలవారు మొట్టమొదట మహారాష్ట్ర పశ్చిమ నైజాము ప్రాంత్యములనుండి మహారాష్ట్ర యుద్ధములకాలమున ఆదేశముల విడచి యితరదేశములలో ప్రవేశించి వారివారి కనుకూల

మగు వృత్తుల నవలంబించి కాలముగడుపు కొనుచు మహమ్మదీయుల పరి పాలనా కాలమునందు బ్రాహ్మణులకు విధికృతమైన వైదిక సాంప్రదాయముల త్యజించి లౌక్య వ్యాపారముయందు ప్రవేశించి, ప్రపంధమమున వ్యాపారములయందు, ప్రవేశించినవారగుటచే ఈ తెగవారినందరిని వ్యాపారులని బిలువజొచ్చిరి. వీరు వారివారి మతగురువులను బట్టి వేఱువేఱు తెగలవారుగా విభజింపబడిరిగాని వీరి సాంప్రదాయములుమాత్రము మారినట్లు కనుపించదు. వ్యాపారులు (మధ్వ) గోల్గొండ వ్యాపారులు కర్ణకర్మవ్యాపారులు మున్నగువారి సాంప్రదాయవివరము, లు ఉపోద్ఘాతమున వ్రాయబడును. కరణకర్మలనగా సలహాసనియనియు, వీరు ప్రభువులయొద్ద కార్యదర్శులుగాను, జవాబు నిదీసులుగాను, వుండి సలహా సహాయకర్మలకు చెందేవుద్యోగములు చేసియుండుటచే వీరికి కరణ కర్మలని పేరువచ్చినది. ఈ ప్రాంత్యమునందు వీరికి బందరు ముఖ్యస్థానమైయున్నది. కస్తూరివారి కుటుంబములో ప్రఖ్యాతిపురుషుడు సీతాపతి రావుగారు. ఈ యనకు లక్ష్మీనరసింహరావుగారు ఈ యనకు వేంకటనరసింహము. ఈ యనకు సీతాపతిరావు. లక్ష్మనృసింహము— రామారావు అను ముగ్గురు కుమాళ్లుండియున్నారు వీరి మూలపురుషుడగు సీతాపతి రావుగారు బందరు నబాబుగారి యొద్ద దివాన్‌గా నుండెడివారు. ఆయనకాలములోనే ఉత్తరసర్కారులు ఇంగ్లీషువారి వశమగుటచే అప్పటిసంస్థానముల ప్రభువులకు ఇంగ్లీషువారికి తటస్థించిన తగవులనే కములుకలిగినవి. ఆసమయములో సీతాపతిరావుగారు బందరు కలెక్టరు గారియొద్ద జవాబునివీసుగా చేరి ఆతగవు లతిసూక్ష్మముగ పరిష్కరించుటచే అయాచితముగ యాబది లక్షలరూపాయిలధనము పోగుచేసుకొనగలిగెను. ఈ యన ఉద్యోగము నందుండగానో చాలించిన వెనుకయో గాని బందరు చింతగుంట పాలెములో ఒక్క ముహూర్తమున అరువదినాల్గు యజ్ఞములు చేయించి నటులను

బందరులో వారు నివసించుటకు కట్టించిన భవనమున ఎంతటి గొప్పసౌ ఘము కురియుచున్నను స్వేచ్ఛగా అనుదినము వేయిమంది బ్రాహ్మణులు భుజించుట కనువగునటుల కట్టించినటుల పెద్దలవల్ల తెలియవచ్చినది. ఆయన చనిపోవుకాలమున కైదు లక్షల రూపాయల రొఖముండగా ఆయన కుమారుడు పుట్టు భోగియై నిరుద్యోగియై స్వేచ్ఛగా తనతండ్రి గారు సంపాదించిన ధనముతో అత్యంత వైభవముగ జీవయాత్ర గడపి తన కుమారునకు రెండులక్షల రొఖము నిలువచేసి గతించిరి వారు చని పోవు కాలమున వారికుమారుడు వెంకట నరిసింహరావుగారు మయిన రు అగుటచే ఆస్థిఅంతయు తోబుట్టువ పెనిమిటియగు కొల్లూరి నాగ భూషణ రావుగారి మేనేజుమెంటు క్రింద యుండగా ఆయన యిచ్చినరి ప్పులలో నిరాధారులగు వారు చాలామంది యుండుటచే చాలాసొమ్ము మునిగిపోయినది అందువలన వెంకట నరసింహరావుగారి కున్మత్తత తట స్థించి మిగిలిన ఆస్థియు నసించినది అకాలములో మైసూరు రాష్ట్రమున తాహశీల్ దారుగానుండిన దేవర్సు భగవంతరావు గారివలన అనంతర ముమ్మ్యదపాటి అగ్రహారీకులు— పెశాషను తాశీల్ దారుగా దుండెడు కొ ల్లూరు రంగధామ రావు పంతులుగారివల్లను పోషింపబడిరి. ఈ కుటుం బమువారిలో సీతాపతి రావుగారు బెజవాడయందును, లక్ష్మీనృసింహ రావుగారు రాజమహేంద్రవరమునందును, రామారావుగారు బందరు నందు ఉద్యోగరీత్యా, నివసంచియుండిరి. వీరిజ్ఞాతులలో కస్తురి వెంకట శివరావు పంతులుగారి కుటుంబము కాకినాడసమీపములోని కాపులపాలె మునందున్నారు. కరణ కర్మ వ్యాపారులలో కస్తురివారను పేరుగలవా రీ రెండుకుటుంబములవారు మాత్రమె యిటు వైపుల నుండినటుల బెజ నాడకాపురస్తులగు కస్తురి సీతాపతిరావుగారివల్ల తెలియవచ్చినది.

వీరి కనుశ్రుతముగా దేసర్సువారితోడను— కొల్లూరు వారు

బనివీసు– దీదువాన్. హెజీబు– చిట్టేల- బీరకాయల- కొల్లూరు వారు మున్నగువారితో సంబంధములు గలవు.

☞ ఈ శాఖాబ్రాహ్మణ చరిత్రి వ్రాయుట కిదియే ప్రారంభము. ఇటీవల బరంపురముసందలి ప్రముఖులుకొందరు కర్ణకర్మసభ యొకటి యేర్పాటుచేసి దానికి రావికంటి రమణయ్యపంతులుగారి సభ్యులుగా యేర్పాటుచేసినటుల తెలిసి వారికొకవిన్నసము బంపుకొంటిని. కాని వారికి అనుగ్రహాము రాలేదు. వాకబుచేయగా కర్ణకర్మలుగా యుండువారిలో 1 రావికంటి, 2 కోనర్గాం, 3 నాభి, 4 సత్యవాడ, 5 కాండ్రేగుల, 6 గుమ్మిడిదల, 7 గజవెల్లి, 8 జిల్లేళ్ళ, 9 జీడిగుంట, 10 దేవర్సు, 11 పొగాకు, 12 మూరేమంద, 13 మద్దిరాల, 14 సూకూరు 15 అంగర, 16 బెండూరి, 17 భట్లపెనుమర్తి, 18 మొసలిగంటి, 19 బనివీసు, 20 దీదువాన్, 21 హేజీబు, 22 చిట్టేల, 23 బీరకాయల 24 కొల్లూరి, 25 కస్తూరివారి కుటుంబములు తెలియవచ్చినవి. ఈశాఖ వారేరైన అనుగ్రహించి సంపూర్ణచరిత్రిలు బంపి పత్రికాభివృద్ధికి తోడ్పడ ప్రార్థన.

## పైడిపాటివారు

వీరిలో కౌండిన్య– శఠమర్షణ– వాధూల- గౌతమగోత్రికులు గలరు.

1. శఠమర్షణగోత్రీకులు:—

ఆర్వేలనియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, శఠమర్షణ గోత్రికులు. ఈగోత్రీకులు ఆంగీరస పౌరుకుత్స్య త్రాసదస్య అని ప్రవర చెప్పుకొనుట వాడుక. అందుకు విరుద్ధముగా శఠమర్షణ భగణ బాదరాయణ అని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. ఈ

కుటుంబమువారి కాపురస్థలము నెల్లూరుమండలములోని పైడిపాడు. ఈకుటుంబీకులలో పైడిపాటి వెంకట నరసింహకవి యను కవి గలడు. ఆయన లక్ష్మీనృసింహవిలాసమను ఒకప్రబంధమును రచించెను. అందు తన వంశక్రమ మిట్లు వర్ణించెను.

సీ॥ క్షితితలంబున నొప్పు కృష్ణా పినాకినీ
దివ్యనదీ మధ్య దేశభూమి
గడుఁ బూర్వవార్ధికిఁ బడమట యోజన
దూరమై తగు కందుకూరు మఱియు
నదియ సీమానామమై యొప్పు నాకందు
కూరికిఁ దనరు వాయువ్యదిశను
బాలేరు దానికిఁ బౌలస్త్య దిశఁ బైడి
పాడొప్పు దానికిఁ బశ్చిమమున
నెగడుఁ జతుకుపాడు నిరృతిని వేంపాడు
చెలఁగు గాడ్పు మూల నిలవరయన
నమరుపుర చతుష్టయం బిది తృణకాష్ట
జలసమృద్ధి సిరుల నలరుచుండు.
గీ॥ గ్రహణవేళ గోపరాజు రామన గోల
కొండ ప్రభువుచేతఁ గొనిన దాన
మహిమ దుష్టమతుల మడియించి స్థావర
జీవనంబు ద్విజులఁ జేర్చె మున్ను.

తదీయానుగ్రహ లబ్ధంబైన యేతద్గ్రామ చతుష్టయ స్థావర జీవన జీవితులయిన మదీయ వంశజుల జననక్రమం బభివర్ణించెద. తన వంశక్రమ మిట్లు చెప్పెను.

క॥ ఘనమైన యజుర్వేదం
బున కాపస్తంబసూత్రము ఘటించె మహా

జనసమ్మతి నామోనీ
సుని శాసనమునఁ దదీయ సూత్రమునందుర్గా.

చ॥ ప్రవిమల పుణ్యకీర్తిఁ హరిభక్తిఁ గవిత్వతరోక్తిగల్గి యీ
భువిఁ దగి పైడిపాటి కులభూషణు లొప్పుచు రట్టి వంశసం
భవులగు వారికెల్ల శతమర్షణ భద్రిణ బాదరాయణ
ప్రవరసమేతమై యవనిపై శతమర్షణ గోత్ర మొప్పెడిన్.

ఈవంశములోని మూలపురుషుఁడు ఓబళప్ప. ఈయన ఆగమ వేది, నిరంతర భోగియునట. ఈయన కిరువురు భార్యలు. పెద్దభార్యకు కేశవుడు. ఈయనకు జగన్నాథము, పర్ణశాల, బుచ్చన్న అయ్యవారు అను నలుగురు కుమాళ్ళు. రెండవభార్య సంతతివాడయిన గోపాలుడు. ఈయనకు నారాయణుడు, గురుమూర్తి, పెదనరసింహము, చిననరసింహము, ఓబళయ్య, లక్ష్మయ్య అను ఆర్గురు సంతతి గల్గిరి. ఇందు కడపటివాడగు లక్ష్మణాఖ్యుడు మంగమను వివాహ మాడెను. ఈదంపతులకు నరసింహము, కృష్ణమూర్తి, కొండయ్య, లక్ష్మీపతి యను నలుగురు కుమారులు కలిగిరి. ఇందు లక్ష్మీపతి కవి యనియు, యాయన కిద్దరు భార్యలు గలరనియు, పెద్దభార్యయందు వెంకటనరసింహము అనుతాను బుచ్చన్నయను సోదరుడు, రెండవ భార్యయందు బరచేసి జన్మించిరని చెప్పెను. మరియు తాము

గీ॥ అవని సురలను శతమర్షణాఖ్య గోత్ర
సంజ్ఞగల పైడిపాటి వంశజుల మారు
వేల కృతిని యజుశ్శాఖ నెలసి వాక్య
సిద్ధి గలిగిన మావృత్తి శిష్టహితము.

ఈకవి హంసవింశతి వ్రాసిన అయ్యలరాజు నారాయణకవి మేనల్లుడు. వీరికి అయ్యలరాజువారు, కామరాజువారు బంధుగులు. ఈనృసింహకవి నరసింహశతకము, మన్నారు కృష్ణశతకము అను రెండు శతకములుకూడ వ్రాసెను. ఈవంశీకుల కీయబడిన గ్రామములు

కొండవీటిదండ కవిలెయందు కనుపించవు. మాత్రుకభిన్నమ్మ
యున్ని గ్రామములు లేవో తెలియదు. ఈగోత్రీకులు అద్దంకియం
దున్నారట. ఈవెంకట నృసింహాకవి రచించిన శ్రీలక్ష్మీనృసింహ
విలాసమున గద్యచూడగా నాయన గొప్పసంస్కారిగా గన్పట్టుచుం
టచే అందలిగద్య నిట నుదహరించుచున్నాను.

గద్య—ఇది శ్రీమదుభయ వ్యాకరణ త్రికరణాచరణ భక్
వాగర్థజ్ఞానసమర్థ విద్వజ్జన విశిష్ట సముత్కృష్ట పీత భయభూత దర్శ
లబ్ధసమారబ్ధ కవితా మిత చమత్కార కారణ చణాషాభాష స్ఫూ
మనీషా విశేషమహాతాపసాపస్తంబ సూత్ర శఠమర్షణగోత్ర రత్న గ
కర్పూరపేటీ పరిపాటి ధాటి పైడిపాటి వంశక్షీర వారాశి రాకా
కరోదయమాభ్యానయ లక్ష్మీపతికవీంద్ర నందన వెంకటనృసింహకవి ప్ర
ణీతంబైన శ్రీలక్ష్మీనృసింహవిలాసము-

ఈతడు రచించిన శతకములు దశకవిభాగము నొందియున్న
వన్నారట కృష్ణశతకములో దాససంగ దశకము- స్తుతిదశకము- శి
మాతృదశకము- బాలదశకము- చోరదశకము- జారదశకము- గోప
దశకము- దుష్టనిగ్రహ శిష్టప్రతిపాలన అవతార దశకములనియు
రామచంద్రశతకమునందీ దిగువవిధమున విభజించెను.

మ॥ స్తుతికావ్యోన్నతి దాససంగతి మనోదుర్వృత్తి సంసార ప
ద్ధతి మాయాకృతి తత్త్వసంతతి యభేదఖ్యాతిదీనావన
స్థితిసద్భోధ దశావతారనుతి కించిత్స్తుతి నానోప్ప న
చ్ఛలలితం గృతి రుద్రసంఖ్యా దశకంబుల్ సమ్మతిం దాని స
ముపకారణ్యాత నన్నుగై కొను మువేంద్రా! రామచంద్రా!

ఈకవి క్రీ॥శ॥ 1660 నాడని చరిత్రకారులు వ్రాయుచున్నా
అద్దంకియందిపుడున్న ఈగోత్రీకులు ఈకవికి 7, 8 తరముల
వారయి యుండవచ్చును.

2 కౌం డి న్య గో త్ర ము.

ఆశ్వేల నియోగులు, ఆపస్తంబులు యజుర్వేదులు, కౌండిన్యస గోత్రీకులు, వాశిష్ఠ, మైత్రావరుణ కౌండిన్య అని త్ర్యార్షేయము. కౌండిన్య గోత్రీకులగు పైడిపాటివారిలో లక్ష్మణమంత్రియను వారు కవులు. యీ యన ఏకామ్రమంత్రి కుమారుడనని ఈ యనరచించిన ఆంధ్రనామ సంగ్రహమను నిఘంటువునందిట్లున్నది.

క॥ నతభక్త లోకరక్షా
రతికిం జంచత్కృపా తరంగి తమతికిన్
శతమఖముఖ సురనుతి సం
గతికిన్ వాహిమోన్నతికని కాశీపతికిన్.

గీ॥ అంకిత మొనర్తు దెనుఁగుపేర్లుఁ గూర్చి
గరిమలో నాంధ్రనామ సంగ్రహ మనంగ
నమరు కృతిఁ బైడి పాటియే కామ్రమంత్రి
సుతుఁడఁ గవిలక్ష్మణాఖ్యుఁడ సుజనహితుఁడ

అని మాత్రము చెప్పుకొనెను గాని తమ వంశక్రమమేమియు వర్ణించియుండలేదు మఱియు తన గ్రంథము కాశీవిశ్వనాథుని కంకిత మిచ్చెను. మొచటివారితో అక్కడికి వెళ్ళి యీ గ్రంథము చెప్పెను కాబోలును.

మ ఱి యు గ ద్య మి ట్లు న్న ది.

ఇది శ్రీమదేకామ్ర నామాత్యపుత్ర— కౌండిన్యగోత్ర పవిత్ర సదారాధిత దేవపటల పట్టపైఁడిపాటి లక్ష్మణకవి ప్రణీతంబైన యాంధ్రనామ సంగ్రహమను కృతియందు సర్వాంబును బంచమాశ్వాసము. అని యున్నది ఇంతకంటె ఈ వంశచారిత్ర తెలియదు.

3 వా ధూ ల స గో త్రీ కు లు.

ఆశ్వేలనియోగులు, ఆపస్తంబులు యజుర్వేదులు, వాధూలస

గోత్రీకులు, భార్గవ, వీతహవ్య, సావేతస, అని త్ర్యార్షేయము.
వీరి అనాది కాపురము పెద్దాపురము సంస్థానములోని పెద్దాడ గ్రామము
వీరి పూర్వీకులైన సింగన వంశములో నొకడగు జలపాలామాత్యుడు
పెద్దాడసంస్థానా ధీశ్వరుడగు గజపతిరాజుచే నేనుగును సోమేశ్వరమను
గ్రామమును బహుమాన మందుటచే నప్పటినుండియు నేనుగువారని
మారినట్లును భాషిత రత్నావళ్య పతాకికలో నీదిగువపద్యము వలన
తెలియవచ్చుచున్నది.

సీ॥ పరమేష్ఠితుల్య ప్రభావుండు వాధూలు, డను
మునీంద్రుడొప్పు ననఘమూర్తి
యమ్ముని నాథువంశమ్మున క్షీరాంబు
నిధిసుధా కరుడు జన్మించినట్లు
పరిభవించె శ్రీపైడిపాటి సింగనమంత్రి
వంశాగ్ర గణ్యుడై వరలునతని
మహిత సంతాన క్రమంబున జలపాల
సచివుడొప్పె బలారిసచి వసముడ.

గీ॥ గజపతి క్షితిభర్తచే గజముతోడ
నగ్రహారంబితండు పరిగ్రహించె
నెలమినేనుగు వారన్న యింటిపేరు
గలిగె నతనికి గజలాభ కలనవలన.

వాధూలసగోత్రికులైన పైడిపాటివారి వంశవివరము ఏనుగు
వారి వంశచరిత్రమునందు బూర్ణముగా గలదుగాన ఆచరిత్ర జూచునది.

4 పైడిపాటివారు—గౌతమ.

యాజ్ఞవల్క్య నియోగులు, శుక్ల యజుర్వేదులు, కాత్యాయ
న సూత్రులు, గౌతమ గోత్రీకులు, ఆంగీరస, అయాస్య, గౌతమ,
అని త్ర్యార్షేయము. ఈ గోత్రీకులైన పైడిపాటి వారి కుటుంబమొకటి
బాపట్ల తాలూకా పూసపాడునందుగలదు.

# అయితంరాజువారు.

ఆర్వేలనియోగులు, అపస్తంబులు, యజుశ్శాఖీయులు కౌండిన్యస గోత్రికులు. వాసిష్ఠ మైత్రావరుణ కౌండిన్య అని త్ర్యార్షేయము. వీరు కందుకూరు తాలూకా కరేడుగ్రామకాపురస్తులు వీరిలో నరస య్యగారనువారికి— సీతారామయ్య— అయ్యపరాజు— వెంకట్రాయఁడు సుబ్బారాయడు— పురుషోత్తము— కృష్ణయ్య అని ఆర్గురు కుమాళ్లు. వీరిలో అయ్యపరాజుగారు నెల్లూరిలోని శ్రీ రంగనాయకులవారి గాలి గోపురము కట్టించి పండితశ్రేష్ఠులై నిరతాన్న దాతృత్వాది విశేషగుణ ములతో కూడియుండిరి. పురుషోత్తము పంతులుగారు ఆశ్రమస్వీకారా నంతరము పరమహంస శ్రీరామానందసరస్వతీయతీంద్రుల నిప్రసిద్ధిజెంది కంచియందు ఉపనిషద్బ్రహ్మస్వాముల వారని జనులచే పిలువబడుచు జీర్ణాద్వైతమతపునరుద్ధారకులగు శ్రీ సచ్చిదానంద సరస్వతీయతీంద్రుల వారికి శ్రీ నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితులవారికి పదునెనిమిది మాసములకాలము ప్రస్థానత్రియమును సరహస్యముగ బోధించి అనం తరము భగవద్గీతలకు రామానంద సరస్వతీయమను, పేరుతో సంస్కృ తమున వ్యాఖ్యవ్రాసి అనంతరము అష్టోత్తర శతోపనిషత్తులకు వ్యాఖ్య వ్రాసి అనంతరము కావేరీనదీతీరమున పంచనదమను ప్రదేశమునందు సిద్ధినొందిరి. ఈ కుటుంబమువారిలో చేరినవారొక కొందరు యిప్పుడు నెల్లూరుజిల్లా కందుకూరు తాలూకా కరేడు గ్రామమునందు గలరు. వీరికి యఱ్ఱగుడిపాటివారు బంధుగులయినటులను కొంతకాలమునకు పూర్వము నియోగిపత్రికయందు ప్రచురింపబడినది. అంతకంటె యిత రవృత్తాంతమేమియుదెలియదు.

2 కౌశికగోత్రికులు:— అయితంరాజు శేషగిరిరావుగారు వీరి కుటుంబము చిత్తూరునందుగలదు వీరు గార్లదిన్నెవారి చుట్టములు.

## అక్కెనప్రగడవారు.

ఆర్వేల నియోగులు ఆపస్తంబులు, యజుర్వేదులు, కౌండిన్య గోత్రీకులు. వాసిష్ఠ- మైత్రావరుణ- కౌండిన్య అని త్ర్యార్షేయము వీరిలనాదికాపుర మెచటనోగాని ఈ వంశీకులలో చేరిన అక్కెన ప్రగడ లక్ష్మన్నారాయణగారి కుటుంబమువారిపుడు పాతగుంటూర్నందున్నారు. ఈ కుటుంబమువారిలో అక్కెనప్రగడ పిచ్చయామాత్య హరిదాసనుపేరుగలవారు కవులు. ఈయన శాలి 1864 లోని ప్లవసంవత్సరమున కుబ్జాకృష్ణవిలాసమను శృంగార కావ్యమొకటి రచించిరి. అందు తనకుటుంబములోని మూలపురుషుఁడు శేషప్పయనియు అతనికి నెల్లసభలయందు మెప్పువడసిన రాయనమంత్రి, మేరుపర్వతమునుబోలు ధైర్యసాగరుఁడగు రామఘనుఁడు అను యిద్దరుపుత్రులు అనియు, ఇందు రాయన మంత్రికి అన్నాప్రగడవారి చిన్నదానినిచ్చి వివాహముచేసినట్లు ఆయనకు పిచ్చయ్యామాత్యహరిదాసుఁడనుకవియు, భుజంగాహ్వయుఁడను సోదర్యు కలిగియుండినటులను తనకావిశ్వనామాత్రివారి యనుగ్రహమున బాల్యముననే కవిత్వసంపద కలుగుటచే యిట్టి గ్రంథమురచించుటకు కారణమైనదని వ్రాసుకొనిరి.

మఱియు తమగ్రంథమునందిట్లు

సీ॥ జగతియందక్కెన ప్రెగడాన్వయంబున<br>
పొరిదినాపస్తంబ సూత్రమునను<br>
కౌండిన్య గోత్రసంకలితుఁడై జనియించె<br>
శేషప్పయని గోత్రసూత్రములు స్పష్ట

ముగా చెప్పుటచే కాబోలు గద్యయందేమియు వ్రాసుకొనలేదు వీరికి నందిరాజువారితోనూ- అన్నాప్రగడవారితోనూ- నండూరివారితోనూ- బంధుత్వములుగలవు. వీరో మఱియొకరో అక్కెనప్రగడ హరిదాసనువారుఅధ్యాత్మ పారిజాతమను మతసంబంధమగు గ్రంథము రచించినటుల ఆంధ్రవాఙ్మయసూచిక యందు కనుపించుచున్నది.

# గోపరాజువారు.

వీరిలో ఆర్వేల నియోగులు, యాజ్ఞవల్క్య నియోగులు గలరు. అందు ఆర్వేల నియోగులలో భారద్వాజ, శాండిల్య, కౌశిక చికితస, సాంఖ్యాయన, కౌండిన్య, శ్రీవత్స యను సప్త గోత్రముల వారు గలరు. యాజ్ఞవల్క్యులలో కౌండన్యగోత్రికులు, కౌశికగోత్రికులు గలరు గాన ముందుగా, ఏడుగోత్రములలో నుండు ఆర్వేలవారి వంశచరిత్రలు ప్రచురించి పిమ్మట నియోగిశిఖామణియు యాజ్ఞవల్క్య ప్రభు వగు శ్రీ గోపరాజు రామప్రధానిగారి వంశమును వివరించెదను.

A 1 ఆర్వేల నియోగులలో భారద్వాజగోత్రులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ అని త్ర్యార్షేయము. ఈ గోత్రికుల సంతతి వారిపు డెచటనుండిరో గాని పూర్వము రావూరి సంజీవకవి రచించిన వీరనారాయణ శతకము గోపరాజు రామనామాత్యుని ప్రోత్సాహముచే రచింపబడినటుల నీ క్రింది పద్యములో చెప్పెను—

సీ॥ సుతతటాక వన ప్రభృతి
సంతతిని వీరనారాయణుని మహిమను
కృతిముఖంబున గాని కీర్తి జగ
ద్విదితముకాదు గాన సీసములచేత
నంజీవ సుకవీంద్ర! శతక మొక్క—
టీవు రచియించు వీరనారాయణున క
టంచు శ్రీ గోపరాజాన్వయ రామ
నామాత్య చంద్రుండు రత్నహాటకాంబ

గీ॥ రాది తాంబూల సత్కృతి నాదరింప
శతకము రచియించి యిచ్చితి స్వామి నీకు
కుటిలహృదయ పినాక శ్రీకొలను పాక
వీరనారాయణ ముకుంద విశ్వతుండ.

అని చెప్పుటవల్ల వీరు కొలనుపాక కాపురస్థులైనట్లును, దిగువ పద్యమువల్ల భారద్వాజ గోత్రీకుడైన అయ్యవార్మంత్రి పుత్రుడైనట్లు లను ఈ శతకము 200 సంవత్సరములకు పూర్వము రచింపబడుటచే ఈ కుటుంబమువారు 200 సంవత్సరములకు పూర్వము కొలనుకుదురు కాపురస్థులై యుండవచ్చు నని తెలియుచున్నది. కొలనుకుదురు గ్రామము నెల్లూరుతాలూకాయందున్నది. ఇపు డీకుటుంబము వా రెవరైన అచట యుండిరో లేదో తెలియదు. వీరనారాయణశతకములోని పద్య మిట్లున్నది—

"సీ॥ తత భరద్వాజ గోత్ర పవిత్ర
పుణ్యచారిత్రాయ్యవార్మంత్రిపుత్ర గోప
రాజాన్వయ మహేంద్రరంగద్యశస్సాంద్ర
రాయనామాత్య చంద్రపురంద్ర
శాశ్వతైశ్వర్య సంజాత దాయక
కృపారస సుధాలహరీ విరాజమాన
ఫల్యారవింద సంపల్లలనా భాస భూసుర
శ్రవణాంతభాగభాగ" - - - -

అని యుండుటచే పై విషయములు స్థిరపరచుచున్నది. నెల్లూరు తాలూకాలోని కొలనుకుదురు వారేరైన వీరి విషయ మెఱిగి యుండిన వ్రాయించ గోరెద.

2 గోపరాజువారిలో శాండిల్య గోత్రము:—ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, శాండిల్య గోత్రము. కాశ్యప, అవత్సార, శాండిల్య అని త్ర్యార్షేయము. ఈకుటుంబవారు ప్రస్తుతము గోదావరిజిల్లా తణుకు తాలూకా ఉంగుటూరు, కుంచెనపల్లి గ్రామములయందున్నారు. వీరికి పూళ్ళవారితోనూ, ఆచంట_అత్తిలి_తల్లాప్రగడవారితోనూ సంబంధబాంధవ్యములు గలవు.

3 గోపరాజువారిలో కౌశిక గోత్రము:—

ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, కౌశిక గోత్రము. విశ్వామిత్ర, అఘమర్షణ, కౌశిక అని త్ర్యార్షేయము. వీరి అనాది కాపురము కొండవీటిసీమలోని చిరుమామిళ్ళ. గోపరాజు రామప్రధాని గారి కాలములో చిరుమామిళ్ళ గ్రామమును వెలనాడు, కౌశిక గోపరాజువారికి సంప్రతి కరణీక మిప్పించబడినటుల కొండవీటి దండకవిలెయం దున్నది. ఇటీవల ప్రచురింపబడిన కొండవీటి సామ్రాజ్య మను గ్రంథమున చిరుమామిళ్ళ గ్రామమును ఆర్వేల నియోగులగు శ్రీవత్సగోత్రీకులైన గోపరాజువారికి సంప్రతి యిప్పించబడినటుల ప్రచురింపబడియున్నది. ఈ చిరుమామిళ్ళ యను గ్రామము ప్రస్తుతము నర్సారావుపేట తాలూకా యందున్నది. ఈ గోత్రీకులగు గోపరాజువా రిపు డచట నుండిన వారి వివరము దెలిసినచో సవరించుకొనెదము.

4 గోపరాజువారిలో చికితస గోత్రీకులు:—

ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, చికితస గోత్రీకులు. వైశ్వామిత్ర, దేవరాత, ఔదల యని త్ర్యార్షేయము వీరు ప్రస్తుతము కృష్ణాజిల్లాలో దుగ్గిరాలయం దున్నారు. వీరు ఏలూరు కాపురస్థులగు సోదరు...... తెలియుచున్నది.

5 గోపరాజువారిలో సాంఖ్యాయన గోత్రీకులు:—

ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు. సాంఖ్యాయన గోత్రీకులు. విశ్వామిత్ర, అఘమర్షణ, కౌశిక అని త్ర్యార్షేయము. వీరు దరిమిలాను అడవివారుగా మారినారు. ఈ అడవి వారు కల్దిండి వా రని పిలువబడుటచే వీరి చరిత్ర కొంత కల్దిండివారి చరిత్రలో వ్రాయబడినది. ఈ గోత్రీకులు ప్రస్తుతము తణుకు తాలూకా కాకరపఱ్ఱు గ్రామము నందున్నారు. కామేశ్వరరావుగారిది సాంఖ్యాయన గోత్రమే నట! వీరు ప్రస్తుతము అమలాపురం తాలూకా కొమరాజు లంకలో గలరు.

6 గోపరాజువారిలో కౌండిన్య గోత్రీకులు:—

ఈ గోత్రీకులు ఆర్వేల నియోగులలోనూ యాజ్ఞవల్కులలోను గలరు. ఆర్వేల నియోగులది ఆపస్తంబ సూత్రము, కౌండిన్యసగోత్రము, వశిష్ట, మైత్రావరుణ, కౌండిన్య యని త్ర్యార్షేయము. గోపరాజు రామప్రధానిగారి కాలములో తెనాలి తాలూకా కొలకలూరు గ్రామముకు వెలనాడు కౌండిన్య, గోపరాజువారికి, పరాశర గోత్రీకులగు మాదిరాజువారికి, సంప్రతి కరిణీక మిప్పించబడినటుల కొండవీటి దండకవిలెయందు గలదు. ఈ గ్రామమునకు లీస్టు యివ్వబడిన కరణము గోపరాజు గోపయ్యగారు. ఈయన దౌహిత్రు డగు భూరెపూడి కొండయ్యకు కొంతభాగము సంక్రమించినటుల లోకల్ రికార్డులోని కయిఫియ్యతువల్ల కనుపించుచున్నది. ఈ విషయమె కొండవీటి సామ్రాజ్య మను గ్రంథమందు వ్రాయబడియున్నది గాని యిప్పుడీ గోత్రీకులైన గోపరాజు మంగపతిరావుగారి కుటుంబము కొలకలూరు గ్రామమందున్నటుల తెలియుచున్నది. ఈ గోత్రీకులగు గోపరాజువారికి వినుకొండ తాలూకా పొట్లూరు గ్రామముకు సంప్రతి కరి

కము గలదు. వీరు పొట్లూరు వచ్చిన వెనుక పొట్లూరివా రని పిలువబడుచుండిరి. వీరు పొట్లూరు గోపయ్య అను కవీశ్వరుని సంతతి వారైనటుల కొండవీటి సామ్రాజ్యమున వ్రాయబడినది.

7 గోపరాజువారిలో శ్రీవత్సగోత్రము:—

ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, శ్రీవత్స గోత్రము. భార్గవ, చ్యవన, ఆప్లువాన, ఔరవ, జామదగ్ని యని పంచార్షేయము. వీరికి కొండవీటిసీమలో చిరుమామిళ్ళ గ్రామమునకు సంప్రతి కరిణీక మివ్వబడినటు కొ॥ దండకవిలె యందు గలదు. ఇదిగాక ఈ గోత్రీకు లగు పేటవారికి గోపినాథపురము గ్రామముకు సంప్రతి యివ్వబడినటులను వీరిని కొంతకాలము సాలసవా రనియు అనంతరము సంకురాత్రిపాటివా రనియు పిమ్మట గోపరాజువారనియు పిలువబడుచుండినటుల తెలియుచున్నది. ఈ గోపినాథపుర మెచటిదో తెలియదు. బహుశా యిదిబాపట్ల తాలూకా గోపాపురమో, లేక నరసారావుపేట తాలూకాగోపాపురమో కావచ్చును. సాలసవారు కొందరు విశాఖపట్టణము జిల్లాలో నున్నటులను వారిది కౌండిన్యగోత్రమని తెలియుచున్నది.

8 గోపరాజువారిలో యాజ్ఞవల్క్యులు, యాజ్ఞవల్క్యనియోగులు, కాత్యాయన సూత్రము, కౌండిన్యగోత్రము, వాసిష్ఠ, మైత్రావరుణ, కౌండిన్య అని త్ర్యార్షేయము. వీరు అనుముకొండలు. వీరిలో రామప్రధానిగారు ఆంధ్రదేశములోని అన్నిశాఖలనియోగులకు జీవనాధారము కల్పించి తరతరములనుండి ప్రఖ్యాతినొందుచుండిన మహాపురుషుడు—మృతజీవుడు—స్వకులాభిమాని—యని చెప్పకొనదగిన వారిలో మొదటివాడు. ఈ యనగోత్రము కౌండిన్యగోత్రమని కొందరును కౌశికగోత్రమని కొందరును చెప్పుచున్నారు. రెంటికిని ఆధారములు

కనుపించుచుండుటచే నెటుచెప్పుటకు వీలు కనుపించుటలేదు.

ఇతఁడు శాలివాహనశకము 1050 కాలమునందు కళింగదేశపు రాజగు గణపతి మహారాజుకాలములో కొండవీటిసీమయందు మంత్రిగా నుండెను. ఈ గోపరాజువారి వంశచారిత్రముకు ముందు కొండవీటిచరిత్ర కొంత తెలుపుట ముఖ్యావసరముగా గనుపించుచున్నది. పూర్వము ముస్తుజానగర్, ముర్తుపానగర్ లేక గుంటూరు, బందరు జిల్లాయందుండు ప్రదేశములవారిలో కొండవీటి సీమవారితో సంబంధించినవారుమాత్రము తమ దేశమందు పూర్వకాలములో నడచిన సంగతులన్నియు, 'దండకవిల' యను తాటియాకు పుస్తకములో వ్రాసియున్నారు.

పూర్వకాలమున క్రోష్టుని వంశజుండగు జ్యామఘుడనువాఁడు తన తండ్రిరాజ్యమును విడిచి నర్మదా నదీతీరంబునకువచ్చి మధ్యదేశము యావత్తు జయించి తద్దేశము నిజనివాస తలముగఁ జేసికొనెను. ఇక్కాలంబున నితనికొక సుతుడుదయమాయెను. ఇతను విదర్భుడను పేరుగలిగి, యతిపరాక్రమవంతుఁడును, ధర్మపరిపాలకుండునై యనేకదేశముల సాధించెను. ఈయనపాలించు దేశము విదర్భదేశము అని పిలువబడుచున్నది. ఈ విదర్భదేశాధీనుండగు భీష్మకుని రాజధానియై జగన్మాతయగు రుక్మిణీదేవికి జన్మస్థానంబై కుండినపురంబను నామముచేఁ బ్రసిద్ధిఁ జెందియుండెను. ఎప్పుడు యేకారణంబుచే నీకుండినపురమునకు కొండవీడను నామమేర్పడినది స్పష్టముగాఁ దెలియదు. విదర్భదేశమిదికాదనియు కుండినపురమనునది బీదర్ దేశమునందు గలదనియు అనేకు లనేకవిధములుగ వ్రాయుచున్నారు. కొండవీటికి కుండినపురమని పర్యాయనామము కలిగియున్నటుల కొండవీటి గ్రామప్రాజ్యము సమర్థించుచున్నారు. ఈ రాజ్యమును పాలించిన ప్రభువు ముక్య...

అనియు, రుద్రుఁడు అనియు, ప్రతాపరుద్రుఁడు అనియు వాడఁబడెను. ఈయన నివాసస్థానము కొండవీడు. అట్టి కొండవీటి చారిత్రను శా॥ శ॥ 1250 నల సం॥ లో జయనాగదేవ భట్టరు, అనంతరం సంపటంచిన కోనప్ప, పిమ్మట పోలంరాజు అన్నంరాజు అను ముగ్గురు పురుషులు అంతకు పూర్వము జరిగిన చారిత్రాంశములను దండకవిలగా వ్రాసియుంచిరి. ఆచారిత్రమును తెలుసుకొనుటకు యిప్పటికాదండకవిలెయే యాధారముగా నున్నది. ఈ ప్రదేశమును ముక్కంటి తన ప్రతాపమున జయించి క్రీస్తుశకము 232 మొదలు, 298 వరకు 66 సంవత్సరములు రాజ్యపరిపాలన జేసినట్టు కనుపించుచున్నది. ఈ ముక్కంటియను పురుషుని విషయము:— కృష్ణానదీతీరంబున అమరావతియను పట్టణంబొకటి కలదు. అందు నమరేశ్వరుఁడగు ఈశ్వరుఁడు చాలా మహిమఁ జెంధియుండెను. ఒకనాడొక బ్రాహ్మణస్త్రీ (పూర్వసువాసిని) కృష్ణలో స్నానముచేసి స్వామిసన్నిధికరిగి 'స్వామీ! భూమినేలు పుత్రుఁడొకని నాకిచ్చితివేని నీకు పుట్టెడునీటితో దీపారాధనచేసి పుట్టెడు ఇసుక అన్నమువండి నివేదనచేయుదును' అని పలుకగా నామెను చుట్టుకొనియుండు అమ్మలక్కలందరు పకపకనవ్విరి. అంత జలముచే దీపము వెలుగుటయు, ఇసుకతో యన్నము అగుటయు ఎంతనిజమో విధవరాలు పుత్రునిగనుటయు అంతనిజమే యనుచు నాపె నిజగృహంబునకుఁ జనియె. కొంతకాలమునకు పిదప నీయబలకు గర్భమేర్పడి తత్సంబంధములగు చిహ్నములన్నియు ఇరుగు పొరుగువారికిగోచరంబాయెను. అనంతరము ఆమెకు మొగశిశువు గలిగెను వితంతువు గర్భవతియై కొమరుని గనుటచే నూరివారందరు ఆమె ననేకవిధముల నిందింపసాగిరి. క్రమక్రమముగా నాబాలుఁడు పెరిగి పెద్దవాఁడై యితరులచేఁ బరిహాసింపఁబడి సిగ్గుఁబడి తల్లినియొత్తిడిచేయగా నోర్వఁజాలక

నిరపరాధియగు నబ్బాలిక దృఢచిత్తయై శుచియై ఈశ్వరుని మనస్సు ధ్యానించి, కృష్ణోదకమును దెచ్చి ఒక తొట్టిలోఁబోసి వెలిగించగా నది వెలిగెను. ఆ యేటి యొడ్డుఇసుక తెచ్చి వండఁగా స్వచ్ఛమైన అన్నమాయెను. ఈ యద్భుత కార్యమునుజూచి ప్రజలందరు విభ్రాంతినొంది తామిదివరకు పలికిన పరుషవాక్యములకు పశ్చాత్తాపమునొంది తల్లిని కుమారుని కులములోఁ జేర్చుకొనిరి. ఈ చిన్నవాఁడు రుద్రమహాంశ సంభూతుఁడై భ్రూమధ్యమందు మూసిన కన్నువలె ఒకగుర్తుండుటవల్ల ముక్కంటియని పేరిడిరి. ఈ ముక్కంటి కొంత సైన్యమును గూర్చుకుని ప్రథమములో ధరణికోట వశపరచుకుని, పిదప చుట్టును నుండురాజ్యమును స్వాధీనపరచుకొనెను. (ఇతని రాజ్యకాలము క్రీ॥ శ॥ 1146—1196) ఈ యనకాలములో నీదేశమందు బ్రాహ్మణులు లేరు. జైనులు విస్తారముగాఁగలరు. పాలకురికి సోమారాధ్యుఁడను యొకపరమయోగి ప్రతాపము మిక్కుటముగా నుండెను. ముక్కంటి ధరణీకోటలో నుండు కాలమున కొందరు మహాసిద్ధుల వలన తలచినచోటికి తీసికొనిపోవు మంత్రశక్తిగలపాదుకలు సంపాదించి వాటి ప్రభావముచే ననుదినము ప్రాతఃకాలమున కాశికిపోయి గంగాస్నానముచేసి వచ్చుచుండెడివాఁడనియు ఈరహస్యము జైనులవలన తీయనభార్య తెలిసికొని భర్తతోనామెయు పాదుకలసహాయమున కాశీకిఁబోయినపిదప అశుచియగుటచేఁ దత్ప్రభావంబు తొలగిపోవుటవలనచట బ్రాహ్మణులను రావించి తన పురంబునకు పోవునుపాయము చెప్పుమని వేడుకొనగా నావిప్రముఖ్యులు ముందు పన్నెండుసంవత్సరములకు రాబోవు కరువుకాలమందు మమ్ములను పోషించెదనని వాగ్దానముచేసిన పాదుకలు నడిపించెదమని చెప్పి అందుకు నారాజును సమ్మతింపఁజేసి ఆ బ్రాహ్మణులు తమ తపోమహిమచే ముక్కంటిని భార్య

సమేతముగా ధరణికోట వెళ్లునటుల జేసిరనియు అనంతరము వారుచెప్పి నటుల కరువు సంభవించగా నచ్చట బ్రాహ్మణులందరు ఈ దేశమువచ్చి స్థావరములు ఏర్పరచుకొనిరనియుఅదియె త్రైలింగ్య బ్రాహ్మణోత్పత్తికి కారణమని ఒక కథకలదు. ఇట్టికథలు ఈ షణ్మాత్రము తేడాలతో చాలా గ్రంథములందు వ్రాయబడినవి బ్రాహ్మణోత్పత్తి మార్తాండ మను గ్రంథమునందు, నందవరీకుల గ్రంథమునందు ఇట్టి కథ యొకటి గలదు కాశీయందు కరువు వచ్చి నప్పు డీ దేశము వచ్చిన ఉత్తరాది బ్రాహ్మణులు. విప్రవినోదులమూలమున జైనుల నోడించి రాజానుగ్రహమునకు పాత్రులై స్థిరవసతులు సంపాదించి ఆంధ్ర త్రైలింగ బ్రాహ్మణులైనట్లు వ్రాయబడినది. ముక్కంటి తన రాజ్యమగు కొండవీటిసీమయందు శిస్తుదస్తులు తెలుసుకొనుటకు తగు సదుపాయములులేక తన దేశమంతయు పదునాల్గు భాగములుగా విభజించి వానికి సీమలని పేరుపెట్టెను. అందు (1) కొండవీటిసీమ ఇందు 580 గ్రామములు గలవు 2 బెల్లంకొండసీమ-దీనిని బిలంకొండసీమయని పిలుచుటకూడకలదు. ఇందు 100 గ్రామములున్నవి. 3 విన్నుకొండసీమ-ఇందు 225 గ్రామములుగలవు. 4 నాగార్జునకొండశీమ- ఇందు 160 గ్రామాదులుగలవు. చంద్రగుప్త మహారాజువంశజుండగు నాగమహేంద్రుడు ఉత్తరదేశమునదలి యీ ప్రాంతమున కేతెంచి ప్రస్తుతము తుమ్మృకోట డివిజన్‌తో జేరియున్న నాగులవరమను గ్రామ సమీపమందుండు పర్వతమునీద నొక కోటకట్టించెను. అది అతని పేరట 'నాగార్జున దుర్గము' అని పిలువఁబడెను. ఆకాలమున ఆదుర్గమును చుట్టియుండు దేశము నాగార్జున కొండశీమయనియు కొంతకాలమునకు పిమ్మట పల్నాటిసీమయనియు పిలువబడెను. 5 అద్దంకిసీమ ఇందు 55 గ్రామాదులుగలవు 6 అమ్మనబ్రోలుసీమ- ఇందు 55గ్రామ

ములు గలవు. 7 కంధుకూరుసీమ- ఇందు 65 గ్రామములుగలవు. 8 నె ల్లూరుసీమ- ఇందు 150 గ్రామములుగలవు. 9 ఉదయగిరిసీమ- ఇందు80 గ్రామములుగలవు. 10 చుండిసీమ- ఇందు 44 గ్రామములుగలవు. 11 పొదిలెసీమ-ఇందు 66 గ్రామములుగలవు. 12 మార్కెల్లసీమ- ఇందు 58 గ్రామములు కలవు. 13 కోటసీమ- ఇందు 60 గ్రామములు గలవు. 14 దూపాటిసీమ ఇందు 36 గ్రామములుగలవు. మొత్తము గ్రామము లు 2048 (ఇవిగాక నందిగాను సీమ90, కంభంసీమ 200, వినుకొండసీ ము 225 గాక 237 గ్రామములనియు మొత్తం 2350 గ్రామములని మరియొకప్రతి. ఈ దేశము ముక్కంటి అనగా ప్రతాపరుద్రునికి 600 ఏండ్లకు ముందుండు రాజాయనంతరము క్రీ॥ శ॥ 299 మొదలు 515 వరకు 217 సంవత్సరములు చోళమహారాజు స్వాధీనమందుండెను. అనంతరము క్రీ॥ శ॥ 516 మొదలు 973 వరకు జ్ఞానభోజుడు మొదలు గు 9 గురు సూద్రరాజు లేలిరి. అనంతరము క్రీ॥ శ॥ 973 మొదలు 1133 వరకు గజపతి, అశ్వపతి, నరపతియను ముగ్గురు రాజులేలిరి. దండకవిలెయందున్న విధమిట వివరించితినిగాని ఇందలి సత్యాసత్యము లరయుట ప్రస్తుత గ్రంథమునకవసరములేదు గాన అందలి సత్యాసత్య ము లారయలేదు. ఆవిషయము లెరుగగోరినవారు బ్రా॥ శ్రీ చిల కూరి వీరభద్రరావుగారు ప్రచురించిన ఆంధ్రులచరిత్రచూచిన నందలి క మార్పులతో కథ నిటులనె నుడువబడినది. వీరి ముగ్గురిని జయించి అనంతరము 160 సంవత్సరములు రుద్రుని యింటివారేలిరి. వీరిలో ప్రతాపరుద్రుడు ముఖ్యుడు. ఈయన కాలములో గోల్కొండ పట్టము స్థాపనకాబడి గోలకొండ వ్యాపారుల వ్యుత్పత్తి పుట్టినది. ఈ ప్ర తాపరుద్రునిమంత్రి యుగంధరుడు. ఈయన మిగుల నేర్పరి. రాచకార్య దురంధరుడు, అతను బ్రాహ్మణులలో తెలివిగలవారిని పిలిపించి నా

వ్యాపారులను సంజ్ఞ ఏర్పరచి, దేశపాండ్యా, దేశముఖి, సిరస్తాదారీ, ఫేష్కారీ మొదలగు గొప్ప యుద్యోగములను వారికిచ్చుచు వచ్చెను. ఈ వ్యాపారులు గోలకొండవదలి ఈ దేశమురాగా గోలకొండనుంచి వచ్చినవ్యాపారులు క్రమముగా గోలకొండవ్యాపారులని పిలువఁబడుచు వచ్చిరి. క్రీ॥ శ॥ 1133 మొదలు 1144 వరకు విరియాల శ్వంభరగజపతి కొండవీటికోట స్వాధీనము చేసుకొనెను. క్రీ॥ శ॥ 1145 మొదలు 1237 వరకు విశ్వంభరుని కొమారులగు గణపతి మొదలగువారు 143 ఏండ్లు రాజ్యమేలిరి. ఈ గణపతి ప్రభువుని కాలములో. గోపరాజు రామప్రధానిగారు, ప్రధానిగా నుండెను. ఆరాజ్యమందు ఆదికాలము నుండియు బ్రాహ్మణేతరులు కరిణీకపుపని చేయుచుండుటచే సర్వాధికారము వహించి విద్యయనుమాట ఎంతమాత్రము గిట్టక బ్రాహ్మణులను వారివారి కాలోచిత కృత్యములను జరుపుకొనకుండా అభ్యంతరము పెట్టుచు వారు నిరంతరము తపఃస్వాధ్యాయపరులై స్వేచ్ఛగా సంచరించకుండునటుల వారిని ముప్పు తిప్పలుపెట్టి మూడు చెరువులనీరు త్రాగించుచుండెడి వారనియు. ఆకాలములో అనగా శా॥ శ॥ 1066 సంవత్సరమున రామ ప్రధాని జగన్నాథ యాత్ర చేయు సమయమున దారిలో బ్రాహ్మణులకు సంభవించిన రెండువిపత్తులు స్వయముగాఁ జూచినటుల గోపరాజు రామప్రధానిగారి చరిత్రమందు గురుజాడ శ్రీరామమూర్తి పంతులగారి వలన వ్రాయబడిన దాని నీదిగువనుదహరించుచున్నాను, 'రామప్రధానిగారు శా॥ శ॥ 1066 కాలంబున శ్రీజగన్నాథంబు చూచునిచ్ఛచేఁ దనయొడయునికడ శెలవుతీసుకొని మితపరివారుండై బయలు వెడలె. ఇట్లు కొన్నిదినంబులు మార్గంబునడచి యొక పల్లెనుంజని యామరుదినంబు పితృకార్యంబవుటంజేసి యచ్చట నిలిచి విప్రయుక్తముగా భోక్తల తొలిదినంబుననే మంత్రణంబుచేసెను.

అందొక బ్రాహ్మణుడీయవలసినపన్ను చెల్లింపకుండుటంజేసియాయూరిమిరా సీదారుండు ఆబ్రాహ్మణునిబట్టి నిర్బంధించి ఎన్నివిధముల ప్రార్థించినను విడువక, బ్రాహ్మణకార్యమునకు భంగమువచ్చుననియు, కార్యము నెరవేరినతోడనే అతనిం బంపెదనని రామప్రధానిగారు వర్తమానము పంపినను తిరస్కరించుటచే నాబ్రాహ్మణుఁ డియ్యవలసిన పన్ను తానిచ్చి యానాటికార్యము నెరవేర్చి యాత్రకుం జనియె.

ఇతనింకొక గ్రామంబునకుఁ జని యొక బావికడ స్నానముచేసి సంధ్యాది కృత్యములు జరుపు కొనుచుండెను. అప్పుడొక బ్రాహ్మణచిన్నది, ఆయూరి మిరాసీదారుఁడగు కంసాలి భార్యయు నీళ్ళకువచ్చుటచే ఆమె నీళ్లుతోడుకొనువరకు నిలువబడియుండెను. కరణం భార్య నీళ్లుతోడుచు పాటలుపాడుచు జాప్యముచేసెను. ఇంతవరకు నిలువబడియుండిన బ్రాహ్మణచిన్నది రామప్రధానిని జూచి 'నానేరంబేమియు లేదని మీకు విశదమేకదా? కర్ణంభార్య నీళ్లకువచ్చి జాప్యముచేసెను. దీనికి మాయత్త శిక్షింపకుండ యదార్థముచెప్పవలెనని వేడుకొనెను. ఈ రామప్రధాని మనస్సునకుకఠినముగానాటి బ్రాహ్మణులకధికారమున్న ఇంతచేటు వాటిల్లదని నిశ్చయించి అట్లు చేయ దగుసమయము నిరీక్షించుచునుండెను. అంతట కొన్నిదినంబులకు గ్రహణ సమయంబున తంజావూరు రాజు నదీజలంబు స్నానంబునకరిగె. ఆసమయముకనిపెట్టి రామప్రధాని తన భటులను పిలిపించి బ్రాహ్మణుల నెవరిని రాజుకడకురానీయవలదని నాజ్ఞాపించి తానొంటరిగా రాజుకడకుంజనియె. అప్పుడు రాజతనిం జూచి సంకల్పమునకు బ్రాహ్మణుండులేడా? అనుడు అవసరంబడినచో నేను సంకల్పంబుజెప్పెదను. నేనుబ్రాహ్మణుండనుకానా తాము గ్రహణకాలంబున నీయదలచిన దానము నాకే దయచేయవచ్చును. అనుడు రాజు కొంచమాలోచించి నీవునియోగివికావా? అని ప్రశ్నింపగా అందులకు రామమంత్రి యిట్లనియె.

ఉ॥ మానధనుండు బ్రహ్మకుల మండనమూర్తి పరోపకారి దు
ర్దాన దురన్నముల్ గొనఁడు తప్పడు స్వామిహితైకకార్యముల్
దీనులఁ బ్రోచు బాంధవ విధేయుఁడు డస్సియు వేఁడబూన డిం
పూనిన భక్తితోడుత నియోగి కొసంగిన దాన మల్పమే!

అనుడు నారాజు నీవు కవివి గాని పండితుఁడవు గావు నీకు దాన మియ్యవచ్చునా యనుడు రామమంత్రి యిట్లనియె

చ॥ కవి కమలాసనుండు త్రిజగత్పతియైన పినాకపాణియున్
గవియెఁ తలంపగాఁ గవులు గారె పరాశరబాదరాయణుల్
కవికృతపుస్తకగ్రహణ గర్వితు లెల్లను బూజనొందఁగా
గవు లట! దానపాత్రకులు గారట! ఇట్టిదె పో విచిత్రముల్.

అనవుడు నీవు మాకడ వ్రాతకు కుదిరినాడవు. నీవెట్లు దానపాత్రుడ వగుదువు? అనుడు రామప్రధాని యిట్లనియె

ఉ॥ వ్రాయుట దోసమా! యిదియ నైదికమా? నిజదార రక్షణో
పాయము జూడగోరి యల పార్థివ సేవకు జొచ్చినంతనే
పోయెనె వంశశీలములు పూర్వులు సేయరె చిత్రగుప్తులుర్
వ్రాయరె యెల్లలోకములవారలు సేసిన పుణ్యపాపముల్.

అనుడు రాజు నవ్వి ఇత డెద్దియో వాంఛించి వచ్చెను కాబోలు నని యూహించి యాతనిచే సంకల్పము చెప్పించుకొని యనంతరము నీవు కోరిన దానిని నిచ్చెదను కోరు మనుడు, నాత డిట్లనియె. 'దేవర కటాక్షమున నాకు సర్వంబును గలదు. నాకు ప్రభుత్వముచేయ నిచ్ఛ గలదు గాన ఒక యామంబు దనుక నే గోరుతరి దేవరభద్ర ముద్రికం దయచేయు మనుడు రాజు దానికి సమ్మతించె. అనంతర మా యిర్వురు యథేచ్ఛం జనిరి. అనంతర మా ప్రధాని లౌకికజనముల రావించి ధరణీసుకడ లా గ్గ కొనిన బాసంబు తెరంగు నారల కెఱిం

గించి తన మనోరథము జెల్పి కొండవీటిసామ్రాజ్యమున వెలయు గ్రామము లన్నిటికి విప్రు లధిపతులై యుండునటుల ధర్మశాసనంబులు తెమ్మని యాజ్ఞాపించి ఒకానొకదినమున రాజు ముద్రికం గైకొని రాజ్యపాలనం బూని తా ననిపిన ఆశ్రితు లమరచి తెచ్చిన తామ్రశాసనములపై తన ముద్రిక ముద్రింపించి ఈ దిగువ విధమగుశాసనము చెక్కించెను. ఆ శాసనభావమును తెల్పెడు తెలుగు పద్యము నిట నుదహరించెదను:—

సీ॥ శ్రీగజపతివంశసింధు సుధాకరు
డన దగు గణపతి జనవరుండు
చతురబ్ధి వలయిత క్ష్మాతలం బాత్మ మం
త్రిల సమ్మదమున నుజ్వలముగాగ
నేలుకాలమున మహీతలమున గోప
రాజాన్వయుం డయిన రామమంత్రి
గణికుల కెల్లను గడుహితంబుగ
గృష్ణవేణీతటంబున వింశభాగ
గీ॥ కలన నాహార వృద్ధివృత్తుల గ్రహించె
నవని రక్తాక్షి భాద్రపదార్క వార
గ్రహణమందున గోత్రశాస్త్ర వియదిందు
హాయనము లయినశాలివాహన శకమున.

పరిభుత్వనిర్ణయానంతరకాలంబున నమ్మహీను పాలికిం జని; నృపతిం జేరి 'మహాత్మా! యుష్మదనుగ్రహాతిశయంబున మన్మనోరథం బీడేర్చు కొంటి.—

మ॥ ఘనమకా త్రావక రాజ్యమందు సకలగ్రామాధికారంబులన్
జనితానంద నియోగిభూసురులకున్ సాగించి తత్త్వద్వితే

ఖనముల్ సేయుచు గొల్వ నేర్పరచిరక్షాదృష్టి తాంబూలచం
దనహేమాంబరరత్నయుక్తముగ భూదానంబులం జేసి శా
సనముల్గూర్చితి నీ యశంబు నా చంద్రార్క సంస్థాయిగాన్.

అని వచించెను. రాజును తత్కార్యమునకు సంతసించెను. ఆకాల
ములో కొండవీటి రాజ్యములోని 14 సీమలయందుండిన గ్రామాదులు
పైనుదహరించిన సంపటంచిన కోనప్ప మున్నగువారు వ్రాసియుంచి
నట్లు చెప్పబడి నాకు లభించిన కొండవీటిసీమ దండకవిలె వ్రాతప్రతు
లనుబట్టి చూడగా, అన్నిసీమలలోని గ్రామములు 2048 యో లేక,
2350 కంటె యెక్కువ కనుపించవు. నావలన తయారైన కర్ణీకముల
లిస్టులో మాతృకకు భిన్న మని విడిచిపెట్టబడినవి గాక మిగిలినవి 945
గ్రామములకంటె యెక్కువ కనుపించవు. మాతృకకు భిన్నమను వాని
లో వినుకొండసీమమున్నగునవి 400 గ్రామము లుండియున్న వను
కొనినను మొత్తము 1400 గ్రామములకు లోపుగా కనుపించుచున్నవి.
అందువల్ల చూడగా, రామప్రధాని గారాజాములో యిచ్చిన కరణీక
ములు—వినుకొండసీమలో 225, కొండవీటిహవేలీ గ్రామాదులు 580
తక్కిన సీమలలోని గ్రామాదులకు పెత్తనపుకర్ణీకములారు - పంద
లు, యిచ్చినట్లు కనుపించుచున్నది. క్రమక్రమముగా ఆంధ్రదేశమం
దు చాలభాగములలోని కర్ణీకపువనతులు నియోగుల వశమైనవి.
ఈ మహాపురుషుని ఔదార్యాతిశయమున అనేక వేలనియోగులు 7-8
వందలు సం॥ నుంచి సుఖజీవనము సల్పుచున్నారుగాని ఇపుడు దొరత
నమువారు జీతములేర్పరచి భూములకు పన్నుకట్టి పట్టాలిచ్చుటచేచాలా
భాగములమ్మకమగుచున్నవి. అనుమకొండనుంచివచ్చినయాజ్ఞవల్క్యులలో
100యింటిపేర్లవార్లకు కరణీకములిప్పించినట్లు కనుపించుచున్నది-శ్రీశ్రీ
పూరే వీరభద్రకవిచే రచింపబడిన 'కరణీకోద్ధారిణి' యను గ్రంథమున

సీ॥ శాలివాహాఖ్యశకవత్సరము లద్రిరస
పుష్కరేందుల [1067] నెసగుచుండ
రక్తాక్షివర్ష భాద్రపద కృష్ణామా
ప్రయుక్కుజవార సూర్యోపరాగ
సమయంబునఁ గళింగ జననాయకా
గ్రణి గజపతివంశ ప్రకాశకుండు
గణపతిరాజు శాఖాసూత్రగోత్ర సం
పన్నుఁడ వౌ నీకు నిన్ని యూళ్ల
ననదృశంబైన గ్రామణిత్వాధికార
మున కొసంగెను ననుభవింపుము రవీందు
తారకంబులు గల్గు నందాక ననుచు
వేరువేరుగ నుండుట వినియె నృపుడు.

ఉ॥ ధీనిధి గోపరాజకులదీపకుఁడై తగురామమంత్రి పం
చాణులయందునిశ్చలత నానిన యీ కరిణీకధర్మముల్
పూనికఁ జేసి తీసి ద్విజపుంగవులం బిలిపించి యిచ్చె నౌ
నౌ నని సంతసించిరి నిరంతర సౌఖ్యము నొంది రందరుౕ.

ఇట్టి గొప్పకార్యముచేయుటచేతనే—

"గణిక నిర్వాహంబు గల్పించె నూరూర
మహి గోపరాజు రామప్రధాని"

అని ముప్పదియిద్దరు నియోగిమంత్రుల సీసమాలికలో జెప్పబడినది. ఇట్టిమహాపురుషుని సంతతివా రిపు డెచట నుండిరో గదా! పూర్వము నుండియు మహాపురుషవర్యులయొక్కయు, వారి కుటుంబములయొక్కయు, సంగ్రహచరిత్రలు లేకపోవుటచే గదా యిట్టి లోపము వాటిల్లిన దని విచారింపవలసివచ్చినది. ఈ రామప్రధాని తా నిచ్చిన కర్ణి

కములలో తన సంతతివారిలో నిద్దరికి మాత్రము కొండవీటిసీమలోని కొలకలూరు గ్రామమునకు, గుంటూరు తాలూకా తంగెళ్ళమూడి గ్రామమునకు మిరాసీలు యివ్వబడినట్లు కనుపించుచున్నది. తంగెళ్ళ మూడియం దుండు కౌండిన్యస గోత్రీకులగు గోపరాజువారు అనుమ కొండవారని ప్రస్తుతము పిలువబడుచుండిరి. యాజ్ఞవల్క్యులలో వీరు అనుమకొండ శాఖీయు లగుటచేత, యింటిపేర్లు అనుమకొండ లని పిలు వబడుచుండిరేమో. వినుకొండ తాలూకా పొట్లూరునకు సంప్రతి కరి ణీక మివ్వబడిన గోపరాజువారు పొట్లూరివా రని పిలువబడుచుండి రని యు, యీ పొట్లూరివారిలో గోపయ్య యను కవి గల డనియు, వీ రా కవి సంతతివా రనియు కొండవీటి సామ్రాజ్యములో వ్రాయబడి నది. రామప్రధానిగారి చరిత్రి బ్ర॥ శ్రీ॥ గురుజాడ శ్రీరామమూర్తి గా రొక గ్రంథముగా బ్రచురించిరి. ఇంకనూ విశేషములందు గన నగును. ఈ కుటుంబములవా రిపుడు గోదావరిజిల్లా, పెనుమంత్ర, ఆలమూరు, కొడమంచిలి, మట్టపర్రు, మొగలితుర్రు, అమలాపురం, మాచవరం, రాజమండ్రి మున్నగు ప్రదేశములలో గలరు. వీరి కను శృతముగా రాయభారంవారు—మాగి—బొల్లాప్రగడ—చెట్లపల్లె—అయి నాపురం—అయినపర్తి—పుసులూరి—సరిపెల్ల-జోస్యుల—విప్పర్తి—కొప్పర్తి దిగుమర్తి—పోతులవారలతో సంబంధబాంధవ్యములు గలవు.

వీరి కూటస్థుల మనువా రిపుడు మట్టపర్రు, పెనుమంత్ర, కొడ మంచిలియందున్నారు. వీరందరిది కౌండిన్యగోత్రమె. కాశ్యప అనుట యెటులవచ్చినదో తెలియదు.

---

☞ పూర్వము కొండవీటి దండకవిలెలో వ్రాయబడినవిధమె యిందు వ్రాయబడినది.

## చాట్రాతివారు

ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, కౌండిన్య గోత్రీకులు. వాశిష్ట, మైత్రావరుణ, కౌండిన్య యని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరి అనాది కాపురము తిరువూరు తాలూకా చాట్రాయి. ఈ కుటుంబీకులు బెజవాడలో గలరు. చాట్రాతి వెంకటరామయ్యగారు తీగెలవంచ నర్సాపురం, చింతలపూడి గ్రామములయం దున్నారు. చాట్రాతి శ్రీరాములుగారు నూజివీడు తాలూకా కేతవరం, జగ్గవరం అనే గ్రామములయం దున్నారు. వీరికి నండూరివారు చుట్టములు.

## అచ్యుతునివారు లేక అచ్చుతన్నవారు

ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, కౌండిన్య గోత్రీకులు. వాసిష్ట, మైత్రావరుణ, కౌండిన్య అని త్ర్యార్షేయము. వీరి కీ యింటిపే రెటుల వచ్చినదో గాని వీరి అనాదికాపురము కృష్ణా జిల్లాలోని తిమ్మసముద్రము. వీరి మూలపురుషుడు యజ్ఞేశ్వరసోమ యాజి. ఈయన కుమారుడు శేషాద్రిసోమయాజి. ఈయన కైవల్యనవనీత గ్రంథకర్త యగు శ్రీ కనుపర్తి వేంకటరామ శ్రీ విద్యానందనాథులవారి మాతామహు డగుటచేతను, గ్రంథమునం దీయన నిట్లు బొగడిరి.

మ॥ ధర సాధించి యమాది నిష్ఠల సుభద్రాకాంత నుద్వాహమై
సొరిదిం బాకహవిర్మఖాఖిల మఖస్తోమంబు సోమంబు వా
సరపూర్వాణిల సత్కృప న్సలిపి సత్సప్త ప్రసంతానముల్
వర శేషాచలయజ్వనా నెగడె విద్వత్సంఘు మగ్గింపగన్.

ఈయనకు యజ్ఞనారాయణసోమయాజి, రాజేశ్వరసోమయాజి, సుబ్బయ్య పంతులు అను ముగ్గురు కుమాళ్లు నలుగురు ఆడపిల్లలు గలిగిరి అందు రెండవ పిల్లయగు కామాంబను వేంకటరామ విద్యానందనాథుల వారి తండ్రి యగు కనుపర్తి వెంకయ్యగారి కిచ్చినట్టు ఈ దిగువ పద్యమువల్ల దెలియుచున్నది.

మ॥ కరమా యజ్వసుపుత్రులన్ స్వసములన్ గౌండిన్యగోత్రంబు వి
స్తర మొందంగనె, మువ్వురన్నలువురన్ సంస్తవ్యలౌ స్త్రీల నం
దరయన్ రెండవకాంత సామ్యయయి కామాంబాభిధానంబుచే
బరఁగెన్ శ్రీత్రిపురాంబయో యనఁ బరబ్రహ్మైను సంధానయై

తే॥ ఆ రతజనరక్షకుడు కనుపర్తి వేంక
యాభిధాన ప్రధాని కామాంబ యనెడు
ధీయుతను బెండ్లియై కీర్తిఁ దేజరిల్లి
సుతుల నిరువుర సుజన సమ్మతులఁ గనియె.

అని చెప్పెను. ఈ కుటుంబమువారు 200 సంవత్సరములకు పూర్వము అనేక గ్రామములు యిజారాచేయుచు ధనికులుగను, యజ్ఞయాగాదికము లొనర్చు సదాచార నిరతులుగాను, బహుపుత్రపుత్రికా సంతతికలవారుగా నుండియుండిరట! ఈ శ్రోత్రియకుటుంబమువారి సంతతి యేమాయెనోగాని యితర గ్రామాదులయందున్న వెంకట నర్సయ్యగారి కుమారుడు శ్రీరాములుగారిని దత్తత దీసికొని నటుల తెలియుచున్నది.

పూర్వ మీ తిమ్మసముద్రములో నుండెడు వేంకటేశ్వర్లుగారు అరుంబాక గ్రామం వచ్చి నివసించినారు. ఆయన కుమారుడు వెంకటరామయ్యగారు. వీరికి బాపిరాజు, కృష్ణంరాజు, రామయ్యా, వెంకటచలము అని నలుగురు కుమాళ్ళు. ఇందు బాపిరాజుగారికి సం

లేదు. కృష్ణంరాజుగారికి లక్ష్మీనరసయ్య, బాపయ్య, కామయ్య
అను ముగ్గురు కుమాళ్లు గలరు. ఇందు లక్ష్మీనరసయ్య నిస్సంతు,
బాపయ్యగారికి గోపాలముగారు. వీరు చాలకాలమునుంచి గోదా
వరిజిల్లా అమలాపురము నివాస మేర్పరచుకొనిరి. మూడవవాడు
రామయ్యగారికి పట్టాభిరామయ్య, వెంకటరావు అని యిద్దరు కుమా
ళ్ళు గలరు. ఇందు పట్టాభిరామయ్యగారు గంజాము జిల్లా శ్రీకాకు
ళమున నివాస మేర్పరచుకొన్నారు. ఈయన తమ్ముడు వెంకటరావు
గారు అరుంబాక గ్రామమునం దుండియున్నారు. వీరు అరుంబాక,
చెరుకుపల్లి, గుళ్ళపల్లి గ్రామములకు మిరాశీలు సంపాదించుకున్నారు.
మూలపురుషులలో కృష్ణంరాజుగారి కుమార్డు రామయ్యగారికి వెంకట
నరసయ్య లక్ష్మయ్య అను యిద్దరు కుమాళ్ళు. అందు వెంకటనరస
య్యగారికి లక్ష్మీకాంతం శ్రీరాములు అని యిద్దరు పుత్రులు. ఇందు
శ్రీరాములుగారు వెనుక వ్రాసిన తిమ్మసముద్రములోనివారికి దత్తు
వెళ్ళినాడు. లక్ష్మీకాంతం అరుంబాకములో నున్నారు. లక్ష్మయ్య
గారికి సంతు లేదు. వెంకటనరసయ్యగారికి వల్లభరాయడు వెంకట
రామయ్య, కృష్ణయ్య, అప్పయ్య, శ్రీరాములు, చినలక్ష్మయ్య, గో
పయ్య, శేషయ్య అను యెనమండుగురు కుమాళ్ళు. వీరిలో వల్లభ
రాయడుగారి కుమార్డు సీతారామయ్యగారు అరుంబాకములోను
వెంకటరామయ్యగారి కుమార్డు అంజయ్యగారు స్వస్థలములోనూ,
కృష్ణయ్యగారు అమలాపురమునందు నివసించియుండిరి. ఈ కృష్ణయ్య
గారి కుమారుడు రామయ్యగారు తిరుగా అరుంబాకము చేరెను. అ
ప్పయ్యగారి కుమార్డు నారాయణగారు పాలకొండలో నున్నారు. శ్రీ
రాములుగారి కుమారుడు లక్ష్మయ్య లష్కరులోనూ, చినలక్ష్మయ్య
గారి కుమారుడు గోపాలకృష్ణయ్య అరుంబాకములోనూ, ఉన్నారు.

7—8 వ కుమాళ్ళగు గోపయ్య శేషయ్యగార్లు నిస్సంతు అయినారు. ఇప్పు డీ అచ్చుతన్నవా రని పేరుగల ఈ వంశీకులు బాపట్ల తాలూకా వేట్లపాలెము, సంతరావూరు, పందిళ్లపల్లి, తిమ్మసముద్రము, స్వర్ణ, కారంచేడు, ఆడుసుమిల్లి మొదలగు గ్రామములయందు గలరు. వీరి కనుశృతముకా కనుపర్తి వారిలోనూ, యల్లాప్రగడగా మారిన కావూరి వారిలోనూ చెరుకుపల్లివారు, వాడ్రేవువారు, పూసపాటి మున్నగువారితో సంబంధములు గలవు. పై వివరము చాలభాగము అరుంబాక కాపురస్తులగు అచ్చుతన్న వెంకట్రావుగారివల్లను అమలాపురము వాస్తవ్యులు గోపాలము పంతులుగారివల్లను తెలియవచ్చినవి. తిమ్మసముద్రములోని విషయ మొకింత కైవల్యనవనీతగ్రంథమునుండి గ్రహింపబడినది. ఈ అచ్చ్యుతునివారిని అచ్చ్యుతన్నవా రని కూడా బిలుచుచున్నారు. ఈ సంతతిలోనివారే కొందరు అచ్చుతన్నవారమని వ్రాయుచున్నారు. అచ్చ్యుతుని సీతారామయ్యగా రనువారు సముద్రయానమను గ్రంథము లక్ష్మీనారాయణగా రనువారు తనయ శతకమును రచించిరి. రామ ప్రధానిగారికాలములో సంతరావూరు సంప్రతులు ఆరింటిలో 1 టి వెల. కౌండిన్యగోత్రీకులగు అచ్చుతునివారి కొక సంప్రతి యివ్వబడినటుల కొండవీటిదండకవిలెలో గలదు.

## గూడావారు

వెలనాటి వైదీకులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, కౌశికగోత్రీకులు. విశ్వామిత్ర, అఘమర్షణ, కౌశిక అని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. పూర్వము వీరు చింతలపూడివైపు చనుబండనుండి రామచంద్రశాస్త్రిగారు అనువారు ఏడుగురు అన్నదమ్ములతో కాశీ వెళ్ళి అచట అన్నిశాస్త్రములు చదివి అమరావతికి వచ్చి అచట ప్రభు

వులవల్ల యెనుబదియెకరముల భూమి సంపాదించి ఆ భూమిని ఆ ప్రదేశములనుండు తమ వారసుల కిచ్చినారు. అచట వీరి విద్యావిభవము చూచి రేకపల్లివారి చిన్నదాని నిచ్చి వివాహముచేసిరి. అనంతరము వీరు గోదావరిజిల్లాలో ముప్పది యెకరముల భూమి సంపాదించి, ఇదియు విడిచి నిరంతరము గోదావరి స్నానాపేక్షావరులై గోదావరి యొడ్డున నుండు వాడపల్లిలో ప్రవేశించగా అచటి రాజాగారు ఆవిద్వచ్ఛికామణి నడచినంత నేల మాన్యముగా యిచ్చిరట!

వీరి కుమాళ్ళు సూరిశాస్త్రుల్లుగారు. వీరు మంచికర్మిష్టులు, నిత్యాన్నప్రదాతలు. అనంతరము వీరి జ్ఞాతులలోని వారే వెంకటచలమను వారు మద్దూరు వచ్చి అచట నివాస మేర్పరచుకొనిరి. కృష్ణజిల్లా కంభంపాడు వదలి వెంకటరామ సిద్ధాంతిగారు సిద్ధాంతభాగము బాగా చదువుకొనిరి. గుంటూరుజిల్లా కారంచేడునందు రామకృష్ణ సిద్ధాంతిగారు గలరు. బాలంభొట్లుగారు నర్సాపురమునం దున్నారు.

వీరి కనుశృతముగా వారణాసివారితోనూ, చిత్రావూరివారితోనూ తులసివారితోనూ, చింతావారితోనూ, వేపావారితోనూ, ఈమనివారితోనూ, పరిమివారితోనూ, ఏలూరుపాటివారితోనూ, ఋత్రావారితోనూ. పుల్లెలవారితోనూ, చేబియ్యంవారితోనూ మల్లాది వారు— దువ్వూరివారితోనూ సంబంధబాంధవ్యములు గలవు అని గూడావారి బందుగులవలన తెలియవచ్చినది.

ఈ కుటుంబములో మరియొక పండితకుటుంబము రామచంద్ర శాస్త్రిగారిది కలదు. వీరు మహాపండితులు. వేదమంత్రశాస్త్రమందు గొప్పప్రవీణులు. వీరి కుమారుడు సూరిశాస్త్రిగారు. వీరును గొప్పపండితులు. నిరతాన్న ప్రదాతలు. కర్మిష్టులు, ఈయనకు సన్యాసయ్య, వెంకటరత్నము, చంద్రశేఖరశాస్త్రి అను వారు గలరు.

ఇందు మొదటివారు వైద్యశాస్త్రమందును, రెండవవారు వేదమందును, మూడవవారు జ్యోతిషమందును, ప్రవీణులు. వెంకటరత్నంగారికి కృష్ణమూర్తి, సత్యనారాయణశాస్త్రి అను యిద్దరు కుమాళ్ళు గలరు. చంద్రశేఖరశాస్త్రిగారి కుమారుడు సత్యహరిశ్చంద్రుడుగారు. వీరు ప్రస్తుతము అమలాపురమునందు అడ్వకేటుగా నున్నారు.

# చలంచ్యాలవారు

ఆర్వేలనియోగులు, అపస్తంబులు, యజుర్వేదులు, ఆత్రేయసగోత్రులు, ఆత్రేయ, అర్చనానస, శ్యావాస్య అని త్ర్యార్షేయము. అదికాపురము నెల్లూరు జిల్లా కందుకూరు తాలూకా చలంచ్యాల అను గ్రామము. ఈ యింటిపేరుగలవారిపుడు చలంచ్యాల కావలి తాలూకా మనుబోలుపాడు- కనిగిరితాలూకా పామూరు వెంకటగిరి డివిజను యానవరము- నెల్లూరుతాలూకా పురిణి-చెంగలుపట్టు జిల్లా కంచితాలూకామిట్టపాలెం- నెల్లూరు తాలూకా ఇందుకూరుపేట- కావలితాలూకా కావలిలోను గలరు.

పామూరు కాపురస్తులగు చలంచాల సుబ్బయ్య పంతులుగారు శ్రీకాళహస్తి సంస్థానమువారి యిలాకా నుద్యోగమునందుండెడివారు. ఈ కుటుంబమువారు ప్రథమములో చలంచాల యందుండెడివారు. అటునుండి అరువది సంవత్సరముల క్రిందట కావలి మనుబోలు వచ్చిరి ముప్పది సంవత్సరముల క్రితము పామూరు, పురిణీ, యిందుకూరుపేట వచ్చి నూటముప్పది సంవత్సరము లైనట్లు చెప్పుదురు. ఈ కుటుంబమువారి కనుశ్రుతముగా పవనివారితో సంబంధముగలదు మా బంధువులలో ముఖ్యులు పవని క్రిష్ణయ్యగారు అన్నవరం వారిలో రంగయ్యగారు వీరి కాపురం కావలిప్రాంతములోని అన్నవరం. శ్రీ నవులూరి వెంకట

కృష్ణయ్యగారు వీరి కాపురం కందుకూరి తాలూకా వుల్వపాడు 4 వే
వూరు నరశింహయ్య కావలి పొస్టుచన్నయ్య పాలెం— 5 కోగొల్లు రం
గయ్యగారు నెల్లూరుతాలూకా అల్లూరు— 6 మతుకుమిల్లి వీరది కని
గిరి తాలూకా అలకపాడు— 7 స్రాజు సుబ్బరామయ్యగారు కావలి
తాలూకా జలదంకి 8 గుడ్లూరు గోపాలయ్యగారు కందుకూరు తాలూ
కా గుడ్లూరు నందున్నారు వీరే మాముఖ్య బంధువులు యింతకంటె
యితరవిషయములు తెలియవు అని కావలితాలూకా కావలినుండి
చలంచాల నరసింహయ్యగారు 1903 సం॥ లో తెలియపరచిరి.

## తల్లాప్రగడవారు.

ఆర్వేలనియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, ఆంగీరస
బార్హస్పత్య భారద్వాజ అను త్ర్యార్షేయము. తల్లప్పమంత్రిని బట్టి
తల్లాప్రగడవారైనట్టు వాడుక. ఈ తల్లాప్రగడవారికి తల్లాపురము
అగ్రహారముకలదు. ఈ సంతతికులిపుడు గోదావరిజిల్లా తణుకు తా
లూకా కోరమిల్లి అగ్రహారం— కొండ్రోపాడు— విప్పర్రు— పరిమెళ్ల
రాచర్ల— యీనాలపల్లి— దరిశిపర్రు— జువ్వలపాలెం— ఉంగుటూరు—
తణుకు— నిడదవోలు— యర్నగూడెము తాలూకా కోనాల- మాధ
వరం— కొంద్రుప్రోలు- దొమ్మేరు- రాజమండ్రి- పోలవరం- రామచం
ద్రపురము తాలూకా రామవరము- తాడేపల్లిగూడెము వగయా
గ్రామములయందుండియున్నారు. వీరు పూర్వ మెవరియొద్ద మంత్రు
లుగనుండిరో గాని ఇటీవల వీరికి దేశపాండ్యా హోదాకలిగియుండి
అగ్రహారములు సంపాదించి తల్లాపురము అగ్రహారముకు సమీపము
నందు ఉంగుటూరునందు దివ్యభవనములు కట్టి నియోగులలో వా

ప్రఖ్యాతికలిగి యుండెడివారు. దాదాపుగ రెండువందల సంవత్సరములకు పూర్వము ఈ వంశమువారు మహోన్నతదశయందుండియున్నటుల తోచుచున్నది. ఉంగుటూరు నందుండువారిలో తల్లాప్రగడ సూర్యప్రకాశ రాయుడుగారు మహదైశ్వర్య సంపన్నుడై ఉంగుటూరునందు గొప్ప భవనము కట్టించెను, తురగా రామకవి ఈయన బావమరది. ఒకనాడు సూర్యప్రకాశరాయుగారు తానుకట్టించిన కట్టడమును తన బావమరదియగు రామకవిగారికి జూపదలచి బావమరదిని వెంటబెట్టుకొని లోపలికిదీసికొనిపోయి ఒకగదిలో విడచి బావమరిది పరియాచకమునకయి తాను మఱియొకచోటదాగి యుండెననియు రామకవిగారా యింటదిరిగితిరిగి దారికనుగొనలేక విసిగి తిట్టుకవిత్వమునందు వేములవాడ భీమకవికన్నను మిన్నయని ప్రఖ్యాతినొందిన రామకవిగారీదిగువ పద్యము చదివెనట.

గీ॥ అంగణములెన్ని కేళీగృహంబులెన్ని
యోడు బిళ్ళల యిండ్లెన్ని మేడలెన్ని
కట్టెగా కేమి సూర్యప్రకాశరాయ
డుంగుటూరింట్ల రాకాసు లుండవచ్చు.

అని నుడివితోడనే భయంకరముగనఱచుచు నింటనేమూలఁజూచినను దామేయయి పట్టపగలు పిశాచములు సంభవింప జొచ్చెనట. అందునకాయిండ్లు పాడుపెట్టి మరియొకచో కట్టుకొనినటులను, ఇప్పటికిని ఆప్రదేశములు పాడుపడియుండెనటులను అచటివారు చెప్పెదరు. యిటీవల వారిలో తల్లాప్రగడ సుబ్బారావుగారు- రామయ్యగారు- సూర్యనారాయణరావుగారు- సుందరరామయ్యగారు మున్నగు ప్రఖ్యాతిపురుషులుగలరు. వీరిలో సుబ్బారావుగారు ఉన్నతపరీక్షలయందుత్తీర్ణులై ఉన్నతసభలో న్యాయవాదిగానుండి అత్యంత మేధాసంపన్నులై బ్రహ్మ

విద్యావిశారదుడై గొప్పపేరువడసి అకాలమృత్యువు పాలైరి. అనం తరము ఈయనను పోలినవారు సూర్యనారాయణ పంతులుగారు వీరు నడి వయస్సున మృతులైరి గాని వీరిప్రతిష్ఠ వీరిని మృతజీవులుగా చేయుచు న్నది. ఈయన మంచికవి. కవిత్వము వినసొంపుగా నుండును. ఈయన సువర్ణలేఖ, దుర్ణయదురోదరము, హిందువుల పూర్వపు స్థితి, శైవలినీ చంద్రశేఖరము, వినోదిని మున్నగు గ్రంథములు రచిం చుటయేగాక సువర్ణలేఖయను చక్కని మాసపత్రిక చాలాకాలము ప్రచురించిరి. అవసాన దశకుముందు లోకానుభవము అను చిన్నశత కము రచించిరి అందీదిగువపద్యము చూచిన ఈయన మనసెంత పరిప క్వమైనదో తెలియగలదు.

చ॥ గడియకు మీదవచ్చె డిదిగాంచగ నేరదు లోకమంతయుఁ
గడసయొనర్ప నెంచుఁగలకాలము నీభువినిల్చునట్టు లి
ప్పుడొ యికనొ గుటుక్కుమని పోయెదు గుఱ్ఱక్కుడు ప్రాణమప్పుడీ
గడనలు గూడవచ్చునొకొ గాంచదు వచ్చెడు దానినీశ్వరా.

ఈయన యిట్లు చెప్పుటయేగాక ఇందలి అర్థము మనమునందు నాటి పరివర్తించినారు. ఈయన ఆంధ్రుల అదృష్టవశమున గోస్త నదీతీరము వదలి గోవుపాద క్షేత్రమగు కొవ్వూరుప్రవేశించిన దాది గోదావరితీరమునందలి కొవ్వూరుగ్రామమున గౌతమాశ్రమము అను పేరట ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమును స్థాపించి 1923 సంవత్సరము పాలాఖరుకు అనేకగ్రామములు తిరిగి కాయకష్టమున కొడిగట్టి ఒక్కొ కచో వేళకు ఆహారము లభించుటకష్టమనియో తమభుక్తికొరకు యిత రులకష్టపెట్టుట యిష్టములేకనో భోజనముమాని పండ్లు పాలు మున్నగు వానితో తృప్తినొంది మొత్త మెనుబదివేల రూపాయలఆస్తి సమకూ ర్పకలిగిరి. అనంతరము తామీదిగువ విధమగు ధర్మశాసన పత్రిక

వ్రాశి రిజస్టరుచేయించి సంస్థకిచ్చివేశిరి. ఆ దస్తావేజుసం దిట్లున్నది

దిర 24-1-1914 వ సంవత్సరముకు సరియైన ఆనంద నామసం వత్సర శ్రావణ శు౹౹ శుక్రవారము రోజున కృష్ణాజిల్లా యెర్నగూడెము తాలూకా కోనాలగ్రామ కాపురస్తుడును ప్రస్తుతము కొవ్వూరు డిష్ట్రి క్టు మునసబుకోర్టునందలి న్యాయవాదియునగు బ్రాహ్మణుడు. తల్లాప్రగడ చినవెంకటరామయ్యగారి కుమారుడు సూర్యనారాయణరావు వ్రా యించియిచ్చిన దానపత్రము.

ఈ విద్యాలయము 1912 సం౹౹ అక్టోబరు 20 తేదీకి సరియైన విరోధికృతు నామసంవత్సర ఆశ్వయుజ శుద్ధ దశమినాడు నాచేప్రారం భముచాయబడి స్వహస్త పరహస్తములచేత క్రమాభివృద్ధిని పొందుచు న్నది. దొరతనమువారి ఆదరమునుకూడ పొంది పనిచేయుచున్నదిన దీని కార్య నిర్వహణమున కిదివరకే యొకసంఘ మేర్పడియున్నది. దీనికి స్థిరమగు కట్టుబాటులు చేయుతలంపుతో దీని నిమిత్తమై యుద్దేశిం చుకొన్న ఆస్తి దీనికి చెందచేయుటకు ట్రస్టు (Trust) దస్తావేజు వ్రాసి యివ్వవలసినదిగా కమిటీవారు కోరినందున వారిసలహామీద ఈ క్రింది యేర్పాటులు చాయడమయినది. అని అనంతరము దీని ఉద్దేశ్యము. పరిపాలన. ఆస్తిమున్నగువిషయములు స్పష్టముగా వెల్లడించి కడపట నాచే నొసంగబడిన ఆస్తివివరం అని యిట్లు వివరించిరి.

కృష్ణాజిల్లా పెంటపాడు సబురిజస్టరులోచేరిన రాచపల్లగ్రామము లోని నాస్వార్జితంబాపతు యీనాంపల్లము రీసర్వే నెం 232 రు య 5-72 ట్ల భూమిన్ని యర్నగూడెము తాలూకా కొవ్వూరుగ్రామము లోని జిరాయితి మెరక రీసర్వే 694-2 AB య 5-80 శెంట్లలో య1-58 శెంట్లభూమిన్ని ఇందులోని నిధి నిక్షేపములసహితం దా. పూర్వకముగా యిచ్చిజేయడమైనది.. ఇది మనఃపూర్వకముగా

వాయించియిచ్చిన దానపత్రము. ( తల్లాప్రగడ సూర్యనారాయణ రావు వ్రాలు ఉన్నది ) ఇయ్యది యర్నగూడెం తాలూకా సబురిజ్ఞ్రు గువారి ఆఫీసులో 24 జూలై 1915 తేదీని 1608 రుంగా రిజస్టరుకాబడి నది. ఆమరుచటి సంవత్సరపు రికార్డులో ఇట్లున్నది. విద్యాలయము నేటికొక్క లక్షరూపాయల విలువగల యాస్తిని సంపాదింపగలిగినది. ఆవత్సరపు నివేదిక రక్తాక్షి సంవత్సర పుష్య శు ౧౧ సోమవారంనాడు ప్రచురింపబడినది. ఆమరుచటి సంవత్సరము శ్రీ సూర్యనారాయణ రావుగారు కీర్తిశేషులైరి. ఈయన అనంతరము విద్యాపీఠము శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారి పాలన యందభివృద్ధి నొందు చున్నది. వారిప్రశంస వచ్చినప్పుడు సవిస్తరముగా వివరింపబడును. శ్రీతల్లాప్రగడ సూర్యనారాయణరావు పంతులుగారి నిర్యాణానంతరము విద్యాశాలలోని విద్యార్థులు చదివినపద్యములిట నుదహరించుచున్నాము.

సీ॥ ముల్లోకముల ప్రభువుల కందరకును దా
నేలికనంచును నిందుఁ డెపుడు
విఱ్ఱవీగుచునుండె విద్యాలయమునకు
పాయనీతనిరొందు చేయుమనుచు
జెప్పియొప్పించి వాచస్పతి నిటదెత్తు
విద్యాలయంబున విద్యగఱప
సంచుమనంబున నాలోచనముఁజేసి
పయనంబు క్రోధన ఫాల్గుణమున
కృష్ణసప్తమియందున గోప్పదీశ
మఱలివచ్చెదు నందాక మాకునిన్ను
పాలకునిగను నిజముగ బల్కిపోమె
స్వర్గమాతని సుఖముగ చేర్చుమయ్య.

గీ॥ కాసయినను దగ్గక మాసమాసమునకు
నాల్గువందలు వచ్చెడు న్యాయవాది
పదవి త్యజయించితివి దేశభక్తి గలిగి
అమల గుణధుర్య సూర్యనారాయణార్య.

గీ॥ ఆంధ్రగీర్వాణ విద్యాలయమ్ముకొఱకు
వెనుక ముందాడకుండఁ గావించి నట్టి
పనుల నన్నిటి వ్రాకువ్వ వశమె మాకు
అమల గుణధుర్య సూర్యనారాయణార్య.

అని ఏలూరి అనంతరామయ్య కోగంటి దుర్గామల్లిఖార్జునరావు గార్లు రచించిచదివిరి.

ఈ కుటుంబమువారిలో ప్రస్తుత ముంగుటూరునందున్నవారిలో ప్రకాశరాయుడుగారు M. A. పరిక్షయందు కృతార్థు లై రట!

ఈ కుటుంబమువారికి అనుశృతముగా తురగావారు—చామర్తివారు ఆచంటవారు—నూరంపూడివారు—సత్తిరాజువారు — అయ్యగారివారు— పాలెపువారు—పరకాళా—తాడిమళ్ళ—దుగ్గిరాలమున్నగువారితో సంబంధములు గలవు. సూర్యనారాయణరావుగారికి పూర్వము తల్లాప్రగడ వెంకటశాస్త్రిగారు ఏవో గ్రంథములు రచించినట్లును ఈయన కోరు మిల్లి కాపురస్తు లనియు తెలియుచున్నది. ఇంకను యీ కుటుంబము వారిలో తల్లాప్రగడ వీర్రాజుగారు. ఈ నరసింహారావుగారు. వీరవెంకయ్యగారు. పానకాలురావుగారు. సుందర్రామయ్యగారు. భీమేశ్వర్రావు గారు, కామేశ్వర్రావుగారు, సుబ్బారావుగారు తల్లాప్రగడ త్రియంబకము గారు మున్నగువారు యిప్పటివారిలో చాత లనిపించుకొనినటుల వినికి.

## ఆలమూరివారు

ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుశ్వేదులు. భారద్వాజ
గోత్రీకులు. ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ యని త్రయార్షేయ
ము చెప్పుకొనుచున్నారు.వీరి పూర్వపు యింటి పేరేమియో ఎటనుండి
వచ్చిరో గాని రామచంద్రపురం తాలూకా ఆలమూరునందు నివసించి
యుండుటచే ఆలమూరువా రను యింటి పేరు గలిగినది. వీరి కుటుం
బములు విస్తారముగా కనుపించవు. నూటయేబది సంవత్సరములకు
బూర్వము ఆలమూరు జగన్నాయకులు, లక్ష్మీపతిగార్లు కుటుంబములు
విజయనగర సంస్థానము చేరినవి. కొందువవా రాలమూరులోనూ, రా
జోలులోనూ యుండిరి. వీరిలో అప్పలరాజుగారు కొంతకాలము గో
పాలపురము, పలివెల, యస్టేట్లలోను, అనంతరము పోలవరం యస్టేటు
లోనూ, గూటాల తాలూకా అమల్దాగుగా నుండి పిమ్మట కొత్త
పల్లి డివిజను మేజస్ట్రేటుగా నియమింపబడిరి. ఆ కాలములో గోదా
వరిజిల్లా మన్యపుప్రాంతమున ప్రారంభమైన మన్యపుపితూరి సమయ
మున ఈయన చేసిన మేహనతుకుగాను, సాలుకు 250 రూపాయల
శిస్తు చెల్లెడు భూమి రెండుతరములవరకు అనుభవించునటుల గవర్న
మెంటువారివల్ల మెహనతు పొందిరి.

సూర్యప్రకాశరావుగారు, కృష్ణంరాజుగారు, తిర్పతిరాజుగారు
రామచంద్రరావుగారు చిన్నతనమునుండియు గవర్నమెంటు ఉద్యోగము
లలో నుండి మెప్పు వడసియున్నారు. ఇందు రామచంద్రరావుగా
రతి సమర్థులు. ఎక్కువైన స్వశాఖాభిమానులు. వీరు తణుకు
తాలూకాలో కొంతకాలము మేజస్ట్రేటుగా నుండి యిటువైపుల చుట్టు
రికములుచేసి వసతులు సంపాదించుకని తణుకునందు స్థిరపడిరి.
నగరమువైపులకు వెళ్లిన కుటుంబముల విషయము.

ఆలమూరు జమీందారులవారి శిఫారసుపై విజయనగర సంస్థానాధీసులైన శ్రీవిజయరామగజపతిరాజమహారాజులంగారు ఆలమూరు లక్ష్మీపతి జగన్నాయకులుగార్లకు కోడూరు మిరాశీ యివ్వబడుటచే ఆ కుటుంబములవారా మిరాశీల ననుభవించుచూ అచటనే యున్నారు. వారిలో ఆలమూరి దీక్షితులుగారు కొన్నిక్రతువులుచేసియుండిరి.

ఈ కుటుంబమువారిపుడు ఆలమూరు, గోపవరం, తణుకు, రాజోలు, విజయనగరం, చోడవరం తాలూకా కోడూరు గ్రామములలో నుండియున్నారు. తూర్పుకుటుంబములవారికి పుల్లేపువారు, పాణంగిపల్లివారు, దేవగుప్తమువారు, కేసిరాజువారు కోరుమిల్లివారు, విస్సాప్రగడవారు, మండపాకవారు, అయ్యగారివారు, చేవూరివారు, దుగ్గిరాలవారు, యల్లాప్రగడవారు. కలిశపూడి, సుద్దాలవారు, కావలిపాటివారు, సర్వసిద్ధివారిలోడను సంబంధములు గలవని తూర్పున నుండువారును వడ్డాదివారు, మల్యాగలవారు, మాచరవారు, తాడిమళ్ళవారు, పోలాప్రగడవారు, కూచిమంచివారు, యర్రాప్రగడవారు, కొచ్చెర్లకోటవారు, ఆచంట, వల్లూరు, దినవహి, దొడ్డిపట్ల, బంధకవివారితోనూ యిటునైపువారికి సంబంధములు గలవని రాజోలునందుండువారును జెలియబరిచిరి.

ఈ చరిత్రవిషయములు విజయనగరము కాపురస్తులు ఆలమూరు సూర్యప్రకాశరావుపంతులుగారివల్లను రాజోలు తాలూకా శివకోడు కాపురస్తులగు ఆలమూరు కృష్ణంరాజుగారివల్లను తెలియవచ్చినది.

## పేరుకుంతలవారు.

ఆర్వేలనియోగులు, యజుశ్శాఖ ఆపస్తంబసూత్రము, కౌండిన్యగోత్రము, వాసిష్ఠ, మైత్రావరుణ, కౌండిన్య అని త్ర్యార్షేయము.

ఈ యింటిపేరుగలవారిపుడు కర్నూలుజిల్లా నంద్యాలతాలూకా మిట్న లఅను గ్రామమునందున్నారు వీరిచరిత్ర యింతకుమిక్కిలి యేమియు తెలియదుగాని ఈ కుటుంబమువా రిటీవల నోదనపల్లెవారనియు, గార్ల దిన్నెవారుగాను మారినారు. గాన ఈ కుటుంబవిషయము గార్లదిన్నె వారి కుటుంబ విషయము నోదనపల్లెవారి కుటుంబవిషయమున గనునగు

## పంతంగివారు.

ఆంధ్ర వైదిక బ్రాహ్మణులు, తెలగాణ్యులు, మిత్రస గోత్రము, వాధ్య్రశ్వఋషి, ఏకార్షేయము.

వీరు గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా రెంటాల, కారెం పూడి, దాచేపల్లి గ్రామములలోను, పంతంగియను నైజామయిలాకా గ్రామమునందుగలరు. వీరింటిపేరు ఆగ్రామమునుబట్టియే పంతంగి వారని పేరువచ్చినది. వీరిలో పంతంగి బసవేశ్వరావధానులుగారు శాలిశక ౧౬౮౦ కాళయుక్తి సం॥ కార్తీక శు ౧౧ కారెంపూడిగ్రామ ములో జూపల్లి రంగపతిశాయిగారి ముద్రికర్త కసుబా అనంతప్పగారి వద్ద భూదానమును పొందినట్లు ఒకశాసనముకలదు. అప్పటినుండి నేటి వరకు ఆభూమిని వారివంశీకులే అనుభవించుచున్నారు. ఈ కుటుంబము వారిపుడు పల్నాడుతాలూకా కారెంపూడిగ్రామ పరగణాలో చేరిన అడిగొప్పుల, మిర్యాల, నర్మాలపాడు, వప్పచర్ల, గాదెవారిపల్లె, చినకొదుమగుండ్ల, పెదకొదుమగుండ్ల, భట్టవారిపల్లె, వ్యాపకంపల్లె, ఇనపరాజుపల్లె, చింతపల్లె, పేటసన్నికండ్లు, కారెంపూడి, వీరలక్ష్మీపు రం అను 14 గ్రామములకు సభాపత్యంకలదు. వీరి కనుశృతముగా వెల్లంకివారు, ద్రోణావారు, నారాయణభట్ల, పుల్లాభట్లవారితో సంభంధముకలదు.

2 . ఈ పంతంగివారిలో బడగలనాటి కన్నడీలుగలరు. వీరిది కాశ్యపగో త్రము. సప్తార్షేయము. వీరు ప్రస్తుతము ఒంగోలు తాలూకాఒంగోలు నందు చందలూరునందు కాపురమున్నారు. యితరవివరములు తెలియవు.

# ఆచంటవారు

ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, సాంఖ్యాయన గోత్రీకులు. ఏకార్షేయము. ఆచంటవారి యింటిపేరు పూర్వము గురజాలవారు. వీరి కాపురస్థలము పూర్వము కృష్ణజిల్లా. ఇపుడు గుంటూరు జిల్లాలోని గురుజాల అయియున్నది. సుమారు అయిదు వందల సంవత్సరముల క్రితము అరునది గ్రామముల మొఖాసాదార్లు అయి ఆచంట గ్రామములో నున్న జీలకర్రి రామలింగముగారి ఇంటికి లింగరాజు అను చిన్నవాడు అతని తల్లి, జీవనార్థము వచ్చియున్నట్లు సదరు లింగరాజున కుపయనయనము జీలకర్ర రామలింగముగారే చేయించినట్లు ఉపనయన కాలమందు తల్లిని గోత్రి మడుగగా తెలియకపోవుటవల్ల పండితులను పిలుపించి గాయత్రీగోత్రము, సాంఖ్యాయన యగుటచే ఆగోత్ర మేర్పరచి సాంఖ్యాయనుఁడు ఒకఋషిగా కల్పన చేసి, సాంఖ్యాయన ఏకార్షేయ మను ప్రవరతో ఉపనయనాది సంస్కారములు జరిగించినట్టున్నూ గోత్రము మార్చుటవల్ల యింటిపేరు మార్చి ఆచంటవా రను గ్రామనామ ముంచినట్టును, ఆలింగరాజే ఆచంటవారి వంశమునకు మూలపురుషు డైనట్టును కొంతకాలమునకు బిమ్మట ఈ రామారావుగారు తమ గ్రామజమాబందీ లెఖ్ఖలు వ్రాయుటకు ఈ లింగరాజును వెంట నిడుకొని హైదరాబాదు తీసుకొనివెళ్ళి యచ్చట దివాన్ ఖానాలో లెక్కలు వ్రాయించుచూ ఒకనాడు ప్రొద్దుగ్రుంకు సమయమున రామలింగముగారు షికారు వెళ్ళగా తిరుగ ఆయన కచేరీకి వచ్చు నను తలంపున లింగరాజుగారు సూర్యాస్తమయ మగువరకు కచేహరియందుండి, పిదప కాగితములు సవరించుకొని యింటికి వెళ్ళుటకు దేవిడీగుమ్మమువద్ద కరుగగా కవాటము మూసివేయబడియుండుట

చూచి చేయునదిలేక ఆదివాన్‌ఖానాయం దీబాలు డేమూలనో నిద్రాశ రవశుడై యుండె నట. నాటిరాత్రి పదిగంటలకు నవాబుగారికి మెలకువ వచ్చి యేదో లేఖ ఢిల్లీపాదుషాగారికి వ్రాయగోరి, కచేరీలో నెవ్వ రుండిరో తోడితెం డని భటుల కాజ్ఞాపించెనట. ఎవ్వరును లే రని దెల్పిన ప్రభువున కాగ్రహము రా గల దని దివాన్‌ఖానాయంతయు వెదకి యచ్చట నొకమూల నొంటరిగా నిద్రించుచున్న లింగరాజుగారి ని లేపి నవాబుగారి శలవైన దనగా, ఆ బాలుడు జంకులేనివాడై నిర్భయముగా రాజసన్నిధి కఱిగి మర్యాద చూపి నిలబడెనట! తోడ నే ప్రభు వొక జాబును చేతి కొసగి జవాబు వ్రాయ మనె నట, అంతలో నవాబు మత్తుడై యుండగా నీ బాలుడు పార్షీభాషను ప్ర త్యుత్తరము వ్రాసెను. కొంచెము సేపటికి నవాబునకు తెలివి వచ్చి తాను వ్రాయవలసిన ప్రత్యుత్తర మెట్టిదో చెప్పబోగా మహాప్రభూ! ఆ వాక్యము లిదివరకే వ్రాసితి నని ప్రత్యుత్తర మిచ్చెను. అట్టు లైన నీ వేమి వ్రాసితివో బూర్తిగా చదువు మనుడు నా బాలు డా ప్రత్యుత్తర మంతయు చదివి వినిపించెను. అది విని తాను వ్రాయ దలచినదానికంటె అత్యంతచతురతగా కనుపించిన, నవాబుగారి కను గ్రహము వచ్చి తక్షణమే ఆచంటపరగణాకు దేశపాండ్యాహోదానిచ్చి ఫర్మానా నొసంగె నట! అంత దేశపాండ్యాకు జరుగవలసిన మర్యా ద లన్నియు భటులవలన జరుపబడి. గొప్పయుత్సవముతో అర్ధరాత్రి వేళ యేనుగు నెక్కించి బసకు తీసుకువచ్చి వప్పగించగా రామాశాస్త్రి గా రా యద్భుతమున కానందించి జమాబంది ముగించుకుని యింటికి వచ్చినతోడనే పురుషసంతతిలేనియాతడు తన కుమార్తె నిచ్చి వివాహ ముచేసి యింటనుంచుకొనుటచే ఆచంటవారు స్థలకరణములుగాను, దే శపాండ్యాలుగాను చిరకాలము వ్యవహరించిరి. వీరిలో కొందరు

కొన్ని పరగణాలకు దేశముఖీలుగాకూడ నియమింపబడి రని వాడుక గలదు.

ఆచంటవారి వృత్తాంతము ఒడయనంబి విలాసమునందును, వీరి యౌన్నత్యము దాక్షాయణిపరిణయ మందును విశేషముగా వర్ణింప బడినది.

ఈ ఆచంటగ్రామమునకు పూర్వము మార్తాండ పుర మని పే రుండెడి దట. శివరాత్రి మహాపర్వపుణ్యకాలమందు లింగోద్భవసమ యమున ఒడయనంబి యను బ్రాహ్మణుడు తా నుంచుకొనిన పరమ నాచి యను భోగకాంత కుచమును భక్తితో పూజించగా శ్రీరామ లింగేశ్వరస్వామి యుద్భవించె ననియును, చంటను బుట్టుటచే ఆచంట యను పే రా గ్రామమునకు వచ్చె నని ఒడయనంబివిలాస మను గ్రం థము నందున్నది. ఆచంట రామలింగేశ్వరస్వామివారి ఆలయములో మార్తాండేశ్వరస్వామి ఆలయముకూడ గలదు. పూర్వ మీ గ్రామ ములో కొంత రామేశ్వర మనియు, కొంతభాగము మార్తాండ పుర మనియు వే ఱొకభాగమున కింకొక పేరును కలిగియుండెడి దనియు తెలియనగును.

గీ॥ అట్టి మార్తాండపురమున కరుగుదెంచి
భక్తితో నొడయనంబి పరమనాచి,
చన్నుబూజింప శంభు డా చంద మెఱిగి
చంట బలుకంగ గ్రామ మాచంట యయ్యె. (ఒ॥వి॥)

పై నుదహరించిన రామలింగేశ్వరస్వామి యవతారానంతరము ఆచంట గ్రామమును, ఆచంటవారును మిగు నభివృద్ధినొందిరి. కుటుం బములు క్రమాభివృద్ధియైన కొలది శుభాశు[illegible]కార్యములు జరుపుకొను టకు చాలచిక్కులు కలుగుచూ వచ్చుటచేత కుటుంబవారసత్వపు

తారతమ్యముల ననుసరించి ఆచంటవారిలో కొందరు దశరాత్రము వారిలోని వారుగను, కొందరు త్రిరాత్రములలోనివారుగను, ఏర్పాటు చేసుకొని రాను రాను తుద కేయూరి కాయూరి వారే యనుచున్నారు.

నాడు నవాబుగారిచే ప్రసాదింపబడిన దేశపాండ్యహోదా ఆచంటవారి వంశములో విశ్వేశ్వర సోమయాజులుగారి వరకు పరంపరగా ననుభవము కాబడుచు వచ్చినది. ఆచంట పరగణా గవర్నమెంటువారి స్వాధీనమైనతోడనే మాన్యములకు శిస్తులు కట్టబడి విశ్వేశ్వర సోమయాజులుగారు బ్రతికియున్నంత కాలము కొంత ప్రతిఫల మాయనకు ముట్టుచుండెడి దట. ఈయన చనిపోయిన వెనుక ఆయన కుమారుడు భీమరాజుగారు పిఠాపురము సంస్థానములో ఉద్యోగము సంపాదించుకొని ఆ కుటుంబమువారు పిఠాపురము నివాస మేర్పాటుచేసికొనిరి. విశ్వేశ్వర సోమయాజులువారే గాక ఈ కూటస్థులలో చాలామంది యజ్ఞయాగాది క్రతువులు చేసినవారు చెరువులు త్రవ్వించినవారు, దేవాలయములు ప్రతిష్ఠించినవారు అనేకులు గలరు.

ఈ కుటుంభములవా రిపుడు గోదావరి జిల్లా ఆచంట, ఆచంట వేమవరము, కరుగోరుమిల్లి, కందరవిల్లి, పోడూరు, కాపవరం, కాకినాడ కాపుల యిల్లిందలపర్రు, దువ్వ, గన్నవరం, కొవ్వూరు, వడలి, ఏలూరు, బాదంపూడి, తాడిమళ్ళ, మాధవరం, వల్లూరు, జిన్నూరు, సిద్ధాంతం, గొడిచర్ల, నిడదవోలు, ములపర్రు, తణుకు, నరసాపురము, నూజవీడు, కొవ్వూరు, రాజమండ్రి, ఉప్పాడ, ముంగండ, మాచవరము, పిఠాపురము, పోలవరము, కాకినాడమున్నగు తూర్పుపశ్చిమగోదావరిజిల్లా గ్రామాదులయందును, తూర్పున శ్రీకాకుళము, మొదలగు పార్వతీపురము, అనకాపల్లి, సర్వసిద్ధి, గోలుకొండ, చెన్నపురి మొదలగు గ్రామములయందును గలరు.

వీరి కుటుంబము మిక్కిలి బాహుళ్యము గలది యగుటచేతను, వీరి గోత్రము సాంఖ్యాయన ఏకార్షేయము అగుటచేతను, కృష్ణాగోదావరి విశాఖపట్టణము జిల్లాలలోని నియోగి కుటుంబములవారిలో చాలా మందిలో వీరికి చుట్టరికములు గలవు. అందు పెమ్మరాజువారు, తల్లాప్రగడ, భోగరాజు, ద్రోణంరాజు, సత్తిరాజు, పోడూరి, గోటేటి, పెద్దాడ, యర్రాప్రగడ, అత్తిలి, పరకాలా, వల్లూరి, తటవర్తి, అయ్యాగారి, పాలకోడేటి, పులిపాక, మద్దాలవారు మున్నగువారితో ననుశ్యూతముగా సంబంధములు గలవు. అందు తల్లాప్రగడవారితోను, పెమ్మరాజువారితోను విశేషముగా గలవు. గాని సూరంపూడివారితోమాత్రము వీరికి సంబంధము కలుపుట కిచ్చగించరు. అందుకు కారణము సూరంపూడివారు, ఆచంటవారు అప్పసెల్లెండ్రు బిడ్డ లనియు అందువల్ల వీ రుభయులు అన్యోన్యసంబంధములు మానుకొనినటుల జెప్పెదరు గాని, అది అంత సహేతుక మని తోచదు. ఆచంటవారిబంధుగు లందరు తమలో తాము సంబంధములు చేసికొనుట మానినారా? ఆచంటవారు సూరంపూడివారు అప్పచెల్లెండ్ర బిడ్డలైన అయియుండవచ్చును. ఆకారణముననే ఆచంటవారి పిల్లవాడు సూరంపూడివారికో సూరంపూడివారి పిల్లవాడు ఆచంటవారికో దత్తువెళ్ళియుండవచ్చును. లేదా, సమానమైన దేశపాండ్యాహోదాలు గలిగియుండుటచే పరశ్రేయస్సహనదోష మొండొరులకుకలిగియుండవచ్చును. బహుశాదత్తతయే నిజమైయుండవచ్చును. ఈ సాంఖ్యాయనగోత్రికులు నియోగులలో గురజాల, అడవి, కుందూరి, కృష్ణా, మాదిరాజువారిలో కొందరు, వసంతాడవారిలో కొందరు, అబ్బరాజు, రావినూతుల, రెమ్మరసు, పాకల, మున్నగువారు చాలమంది గలరు. గోపరాజువారిలో కొందరిది సాంఖ్యాయనగోత్రము. ఈగోత్రికులు ఆర్వేలనియోగులలోనే గాక, వైష్ణవుల

లోనూ ఆర్వేల కమ్మనియోగులయందు గలరు. ఈగోత్రికులలో కొంద
రిది సాంఖ్యాయనలని ఏకార్షేయము. ఆంగీరస,సైన్యగార్గ్యలనియు మరి
కొందరువిశ్వామిత్ర దేవరాత, ఔదలలనియు ఆర్వేలనియోగులలో కొం
దరు విశ్వామిత్ర,దేవర్షణ, అఘమర్షణయనియుత్ర్యార్షేయముచెప్పుకొను
చున్నారు. ఇట్టిస్థితిలోపై లింగరాజుగారియింటిపేరుగురజాలవారేమైనచో
గోత్రము తెలియక గాయత్రీగోత్రము పెట్టి రను కథ యనృతము కావ
లెను. అత్తిలి వాస్తవ్యులగు పెమ్మరాజు వెంకయ్యగారి వితరణాది
గుణముల ననుసరించి పామరులు చాలాభాగము అత్తిలి వెంకయ్య
గా రని పిలిచి నటుల, యీకూటస్థుడు లింగరాజుగారి కాపుర మాచం
ట యగుటచే ఆ గ్రామములోని జీలకర్రవారి కుటుంబ మడుగంటిన
పిగప గురజాల లింగరాజుగా రాచంట లింగరాజుగారై యుండవచ్చును

ఈ కుటుంబమువారిలో రాజమహేంద్రవరమున నుండెడు, సుం
దరరామయ్యగారు, నాగరాజుగారు, కాల్దరిలోని రామన్నగారు; పీఠా
పురములోని విశ్వేశ్వర సోమయాజులుగారు, మేరంగిలో నుండు వెం
కటరావు సాంఖ్యాయనశర్మగారు, సిద్ధాంతములోనుండు సుబ్బారాయు
గారు, నూజివీటనుండిన రాజగోపాలముగారు, నిడదవోలునందుండి
యుండిన సూర్యనారాయణగారు, చెన్నపట్టణమునందున్న లక్ష్మీపతి
గారు మున్నగువారీ కుటుంబ గౌరవమును ప్రఖ్యాతికి దెచ్చియున్నారు.
మేరంగిలో నుండెడి వెంకటరావుసాంఖ్యాయనశర్మగారు ఆంధ్రసాహి
త్యధురంధరులు. బహుభాషాకోవిదులు. వేదార్థము చెప్పగల సమ
ర్థులు. బహుశాస్త్రములు శోధించినవారు. వీరు కొంతకాలము ప్రచు
రించిన 'కల్పలత' యను పత్రిక వీరి బుద్ధివిశేషములనుగూర్చి వేనోళ్ళ
చాటియున్నది. చెన్నపురియందుండు లక్ష్మీపతిగారు వైద్యవిద్యా
భ్యాస మొనర్చిఆయుర్వేదశాస్త్రమునందు గొప్పకృషి చేయును న్న

పురియందుండి విజ్ఞానచంద్రికా గ్రంథమండలి యను దాని స్థాపించి అందు వీ రొక కార్యనిర్వాహకులై వివిధోపయోగములగు గ్రంథము లెన్నిటినో ప్రచురముచేయించిరి. సుందరరామయ్యగారు, రాజమహేంద్రవరమున న్యాయవాదిగా నున్నకాలములో కొన్నియుపన్యాసములు, చిన్నగ్రంథములు ప్రచురించిరి. రాజమండ్రిలో నుండెడి సుందరరామయ్యగారు, నిడదవోలు నందున్న సూర్యనారాయణరాజుగారు వర్తమానకవులు. వీరు చాలగ్రంథములు కొన్నిశతకములు రచించిరి. నూజవీటియందుండిన రాజగోపాలముగారు, వేమవరమునందు సన్యాసాశ్రమము స్వీకరించి సిద్ధినొందిన కనకయ్యగారి సంతతివారు. వీరు నియోగిమహాజనసభకు కార్యనిర్వాహకులుగా నుండి చాలసభలు జరిపించి మతాభిమాను లని ప్రసిద్ధికెక్కిరి. వీరి పెద్దలు పోడూరి పెదరామకవిగారివలన రచింపబడిన శివరామాభ్యుదయమను గ్రంథమును కృతి నందుటయేగాక చెరుకువాడయందు విశ్వేశ్వరాలయ ప్రతిష్టచేసినటుల శివకవచమహత్మ్యమున 'శ్రీమద్గురుజాలాన్వయ పేరసచివప్రతిష్ఠిత సమ్యగ్ధామవరీ చెరుకువాడపురీ విశ్వేశలింగసదయాపాంగా' అని చెప్పబడినది. ఇకశివరామాభ్యుదయకావ్య ప్రేరకుడైన గురజాల పేరయార్యుని యభీష్టప్రకారము గోదావరి మండలములోని ఆచంటగ్రామమునందలి రామలింగేశ్వరస్వామివారి కంకితము చేయబడుటచే నీ యాచంటవారు పూర్వము గురజాలవా రనుటకు సందేహము లే దనియు, వీ రాచంటగ్రామమునం దుండుటచే ఆచంటవారై రనుటకును, ఏతద్గ్రంథములోని నీ దిగువపద్యమునుబట్టి వీరి గోత్రము పూర్వమునుండియు సాంఖ్యాయన గోత్రమే యనుటకు, వీరి పూర్వీకులుకూడ చాలాప్రసిద్ధపురుషులుగా యుండిరని చెప్పుటకు ఎంత మాత్రము సందేహించవలసిన పని యుండదు, అందరు నియోగుల

వలెనే వీరు పూర్వము గురజాలసీమనుండి ఆచంటగ్రామము వచ్చియుం డవచ్చును. అం దీ లింగరాజు బుద్ధికుశలతగలవా డగుటచే జీలకర్ర వారి పిల్ల నిచ్చివివాహముచేసియుండవచ్చును. మఱియు శివరామా భ్యుదయములోని దిగువపద్యము చూడగాగురజాలవారు చాలకాలము నుండి ఆచంటయందుండినటుల కనుపించుచున్నది. ఆపద్యమిట్లున్నది.

సీ॥ ఏ మంత్రికుల పూర్వుఁ డిల జమత్కార భారత
మందె శ్రీరంగరాజనాము
డే మంత్రి ముత్తాత యామల్లయజ్వదాక్షాయ
ణీపరిణయగ్రంథ మందె
నే మంత్రితాత యజ్ఞామాత్యుఁ డొనరించె
సప్తసంతానముల్ సరవితోడ
నే మంత్రిపిత పార్వతీశ్వరుఁ డాదిమ
దాతయై పద్యగద్యంబు లందె
నట్టి గురజాలకులకలశాబ్ధి విభుడు
రసికు డివటూరి మల్లనారాధ్యశిష్యు
డభవపూజాదురంధరుఁ డైన పేర
ఘనుఁడు సాంఖ్యాయనస గోత్రుఁ డెనయు సిరుల.

శ్రీరంగరాజు—ఈయనకుమార్డు మల్లసోమయాజి—ఈయన కుమా రుడు యజ్ఞామాత్యుడు—ఈయనకు పార్వతీశ్వరుడు—యీయనకు పేర య్య యనువారల పేర్కొనెను. ఇందు లింగరాజు పే రెచటను గాన రాదు. ఈ లింగరాజుగారు వీరికి పూర్వుడో దిగువవాడో చెప్పవీలు కనుపించుట లేదు. ఈ గ్రంథము లన్నిటిని వెదకి చూచిన ఇంకనూ వీరి చరిత్ర మేమైన డెలియు నేమో! అంతవరకు నీ పుక్కిటిపురాణ ములు కల్పనాకథలే ఆధారముచేసుకొనక తప్పదు.

సన్యసించిన కనకయ్యగారి కుటుంబవిషయము:—ఈయనకు బాపయ్య, కొండయ్య, వెంకయ్య, మరియొకరు కలిసి నలుగురు కుమాళ్ళు. అందు బాపయ్యగారికి పెదకనకయ్య—ఈయనకు బాపయ్య ఈయనకు వెంకటపూర్ణయ్యగారు; పూర్ణచంద్రరావుగార్లు. వీరు ఆచంట వేమవరములో నుండిరి. ఈ కనకయ్యగారి రెండవకుమార్డు కొండయ్యగారు. ఈయనకు చినకనయ్య, ప్రకాశంగార్లు. వీరిలో చినకనకయ్యగారికి కొండయ్యగారు. వీరు యేలూరునందు నివాస మేర్పరచుకొని 1896 లో జనిపోయిరి. వీరి కుమారుడే పై నుదహరించిన రాజగోపాలముగారు.

కొండయ్యగారి రెండవకుమార్డు ప్రకాశముగారి దత్తుడు రామమూర్తిగారు. ఈయనకు కనకరాజుగారు, రామచంద్రయ్యగారు. ఈ కుటుంబమువారు వేమవరమునం దున్నారు. కొదువ నిస్సంతు. ఫోడూరి పెదరామామాత్యుడు సంస్కృతాంధ్రకవుల సంస్తుతించిన పిదప శ్లేషకావ్యమునకు మార్గదర్శియైన పింగళసూరనామాత్యుని పొగడియుండుటచేతనో, మరే కారణముచేతనో, ఈకవి యిప్పటికి 130 సంవత్సరములక్రిందటివా డని తోచినటుల కవిచరిత్రకారులు వ్రాసియున్నారు. ఈ సూరనార్యుడు వ్రాసిన 'రాఘవపాండవీయము' క్రీ॥ శ॥ 1564 నాటిదగుటచే ఈ పెదరామామాత్యుడు తరువాత 100 సంవత్సరములకు ఈ గ్రంథము చెప్పుట తటస్థించినను దాదాపుగా 300 సంవత్సరముల లోపుకాలము అయియుండవలెను. కానిచో ఆచంటవారు చెప్పు పై గాథకు అనుగుణ్యముగా నుండజాలదు. 1740 ప్రాంత్రమున వాడపల్లిగ్రామములో ఆచంట లింగరాజుగారివల్ల వ్రాయబడిన తాటియాకుల పురాణములు కనుపించుచున్నవి. ఈ లింగరాజుగారు దేశపాండ్యా లింగరాజుగారేమో! ఆచంట కృష్ణారావుగారి కుటుంబవారు ఆచంటవేమవరములో గలరు.

అచంటవారు వైదికులు:—వెలనాడు, ఆపస్తంబులు, యజు
దులు, భారద్వాజ గోత్రము. అచంటవారిలో యాజ్ఞవల్క్య
గల రనియు, వా రాచంటయందుండెడివా రనియు తెలియుచున్నది
గోత్రసూత్రములు తెలిపినవా రేరును కనుపించరైరి.

☞ అచంటవారిలో స్వకుటుంబాభిమానులుతమకు దెలిసినవిశేష
శములు మాకు వ్రాసి పంపినచో ముందు ప్రచురించు చరిత్రలో ప్ర
రించుకొందుము.

## రేవుణూరివారు

నందవరీక నియోగులు, ఋగ్వేదము; ఆశ్వలాయన సూత్ర
శ్రీవత్సగోత్రం, భార్గవ, చ్యావన, ఆప్నువాన, ఔర్వ, జామ
గ్ని అని పంచార్షేయము. ఈ వంశీకులలో రేవుణూరు పాప
గారి కుటుంబమువారిపుడు కర్నూలు జిల్లా నంద్యాలతాలూకా గ
టూరుఅను గ్రామమునందున్నారు. ఈ పాపరాజుగారి కుమా
శేషయ్య యీయనకు వెంకటపతయ్య, ఈవెంకటపతయ్యకు శేషయ్య
చలమయ్య పెద్దపాపయ్య—రామస్వామి-చినపాపయ్య- కృష్ణయ్య. నా
రాజుఅనువడ్గురుకుమాళ్లుగలరు.ఇదు చినపాపయ్యకు శేషయ్య ఈయన
మార్డు.సుబ్బారాయుడువీరికిచంద్ర శేఖరరావుఅను కుమార్డుగలడు. ఇం
కడపటనుదహరించిన శేషయ్యగారు గగ్గటూరుకు కరణముగానున్నారు
ఈ కుటుంబము వారికి శిరువళ్లు తాలూకా చిలకలూరు—శిరువళ్ల—
గాని పల్లె ఎస్టేటులోని వల్లూరిగ్రామములోని ఒంటివెలగలవారు. కోవ్వ
పురం సంస్థానములోని చక్కెంగ్రామములోను, నంద్యాల తాలూకా
నంద్యాలయందు, అల్వకొండవారు ఆతాలూకా త్రిరిపాడులోని ద

వారిలోనూ. అదేతాలూకాలోని మంచాలకట్టు గ్రామములలోని కానాలవారిలోనూ వెంపల్లివారితోనూ సంబంధములు గలవు.

2. నందవరీక వైదికులు, వీరిది శ్రీవత్స గోత్రమె అశ్వలాయనసూత్రము. భార్గవ- చ్యావన అప్నువాన. ఔర్వ- జామదగ్నియని పంచార్షేయము చెప్పుకొనుచున్నారు. పూర్వము కాశీసంది నందునిరాజ్యము నకు వచ్చిన విప్రులలో కొందఱికి నందవరాగ్రహారమీయబడుటచే అందునివశించువిప్రులు నందవరీక వైదికులను, వారే నూరిండ్ల వారనియు పదమూడుగోత్రముల వారనియు ఔడారి కిచ్చయకవి రచించిన 'మాధవాభ్యుదయ' మను గ్రంథమునవర్ణించెను. ఈ పదమూడు గోత్రములవారికి వారి యిష్టదేవతయగు చౌడేశ్వరియే ఈ దిగువవిధమున పంచిపెట్టినటుల బ్ర॥ శ్రీ గుమ్మరాజు రామకవిగారు రచించిన శ్రీ చౌడేశ్వరీ మహాత్మ్యమను గ్రంథము నందుదహరించిరి. ఆపద్య మిట్లున్నది.

సీ॥ గురుతర శ్రీవత్సగోత్ర సంజాతులు
 నూఱిండ్లవారికి నూ[illegible]వృత్తు
లీశవసిష్ఠా త్రికౌశిక గోత్రభవులకు
 పదియునువది యిండ్లవారి కలువ
దేసివృత్తులు నల్వదేసి భరద్వాజ
 హారిత గోత్రజులకు, నవలగుత్స
గౌతమ మౌద్గల్య కాశ్యపాగస్త్యభా
 ర్గవపీత హావ్యాఖ్య గలుగునట్టి
యేడుగోత్రాల వారికి నిరువదేసి
వృత్తులుగఁ జేయునేనూఱు వృత్తులమ్మౌ
గోత్రములు పదమూఁడని గుఱుతు గలిగె.. అనివ్రాసిరి.

అనుటచే శ్రీవత్సగోత్రీకులు 100, వసిష్ఠ అత్రి కౌశికు ముగ్గురకు 180, భరద్వాజ హరితగోత్రజులకు 80, కుత్స గౌతమ మౌద్గల్య, కాశ్యప, అగస్త్య, భార్గవ వీతహవ్య గోత్రీకులు 7 కి 140 వృత్తులు మొత్తం 500 వృత్తులు, 13 గోత్రములవారికి పంపకముచాయ బడినవి. అందువలన అప్పటిలో ఈ నందవరీకులయందు నియో వైదికభేదము పాటింపబడినటుల తోచదు. ఈ దేశమువచ్చిన పిమ్మట చాలాకాలమునకు, రామచంద్రో పాఖ్యాన గ్రంథకర్తయగు తిరుమల కొండ యార్యుని పుత్రుడును 'శకుంతలాపరిణయ' గ్రంథకర్తయగు రేవునూరి వేంకటార్యుడు తాను నందవైదిక బ్రాహ్మణుడనని తనగ్రం థమునందీ దిగువ పద్యము వ్రాసుకొనెను.

శా॥ శ్రీవత్సాన్వయు రేవునూరి కులజుఁ శ్రీపాదరేణుప్రభా
సౌవర్ణ్యస్ఫుట కావ్యకల్పక కవిఁ సంకీర్తనా చార్యపు
త్రీవంశోత్తము నంద వైదిక బుధాదిప్రోక్త వృత్తిస్వయం
భావుఁ దిర్మలకొండ యార్యసుతు శుంభద్వేంక టాభిఖ్యునిఁ
బిలువంబంచి అని కృతి పతిసంబోధించినటుల చెప్పుకొనెను.

మఱియు.

'చ॥ కనుగొని చండికాభిముఖ ప్రదనంద వరాగ్రహార పా!
వసఘునపెద్ది భట్టకుల వార్ధినిశాకర' — —

అనియు సంబోధించినటుల చెప్పుట చేతను కిచ్చయకవి నందవ రీకులను వర్ణించుటలో ఆశ్వలాయన సూత్రుడు శ్రీవత్సగోత్రీకుడు పెద్దిబొట్లు యశస్కాముడైనట్లు చెప్పియుండుటచే, వీరందరు పెద్దిబొట్ల సంతతివారై యుందురు. వీరిలో నియోగి వైదికభేద మిటీవల యేర్ప డించినదేమో! పూర్వము పాటింపబడుచున్నట్లు తోచదు.

# మానూరివారు

వీరు మధ్వమతస్థులు—యజుర్వేదులు, ఆపస్తంబులు, భారద్వాజ గోత్రీకులు. అంగీరస, బార్హస్పత్య భారద్వాజ అని త్ర్యార్షేయము. వీరి పూర్వులగు మానూరి వెంకటరాయ భూపాలునకు పండితారాధ్య నాగలింగకవిగారు తామురచించిన 'పట్టాభిరామవిలాస' మను గ్రంథముఁ గృతిగానిచ్చుచూ, అందు వీరి వంశమునిట్లు వర్ణించిరి—

క॥ పూర్ణ ప్రజ్ఞాచార్యుని
పూర్ణకటాక్షేక్షణమున భూమిస్థలిలో
వర్ణితమై మధ్వమతం
బర్ణవమున్ వెల్లి విరిసినట్లలరారెన్.

గీ॥ అట్టి మధ్వమతంబున నవతరించి
గురు భరధ్వాజ గోత్ర విస్ఫురితుఁ డనఁగ
వర యజుర్వేద శాఖా ప్రవర్తకుండనఁ
బ్రబలె గొండల రాయభూపాలమౌళి.

ఈ కుటుంబమువారి మూలపురుషులైన కొండలరాయఁడుగారికిద్దరు భార్యలు. పెద్దభార్య కొండవీటి అప్పాజీగారి కుమార్తె కోనమ్మ, చిన్నభార్య నబ్బినీసు వెంకటపతి కుమార్తె శాయమ్మ, పెద్ద భార్యకు నరసన్న వెంకయ్య అను యిద్దరు కుమాళ్లు అందు వెంకయ్యగారిట్లు వర్ణింపబడిరి—

గీ॥ దండి వినుకొండ బెల్లము కొండకొండ
వీటి దుర్గంబు నీమూటి సూటిదనర
మేటితనమున బాలించి మించెనౌర!
ధీవరుండన వెంకపృథ్వీవరుండు.

అని యనుటచే నీయనపై మూడుదుర్గములనేలిన ప్రభువుగాగన్న ట్టును. చిన్నభార్యకు అప్పాజీపంతులు అక్కప్ప ధరాధిపతి- ఈయన సబ్నివీసు కృష్ణయ్య పంతులుగారి కుమార్తె నుద్వాహమాడెను. ఈయనకు వెంకటాద్రి భూపాలుడు గలిగెను. అప్పాజీ పంతులు ఉమ్మెత్తల వెంకయ్యగారి కుమార్తెను బెండ్లియాడెను. ఈయనకు వెంకటభూపాలుడు- యీయనకు జబుకు పద్మనాభం పతులుగారి కుమార్తెనిచ్చిరి. ఈ దంపతులకు అప్పాజీ- నరసింహమూర్తి- రమణయ్య జానకిరామయ్య అను నల్వురు కుమారులు గల్గిరి. రమణయ్య పంతులుకు అప్పాజీ పంతులు వెంకటగోపాలవిభుడు జన్మించిరి. యీ అప్పాజీ పంతులుగారికి వెంకటరాయ మహీపాలుడు జన్మించిరి. వీరే ఏతత్కృతి భర్తలు. పైగ్రంథమున మొదటి యాశ్వాసములలో రామాయణకథ వర్ణింపబడి కడపటి అధ్యాయమునందీ పంతులుగారిచే కొండవీటి వద్దనున్న మాబుగనేశుపేటలో ప్రతిష్ఠింపబడిన పట్టాభిరామదేవుని యాలయప్రతిష్ఠమున్నగు విషయము లుదహరింపబడినవి. ఆ గ్రంథము లభింపమిచే యింతనూ యీ యనచేసిన సత్కార్యములు తెలియుచున్నవి.

మానూరివారు ప్రథమమునుండి జమీంబారీ కుటుంబములోనివారు. కొండవీటిసీమ క్రీ. శ. 1788 సెప్టెంబరులో ఈస్టిండియాకంపెనీవారి స్వాధీనమయినపుడు ప్రభుత్వమువారు మనదేశపు జమీందార్లకు జమీలిచ్చుటలో కొండవీటిసీమ మానూరు వారికివచ్చి చిలకలూరిపేట వంటులోచేర్చి తొలుత శ్రీరాజా మానూరి నరసన్నరావుగారి పాలనక్రిందనూ అనంతరము వారి తమ్ములు వెంకట కృష్ణయ్యగారి పాలన క్రిందను క్రీ. శ. 1812 వరకు నుండబడెను. తర్వాత నీకుటుంబమువారికి కొంత 'అలవెన్సు' ఏర్పాటు కాబడినటుల చరిత్రలు తెల్పుచున్నవి.

ఇప్పటికి 100 సం॥ ల క్రితము ఇప్పటికొండవీటికి దక్షణమున నున్న సింగిస్ఖాను పేటలోని దేవాలయముననున్న వెన్నముద్ద కృష్ణ స్వామి విగ్రహము గోపినాధ పుర గ్రామమునందొక మహమ్మదీయుని యింటదొరకగా, అప్పటి జమీందారైన శ్రీరాజా మానూరి వెంకట కృష్ణమ్మగారు చిలకలూరిపేటలో ఆలయము నిర్మించి అందు ప్రతిష్ఠించుట కావిగ్రహము తెప్పించుచుండగా సింగిస్ఖాన్ పేటవరకు వచ్చి విగ్రహమున్న బండివిరిగిపోవుటయు ఆరాత్రి స్వప్నములో స్వామి తానక్కడనుండి కదలననుటచే అక్కడనే వేరొక గుడికట్టించి స్వామినందు ప్రతిష్ఠించిరట.

మానూరి వెంకన్నారావుగారి సంతతివారైన వెంకటకృష్ణుంగారు ఆలపాటిలో కొంతభూమి పత్రి వెంకన్నగారికి మాన్యమిప్పించిరి. మానూరి వెంకన్నగారు ముజుందారుగానున్న కాలములో తురుమెళ్లగ్రామమునందు చాలాఆలయములు కట్టించబడినటుల తురుమెళ్ల గ్రామకైఫియ్యతులోగలదు. వెంకన్న పంతులు జమీందారుగారు క్రీ. శ. 1595 లో జొన్నలగడ్డ అన్నంభొట్లుగారి కుమార్తు మూర్తి భొట్లుగారికి గ్రహణ కాలమున 'కారెంపూడి' అగ్రహారముగా యిచ్చినటుల ఆగ్రామ కైయి ఫియ్యతునందు గలదు.

గోల్కొండ నవాబుగారైన ఇబ్రహీంపాదుషావారి కాలములో ఫౌజుదారుగానున్న మహారాష్ట్ర బ్రాహ్మణులు రాయరావు అనువారు క్రీ. శ. 1590 ప్రాంతమున మానూరివారికి 'జమీందార్' అనియు ముజుందారు బిరుదునిప్పించి నటుల కొండవీటి దండకవిలెయందుగలదు.

ప్రస్తుతములో రాజా మానూరి జానకిరావు పంతులు బి. ఎ. బిల్. గారు చిలకలూరు పేట జమీందార్లు మానూరి పురుషోత్తం పంతులుగారి కుటుంబము విశాఖపట్టణములోను, వెంకటరమణయ్యగారి కుటుంబము

గుంటూరునందును గలవు. వీరికనుశ్రుతముగా కొండవీటివారు- సబ్బిసీసువారు- ఉమ్మెత్తాలవార్లు- జబుకువారు- న్యాయపతివారు మున్నగువారితో సంబంధబాంధవ్యములు గలవు-

(2) వైదికులు:—

ఈ మానూరివారిలో వైదికులుగలరు, వీరిది కౌశిక గోత్రము, విశ్వామిత్ర, అఘమర్షణ, కౌశికయని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరు గోదావరిజిల్లాలో గలరనియు, కలగరవారిచుట్టములనియు దెలియవచ్చినది—

## గుమ్మరాజువారు.

నందవరీకనియోగులు, ఋగ్వేదులు, ఆశ్వలాయన సూత్రము. వీరిలో రెండు గోత్రీకులు గలరు అందు.

(1) వసిష్ఠగోత్రీకులు:— వీరికాపురస్థలము కర్నూలు జిల్లాలోని నందవరము. అటనుండి కడపజిల్లా పులివెందల తాలూకా మాదూరను గ్రామమున కొంతకాలముండి ఈ కుటుంబీకులలో ఎల్లమరాజుగారనువారొకరు దక్షిణదేశమునకు వచ్చి ప్రకృతము మైసూరు దేశమునకుం జేరియుండునదయ్యుం గొల్లవిజయ నగరమువారి యధీనమందున్న సుందొకల్లు (స్వర్ణకల్లు) అను నాయకుల సంస్థానమున రాజకీయోద్యోగమును సంపాదించి వంశపారంపర్యముగా నందేయుండిరనియు అనంతర మదేసంస్థానమునకుం జేరిన కల్లూరు, ఇమరకుంట, గొనిపల్లె, మొదలగు గ్రామములలో నివసింపసాగిరి. కొంతకాలము వీరు మదూరు గ్రామమునందుండుటచేకాబోలు మదూరువారని పిలువబడుచు వచ్చిరి. ఆ మదూరివారిలో గుమ్మరాజుగారనువారు పైసు

దహించిన సుంకొల్లు సంస్థానము ప్రతినిధిగ విజయనగర రాజ్యము నకుం జని అప్పటి చక్రవర్తులగు సదాశివరాయలవారి కాలమున అళియ రామరాజుగారి వలన సన్మానము వడసి తమ యేలికయగు నాయకరాజునకు సంస్థానము స్థిరపఱచుకొని సన్నదునొంది ఛత్రచామరాద్యనేక మర్యాదలను దమ ప్రభువులకుఁ జెందునట్లు గావించుకొని స్వగ్రామము నకుఁజేరి నాయకులవలన నెక్కువ గౌరవంబునొందిన ప్రసిద్ధపురుషులైరి. తదాది వీరియింటిపేరు మహారిహారనుటకు బదులు గుమ్మరాజువారని మారినది. ప్రస్తుతము గౌనేపల్లియందీకుటుంబము వారిలో చేన్న రామప్పగారను ప్రఖ్యాతి పురుషులు గలరు. గొప్పభూస్వాములు, మంచికవులు, వీరు మైసూరు ప్రజాప్రతినిధి సభమున్నగువానిలో చేరి మునందు ప్రజలయందు వీరికిగల అభిమానమును వెల్లడించుచుండిరి. వీరు సహజ ధార్మికులని అనేకులు చెప్పగా వినియుంటిని వీరు డిస్ట్రిక్టు బోర్డు మెంబరుగను, తాలూకా బోర్డు వైసుప్రెసిడెంటుగను, ఆనరరీ మేజస్ట్రేటుగను, విద్యాబోర్డు సభ్యులు మొదలగు నుద్యోగములలో నిరతులై యుండి యెట్టెటో తీరిక గల్పించుకొని ఆపద్బాంధవ శతకమును చౌడేశ్వరీమహాత్మ్యమను గ్రంథమును రచించి భాషాయోషామణికొక నూతనాలంకారము సమర్పించిరి. ఈ గ్రంథమిటీవల నాకు చేరినది దీనిపై గల విమర్శ ప్రథమసంచికలో చూడవచ్చును ఈయన యింజేటివారి దౌహిత్రులు మహూరివారి చుట్టము.

(2) శ్రీవత్స గోత్రీకులగు గుమ్మరాజువారు:—

నందవరీకులు, ఆశ్వలాయన సూత్రులు, ఋగ్వేదులు, శ్రీవత్సగోత్రికులు, భార్గవచ్యవన, అప్నువాన, ఔరవ, జామదగ్ని అని పంచార్షేయము చెప్పుకొనుచున్నారు.

వీరు చిత్తూరు జిల్లా వాయల్పాడు తాలూకా మజ్జీమాకుల

పల్లె, మట్టిపాడు, అను గ్రామములయందు, కోలారు జిల్లా పాతపాళ్య మునందు గలరు. వీరు పూర్వ మేగ్రామమునందుండియుండిరో వీరికి గ్రామనామముగాక పౌరుషనామము వచ్చుటకుగల కారణమేమైయుం డెనో తెలియదు.

☞ గుమ్మరాజువారు ప్రప్రథమమున మడూరివారని పిలువబడినటుల తెలియుచున్నది. మడూరివారిది శ్రీవత్సగోత్రము. వీరిది వసిష్ఠగోత్రము. సర్వసాధారణముగా ఈ సందవరీకులకు గోత్రప్రధానమేగాని ఇంటిపే రంత ఎక్కువగా చూడరు. అన్నదమ్ము లిద్దరిసంతతి అయిదువూళ్లలో నుండి యుండిన ఆ అయిదు యూళ్ళపేర్లు వారిద్దరి గృహనామములుగా వాడుకొనెదరు. గ్రామనామమె గృహనామముగా గల యిళ్ళపేర్లు గల బ్రాహ్మణుల యందందరి యందును యిట్టిమార్పులు కలవుగాని సంద వరీకు లంతటి విపరీతపుమార్పులు లేవు. మఱియు నీ మడూరివారు అనేక యిళ్ళపేర్లుగా మారినటుల పసిండికొండదుర్గరాజు వెంకటరమ ణాఖ్య ప్రణీతంబైన లక్షణశిరోమణియను గ్రంథమునం దీదిగువపద్యము కనుపించుచున్నది గాని గుమ్మరాజువారనునది అందు చేరలేదు కార ణము దురూహ్యము.

సీ॥ నందవరంబున నలువొందగా
దశ గ్రంథాలవారన గణనకెక్కి-
పిమ్మట రాయనప్రెగ్గడ వారనఁ దనరి
తరువాత బొత్తపి యనేటి
గ్రామనామమున బ్రఖ్యాతిగాంచి
యనంతరంబు దనర దుగ్గరాజుపేర
పౌరుషేయంబుగ బ్రొడిగౌతమ
గోత్రుండగు పసిండి కొండదుగ్గ

రాజు వెంగన పౌత్రుఁడ రామఘనుని
పుత్రుడమ దూరి కొండార్య పుత్రుడయిన
యెలమి రఘునాథ మంత్రి దౌహిత్రుఁడఁగవి
రాజ మిత్రుఁడ వెంకట రమణకవిని.

## కోనవారిచరిత్ర

ఆర్వేల నియోగులు. ఆపస్తంబులు. యజుర్వేదులు. హరితస గోత్రీకులు హరిత-అంబరీష-యౌవనాశ్వ. అనిత్ర్యార్షేయము చెప్పుకొను చున్నారు. వీరికీపేరెట్లు వచ్చినదో వీరి పూర్వపు కాపరస్థల మెచటనో తెలియదు. ఈపేరు గలకుటుంబము వారిపుడు బాపట్ల తాలూకా పెద చెరుకూరు-వల్లభరావు పాలెము బాపట్ల-బేతపూడి. తెనాలి తాలూకా అమృతలూరు-చిత్తూరి మండలములోని కార్వేటినగరము- రేపల్లెతాలూకా చింతల పూడి తెనాలితాలూకా గుళ్ళపల్లి మున్నగుగ్రామ ముల యందుండియున్నారు. వీరి పూర్వులు చాలామంది అన్నదానమున గర్మానుష్ఠానమున భక్తిప్రపత్తులఁ బేరెన్నికగాంచిన వారు కలరు. అట్టి వారిలో స్వర్గీయులగు వీరయ్యగారు- వారి భార్యయగు మహాలక్ష్మమ్మగారు వీరికుమార్డు వేంకటప్పయ్య- కోటయ్యగార్లును, లక్ష్మీనృసింహము(బేతపూడి)గారును-సజీవులలో వీరయ్యగారి కుమారులగుసుబ్బయ్య గారును- లక్ష్మీపతి గారి భార్యల క్ష్మమ్మగారును ముఖ్యులు. కోటయ్యగారు వ్యవహార పరిజ్ఞానమునఁ బేరుగడించి కవిత్వముచెప్పఁగలిగి విలసిల్లిరి. వీరు 25 సంవత్సరముల విచ్ఛిన్నముగా నృసింహజయంతి- సత్యనారాయణ వ్రతములు జరిపి అనేక సమారాధనలు చేసి విఖ్యాతివడసిరి. ఆధునికులలో సీతారామారావుగారు ఇంగ్లండునకుఁ

బోయి ఎం. ఏ. పరీక్షయం దుత్తీర్ణులై పాఠశాల పరిశీలనాధి కారిగా పనిచేయుచున్నారు- వేంకటరావుగారును వీరి కుమారులగు సత్యనారాయణరావుగారును బాపట్లలో న్యాయవాదులుగఁ బనిచేయుచుఁ బేరు గడించుచున్నారు- సత్యనారాయణరావుగారు బి. ఏ. బి. ఎల్. పరీక్ష యందు విజయులైనవారె. పెదచెఱుకూరు వాస్తవ్యులగు కోటయ్య పంతులుగారి కుమారులగు వేంకటరాయశర్మగారు సంస్కృతాంధ్రముల నభ్యసించి చరిత్ర పరిశోధనమునం దభినివేశముగలిగి 'ప్రాచీన హిందూ దేశ రాజ్యాంగచరిత్ర' కన్నడ దేశచరిత్ర- ఛత్రపతి శివాజీ- ఋతుమతీ వివాహము దూష్యము- వ్యవహారదర్పణము- స్త్రీరత్నములు-'అస్పృశ్యత శాస్త్రీయమే' మొదలగు గ్రంథరత్నముల రచించి శ్రీశ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరాయ ప్రభువర్యునిచే 'సాహిత్యవిశారద' బిరుదమును- సంచార విజ్ఞాన సర్వస్వమునదగు శ్రీమన్మహోపాధ్యాయ ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన (పార్వతీపురము) ప్రభృతి ప్రముఖులచే 'చరిత్ర రచనాధురీణ' బిరుదమును బడసిరి. వీరు 1926 సం॥ నుండియు ఆంధ్రసారస్వత పరిషత్తునకుఁ గార్యదర్శులుగ నెన్నికోబడి యాంధ్ర వాఙ్మయ వికాసమునకు దోహద మొనగూర్చుచున్నారు. ఇదిగాక. 'ఆంధ్రసారస్వత పరిషత్పత్రిక' యను పేరితో నొక ద్వైమాసపత్రికను 'గ్రామోద్యోగి' పత్రికను బ్రచురించి విశేషసేవఁజేయుచున్నారు. వీరు గుంటూరుమండల గ్రామోద్యోగ సంఘమునకు గౌరవకార్యదర్శులుగ 1929 సం॥ నుండి ఎన్నుకొనబడి తత్సంఘమునకెనలేని సేవఁజేయుచున్నారు.

తదుపజ్ఞకయి 'గ్రామోద్యోగి' పత్రికను బ్రకటించుచున్నారు. వీరి సోదరులగు సుబ్రహ్మణ్య శర్మగారు హరికథనమున విన్నాణముం జెంది యీ మండలమునఁ గీర్తిని గాంచుచున్నారు.

కోనల క్ష్మీపతిగారి భార్య లక్ష్మమ్మగారు ధర్మసత్త్రర్వ నొకదాని నిర్మించి మంచి నీటిబావుల రెంటిని త్రవ్వించిరి.

ఈ కుటుంబమువారి కనుశ్రుతముగా భర్తీపూడి- కౌవుటూరి- నడింపల్లి- కొంపల్లి- అన్నమరాజు- వులిపాక- మన్నవ- దేచిరాజు- గండవరపు- వింజనంపాటి. పూండ్ల- రాజశేఖరుని- అబ్బిరాజు- శ్రీగిరి రాజు- రావుల- కొండముది- మామిళ్ళపల్లి- గర్నెపూడి- పూసపాటి నిమ్మరాజు- రావినూతల- అంకరాజు- ముదిగొండ- నారపరాజు దర్శి- జిల్లెళ్ళమూడి-ఇనమనమెళ్లూరు-భట్టిప్రోలు కుమ్మమూరు, లక్కరాజు, మాచిరాజువారు మున్నగువారితో సంబంధములుగలవు అని తద్వంశీయులగు శ్రీశ్రీ కోన వేంకటరాయశర్మగారి వల్ల తెలియవచ్చినది.

హారిత, అంబరీష, యువనాశ్వ; యని హారితసగోత్రీకులనేకులు ప్రవర చెప్పుకొనుచున్నారు. ఇది పొరపాటుఅనియు అంగీరస, అంబరీష, యావనాశ్వ, అనునది సరియగు ప్రవరయనియు ఇట్లు అశాస్త్రీయ ప్రవరవాడుటకు గల కారణము. దురూహ్యమని గోత్రప్రవర సంగ్రహ గ్రంథమున వ్రాయబడినది. గోత్రఋషి ప్రవరయందు గల సియుండవలె అని కొందఱు ప్రశ్నించుచున్నారు. శ్రీవత్సగోత్రీకులు వత్సఋషిని చెప్పుట కనుపించదు. ఈ చర్చ ఉపోద్ఘాతమున విపులముగా వ్రాయదలచితిని.

## మరింగంటివారు

శ్రీ వైష్ణవులు, మౌద్గల్యగోత్రీకులు. అంగీరస, భార్మ్యశ్వ, మౌద్గల్య యని త్ర్యార్షేయము. వీరి పూర్వుల నివాసస్థలము నైజాము యిలాకా నల్లగొండ సమీపములోని కనగల్లు—సిరిసినగండ్ల గ్రామములు. అనంతరము యీ వంశీకులలో కొందరు కృష్ణా జిల్లా నంది

గామ తాలూకాలోని జగ్గయ్యపేటయందు నర్సారావుపేట రాజాగారి యాస్థాన విద్వాంసులుగా చేరినారు. వీరి కుటుంబము చాలగొప్పది. వీరిలో సింగరాచార్యులుగారు, వెంకటనృసింహాచార్యులుగారు (కుమార వెంకటాచార్యుల పుత్రులు) భావనాచారిగారి కుమారుడు వెంకట నరసింహాచార్యులుగారు. పూర్వకవులు. శ్రీమత్తిరుమల నల్లాని చక్రవర్తి వెంకటరామ నృసింహార్యులుగారి శిష్యవర్గములోని మరింగంటి చక్రాచార్యులుగారు ఆధునిక కవులు. పూర్వకవులు రచించిన దశరథ రాజనందచరిత్రము శ్రీకృష్ణశతానందీయము, తాలాంక నందనీ పరిణయము అను గ్రంథములలో వీరి వంశచరిత్ర సంపూర్ణముగ గలదు.

అందలి వివర మీ దిగువ వివరించుచున్నాను. వీరికి ఆసూరి మరింగంటివా రను యింటిపేరు గలదు. దానికి గల కారణ మీ దిగువ విధమున దెల్పబడినది.

కం॥ కంటిక్ లక్ష్మణముని నట
కంటిక్ గూరేశ దేశిక స్వామి మఱిం
గంటి నద్రివ్వరనన్ మరి
గంటి మహాన్వయము దనరె గణ్యంబగుచున్.

గీ॥ సలలితాసూరి కులచే ప్రశస్తి గన్న
సాధు భట్టారకుఁడు రంగశాయివలన
నిల మరింగంటివా రన్న యింటిపేరు
గురుశిఖామణు లెన్నంగఁ బరిఢవిల్లె.

ఆ సాధుభట్టారకునకు పిళ్ళగారు—ఈయనకు పెరియపిళ్ళ—ఈయనకు శ్రీరంగనాథాచార్యులవారు. ఈయనకు తీర్థ పాదయ్యగారు—వీరికి పెరియజియ్యగారు. వీరికి మాధవాచారిగారు జన్మించిరి. ఈయన కిరువదిమంది కుమాళ్లు గలిగి నట్లుల ఈదిగువ పద్యమునలన కనుపించుచున్నది.

క॥ ఘనుఁ డగు మాధవగురువరు
వనితయు నగు తిరుమలాంబ వరగర్భమునన్
తనయులు వింశతి సంఖ్యను
జనియించిరి శేషశైల సదనుని కృపచేన్.

వీరిలో కనిష్టుడు చిన్నయాచార్యులుగా రిట్లు వర్ణింపబడిరి.

గీ॥ నతనికి (మాధవాచార్యులకు) జనించె సకల రాజాధిరాజ
రాజ మకుటాగ్రఘటిత చిరత్నరత్న
బహుళ నీరాజనాతి విభ్రాజితాంఘ్రి
సరసిజుఁడు చిన్నయాచార్య చక్రవర్తి—యనియు

క॥ తనజన నీ గర్భంబున
జనియించెడివేళ నొక భుజంగము కవమై
కనుపట్టి యనంతాళ్వా
రను పేరన్ బ్రబలెఁ జెన్నయార్యు డెలమిన్,

ఈ మహాపురుషునకు తిరుమలయ్య—భట్టరుడు—సింగరాచారి అని ముగ్గురు పుత్రులు కలిగిరి. ఇందు రెండవవారగు భట్టాచార్యులుగారికి వెంగళాచార్యులుగారు. ఈయనకు తిరుమలాచార్యులుగారు భట్టాచార్యులుగారు జనించిరి. ఇందు పెద్దవారగు తిరుమలాచార్యులుగారికి వెంగళాచార్యులు అనంతాచార్యులుగారు సింగరాచార్యులుగారు కలిగిరి. ఈ వెంగళాచార్యులగారి కెనమండుగురు కుమాళ్ళు. వారిట్లు వర్ణింపబడిరి.

సీ॥ ముగురు రాజులచేత మ్రొక్కులు గొన్నట్టి
భగవత్సమాను డప్పల గురుండు
వేదవేదాంగాది వివిధార్థ సంపత్తి నతిశ
యిల్లిన వెంకటార్యమౌళి

కలితసౌందర్య రేఖా విలాసంబులఁ
జెంగలించెడి శ్రీ నృసింహ విభుఁడు
కుపిత మాయావాది గురుశాస్త్రప్రహరణ పా
రగుఁడైన కోనేటిరాయ శౌరి

గీ॥ సరస శతపద్య లేఖికావిరచనోక్తి
గల జగన్నాథ సూరు లగ్రజులు గాఁగ
నలరి రంగప్ప నరసింగప్పదమ్ము
లై మెఱయు వాఁడ భువిసింగ రాహ్వయుండ

ఈసింగరాచార్యులుగారే దశరథరాజ నందన చరిత్రగ్రంథమురచించినవారు. ఆగ్రంథాంత్యమున గలగద్యలో "ఆంధ్ర భాషానిరోష్ట్యాది వింశతి ప్రబంధనిర్మాణ మౌద్గల్యగోత్రపవిత్ర తిరుమల దేశికపౌత్ర వేంగళాచార్యపుత్రి మరింగంటి సింగరాచార్య ప్రణీతంబైన" యని వ్రాసుకొనెను, గాని ఆ యిరువది ప్రబంధముల నామములైనను యిపుడు లభించుట లేదు. సీతాపతి శతక మొకటి యీయన రచించిన దని శతక కవుల చరిత్రయందున్నది. పై నుదహరించిన సింగరాచార్యుల గారికి నరసింహాచారిగారు, వీరికి వరదరాజుగారు—ఈయనకు జగ్గయ్యగారు నరసింహాచారిగారుఁ కృష్ణాచార్యులుగారు అను ముగ్గురు కుమాళ్ళు కలిగిరి. ఈ ముఫ్వురిలో జగ్గయ్యగారికి రాఘవాచార్యులుగారు ఈయనకు శ్రీనివాసాచార్యులుగారు జగ్గయ్యగారు సింగరాచార్యులుగారు కలిగిరి. ఈ సింగరాచార్యులుగారికి వెంకటాచార్యులు, భట్టరయ్య అనువా రిద్దరు పుట్టిరి. అందు వెంకటార్యులకు నరసింహాము అప్పలాచార్యులు, సింగరాచార్యులు పుట్టిరి. వీరి ముప్వురిలో పెద్దవారగు నృసింహాచార్యులుగారే 'కృష్ణశతానందీయ' మను ప్రబంధము రచించిరి. వీరి గ్రంథాంత్యమున 'వేంకట దేశిక పౌత్ర కుమార వెం

కటాచార్య ప్రణీతము' అని వ్రాసుకొనెను. వీరి కాపురము సిరసనగండ్ల అందువల్లనే 'సిరిసనగండ్ల నుండు మా శ్రీకరుడైన లక్ష్మీనరసింహుడు మమ్ములఁ బ్రోచు గావుతఁ' అని సంబోధించెను. వీరుగాక నైజాము యలాకా కనగల్లు కాపురస్థులైన మరింగంటి వారివంశకర్త భావనాచారి యనియు, ఈయనకు నరసింహాచార్యులు. వీరికి వెంకట కృష్ణయ్య, భావనాచార్యులు అను యిద్దరు కుమాళ్లు. భావనాచార్యులకు నలదీగెల వారింటి కూతు రగు రంగనాయకమ్మవలన వేంకటరాఘవాచార్యులు, వెంకటనారసింహులు అను యిద్దరు కుమాళ్ళు. పెద్దవారు పండితులు. రెండవవారు అన్నగారియొద్దనే విద్యాభ్యాసముచేసి కవియై 'తాలాంకనందనీ పరిణయ' మను ఆరాశ్వాసముల మహాప్రబంధము రచించినటులను, అయ్యది అముద్రితమని అందలి పద్యములు కొన్నిటి నుదహరించుచూ మునీషి శేషభట్టర్ వెంకటరామానుజాచార్యులుగారు దుర్ముఖి సంవత్సర కార్తీక మాసములోని ఆంధ్రపత్రికయొక్క సారస్వతానుబంధమున ప్రచురించిరి.

ఆధునికులలోని వారగు చక్రాచార్యులుగారు రచించిన గ్రంథములు తెలియవు గాని ఈయన శ్రీరాజామంత్రిప్రగడ భుజంగరావుపంతులు బహద్దరు జమీందారుగారి కమార్తె యగు హైమవతి వివాహసందర్భమున రచించిన పద్యములు కొన్ని శ్రీరాజాగారు రచించిన ఆధునిక కవిజీవితగ్రంథమున కనుపించినవి. మరియొకరగు భట్టరురామానుజాచార్యులుగారు శ్రీ వారణాసి అచ్చుత రామయ్యగారి గురువులని వారు రచించిన 'సురతానీ పరిణయ' గ్రంథమున వర్ణించెను. ఆంధ్రనిరోష్ఠ్య సీతాకల్యాణము' అను మరియొక ప్రబంధము 1910 లో అచ్చుపడినది. అయ్యది మరింగంటి సింగరాచార్యులగారి ప్రణీతమైనట్టు ముద్రితగ్రంథపట్టికయందున్నది. పైనుదహరించిన దశరథరాజనందన చరిత్రము ముందుగానే అచ్చుపడినది. ఈ సింగరాచార్యులుగా రెవ్వరో తెలియదు.

## అందుగులవారు

వీరు బడగలనాటి కన్నడీలు, ఋగ్వేదులు, ఆశ్వలాయనసూత్రులు శ్రీవత్సగోత్రికులు. పంచార్షేయము. ఈ వంశీకులలో అందుగులవెంకయ్య అను కవిగలడు. ఈయన నరపతి విజయమను నామాంతరముగల రామరాజీయమను గ్రంథమురచించెను. ఆత్రేయ గోత్రులైన చంద్రవంశజులగు చాళుక్యరాజుల చరిత్రమిందు వర్ణింపబడినది. బాహ్లిక దేశమునుండివచ్చి యాంధ్రరాష్ట్రమును పాలించిన చంద్రవంశీయులగు నేడ్వురు సోదరరాజులలో 'నందుడు' అనువాడు తన పేర నందపురమును నిర్మించుకొని సేతువు మొదలు గోదావరివరకు నేలినమహాపురుషుల ప్రతిభావిశేషములు వర్ణించిన మహనీయుడగు నీకవి తన వంశమును, గోత్రసూత్రములను చెప్పుకొనకపోవుట శోచనీయము. ఈయన, కృతిపతి తన్నుద్దేశించి పల్కినట్లుచెప్పిన పద్యమిట్లున్నది.

క॥ నగుమొగమున ననుఁగనుఁగొని
జగతీసుర వంశమణివి సత్కవి వగుటన్
దగుదువు మామన్ననకుఁ బొ
సఁగంగ, నందుగులసూర సచివుని వెంగా.

క॥ రారమ్మనుచును మిక్కిలి
గారవమునఁ బిలిచిచెంత గద్దియపైన
న్నారూఢునిఁగా నొనరిచి
తోరముగాఁ జేలములనుఁ దొడవులనొసగెన్.

అని మాత్రము చెప్పుకొనుటచే ఈయన నియోగిశాఖలోనివాడనియును. సూరనామాత్యుని కుమారుడనియు దెలియుచున్నది. విచారించగా వినుకొండ తాలూకాయందొక అందుగులపాడను గ్రామ

ముకలదదియు అచటివా రందుగులవారనియు శ్రీవత్సగోత్రీకులనియు, ఋక్శాఖా బ్రాహ్మణులనియు ఆశ్వలాయన సూత్రులనియు వీరు రాజులవద్ద అమాత్యులుగానుండి యిటువైపున వచ్చినకుటుంబముల వారిట నిలచిరనియు గ్రామపరిపాలన పత్రికాధి పతులవల్ల తెలసినది.

## చిల్లరవారు

ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, కౌండిన్యగోత్రీకులు. వాసిష్ఠ- మైత్రావరుణ-కౌండిన్య అని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరిలో కొందరు బాపట్లతాలూకా పూళ్ళగ్రామమునందు గలరు మరికొందరు ఒంగోలు తాలూకా కోరుమంచి జయవరం గ్రామాదులలో గలరు. వీరను శృతముగా, అన్నపరాజువారు, పూండ్లవారు, కోనవారు, వల్లూరివారు, రావినూతలవారు, పూసపాటివారు, నండూరివారు మొదలగువారితో సంబంధములు గలవు. చిల్లర సూర్యనారాయణగారు పూర్వకవులలో చేరినవారు. వేదాంతబోధమున్నగుకొన్ని అద్వైత గ్రంథములు రచించిరి. ఈయన తండ్రి పేరు వెంకయ్యశాస్త్రి. ఈయన పూర్వులు చునహో సంస్థానాస్థాన పండితులుగా నుండినారట. వీరు చాలా ఖ్యాతిసంపాదించి నటుల వాడుకగలదు ఈ చిల్లరవారిలో మంత్రులుగలరు నెల్లూరు మండలములోని బిట్రగుంట సమీపములోని సోమరాజుపల్లెయను గ్రామమునేలు రాజులయొద్ద చిల్లర వెంకన్న మంత్రియను ప్రఖ్యాతిపురుషుడు గలడు. ఈయనపేర పిల్లలమఱ్ఱి పినవీరభద్రయ్యగారు శృంగార శాకుంతలమను గ్రంథము కృతియిచ్చెను- ఈ వెంకన్నగారు గొప్ప భూస్వామి ధనసంపన్నుడుగా నుండెనట ఈయన కాపురముండిన సోమరాజు పల్లెనిట్లు వర్ణించబడెను.

సీ॥ లవణాబ్ధి వేల హెూలోకాంచి యగు నంధ్రి
ధరణిమండలికి ముత్యాల జల్లి
సంగ్రామ పార్థరాజన్య రాజశ్రీకిఁ
బెంపుమీరిన జగజంపు వెల్లి
దాతలు సముదంచిత ప్రసూనములుగాఁ
గామితార్థము లిచ్చు కల్పవల్లి
యరువది నాల్గువిద్యలకు నపూర్వ ఘం
టాపథంబైన పట్టణమతల్లి
పంట నృపకోస్తుభములకుఁ బాలవెల్లి
కదన జయలక్ష్మి తొలిచూలు గన్నతల్లి
విపుల భుజగర్వదర్పిత విమతరాజ
రాజహృద్భల్లి ధర సోమరాజపల్లి.

అని యెంతో గొప్పగా వర్ణించెను. యిట్టిగొప్పపట్టణమున మహా దైశ్వర్యసంపన్నుడుగా నుండు చిల్లర వెంకన్నకవి నిట్లు సంబోధించి నట్లున్నది.

గీ॥ కలదు చాలంగ బ్రోమ నీవలన నాకు
వేడ్క నడిగెదఁ గవులెల్ల వేడ్క పడఁగ
షట్సహస్రకులోద్భవ సచివులందు
సుకృతిగా జేయు నాకొక సుకృతిజేసి.

అనుటచే యీాయన ఆర్వేల నియోగి యని స్పష్టమగుచున్నది. ఈ శృంగారశాకుంతలమునం దీ కృతి వంశ మిట్లు వర్ణింపబడినది. ఈ వంశపు మూలపురుషుడు పేడమంత్రి. ఈయనకు ఎర్రయ, వెన్నయ్య నాగరాజు. ఇందు నాగరాజు పోతమాంబను వివాహమాడెను. ఈ దంపతులకు వెన్నయ్య, పేరన, ఆదెన్న, ఎర్రన, వీరభద్రుడు అని

అయిదుగురు కుమాళ్లు. వీరందరిని అనేక చిత్రవిచిత్రములుగ వర్ణించెను గాని వానిని విడచి కృతిపతియగు వెంకన్న విషయములో చెప్పిన పద్యముమాత్ర ముదహరించెద.

సీ॥ కూర్చుండు వయసునఁ గూర్చుండ నేర్చెను
నను దినత్యాగ సింహాసనమునఁ
గొంకక నడవ నేర్చుకొనుచుండి నడ నేర్చె.
దప్పక వేదోక్త ధర్మసరణి
మాటలాడగ నేర్చు నాఁటనుండియు నేర్చెఁ
బలుకంగ హిత సత్యభాషణములు
చదువంగ వ్రాయంగ సరవడి నేర్చియు
నేర్చెను గార్యంబు నిర్వహింప
వినయమున కాకరంబు, వివేకమునకు
సీమ జన్మస్థలంబు దాక్షిణ్యమునకు
నాలవాలంబు విద్యల కరయ మూర్తి
మరుడు చిల్లర వెంకయామాత్య వరుఁడు.

సీ॥ రక్షించె బంధువర్గముఁ బ్రమోదం బంద
నర్థుల కిచ్చె నిష్టార్థ సమితి
గట్టించె ఘనతటాకంబు లంబుధులుగా
ధర్మశాసనములు తరచు నిలిపె
స్థిర సముస్నతి సంప్రతిష్ఠించె నగ్రిండ్లు
వర విధానంబులు శ్వేర ఘటించె
సన్నసత్రము లనేకము లచో సాగించెనోలి
జేయించె దేవోత్సవములు

సప్తసంతానవతి జేసె జలధి నేమి
జేసె ధర్మంబు లెన్నేని జెలువు మిగుల
జేయుచున్నాడు సుకృతంబు లాయితముగ
మనుజమాత్రుండె వెంకయామాత్యవరుఁడు.

అని చెప్పి షష్ఠ్యంత్యములలో

క॥ కౌండిన్య గోత్రునకును
ద్దండా హితసచివమతి లతాదాత్రునకుం
బండిత చింతామణికి
బ్రచండ వచో విభవ విష్ణుశయ్యా ఫణికిన్.

ఇంతటితో విడువక 'వినుత క్ష్మాపాలకామాత్య వేదండానీక మృగేంద్ర' అనియు, శీతశైలాబ్ధివేలామధ్య క్షితిపాలమంత్రి మకుటాలంకార హీరాంకురా' అనియు, సదా స్వామికార్య ప్రియాచార నీతి ప్రియా' అనియు మున్నగు పదము లెన్నో బ్రయోగించెను గాని ఈయన ఎవరియొద్ద మంత్రిగా నుండెనో ఏ రాజ్యము పాలించెనో ఈయన తల్లి యవరియాడపడుచో తాతముత్తాతల కెవరిపిల్లనిచ్చిరో యెచటను కనుపించదు. చిల్లరవీరయ్యగారి కుటుంబమువారిపుడు నెల్లూరు మండలములోని గంగపట్టణమందున్నారనియు దిట్టకవివారి చట్టములనియు తెలియుచున్నది. ప్రస్తుతపు వారిలో చిల్లర ఆంజనేయులుగారను వారు రాజరాజేశ్వరీ దండకము రచించిరి. వీరికాపురమెచటనో తెలియదు చిల్లరకోటయ్యగారి కుటుంబమొకటి మునిపల్లెయందు గలదు వీరిది కౌశికగోత్రమని తెలియుచున్నది.

కౌండిన్య గోత్రీకులగు చిల్లర వేంకటేశ్వర కవిగారి కాపురము గుంటూరుమండలములోని నెల్లూరనుగ్రామము. తండ్రిసుబ్బయ్యగారు ఈయన జననం సం॥ 1889 ఈయన హరిశ్చంద్రచరిత్ర 2 శ్రీ కృష్ణవిజయము. 3 విచిత్రపురూరవము అను గ్రంథములు రచించిరి. ఈ వంశీకులు మునుపల్లె- ఎడ్లపల్లె- అన్నవరము మొదలగు గ్రామములయం దీయన చాలాఅవధానములు చేసినట.

## భీమరాజువారు

ఆశ్వేల నియోగులు—ఆపస్తంబులు యజుశ్వేదులు వీరిలో గౌతమ గోత్రీకులు—కౌడిన్య గోత్రీకులు—గలరు. అందు గౌతమ గోత్రీకుల ప్రవర ఆంగీరస అయాస్య—గౌతమ అని చెప్పకొనుచున్నారు. ఈగోత్రీకులలోని వారగు భీమరాజు వెంకటరమణయ్య గారికుటుంబము గోదావరిజిల్లాలోని కోటిపల్లియందుగలదు. వీరికి అజ్జరపువారు— వాడ్రేవువారు—కుందూరివారు—మాచిరాజువారు—తటవర్తివారు మున్నగువారితో సంబంధములు గలవు. ఈ వెంకట రమణయ్య గారిపితా మహులగు భానుమూర్తిగారు తంజావూరునందు విద్యాభ్యాసము చేసిన వైణికులు కోట—పెద్దాపురము సంస్థానములో వైణికులుగానుండు కాలములోవీరు భీమరాజువారుగా మారినారు. ఈ భీమరాజుగారి తాతగారి కాలములో వీరు నెల్లూరు జిల్లా వేముల గడ్డ యను గ్రామమునందుండెడి వారనియు అపుడు వీరి యింటిపేరు వేమూరి వారనియు మొదటినుండి గాన విద్యాప్రవీణు లగుటచే ఈ భీమరాజుగారి తాత భీమరాజుగారిని బట్టి భీమరాజు వారను పౌరుషనామముగా మారినది అని తమ పెద్దలు చెప్పకొనగా విని యుంటినని కోటిపల్లినుండి భీమరాజు వెంకట

రమణయ్యగారు తెలియపరచిరి. వేములగడ్డ యను గ్రామము కొండవీటి దండకవిలె యందున్నది. ఆ గ్రామమునకు నాలుగు సంప్రతు లిచ్చి నటుల వ్రాయుచూ కౌండిన్య గోత్రికులలో దుమపాటివారు- మోటుపల్లె వారు- అనువారును కాశ్యప గోత్రికులు యిద్దరు నందవరీకు లైనట్టు వ్రాయబడియున్నది. గాని గౌతమ గోత్రీకులమాట కనుపించదు. అందువల్ల వీరి అనాదికాపురము వేములగడ్డఅగునో కాదోగాని వేమూరుగ్రామములో వేమూరి భీమరాజు అనువా రున్నారు వారి గోత్రము కౌండిన్య అనుటచే వారేవీరనుటకు వీలుకనుపించదు. భీమరాజు నారాయణరావుగారిపుడు నెల్లూరుజిల్లా ఒంగోలులోగలరు. వారిగోత్రము గౌతమగోత్రము కాదనుచున్నారు.

(2) కౌండిన్య గోత్రీకుల వివరము:—

ఆపస్తంబులు, యజుశ్శాఖీయులు' కౌండిన్యస గోత్రము. వీరు వాశిష్ట మైత్రావరుణ, కౌండిన్య యని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరి అనాది కాపురము కొండవీటి సీమలో తెనాలి తా॥ వేమూరు గ్రామము. వీరిని పూర్వము వేమూరి వారని పిలుచుచుండిరి. కొండవీటి దండకవిలెలో వేమూరు సంప్రతులు 2 కి వెలదునా కౌండిన్య గోత్రీకులు వేమూరి భీమరాజు గారనియు నందవరీకులు వసిష్ఠగోత్రీకులు వేమూరి వీరరాఘవయ్య యని వ్రాయబడి యున్నది. కౌండిన్య గోత్రీకు లైన భీమరాజు వా రిపుడు గుంటూరునందు ఒంగోలునందు యుండియున్నారు. వేమూరునం దున్ననూ వేములగడ్డలో నున్ననూ భీమరాజువారి పూర్వపు యింటిపేరు వేమూరు వా రనుట నిశ్చయముగా దోచుచున్నది. గ్రామ నామముగా నుండు యింటిపేరు వైణికుడుగానుండు భీమరాజునుబట్టి భీమరాజు వారుగామారియుండవచ్చును. గాని వేమూరివారిలో గౌతమగోత్రీకులు కనుపించుటలేదు.

య్య— సుబ్బారావు వీరు పెండ్యాలయందున్నారు. లక్ష్మయ్యగారి వాహితుడు. వేంకటరత్నముగారికి సీతారామయ్య అను కుమార్డు గలడు ఇతని చిన్నతనముననే తండ్రిచనిపోవుటచే మేనమామలయూరగు ఏలూరు తాలూకా పూళ్ళయందున్నారు. మూలపురుషుని నాలవ కుమార్డు సుబ్బారాయడు ఈయనకు వేంకటరత్నము— రామయ్య ఈ రామయ్యగా రన్యకుటుంబముకు దత్తతవెళ్లనారు వెంకటరత్నముగారి సుబ్బారాయడు— నారాయణ— లక్ష్మీపతి— సుందరరామయ్య అని ఆ యిదుగురు కుమాళ్ళు ఈ కుటుంబమువారు పెండ్యాలయందే యున్నారు. మూలపురుషునికి నలుగురు కుమార్తెలుగలరు. అందొకరిని ఉసులుమర్తి వారికి. 2 కోరుపెల్లవారికి 3 కాశిరాజువారికి 4 యేడిదివారికి 5 చాగంటివారికి నిచ్చి వివాహముచేసిరి. మూలపురుషుని రెండవ కుమార్డు అగు వెంకన్నగారు. మూలపురుషుని నాలవ కుమారుడగు సుబ్బారాయుడుగారి రెండవకుమారుడు రామయ్యగారు దత్తతకాబడిన కుటుంబము వేరుగాకనుపించుచున్నది. ఈ రామయ్యగారికి సుబ్బారావు అను కుమార్డుకలడు. ఈయన మిరాశి కుటుంబములోనివాడగుటచే ప్రస్తుత మా గ్రామకరిణికము చేయుచుండెను, వీరివలెనె పైనుదహరించిన పెండ్యాలవారికి మిరాశీ మాన్యములుకలవు గాని ఈ రెండుకుటుంబములు యెందుకు వేరుపడిరో యెప్పుడువేరుపడిరో తెలియదు, ఈ రెండుకుటుంబములవారికి యిప్పుడు పురుడుపుణ్యములులేవు.

ఈ కుటుంబమువారికి కనుశ్రృతముగా కోరుపల్లె- కాశిరాజు- చాగంటి- జొన్నలగడ్డ- రామరాజు- గన్నవర్పు- దినవహి- కందుకూరు- పెమ్మరాజు- చామర్తి- గోశేట్టి- చెంగల్వల- అయినంపూడి- తేతలి- సత్తిరాజు- ఉసులుమర్తి- మద్దాలి- పూళ్ళ- జీడిగుంట- గోవిందరాజుల- వడ్డాది- బాలాంత్రపు- పాలంగి- పోణంగి- పేరాప్రగడ- ముష్ణ

వారితో సంబంధ బాంధవ్యములుగలవు.

(2) ఆర్వేలనియోగులైన పెండ్యాలవారిలో కణ్వసగోత్రీకులుగలరు వీరు నందిగామ తాలూకా పెండ్యాలయందున్నారు. కొందరు నైజా ము యిలాకా మధిర- కంచల- నాగులపల్లి యందున్నారు పెండ్యాల వెంకటేశ్వరరావుగారు అశ్వారావుపేట జమీందార్ల ఏజంటుగానున్నా రు. వీరికి శివరాజువారు, వడ్డాది, గుండేపల్లివారిలో బంధుత్వము గలవు. వీరికుటుంబములు విశేషముగా నైజాముయిలాకా మధిరయం దున్నటుల తెలియుచున్నది.

(3) పెండ్యాలవారు:— తెలగాణ్యపు వైదికులు, కౌండిన్య గోత్రీకులు, వాసిష్ఠ, మైత్రావరుణ, కౌండిన్య అని త్ర్యార్షేయము. వీరి అనాదికాపురము నైజాము రాజ్యములోని ఓరుగల్లుకు సమీపము నగల పెండ్యాల యిపుడు తెలగగ్యాపు వైదికులగు పెండ్యాలవారు చాల కుటుంబములవారచట గలరు. తాలికోట యుద్ధానంతరము మహమ్మదీయుల జాతి ద్వేషము సహింపలేక యిప్పటికి పదునొకండు తరములకు పూర్వుడగు నరసభట్టు అనువారాప్రాంతమునుండి గోదావరి జిల్లాకు వచ్చిచేరెను. వీరి సంబంధీకులిప్పుడు నైజాములోని మంథెన- ధర్మపురి- పెద్దపల్లి- పెండ్యాల అను గ్రామములయం దుండియున్నా రు. వారిలో చాలమంది వేదవేత్తలు- శాస్త్రజ్ఞులు గలరు. మఱి కొందరు చిత్తూరు జిల్లా యందు కనుపించుచున్నారు. పైనుదహరిం చిన నరసభట్టుగారు చోడవరము సమీపములోని ఒకచెర్వుగట్టున ఒక కుటీరము నేర్పఱచుకొని యాయావర వృత్తి కాలముగడుపుచుండగా పెద్దాపురము సంస్థానాధీనులలో మొదటివారగు తిమ్మగజపతి మహారా జుగారొకప్పుడు వేటతమకంబున దారితప్పి కాళ్ళులమునువీడ క్షుద్బాధా పీడితులై నరసభట్టుగారి ఆశ్రమముచేరి అన్నముబెట్టుమని నరసభట్టు గారి భార్యనడుగ కోవడిచేల లజ్జించి-

గీ॥ పుల్లనగు జొన్నయంబలిఁ బొల్పుమీఱి
రుచిదనర్చిన గఱికి వేరుల నొనర్చి
నట్టిపచ్చడి వడ్డింప నతడుప్రీతి
నమృతమానిన తెఱగున నారగించె.

దానిచే నామహారాజు తృప్తినొంది స్వపరివారము గలసికొనిన వెనుక నరసభట్టుచేయు యథోచిత సత్కార్యముల గైకొని నరసభట్టు గారి భార్యనుబిలచి అమ్మా నీకేమికావలయునన నీకుటీరమునకు జుట్టు నుండు యిరువదిపుట్లభూమి కోరగా పట్టావ్రాసియిచ్చెదను రమ్మని నరసభట్టుగారితో చెప్పి వెడలిపోయినపిదప దేశపరిస్థితు లల్లకల్లోలముగ నుండుటచే చిరకాలమునకు బిమ్మట భార్యా ప్రోత్సాహమున నరసభట్టు పెద్దాపురముచేరగా మహారాజు నరసభట్టుగారిని గుర్తించి యిరువదిపుట్లభూమికి తామ్రశాసనము వ్రాసియిచ్చెనట ఇది క్రీ. శ. 1600 ప్రాంత్యమునాటి వృత్తాంతము. నరసభట్టునకు బిమ్మట నాలుగు తరములు ఆభూమి ననుభవించిరి. పదునెదిమిదవ శతాబ్దమున పెద్దాపురము సంస్థానమును స్వాధీనపరచుకొనిన రుస్తుంఖానుడను మహమ్మదీయుడు ఈ భూమికి అమితముగా పన్నుకట్టుటచే అప్పటివారిలో పేరుభట్టు అని ప్రశిద్ధిగాంచిన విద్వాంసులొకరు హైదరాబాదునకేగి అప్పటి యధిపతులగు అసఫ్ జానిజాము ఉల్ముల్కుగారినుండి తిరుగా ఆభూమిని దుంబాలాగా పట్టా తెచ్చుకొనెను. అంబలి పోయుటవలన సంపాదించినదిగాన 'అంబటిపూడి' యని వాడబడుచున్నట్లు పెద్దాపుర సంస్థాన చరిత్రయందు వ్రాయబడియున్నది. దానకాలమున ఈ ఖండమునకేమిపేరిడదగు నని మహారాజడిగిన తాము నివసించుకుటీర సమీపమున అంబికావిగ్రహ ముండుటచేతను, గ్రామము కుగ్రామమగుటచేతను, అది తమకిచ్చుటచేతను, ఆభాగమునకు అంబిక పల్యగ్రహారమని పే

ఉంచినటుల తద్గ్రామచరిత్రయందు వ్రాయబడినది. ఈ నరసభట్టుకు మాద్ది మహేశ్వరభట్టు- ఈ యనకు వెంకటభట్టు, ఈ యనకు పేరుభట్టు, తిరపతిభట్టు కలిగిరి. ఈ పేరుభట్టుగారు వేదశాస్త్రపండితుడు. ఈయన రామచంద్రపుర ముతాలూకా వెల్ల గ్రామమున ఖాజీగారికి కావ్యములు చదువుటలో సహాధ్యాయుడుగా నుండియుండెను. ఈ తరుణనమునె ఈ అగ్రహారమున కెక్కువ పన్నుకట్టుటచే తామరతంపరగా పెరిగిన ఈ కుటుంబమువారందరూ వచ్చి పేరుభట్టుగారిని ప్రార్థించగా ఆయన ఖాజిగారి సహాయమున గోల్కొండకేగి ఫాదుషాగారి యొద్ద పన్ను మాపుచేయించుకొని పట్టా తెచ్చుకొని యిలుజేరినవెనుక దాయాదులు జూడవచ్చినవారినందరిని బిలిచి అగ్రహార మిరువదిపాళ్లు చేసి 11 పాళ్లు తనకుటుంబనముకును తొమ్మిదిపాళ్లు కొదువవారును పుచ్చుకొనునటుల ఏర్పాటు చేసినటుల పెండ్యాల రామశాస్త్రిగారిచే రచింపబడిన అంబికపల్యా గ్రహారచరిత్రము నందుదహరింపబడినది. ఈ రామశాస్త్రిగారు పేరుభట్టుగారికుమారుడు ఈయన అన్నగారిపేరు వెంకయ్యగారు. ఈయన కాకినాడ తాలూకా వేండ్రయందుపాధ్యాయులుగా నుండెడువారు. రామశాస్త్రిగారు ప్రప్రథమమున అన్నగారియొద్దను అనంతరము శ్రీమాన్ కొమాండూరి రంగనాథాచార్యులుగారి యొద్దను, పోకుల్లూరి వెంకటశాస్త్రిగారికడ పురాణమును, బ్ర॥ శ్రీ గుండు రామస్వామిశాస్త్రిగారియొద్ద సిద్ధాంత కౌముదియు జదివి. సంస్కృతమునం దనేకాష్టకములు, ఆంధ్రమున సీతారామశతక ము వేణుగోపాలశతకము, లీలారామాయణమను పద్యకావ్యము, అంబిక పల్యగ్రహారపుచరిత్రి మున్నగు గ్రంథములు రచించి 1921 లో స్వర్గస్థులైరి కడపటిదశలో రామచంద్రపురము తాలూకా నరసారావుపేటగ్రామములోని భవానీ శంకరాలయము పునరుద్ధరించి మృతజీవులై

రి. వీరి అన్నగారగు వెంకయ్యగారు మేడపాడునందు మహాలింగేశ్వరా లయము కట్టించిరి, నిరతాన్నదాత, పౌరాణీకుడు గొప్పజ్యోతిష్కుడుగా ప్రఖ్యాతినొందిరి వీరికుమాళ్లే పెక్కండ్లనుండి కళాశాలలలోను, ఉన్నత పాఠశాలలలోనూ సంస్కృతాంధ్రోపాధ్యాయులుగానుండి కౌండిన్యాని లయమను పేరిట పిఠాపురమునందొక సంస్థనేర్పరచి పాఠశాలకుపయుక్త ములగు గ్రంథములను బ్రచురించుచుండిన పెండ్యాల వెంకటసుబ్రహ్మ ణ్యశాస్త్రిగారను వారు. ఈచరిత్రవ్రాయుటకువీరొకింత నాకాధారభూతు లైరి. సుబ్రహ్మణ్య శాస్త్రిగారనువారు కాకినాడయందుగలరు వారును పండితులే ఈ కుటుంబమువారిపుడు పిఠాపురమున రాజోలుతాలూకా రామరాజులంక విశాఖపట్టణముజిల్లా యలమంచిలి యందు కాకినాడ రాజమహేంద్ర వరము తాలూకాలయందును గలరు. వీరిచరిత్రి అంబికపల్య గ్రహారచరిత్రయందు గలదు గాని. అగ్రహారము యివ్వబడిన 1600 మొదలు యిప్పటికిగల 336 సంవత్సరములలో పెరిగినకుటుంబ ములవివరము రచింపరైరి. ఏమహాపతివ్రత కారణంబున అగ్రిహార ములభించెనో ఆయమ పేరెచటనుకనుపించదు.

వీరనుశ్రుతముగా యిటు వైపులవారితో సంబంధములు చేయు చున్నారు.

(4) పెండ్యాలవారిలో వెలనాటివైదికులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, భారద్వాజస గోత్రము. ఆంగీరస బార్హస్పత్య భారద్వాజ అని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. ఈ కుటుంబమువారు కాకినాడతాలూకా పెద్దాడగ్రామమునందుండి యుండిరి. ఆగ్రామకాపురస్తులగు సత్యనారాయణమూర్తిగారు ఐ. సి. యస్, అను పరీక్షయందు తీర్ణులై మధ్యపరగణా జిల్లాలయందు కలెక్టరు యుద్యోగము చేయుచున్నారు. ఆంధ్రవైదికులలో డిస్ట్రిక్టు కలెక్టరుడుద్యోగమును సంపాదించినవారిలో వీరు ప్రథములుగ గన్పట్టుచున్నారు వీరి సంతతి వారిపు డెచట నుండిరో తెలియదు.

# కామరాజువారు

ఆర్వేల నియోగులు, ప్రప్రథమమున నీ కామరాజువారు కొచ్చెర్లకోట గ్రామ నివాసు లనియు, నందుచేత వీరి వంశనామము 'కొచ్చెర్లకోట' యని యేర్పడిన దనియు తెలియవచ్చినది. వా రాగ్రామము కొచ్చెర్లకోట యాస్థానమున నగ్రగణ్యులై పేరుప్రతిష్టలు గడించి, యున్నతోద్యోగమున నుండెడివారు.

అంతకొంత కాలమునకు యీవంశజు డొక్కరుడు 'పులిపాక' యను గ్రామమున కేతెంచి, అచ్చట కరిణీకమును సంపాదించి, ఆ యూరనే నివాస మేర్పరచుకొనెను. కొంతకాలమున కీ పురుషుని వంశీయులు 'పులిపాక' వారని పిలువబడుచు, కొచ్చెర్లకోటవారుగా పరిగణింపబడకపోయిరి. అటులనే మరల నీ పులిపాక వంశీయులలో నొక మేథావి, అద్దంకి సంస్థానమునకు వెళ్ళి, అచ్చట తన పాండిత్యవక్తృత్వములచేత పేరుగడించి, యాయాస్థానమున గొప్పగౌరవములను, ఉద్యోగమును బడసిరి. కాలక్రమమున వీరి సంతతివారు 'అద్దంకి' వారని పిలువబడజొచ్చిరి.

ఆ వంశజులలో 'అద్దంకి కామరాజు' యను నతడు చాలగొప్ప రాజమన్ననసన్మానముల నొంది గొప్పపదవిలో నుండెను. సర్వవిధము లా వారా యాస్థానమున నగ్రగణ్యులుగ పరిగణింపబడుచుండిరి. అప్పుడు హైదరాబాదు ప్రభువుగ తానీషా యుండె నట! ఈ హైదరాబాదు నవాబునకు నీ యద్దంకి ప్రభువులు సామంతు లట. ఈ [illegible]మున, నీయద్దంకి ప్రభువులకు తమ కొండకోట యుండిన బాగుగ నుండు నని తలచి, సామంతునకు దుర్గనిర్మాణాది కార్యములకు నవా బియ్యకొన డని యెంచియు, నెట్లయిన ప్రయత్నింపబూనిరి, కాన నవాబు

దగ్గరకు తగు రాయబార మంప నెంచిరి. అందులకు తగుసమర్థుడు
కామరాజుగాక వేరొకడు దిక్కు లేడని యెరింగి దానికి నీ కామరాజు
ను నియోగించిరి. అంత కామరాజునూ, ఆ రాయభారమును వహించి
హైదరాబాదునకు వెళ్ళిరి. అచ్చట నవాబు యీ దుర్గనిర్మాణమున
కియ్యకొనడయ్యెను. కాని, తనసహజవాక్చాతురిచేత, దుర్గముయొక్క
యావశ్యకమును వివరించి, తన ధీసంపదచేతను, తన భావగంభీరత
చేతను లూనీసాపప్రభువునిమెప్పించి, దుర్గనిర్మాణమునకొప్పించి, అద్దం
కిచేరిరి. ఈ రాయబారమునసమాప్తినొంది కామరాజు అద్దంకిచేరుటకు
సుమారు పదిసంవత్సరములు పట్టినదట. అద్దానికి సంస్థానాధీనులు
కామరాజు యొక్క కార్యనిర్వహణశక్తికి మెచ్చి, పదునైదుకత్తులు
అనగా 225 ఎకరములభూమిని యీతనికి యీ నామముగానొసంగిరి.
యీనామును 'కోటఫర్మానా యీనాము' అనిపిలువబడుచుండెడిదిగాని
కాలక్రమమున వెంకటాపురగ్రామపరిసరముల నదియుంటచేత వెంకటా
పురయీనాము అని నేడుపిలువబడుచున్నది. ఈపురుషుడీ కామరాజుకుల
మునకాదిపురుషుడు. ఈతనినామమే కామరాజువారి యింటిపేరైనది.

నేటికిని యీ కొచ్చర్లకోట, పులిపాక. అద్దంకి, కామరాజు
వంశజులందరి గోత్రప్రవరాదులన్నియు నొక్కటియే. వీరిది కాశ్యప
గోత్రము. ఆపస్తంబసూత్రము, యజుర్వేదము, వీరి ప్రవర, కాశ్యప,
వత్సార, నైధ్రువ, రేభ, రైభ, శండిల, శాండిల్య అని సప్తార్షే
యము. కాని యిటీవల కామరాజు వంశజులును ద్వైతాద్వైత
మతస్థాపకులును, బెజవాడ పురవాసులును యగు, శ్రీ దై. కోటే
శ్వర దీక్షిదులు గారుప్రవరను త్ర్యార్షేయముగా మార్చి, కాశ్యప,
వత్సార, నైధ్రువ త్ర్యార్షేయమని చెప్పుచున్నారు. ఈ వంశీయు
లందరును ఆరువేల నియోగుల జాతికిచెందినవారు.

## ఉప్పలవారు.

వీరిలో ఆర్వేల నియోగులు, యాజ్ఞవల్క్యులు, బడగలనాటి కరణకమ్మ వైదికులు కలరు. వీరిలో శ్రీవత్సగోత్రీకులు, కౌశిక గోత్రీకులు, భారద్వాజ గోత్రీకులు గలరు.

1. ఆర్వేలనియోగి, ఆపస్తంబులు, యజుర్వేదులు, శ్రీవత్స గోత్రీకులు. వీరి సంతతివారిపు డెచట నుండిరో తెలియదు గాని ఈ ఉప్పలవారిలో నారయమంత్రి పుత్రికను యనుములపల్లి నారాయణ మంత్రికిచ్చి నటులను ఆ మంత్రి ఎన్ముల పల్లి పెద్దనామాత్యుని సంతతి వాడైనటుల యీయన 'చింతాంబుఖాను' మంత్రి యైనట్లును ఆ చిత్తాంబుఖానుఁడు

సీ॥ గీ॥ ఆత డింపొందు లాటకర్ణాటకోట
ఘూటకరహాట పాండ్యపానాట గౌళ
చోళమళయాళ రాజసంస్తూయమాన
మానధనుఁడైన చిత్తాంబుఖాన విభుఁడు.

శా॥ ఆ రాజేంద్రశిఖావతంస నిజబాహాయత్త విశ్వంభరా!
ధౌరేయుండు విరోధి మంత్రి ముఖముద్రాదకు దుద్యద్దయా
పారీణుండు పటీర తారక సుధాపాండిమ శ్రీయశో
హారుం డెన్ములపల్లి మాద విభు పెద్దామాత్యు డుల్లాసియై.

అని యున్నది. అట్టి విన్ములపల్లివారిలో శ్రీయుతుడు సింగ మంత్రి నారాయణుండు

గీ॥ కోరి యాతఁడు శ్రీవత్స గోత్రజాతుఁ
డైన ఎప్పయుల నారయ యతివసింగ
సాని కాంచిన చెన్నాఖ్య చంద్రవదనఁ

బరిణయంబయ్యె సంతోషభరితు డగుచు (చిత్రిభారతం॥)

2. భారద్వాజ గోత్రీకులైన ఉప్పులవారు బడగలనాటి కరణకమ్మ వైదికులు. ఋగ్వేదులు, అశ్వలాయన సూత్రము. సంతరావులూరు స్టేషను సమీపములోని అన్నవరప్పాడు, ముడివేములయం దున్నారు. ఉప్పుల మార్కండేయ శాస్త్రులుగారు కవులు, నూజవీడు తాలూకా కానుమోలు నందున్నారు. శేషాద్రిగారి కుమాళ్లు సోదర్లు జ్యోతిష నవనీతగ్రంథకర్త అప్పన్నశాస్త్రి కానుమోలునందు వీరిచే ఆనందవాణీ నిలయమను పేర నొక పుస్తకభాండాగార మేర్పరుపబడినది. వీరు కొన్ని శతకములు హరికథలు రచించిరి. (ఆ.క. జీవితం)

3. మూడవవారు యాజ్ఞవల్క్య నియోగులు, కౌశికగోత్రికులు, వీరి చరిత్రి దిగువ నుదహరించుచున్నాను.

3. యాజ్ఞవల్క్యనియోగులు— శుక్లయజుర్వేదులు, కాత్యాయన సూత్రము, కౌశిక గోత్రము. కౌశిక, విశ్వామిత్రి, అఘమర్షణ, అని త్ర్యార్షేయము చెప్పుచున్నారు. వీరి అనాది కాపురము విశాఖపట్ట ణము సమీపమునందలి అనకాపల్లి. మూలపురుషుడు రామరాజు గారు. ఈయన చాల బీదస్థితియం దుండు కాలములో అక్కన్న మాదన్నగార్ల తోబుట్టువ తీర్థయాత్రిలుసేవించి అనకాపల్లివచ్చి అచట ఈరామన్నగారింట బసచేసి వంటచేసుకొని భోజనముచేసి ప్రయాణమగు సరికి గాఢాంధకారమైన చీకటికమ్మి ఉరుములతో మెఱుపులతో గొప్పవర్షము కురియుట ప్రారంభించుటచే ఆ దిన మచట ఆగిరి. మరు దినము మొదలు రెండుమాసముల కాలము యిట్టి వర్షప్రతిబంధము వలన అచటనే నిలువవలసి వచ్చినది. పరోపకార బుద్ధిగల రామ రాజుగారు ఆయన భార్య ఆ కాలము నందాయమ నాదరించుచూ వచ్చిరి. పిమ్మట కొంతకాలమున రామరాజుగారే ఆమెను సురక్షిత

ముగా అన్నలవద్ద చేర్చిరి. ఆమె తన తీర్థయాత్ర వృత్తాంతమును సవిస్త
రము అన్నలతో చెప్పుచూ ఈ రామరాజుగారి ఉపకారచింతయు వీరి
ఆదరణ వీరి బీదతనమును తెలియసరచి రెండుమాసముల కాలము
సర్వవిధముల తన్నాదరించిన ఆ రామరాజుగారి కేదైన ప్రత్యుపకారము
చేయ కోరగా వారా రామరాజుగారికి అనకాపల్లి మొఖాసాగా
యిప్పించిరట

ఆ రామరాజుగారి మనుమలు గంగరాజుగారు. వీరికి నరసిం
హము, సీతన్న, కొండప్ప, వెంకన్న అను నలుగురు పుత్రులు గలిగిరి.
వీరిలో గుర్రాజుగారు అతిథి పూజయం దాసక్తి గలవారు. వీరికి
అనకాపల్లి సమీపము నందలి బోదలవాడకు మిరాసి యుండెడిది. సీత
న్నగారి కుమారుడు గుర్రాజుగారు. ఈయనకు రామమూర్తి, వెంక
టచలము. నరసింహముగారికి లక్ష్మీపతి. ఈయనకు వెంకటనారాయణ
నరసింహము అని యిద్దరు కుమార్లు. వీరి కాలములోనే అనకాపల్లి
నుండి విశాఖపట్టణము కాపురము వచ్చిరి. వీరే సింహాచలములోని
మాధవధారవద్ద నివసించియుండిన పరమానంద తీర్థస్వామివారిని తీసి
కొనివచ్చి విశాఖపురమం దుంచిరి. ఈ స్వామివారి పరిచర్యల కగు
వ్రయములకు శ్రీ విజయనగరము మహారాజావారు కొంత భూవసతి
నొసంగిరి. ఈ వెంకటనారాయణగారికి వేంకటేశ్వరరావు, వెంకట
సుబ్బారావుగార్లు జనించిరి. వేంకట సుబ్బారావుగా రిపుడు బవులు
వాడగ్రామముకు మిరాశిపని చూచుచుండిరి అని విశాఖపట్టణమునుండి
ఉప్పల వెంకటేశ్వరరావుగారు తెలియపరచిరి.

# గొడ్లపర్తివారు

ఆశ్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుశ్శాఖులు, శ్రీవత్స గోత్రీకులు, భార్గవ, చ్యవన, అప్లువాన, ఔరవ, జామదగ్ని అని పంచార్షేయము. ఈ గొడ్లపర్తి యెచ్చటిదో, ఈ కుటుంబమువారిపు డెచట నున్నారో తెలియదు గాని వీరిలో వెంకన మంత్రి యనువారు విక చోత్పలమాల యను పేరున రామాయణము ఉత్తరకాండ మినహా కొదువ రామాయణ గ్రంథమంతయు రేఫ ప్రాసముతో ఉత్పలమాలికగా చెప్పెను. అం దుదహరించిన చివర చరణములవలన వీరి చరిత్ర పూర్ణముగ దెలియగలదు, గాన వాని నిట నుదహరించుచున్నాను.

॥వత్సముని గోత్ర లలాముడు గొడ్లపర్తి విస్తారకులాబ్ధిపూర్ణహిమధాము॥ డభిన్నవతీర్థమాని కంఠీరవ శిష్యవర్యుఁడన నీధరధైర్యుఁడు ధర్మమంత్రిహం వీరవరేణ్యపౌత్రుఁడు నవీనచరిత్రుఁడు సద్వివేక మంజీరుఁ డుదార వేంకటనృసింహ కిశోరుఁడు రామమాదరస్మేరముఖేతనూజుఁడు విచిత్రగణౌజుఁడు కార్యఖడ్గవిద్యారుచిరప్రవీణుఁ డతి తంత్రధురీణుఁడు కృష్ణపాదపద్మోరుగళన్మరందసరిదూర్మిచరద్భ్రమరాయమాణ గంభీరమనో విశాలుఁ డతి విస్మయశీలుఁడు సంస్కృతాంధ్రభాషారమణీయ వాక్సురభిచంద్రుఁడు వేంకన మంత్రి చంద్రుఁ డింపూర రచించినట్టి వికచోత్పలమాల్యమనంగ నొప్పు సీతారఘురామచంద్రుల కథాసుమధామము భూతలంబు నందా రవిచంద్ర తారకమునై నుతి కెక్క జెలంగు గావుతన్ ఇందువల్ల వీరిది శ్రీవత్సగోత్రమైనటులను ధర్మమంత్రిహం వీరపౌత్రుఁడును- వేంకట నృసింహపుత్రుఁడులని తెలియుచున్నది.

ధరణీదేవుల రామానామాత్యుఁడు రచించిన దశావతార చరి

త్రకృతిపతి యగు మగదల కిష్ణమంత్రిగారి వంశములోని పద్మనాభ మంత్రిగొడ్లప ర్తిధర్మమంత్రి కుమార్తెను వివాహ మాడినట్లు దిగువ పద్యమున గలదు.

మ॥ ధనదోదారుఁడు పద్మనాభసచివాభ్యత్మునుండు పక్షంబులో
ననఘాత్యుత్తమ గొడ్లపర్తి కులజుండై నట్టి ధర్మప్రభా
నుని కామాక్ష్యమకుఁ జనించి బుధరాణ్ణుత్యప్పురల్లక్షణా
వనియౌ రంగమఁ బెండ్లియాడెమహితైశ్వర్యంబవార్యంబుగాన్

అనుటచే ఈ మగదలవారు నెల్లూరిమండలములోని సానబూదూరు నివాసస్థులగుటచే వీరు అ ప్రాంత్యమువారై యుందురు.

## కొఠీవారు

మధ్వులు,ఆపస్తంబులు, యజుర్వేదులు,హారితసగోత్రికులు, హారిత, అంబరీష, యౌనాశ్వ అని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరి కాపురస్తలము విజయనగరము. ఈ పేరుగలవారు కొందరు చోడవరములో నున్నారు గాని వీరి కన్యోన్య జాతాశౌచములు లేవు. వెంకటరమణయ్యపంతులుగారు పెద్దాపురమున డిప్యూటి కలెక్టరుగానుండిరి. ఆత్మారాం పంతులుగా రనువారుపూర్వము రాజమహేంద్రవరమున నుండెడివారు. వీరు చక్కని సాహిత్యపరులు. కొఠీవారిలో నరసింగ రావు పంతులుగా రనువారికి ఆ 1780 ప్రాంత్యమున విజయనగర ప్రభువులగు గజపతిమహారాజులంగారు కొవ్వాడగ్రామము మొఖాసా దయ చేసినారు! అనంతరము విజయరామ గజపతిమహారాజులంగారు కుని ల, రెల్లువలస గ్రామములలోను విజయనగరము పెద్దచెర్వుక్రింద రామసాగర మాన్యముల నిప్పించినారు. ఆ కాలమందు కొఠీనరసింగరావు పంతులుగారు సంస్థానమున ఉద్యోగస్థులలో ప్రముఖులుగా నుండెడివారు. వీరికి రెల్లువలసలో మాన్యము యిప్పించిన వెనుక ఆ గ్రామ

ములో నొక కోనేరుత్రవ్వించి సత్రముకట్టించి రహదారీపథికులకు అన్న ప్రదానము చేయుచుండెడివారు. ఈయన కుమారుడు వెంకటేశము పంతులు ఈయనయు తండ్రిగారివలె అన్నప్రదాత లని ప్రఖ్యాతి వడసిరి. ఈయన మనుమలు చినవెంకటేశముపంతులుగారు కర్మిష్ఠి. సంస్కృతాంధ్రములయందు మంచిపాండిత్యము కలిగియుండిరి.

ఈయన అనంతరము యీయన మనుమలు వెంకటేశ్వరరావు పంతులు నరసింగరావుపంతులు బయలుదేరిరి. కొవ్వాడ మొఖాసా గ్రామము యిప్పుడు వీరిక్రింద జరుగుచున్నది. వీ రుభయులు ప్రస్తుతము విజయనగరమునందే యుండియుండిరి. వీరి కనుశ్రుతముగా అంగరవారితోనూ, పన్నాలవారితోనూ, వైజిర్సువారితోనూ, కడపవారితోనూ సంబంధబాంధవ్యములు గలవు. వీరికి కొటీవా రను పే రెట్లువచ్చినదో పూర్వపు నివాస మెచటనో విజయనగరప్రాంత్యములకు ఎప్పుడు వెళ్ళిరో తెలియదు. చోడవరములో నుండు కొటీవారి మూలపురుషుడెవరైనదియు చోడవరపువారికి విజయనగరపువారికి పురుడు పుణ్యములెప్పుడు విడిపోయినది వివరము తెలిసిన వా రేరైన అనుగ్రహించిన ముందు ప్రచురములో సవరించుకొనెదము.

☞ కొటీవారిలో శుక్లయజుశ్వేదులు కాత్యాయనసూత్రులు. యాజ్ఞవల్క్యులు గల రని చెప్పెదరు, గాని వారి గోత్రముగాని ఆ కుటుంబములోనివా రెవరియొక్క చిరునామాయైనను పంపవలసిన దని అనేకమందని కోరియుంటిని. ఈ శాఖవా రేమి ప్రత్యుత్తర మీయరైరి. కొటీవారిలో యాజ్ఞవల్క్యుల వివరము తెలిసిన వా రెవరైన వారిలో యిపు డుండువారి చిరునామాయైన పంపించ ప్రార్థన.

# అగస్త్యరాజువారు

ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, కాశ్యప గోత్రీకులు. కాశ్యప, వత్సార, శేఫ, రైభ, శండిల, శాండిల్య అని సప్తార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరి కీ పేరెట్లు వచ్చినదో, వీరి అనాది కాపుర మెచటనో, వీరి వంశవృత్తాంత మేమియు దెలియదు గాని, ఈ వంశీకులలో అగస్త్యరాజు లక్ష్మీబ్రహ్మముగారి కుటుంబ మొకటి నూజవీటియందు గల దనియు, వీ రెక్కుడు మతాభిమానముగల వా రనియు, నూజవీటినుండి ఆచంట రాజగోపాలముగారు తెలియపరచిరి. 'శకుంతలాపరిణయ' గ్రంథకర్త యగు పెద్దాడ నాగరాజుగారు తమ వంశీకులలోని వెంకప్పను వర్ణించుచూ, అగస్త్యరాజు వెంకయ్యగారి కుమార్తెను వివాహమాడిన సంగతి యిట్లు చెప్పెను.

గీ॥ సరసగుణశాలి వేంకప సచివ మౌళి
భూరి సంతోషకలన నండూరి రామ,
యాహ్వయుని కూర్మిపుత్రి బేరమ నగస్త్య
రాజు వేంకయ సుంత నిర్వారను వరించె.

నని చెప్పుటచేతను ఈ పెద్దాడవారిది గోదావరిజిల్లా వీరవాసర మగుట చేతను అగస్త్యరాజువారుకూడ ఎచటనుండిరోగాని ఈ జిల్లాలోనివారు గానే కనుపించుచున్నారు. కాశ్యపగోత్రీకులగు అగస్త్యరాజు లక్ష్మీబ్రహ్మంగారుగోదావరిమండలములోనికపిళేశ్వరపురములోనున్నట్లువినికి. నర్సారావుపేట తాలూకా నాగరాజుపల్లియను గ్రామమునకు కరణములుగా నున్న రావులకొల్లువారు కౌశికగోత్రీకులగు అగస్త్యరాజువారికి 4 వీసములుకరిణీకం యిచ్చినటుల వినుకొండ దండకవిలెలో గలదు. వీరిది కౌశికగోత్రమవుటచే నూజవీటియందుండువారు వేరు వీరు వేరై యుండవచ్చును. నూజవీటివారుగాని నాగరాజుపల్లెవారుగాని ఈ సందేహము తీర్చిన నవరించుకొనెదము.

# మల్లసముద్రమువారు.

వైదికబ్రాహ్మణులు— ఆత్రేయ గోత్రులు వీరికాపురస్థలము సేలముజిల్లాలోని మల్లసముద్ర గ్రామము. వీరిలో యల్లయ యను కవిగలడు— ఆయన చంద్రతారావిలాసమను యక్షగాన ప్రబంధమును రచించుచూ అందు తన వంశము నీదిగువ విధమునవర్ణించెను.

సీ॥ శ్రీరహిమించిన చేరదేశంబులో
జెలువంది వెలయును సేలపురము
దానిచేరువను నుద్దండమల్ల సముద్ర
మను గ్రామముననుండు నాంధ్రవిప్రుఁ
డాత్రేయ గోత్రజుం డమల తేజస్కుఁ డౌ
రామభక్తుండైన రామభద్రుఁ
డాతని తనయులు ననఘులు నిద్దరు
నందగ్రజుఁడు మల్ల నార్యుఁడనఁగ
గీ॥ నతనికనుజుండు విశ్వనాథాఖ్యుఁ డనయ
వన్నెకెక్కిన కులసతి వెంకటాంబ
గర్భకలశాబ్ధి చంద్రుండు కవివరేణ్యు
లకును శిష్యుండు యెల్లయ సుకవిహితుఁడు.

మరి యొకసీసపద్య గీతికయందు—

"రాజితంబుగ గళ్యాణ రాముకృపను
జంద్ర తారావిలాసంబు నరసయక్ష
గానముగనేను బల్కెద గారవమున
వినుఁడు జనులార వీనుల విందుగాను."

అనియున్నది ఇంతకు మించి ఈవంశీకుల చరిత్రమేమియుఁ దెలియదు దెలసినవారెవ్వరైన దెల్పినచో ముందు సంస్కరించి ప్రచురించెదము.

# జమ్మలమడకవారు.

వెలనాటివైదికులు, ఆపస్తంబులు, యజుశ్శాఖీయులు, కౌండిన్య గోత్రము— వాశిష్ట— మైత్రావరుణ— కౌండిన్య— అని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. జమ్మలమడుగు అనునది జడపజిల్లాలోని తా లూకాగ్రామ మయియున్నది. జమ్మలమడక పురుషోత్తమ సోమ యాజిగారు చాలా తపస్సంపన్నులగుటచే అన వేమారెడ్డిగారి కాల మున సీమహనీయుని కిష్టమగు గ్రామము కోరుకొనుమని శెలవీయగా తెనాలి తాలూకాలోని తాడిపఱ్ఱు కోరుకొనుటచే, తదాది కోరుతాడి పఱ్ఱు అని పేరుపెట్టె రామప్రధానిగారి కాలములో ఈ గ్రామమును సంప్రతి కరణములుగానుండు ఆర్వేలనియోగులగు చంద్రమౌళివారిని తప్పించి కౌండిన్యగోత్ర వైదికులగు జమ్మల మడకవారి కివ్వబడెనట పిమ్మట నిరతాన్న ప్రదాతయగు నీ సోమయాజులు రచట రామలిం గస్వామి ఆలయములు కట్టించిరి. ఈ పురుషోత్తమ సోమయాజిగారి కుమార్డు నాగలింగ సోమయాజి ఈ యనకు వేంకటాద్రిశాస్త్రి త్రిపు రాంతకావధాన్లు శేషావధాన్లు—ఈ శేషావధాన్లు కుమార్డు వెంకటశా స్త్రుల్లు. అప్పటికి అనగా క్రీ॥ శ॥ 1578 మలికి భరాముషాదుషాగారు గ్రామము ఆక్రమించిరి. అనంతరం వీరి కుమాళ్ళు కోదండ రామశా స్త్రుల్లుగారికి నారాయణప్పగారికి కరిణీకపు హోదాలు యివ్వబడినవి. అనంతర మీగ్రామము మానూరివారికి జమీాగా దఖలుపడినది. ఈ కుటుంబమువారిలో కొందరు అచట నిలచిపోయిరి. పై వివరములు మీకొండ దండకవిలెయందు వ్రాయబడినవి. యివి బారాపసలీకి పూర్వపు వృత్తాంతము. అనంతర మీకుటుంబము లోనివారు కొంద రు బందరుతాలూకా రామన్నపేట, భీమవరము తాలూకా దొడ్డన

పూడి, పెదమిరము, కాకినాడ వగయిరా గ్రామములు చేరిరి. మరి కొందరు బందరువద్ద కాజగ్రామము వెళ్ళియుండుటచే వారు కాజవారని పిలువబడుచుండిరి, గాని యిప్పటికి యిచ్చటి కాజవారు పైగ్రామములలోని జమ్మలమడకవారు త్రిరాత్రాశౌచములు పట్టుచున్నారు. ఇటీవల జమ్మలమడక వెంకన్న పంతులుగారి కుటుంబము విశాఖపట్టణమునందుండెడి వారనియు వీరి కనుశ్రుతముగా జోశ్యులవారు కొండూరివారు, చింతావార్, పరిమివారు, దింట్యాలవారు, యనమండ్రివారు మున్నగువారితో సంబంధములు గలవు. జమ్మలమడక లక్ష్మీనృసింహముగారు విజయభాస్కర నాటకం రచించిరి.

## ఇరువంటివారు

వీరు మధ్వమతస్తులు, యజుశ్శాఖ కాముకాయన విశ్వామిత్రగోత్రము. వైశ్వామిత్ర, దైవశ్రివస, దైవతరస అని త్రయార్షేయము.

ఈ వంశీకులు పూర్వము నైజాము దేశములోని కుంభంమెట్టు నుండి రాజమహేంద్రివరము వచ్చినారు. అనంతరం విఘ్నేశ్వరం చేరిరి. అచట ఈ శాఖీయులగు చట్టివారు, పళ్ళెవారు, ఉప్పలవారు మున్నగువారికి అగ్రహారము యివ్వబడినది ఈ కుటుంబీకులలో కొందరు తూర్పునందున్నారు. ఇరువంటి రామన్న పంతులుగారి కుమారుడు శాయన్నపంతులుగారు ఈ యన క్రమముగా డిప్యూటీ కలెక్టరువరకు గల ఉద్యోగము చేసి ఉపకార వేతనము గైకొని గోపాద క్షేత్రమగు కొవ్వూరునందు నివాస మేర్పరచుకొనిరి. వీరికుమాళ్ళువిష్ణురావుగారు బి. యె. బియల్ పరిక్షయందు కృతార్థులై కొవ్వూరుందే న్యాయవాదులుగనున్నారు. శాయన్నపంతులుగారి కుమాళ్ళు మొదలగువారి

క్రీసువవారితో సంబంధములు చేసినారు శంకరమంచి ముఖ్యప్రాణరా వుగారుగుంటూరు ఉలుగుడం భీమారావుగారు గుంటూరు శేకమళ్ళ పురుషోత్తమరావుగారు పెద్దాపురం జమ్మి సుబ్బారావు పంతులుగారు కాకినాడ పానుగంటి శ్రీహరిరావు పంతులుగారు విశాఖపట్నం యీలప్పా రావు పంతులుగారు రాజమండ్రి పళ్ళెసుబ్రహ్మణ్యముగారు రామచంద్రపు రం ముజుంబారు నరసన్నరావు పంతులు గుంటూరు ఇంకను మారేమండ వారు దేవరకొండ మొదలగు వారితో సంబంధములు గలవనిశాయన్న పంతులుగారు శెలవిచ్చినారు. ఇరువంటి శీతారామయ్యగారు హనుమ ద్విజయమను గ్రంథము రచించిరి.

## చీమకుర్తివారు

ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, శ్రీవత్స సగోత్రము. భార్గవ, చ్యవన, ఆప్నువాన, ఔరవ, జామదగ్ని యని పంచార్షేయము. వీరు అద్దంకిశీమలో చేరిన చీమకుర్తి అగ్రహారం కాపురస్థులు ప్రథమములో హీగ విసుకొండకు వచ్చి అగ్రాహ కరణము యిన సుసన్నాదాయము వారివద్ద పాతికభాగంకరణీకం కొనుక్కొనిరి. దేవరరాజు మల్లపెద్దింపని యిద్దరన్నదమ్ములు మల్లి పెద్దగారి సంతతినా టి గోపరాజు రామప్రభాగాని కాలములో నైదెన గ్రామముకు స ర్వ కరణీకము యిప్పించినటువంటి తండ కవితెలో గలదు. ఈయన పేరు రామలింగంగారు ఈయన అగ్రామమునందు రామలింగేశ్వర స్వా మివారి ఆలయములు కట్టించిరి. దేవళరాజుగారు వినుకొండకువచ్చి సున్నాదాయమువారివద్ద పాతికభాగము కరణీకము కొనుక్కొనెను. ఈయనకు వీరనరాజు, సంగంరాజు, హలసరాజు, అను కుమారు

కుమాళ్ళుగల్గిరి. ఇందు సంగంరాజు యేల్చూరు, మిన్నెకల్లు మిరాశీలను, మల్లపరాజు వల్లూరు మిరాశీని సంపాదించుకొనిరి. వీరమరాజు వినుకొండలోని భాగ మనుభవించుచుండెను. యేల్చూరు గ్రామ కరిణీకము శ్రీవత్సగోత్రీకులగు పోతరాజువారి ద్వారా చీమకుర్తి ఓబలయ్యకు దఖలుపడినది. ఈ చీమకుర్తివారి పూర్వపునామము మల్లాప్రగడవారు శాలి 1457 అగు మన్మథ సంవత్సర భాద్రపద శు ౧౫ రోజున పైనుదహరించిన ఓబలయ్యగారు ఆగ్రామములో చెర్వువేయించినటుల శాసనములందు గలవు.

సత్తెనపల్లితాలూకా గోపాపురం శంకర లింగంగుడిపాడు అను గ్రామములకు చీమకుర్తివారికి సంప్రతు లున్నటుల కనుపించుచున్నవి.

కేసానుపల్లివారిలోను, వల్లూరి వారిలోను, శ్రీవత్స గోత్రీకులుగానుండు వారు పూర్వము చీమకుర్తివారుగా పిలువబడుచు దరిమిలాను మారినవారే- వల్లూరువారుగా మారిన చీమకుర్తివారు బాపట్లతాలూకా యిటికంపాడు గ్రామమునందున్నారు. ఈ చీమకుర్తివారు సుమారు 200 సంవత్సరములకు పూర్వము నర్సారావుపేట తాలూకా మిన్నెకల్లుకు సంప్రతి కరిణీకము సంపాదించి మిన్నెకంటివారుగా మారినారు. ఆవివరము కొండవీటి సామ్రాజ్యమున గలదు. నర్సారావుపేట తాలూకా కేసానుపల్లి యందుండు కేసాను పల్లివారి పూర్వపు నామము చెంచువారనియు, ఆగ్రామమునకు శ్రీ వత్సగోత్రీకులగు చెంచు మల్లంరాజునకు సంప్రతి యివ్వబడినటులను. వారిప్రస్తుతనామము కేసాను పల్లివారనియు కొండవీటి సామ్రాజ్యమునం దుదహరింపబడియున్నది. వీటినిబట్టి చూడగా మల్లాప్రగడవారని పేరుగలవు ఈ చీమకుర్తివారు యిటీవల కేసానుపల్లివారుగను. 2 వల్లూరువారుగాను- 3 మిన్నెకంటివారుగానునను- 4 చెంచువారుగాను మార్పులు

కాబడినటుల కొండవీటి దండకవిలె సాక్ష్యమిచ్చుచున్నది. యిట్టికారణములవల్లనే కాబోలు ఒక్కయింటి పేరుగలవారికి భిన్నగోత్రము లుండుటకు కలిగినకారణము. వీరికనుసృతముగా రాయసమువారు అబ్బరాజువారు, కొప్పరపువారు, తమ్మవరపువారు, మల్లవోలువారు కటకరాజువారు, మాదిరాజువారు, చింతలపూడివారు, పోలవరపు వారితో సంబంధబాంధవ్యములు గలవు. ఈ చీమకుర్తి—వారి పైమార్పులకు గలకారణము తెలిసినంతవర కాయాకుటుంబ నామములలో నుదహరించెదను.

బాపట్ల తాలూకా రేటూరుగ్రామము యొక్కపల్లెలు గోపాపురం గణపవరం గ్రామములలోని మిరాశీమాన్యములు మల్లవోలు వారు— కటకరాజువారు మాదిరాజువారు చింతలపూడివారు పోలవరపువారు కొనినటులనూ వారందరూ చీమకుర్తి వారి దౌహిత్రులనియు, చీమకుర్తివారిదగు శంకరలింగం గుడిపాడు గ్రామ కరిణీకము వీరి దౌహిత్రులైన కొప్పరపు వారికివ్వబడినటుల కొండవీటి సామ్రాజ్యమునందు గలదు.

## జోస్యులవారు

జ్యోతిశ్శాస్త్రములోని ప్రావీణ్యతనుబట్టి వీరికీ పేరు వచ్చుట చే వీరిలో వైదికులు నియోగులువారు యజ్ఞవల్క్యులు ఆరామద్రావిడమున్నగు శాఖలవారు—కాశ్యప—హారిత—కౌండిన్య—భారద్వాజ—ఆత్రేయస గోత్రీకులు కలిగియున్నారు గాన దిగువ వేరు వేరు గోత్రముల వారిని విడివిడిగా వ్రాయడమైనది.

1. యాజ్ఞవల్క్యులు, శుక్లయజుర్వేదులు, కాత్యాయన సూత్రి ము, కాశ్యప గోత్రము, సప్తార్షేయము. ఈ వంశీకులు యిప్పుడు మొగలితుర్రు, పెనుగొండ, నర్సాపురం,పాలకొల్లు, నెగ్గిపూడి, సత్యవ రము, ఉండి, తెనాలి, బందరు, బలిజేపల్లి, బుద్దులూరిపాడు, విశాఖ పట్టణము, రాజమండ్రి, విజయనగరమునందు గలరు. వీరి పూర్వపు యింటిపేరు నేలకంటివారు. వీరిలో కొందరు విజయనగరము వెళ్ళి అచట జ్యోతిషమునందు ప్రసిద్ధివడయుటచే జోశ్యులవారని పిలువబ డుచుండిరి. (ఈ విషయము నేలకంటివారి వంశచరిత్రమునందు చూ డవచ్చును.) వీరి అనాది కాపురము కొండవీటిసీమలోని నేలకల్లు, నర్సాపురమునందుండు జోశ్యుల సుబ్బారావు పంతులుగారు నిరతాన్న ప్రదాత. వీరు గొప్పస్థితిపరులు. ఆ గ్రామమందు జోశ్యులవారి వీధి అనుపేరుగల ఒకవీధి ప్రత్యేకము కలదు. వీరికి కొప్పర్తివారితోను, దామెర్లవారితోను, చెట్లపల్లివారితోను, వాడపర్తివారితోను, అ మృతవాక్కులవారితోను, లోలేటివారితోను, ప్రహరాజువారితో ను, జవ్వాడివారితోను, వడగంవారితోను, కవికొండలవారితోను మద్దూరివారితోను సంబంధములు గలవు. ఇతర విషయములు నేల కంటివారి చరిత్రలో కనబడును.

2 వైన్యులు. ఋగ్వేదులు, అశ్వలాయనసూత్రులు ఆత్రేయ గో త్రము. ఆత్రేయ, అర్చనానస, శ్యావాశ్వ అని త్ర్యార్షేయము. వీరిలో పల్లయూరాధ్యుల కనకూరు కనకయ్య సిద్ధాంతిగారు. వీరు చిరకాలమునుండి ఆంధ్రపత్రికకు పంచాంగము గుణించి యిచ్చుచున్నా రు. ఈ వంశీయులలో సుబ్బయ్యలింగంగారు తణుకు తాలూకా లీప ద్రు సంపన్నారు.

3 వైదికులు:-ఆపస్తంబులు, యజుర్వేదులు, భారద్వాజగోత్రీ

కులు. ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ యని త్ర్యార్షేయము. వీరి యింటిపేరు పూర్వము కొల్లివారు. వీరిలో కొందరు విశాఖపట్టపు జిల్లాకు వెళ్ళి అచట జ్యోతిషమునందు నేర్పరు లగుటచే ఈకొల్లివారు క్రమముగా జోశ్యులవా రని పిలువబడుచు తుదకు జోశ్యులవారైనారు.

4 వీరుగాకహారితసగోత్రీకులు, కౌండిన్య గోత్రీకులుగలరు. వీరెచట నుండిరో తెలియలేదు. తణుకు మండపాకలో సోమయాజులు గారి కుటుంబము గలదు. వైదికులలో కాశ్యపగోత్రీకులుఅల్లపాడు సింగవరం గ్రామములలో గలరు. వీరు జమ్మలమడకవారి చుట్టములు. వెంకటశాస్త్రిగారు వ్యాకరణ పండితులు.

5 ఆరామద్రావిడులు:—వీరి గోత్రము తెలియదు. పూర్వము వీరింటిపేరు వస్తేటివారు. వీరు పర్లాకిమిడి రాజులకు బంధువులగు జలుమూరు రాజులవల్ల జ్యోతిషపాండిత్యమునకు సత్యవరము అను అగ్రహారము సంపాదించిరి. ఈ గ్రామము శ్రీకాకుళము తాలూకా నరసన్నపేట యూనియనులో నున్నది. ఆ గ్రామము వీరి కిచ్చినది మొదలు వస్తేటివా రను యింటిపేరు మారి జోశ్యులవా రని ప్రఖ్యాతి పడినది. వీరిలో సాంబశివసిద్ధాంతిగారు వేదమునందు, వ్యాకరణశాస్త్రమునందు, సాహిత్యమునందు, జ్యోతిషమునందు, మంత్రశాస్త్రము నందు, ధర్మశాస్త్రమునందు అఖండపాండిత్యముతో కళింగదేశమున కీర్తిశేషులైరి.

## పరిమివారు

ఈ యిండిపేరుగలవారిలో ఆర్వేల నియోగులు, యాజ్ఞవల్క్య నియోగులు, వైదికులు గలరు. గాని వీరి గోత్రములు వేరు.

1. ఆర్వేల నియోగులు, అపస్తంబులు, యజుర్వేదులు, కౌండిన్య గోత్రీకులు. వీరిపు డెచట నుండిరో గాని గోపరాజు రామప్రధాని గారి కాలములో ఉత్తరపరిమి అను గుంటూరు తాలూకాలోని గ్రామముకు వెలనాడు కౌండిన్య గోత్రీకులకు సంప్రతికరిణీకము యియ్యబడినటుల కొండవీటి దండకవిలెయందున్నది. ఇంతకు తప్ప యీకుటుంబమువారి విషయ మేమియు తెలియదు.

2. వైదికులు:—వెలనాడు ఋగ్వేదులు, హారితస గోత్రీకులు. అంగీరస, అంబరీష,యువనాశ్వ అని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరు కృష్ణజిల్లా కైకలూరు తాలూకాలో నున్నారు. వీరిలో యజుర్వేదులు గలరు. వీరు గోదావరి జిల్లా వెలిచేరు, కాల్ధరి, పేకేరు, వేమవరం, మద్దూరు, మండపాకమున్నగు ప్రదేశములలో గలరు. వీరికనుశ్రుతముగా మల్లెల, దూళిపాళ, దుగ్గిరాల, దువ్వూరి, రాళ్లబండి, మేడూరి, గూడా, జమ్మలమడకమున్నగు వారితో సంబంధబాంధవ్యములు గలవు. ఈ కుంబమువారు వేదాధ్యయన సంపన్నులు తపోనిష్టాగరిష్టులు అయియున్నారు.

3. యాజ్ఞవల్క్యులు, శుక్లయజుర్వేదులు, కాత్యాయన సూత్రులు, హారితస గోత్రులు. ఈ కుటుంబమువారు చాలమంది తెనాలివైపున గలరు. వీరిలో సాంబయ్యపంతులుగారు. నారాయణరావుగారు రామచంద్రరావుపంతులు, వెంకట చలమయ్య, వెంకట కృష్ణయ్యపంతులుగారు మున్నగువారు చాల ప్రఖ్యాతి పురుషులు. ఈకుటుంబమువారిలో వెంకటచలముగారు కవులు.

ఈయన సంగమేశ్వర శతక మను పేర ఒకశతకము రచించుటచే శతక కవుల చరిత్రయందు పేర్కొనబడిరి. ఈయన తండ్రి రఘునాయకులుగారు. వీరు తుంగభద్రకు సమీపములో నుండు జాగర్ల

మూడి నివాసులు. దీనినే సంగము జాగర్లమూడి యనెదరు. అచటి దేవుని పేరు సంగమేశ్వరస్వామి యగుటచే నా గ్రామమునకు సంగము జాగర్లమూడి యని పేరు వచ్చియుండవచ్చును. ఆ శతకమునందు వీరి కులగోత్రము లిట్లు చెప్పుకొనెను.

ఉ॥ మేలుగఁ దుంగభద్రకు సమీపమునం దమరావతీ పురిం
బోలినయట్టి జాగరలమూడి పురిం దగ సర్వమంగళా
లోలుఁడనై వసించి సిరులన్నిజభక్తుల కిచ్చుచున్ దయా
శీలత నొప్పుచుందువు ప్రసిద్ధిగఁ గూడలి సంగమేశ్వరా।

చ॥ నరహరి భక్తి మించు రఘునాయకమంత్రికి సూరమాంబకుఁ
వరసుతుఁడన్ ధరం బరిమివంశజుఁడన్ భవదీయ దాసుఁడన్
హరితన గోత్రజుండఁ జెలువొందఁ జనించితి నాదిశాఖయం
దరయఁగ వేంకటాచల సమాఖ్యుఁడ గూడలి సంగమేశ్వరా!

అని యున్నది. మరియు గోపరాజు రామ ప్రధానిగారి కాలములో దక్షిణ పరిమి యను తెనాలి తా॥ గ్రామమునకు ప్రథములు కౌండిన్యగోత్రీకులకు సంప్రతికరిణీకము యిప్పించబడినటుల కొండవీటిదండకవిలెయందు గలదు. వీరి ప్రస్తుత నామము పరిమివా రని యుండుటచే పూర్వము వీరి యింటిపేరు మరియొకటియై యుండవచ్చును.

## తెడ్డెపువారు

వీరిలో కణ్వసగోత్రికులు-కశ్యపగోత్రికులు గల రని చెప్పిరి గాని కశ్యప గోత్రికుల చరిత్ర యింతవరకు దెలియలేదు.

కణ్వసగోత్రికులు—ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, కణ్వస గోత్రీకులు, ఆంగీరస, ఆజమీఢ, కణ్వ అని త్రార్షేయ

ష్రేయము చెప్పుకొనుచున్నారు. వీరు ప్రథమమునుండియు తెడ్డెము కాపురస్తులగుటచే వీరికి తెడ్డెపువా రని పేరు వచ్చినది. తెడ్డెము ఆకెనగూడెము అను గ్రామాదులు గోదావరిజిల్లా లోనివి. యీ యింటిపేరు గలవా రింకెచట నుండినది వారికే తెలియు దని వ్రాసిరి. ఈ తెడ్డెపువారిలో వెంకటరాజుగారు, జగ్గరాజుగారు చాలకాలము ఈ గ్రామముకు కరణములుగా నుండి విశేష అన్నప్రదానముచేసి ప్రఖ్యాతి నందిరి.

వీరి కనుశృతముగా గోగులపాటి, మంచికంటి, ముత్యాల, సత్య వోలు, బందా, రాయవరపువారలతో సంబంధబాంధవ్యములు గల వని ఈ వంశీకులలోని కృష్ణంరాజుగారు తెలియపరచిరి.

# తాడికొండవారు

వీరిలో కౌశిక గోత్రికులు గలరు. వీరికి రా మ: ప్రగడకాలములో బెజవాడతా॥ వెల్లటూరుకునంప్రతికలదు. వీరిది శౌనక అని కొన్నిప్రతుల యందున్నది. గుంటూరు తాలూకా తాడికొండలో దొంతిరాజువారికి సంప్రతి కనుపించుచున్నది, పైవారిది శాండిల్యగోత్రము. ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, కాశ్యపగోత్రీకులు. కాశ్యప, వత్సార, నైధ్రువ, రేప, రైభ, శండిల, శాండిల్య అని సప్తార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరు ప్రస్తుతము విశాఖపట్టణము తాలూకా జెర్రిపోతులపాలెమునందు నడవ, పెదగాడీ గ్రామాదులలో నున్నటులను అంతకు మిక్కిలి తమ కేమియు తెలియ దని వెంకటరమణయ్య గారు తెలియపరచిరి. ఈ తాడికొండ గ్రామ మొకటి గుంటూరు తాలూకాయందున్నది. అచట తాడికొండవారు గల రనియు, వీరిలో కొందరు యిటీవల కొమ్మరాజునాయైనటుల తెలియుచున్నది. కొ

మ్మరాజువారి చరిత్ర వెంకటనరసయ్యగారి కుటుంబములో చూడుడు.
గోదావరి జిల్లాలోనివారిలో . తాడికొండ కృష్ణమూర్తిగారి కుటుం
బ మొకటి గోదావరి జిల్లా ఉండియందున్నది. వీరికి మల్లవరపువారు
చుట్టములు. రేపల్లితాలూకా తూర్పువెల్లటూరుకు గోపరాజు రామ
ప్రధానిగారి కాలములో భారద్వాజగోత్రికులగు యల్లాప్రగడవారికి
సంప్రతికరిణీకము యిప్పించబడినది. వీరి ప్రస్తుత నామము తాడికొం
డవా రనెద రని కొండవీటి సామ్రాజ్యము నందున్నది. తాడికొండ
సీతారామయ్య పంతులు గారు డిప్యూటి కలెక్టరుగానుండి గొప్పఖ్యా
తి సంపాదించినారు. ఈయనకు నలుగురు కుమార్తెలు మాత్రము
గలరు. వీరి నందరిని క్రమముగా కలనగంటివారికి, పోణంగివారికి,
దిగవల్లివారికి కాకానివారికి యిచ్చి వివాహము చేసిరి.

## కొండముదివారు

వెలనాటి ఆర్వేల నియోగులు, ఆపస్తంబులు, యజుశ్శాఖ, కా
శ్యపగోత్రికులు. కాశ్యప, అవత్సార, నైధృవ అని త్ర్యార్షేయము
వీరి అనాది కాపురము కొండముది. ఇది కొండవీటిసీమలో చేరిన బా
పట్ల తాలూకా గ్రామము. ఈ గ్రామమునందు గోపరాజు రామప్ర
ధానిగారి కాలములో కాశ్యపగోత్రికులగు కొండముదివారికి సంప్రతి
కరిణీక మిప్పించబడినట్లు కొండవీటి దండకవిలెయందు గలదు. కొండ
వీటిసామ్రాజ్య మను గ్రంథమున చెల్లూరు (కొండముది) అని వ్రాయ
బడియుండుటచే పూర్వము చెల్లూరివారేమో అని సందేహము తోచు
చున్నది. దరిమిలాను వీరికి బాపట్ల తాలూకా అప్పికట్ల గ్రామమునకు
మిరాశీ కలదని వ్రాయబడినది. వీరిలో నరసింహకవిగారు గొప్ప
మేధావి. వీరు అక్కయ్యపంతులుగారి కుమాళ్ళు. వీరికి సంస్కృ

తాంధ్రమునయం దసమాన పాండిత్యము గలదు. వీరి కాపురము బాపట్ల తాలూకా. అప్పికట్ల వీరు అష్టావధాన శతావధానములయందే గాక ఆంధ్రశైలిగ్రాపు, నేత్రావధానము పతాకావధానము మున్నగువిద్యల నెన్నిటినో ప్రదర్శించి మకర కుండలాద్యనేక బహుమతుల నందిరి. వీరికి ఆ గ్రామమునకు కరణీకము గలదు. వీరు వెంకటేశ్వర శతకము, జగదీశ్వర శతకము, వత్సలనీతి శతకము, పాంచాలీ పరిణయనాటకము, సైంధవపరాభవనాటకము, భోజచరిత్ర, కలిచర్యాప్రహసనము మున్నగు గ్రంథము లనేకములు రచించిరి. యిట్టి మహావిద్వాంసులుగత ఆషాఢమాసమున స్వర్గమలంకరించి రనివినుటకు విచారించుచున్నాము.

ఈ వంశీకులు గుంటూరుజిల్లా ఆలూరు కొండముది. అప్పికట్ల ప్రాంత్యముల యందున్నారు. శ్రీరాములు పంతులుగారి కుటుంబమువారు తెనాలియందున్నారు. వీరిలో కౌండిన్య గోత్రికులు తెనాలి తాలూకా కొండముదియందుండిరనియు హారుదాసువారితో సంబంధము చేసినటుల తెలియుచున్నది. వీరికి కోనవారితో సంబంధముగలదు.

## పమ్మివారు.

వెలనాటివైదికులు, ఆపస్తంబులు యజుర్వేదులు, కౌండిన్య గోత్రికులు, వాసిష్ఠ, మైత్రావరుణ, కౌండిన్య అని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. పమ్మిఅనునది గ్రామనామమై యుండవచ్చును. ఇది ఎచటనున్నదో తెలియదుగాని ఈ యింటిపేరుగలవారిప్పుడు గోదావరి జిల్లాలోని నిడ్పర్తి— కొవ్వూరు— పాందువ్వ— కొమ్మెట్టిపాడు మొదలగు ప్రదేశముల యందుండియున్నారు. వీరిలో యజ్ఞ

యాగాది క్రతువులు చేసి ప్రఖ్యాతి వహించినవా రంతగా కనుపించరు గాని సర్వసాధారణముగా శ్రౌతము వహించినవా రనేకులు గలరు. వీరి కనుశ్రుతముగా అక్కెళ్ళ, తణికెళ్ల, వారణాసి, భారద్వాజ గోత్రికులతోనూ, శాండిల్య సగోత్రీకులగు హోతావారితోనూ, హరితసగోత్రీకు లగు కొండూరివారితోనూ, లోహిత గోత్రికులగు గుళ్ళపల్లివారితోనూ, చివుకలవారితోనూ, వేమూరివారితోనూ, వాజపేయయాజులవారితో నూ, ఏలేశ్వరపువారితోనూ, చల్లావారితోనూ సంబంధబాంధవ్యములు గలవు. పమ్మి సూరయ్యగారు కొంతకాలము వరకు ఉంగుటూరు స్కూలులో ఉపాధ్యాయులుగా నుండిరి.

## వల్లూరివారు

కౌండిన్య— భరద్వాజ, పరాశర, శ్రీవత్స, కౌశిక గోత్రీకులుకలరు.

(1) ఆర్వేలనియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, కౌండిన్యగోత్రీకులు, వాశిష్ఠ, మైత్రావరుణ, కౌండిన్య అని త్ర్యార్షేయము. వీరు పూర్వము కృష్ణాజిల్లా తోట్లవల్లూరు కాపురస్థులగుటచే వీరిని వల్లూరివారని పిలువబడుట తటస్థించినది. ఈ శాఖవారిపుడు నర్సారావుపేటతాలూకా యల్లమందయందు చనేక యిండ్లవారుగలరు. వీరిలో తిమ్మరాజుగారు నర్సారావుపేట సంస్థానముతాలూకు దివానుగా యుండెడివారలు. అమ్మిరాజుగారు యజ్ఞముచేసినారు. యూపస్తంభము పాతినచోట గొప్ప నుయ్యి త్రవ్వించినారట. ఈ యనను నారాయణ సోమయాజి యనెదరట. సూరిరాజుగారు కోటప్పకొండకుపోవు యాత్రాపరుల బసలకనుకూలించునటుల పన్నెండు యకరములప్రదేశములో చింతలతోట వేయించినారు. రాజయ్యగారు కోదండరామ

స్వామివారి దేవాలయము కట్టించినట్లును, వీరిలో రాజయ్యగారను వారు 'ఆర్వేలనియోగుల చరిత్ర పద్యకావ్యము వ్రాసినటులను' వేంకట నరసయ్యగారు కలియుగ నడవడి చరిత్ర శతకముగా వ్రాసినటులను, వేంకట లక్ష్మయ్యగారు జాంబవతీ పరిణయము, కోదండ హరిశతకము, కోటేశ్వర చూర్ణిక, వేంకట వరదయ్యగారు బిల్హణ నాటకము; వేంకట రాజయ్యగారు కోటేశ్వర చరిత్రి, ధర్మాంగద చరిత్రి, తెనుగు మహిమ్నము, వెంకట రామలింగశర్మగారు శ్రీకోటే శ్వరశతకము రచించినటులును యల్లమంద కాపురస్తులగు వేంకట వర దయ్యగారి వల్ల తెలియవచ్చినది. యల్లమంద కాపురస్తులగు నృసింహ కవిగారి పుత్రుడు లక్ష్మణకవి వీరు జాంబవతీ పరిణయగ్రంథము రచిం చిరి. ౨ వరదకవి బిల్హణనాటకము రచించిరి. ౩ రాజకవి షోడశ కర్మాధికారి. నాలుగ శముల సంహిత ఉపనిషత్తుజదివిరి. జ్యోతిష మందు ప్రజ్ఞగలదు. ఈయన కవి శేతుపధ సీసార్థచతుర్వింశతి, 2 శివ మహత్వము.. ౩ ధర్మాంగచరిత్ర 4 త్రికూటాచలమహాత్మ్యము అను కావ్యములు, గోపాల రాయభారము, పద్మవ్యూహము అను నాట కములు మున్నగునవి రచించినటుల ఆధునికకవి జీవితగ్రంథమున గలదు. మంచికంటి పావకవిగారీయన మేనమామయట. ఈ గోత్రీకులలో కొందరు గోదావరిజిల్లా నర్సాపురంతాలూకా వల్లూరు గ్రామము చేరిరి. వారిలో నరిసింహకవిగలడు. ఈయన నాగ్నజితీ పరిణయ మను గ్రంథము రచించెను. అందు తనవంశవివరము మీదిగువ విధమున వ్రాసెను.

శా॥ ఆకౌండిన్యస గోత్రుండై నగనదీస్థాఖ్యాత తీరంబునన్
వ్యాఘ్రోచక్ర మహోపురాగ్ర కపవ్యాస్వరా ధనారంగ పూ
గాతల్పాంచను పల్లగీష్పు దచీయన్యాప్తుడై వాదుమాబ్ధికిన్
గా కేందుదున్న తి కుజపూజ్య నుశుభీపత్సంబు విఖ్యాతుండై.

ఆయనకు పేర్రాజు, చిట్టెయ్య అను యిద్దరుకుమాళ్ళు అందు చిట్టెయ్యకు అమ్మిరాజు, నరసింహము అందు అమ్మిరాజు

తే॥ గీ॥ అమ్మిరాణ్మంత్రి విఖ్యాతి నలరికాంజ
సీమలోని యుల్లంపర్రు సిరిదలిర్ప
వంగురీమల్ల మంత్రిచే వ్రాసియొసగ
గైకొనియె వేడ్కనేక భోగప్రుమిరాసి.

ఆయనకు అన్నప్పయను నామెయందు ఎఱ్ఱమరాజు పుట్టెను. నరసింహమునకు సింగమ్మయందు యిద్దరుకుమాళ్ళు. అందగ్రజుడు గుర్వరాజు. ఈయనకు పద్మనాభుండు, ఈయన భార్య కొండమ్మ. వీరికి సీతారాముడు, అంతర్వేది, హనుమంత రాయుఁడు, వెంకన్నయు, ఈవెంకన్నకు వేంకటరాయుఁడు, తిరుపతి, బుచ్చిరాజు, అమ్మిరాజు, ఈ వెంకన్న హనుమంత రాయుఁడు.

సీ॥ బుధులకు దక్షిణా పూర్వకంబుగనేర్చి
యుభయతో ముఖదాన మొసగినాఁడు
పుత్రపౌత్రాది విస్ఫూర్తిఁచే దగినకన్యా
దానపుం బున్నె మందినాఁడు
గంగోదకము మాధురింగాంచు సంపూర్ణ
జలముగా కూపముల్నిలిపినాడు
లలిత రసాలాది ఫలవృక్షముల తోఁపు
లెన్నేని ధాత్రి వేయించినాఁడు
మోదమునను గపోత వాక్యాదిపుణ్య
కథలుగల నక్షత్రబంధముల్ కవితఁ జెప్పి
శ్రీనృసింహుల కర్పణ చేసినాడు
సుకరమగు నేహనూమంత సుకవివినుతి,

ఈయన కవితా చమత్కారమునకు మధురగానమునకు మెచ్చి కలిదిండి రామరాజుగారు వల్లూరు, కరుగోరుమిల్లి, భీమలాపురము గ్రామములలో మాన్యము లిచ్చెను. ఈవార్త అప్పటి సమస్థానాధిపతులగు నారసింహ అప్పారాయణింగారు విని, గుంపర్తిలో తుంగబాడవ అను మాన్యమిప్పించిరట. ఈయన సీతావిజయము, త్రిపురారాతి విజయము అను ద్విపదకావ్యములు రచించిరి.

ఈయనకు పెద్దిరాజు వీరాజుగారి కుమార్తెనిచ్చిరి. వీరికి పెదనారసింహుడు, రామరాజు, నరసింహము అను నీకవికి వీరరాఘవులు, వెంకటేశ్వర్లు అను పుత్రులు కలిగిరి. అందు నారసింహమునకు పెన్నిరాజు ఎఱ్ఱనగారి కుమార్తెనిచ్చిరి. ఈ దంపతులకు వేంకటకృష్ణయ్య, హనుమంతుడు, శంబరాజు, రామరాజు అనువారలు అందు రామరాజుగారిట్లు వర్ణింపబడిరి.

గీ॥ చెర్వుత్రవ్వించె భువికి నచ్చెరువు గాఁగ
బనస సహకార ముఖఫల భరితవనుల
జలసమృద్ధి దీర్ఘికలఁ బొసఁగ నిల్పె
వల్లూరి రామరాజు కెవ్వారుసాటి.

ఈయనకు ఆచంట కామరాజుగారి కుమార్తెనిచ్చిరి. ఈ దంపతులకు హనుమంతరాయుఁడు, వీరరాఘవుడుగారికి వంగూరి సూరపరాజు కుమార్తెనిచ్చిరి. ఆయనతమ్ముడు వేంకటాచలపతి కవియట ఏమి గ్రంథములు రచించెనో. రామజోగికి తురగా రామయ్యగారి కుమార్తెనిచ్చిరి. నాగ్నజితీ పరిణయ గ్రంథకర్తయగు నరసింగరాయని కుమారుడు సూరనామాత్యుఁడు. ఈయనకు పోడూరివారి దౌహిత్రినిచ్చిరి. ఈతని తమ్ముడు హనుమంతరాయుఁడు, శంభుడు, వేంకటాచలపతి. ఈ కవి తనతండ్రియైన హనుమంత కవియొద్దనే

విద్యాభ్యాసము చేసెనట. ఈ వల్లూరి వారందరు కవులే ప్రస్తుతము పాఠశాల పరీక్షాధికారిగానున్న నరిసింగరాయుడుగా రీవంశీకులే. గోదావరిజిల్లా వల్లూరు కాపురస్థులగు వల్లూరి సుబ్బారాయుడుగారి కుమారుడు హనుమంత రాయుడుగారు జమాబందీదండకము, గోదావరీ పుష్కరదండకము రచించిరి. సూర్యనారాయణగారి కుమార్డు పార్థసారథిగారు అడ్వొకేటుగా ఉండిరి. వీరికి అనుక్రమముగా పెమ్మరాజువారు, పరకాళావారు, నుంచికంటివారు, కేసానుపల్లివారు, పాలకోడేటివారు, రామరాజువారు, గర్నేపూడివారు, చింతపల్లివారు, చిలకావారు, తిమ్మరాజువారు, తూబాటివారు, మేరువపూడివారు, వాడ్రేవువారు, పోతాప్రగడవారు, తల్లాప్రగడవారు, వంగూరివారు, పాపరాజువారు, గోటేటివారు, పాలూరివారు, ఆచంటవారు, కొమరగిరివారు, మాచిరాజువారు, తురుమెళ్లవారు, పెద్దిరాజువారు, వడ్లమన్నాటివారు, పొణుగుపాటివారు, మిన్నికంటి మున్నగువారితో బంధుత్వములుగలవు.

ఈ కౌండిన్యస గోత్రీకులలో పై నుదహరించిన గోదావరి జిల్లా వల్లూరునందుండెడివారికి యల్లమందయందుండెడివారి కూటస్థుడో కాైడుండవచ్చును. ఈయనపేరు అయ్యలు మంత్రి. ఈయన మిగుల ప్రఖ్యాతిపురుషుడు. ఈయన బెండపూడి అన్నమంత్రి ప్రభువగు యల్లయవేమ వీరభద్రారెడ్డికి తమ్ముండగు దొడ్డయరెడ్డియొద్ద మంత్రిగా యున్నట్లు ఈ దొడ్డయరెడ్డి తనపేరిట దొడ్డవరమని అగ్రహారముంజేసి దానిని కొందరు బ్రాహ్మణులకు ధారవోసినట్లుగా నొకశాసనము కలదు. అందువ్రాయబడిన శ్లోకములలో నీదిగువశ్లోకము గలదు.

వల్లూరి అయ్యలమంత్రి కౌండిన్య.

శ్లో॥ వల్లూరయ్యల మంత్రీశో గురువాన్ కీర్తిభూషణః

ఆపస్తంబో రాజమాన్యః కౌండిన్య శ్శివభక్తిమాన్.

అని యుండుటచే ఆకాలమందనగా శాలివాహనశకము 1352 సంవత్సరమందు దాదాపుగ అయిదువందల సంవత్సరములకు ముందీ యన మంత్రిగానుండెననుటకు సందేహములేదు. (చూడుడు బెండపూడి అన్నమంత్రిచరిత్ర)

(2) వల్లూరివారు. భారద్వాజులు. వీరు శైవ ఆర్వేలనియోగులు, ఆపస్తంబులు, భారద్వాజ గోత్రీకులు, ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ అని త్ర్యార్షేయము. ఈ కుటుంబమువారిలో కొందరు గుంటూరుజిల్లా బాపట్లతాలూకా వల్లూరునందును, కృష్ణాజిల్లా వీరవనేని గూడెమునందును ఉన్నటుల తెలియుచున్నది. ఇంతకంటె వీరిని గురించి చరిత్రాంశ మింకేమియు తెలియదు.

(3) వల్లూరివారు శ్రీవత్సగోత్రికులు, ఆర్వేలనియోగులు, ఆపస్తంబులు, యజుర్వేదులు, శ్రీవత్సగోత్రీకులు, భార్గవ, చ్యావన, ఆప్నవాన, ఔర్వ, జామదగ్న్య అని పంచార్షేయము. వీరి పూర్వపుకాపురస్థలం అద్దంకి సీమలోచేరిన చీమకుర్తి గ్రామమనియు, అనంతరము వీరిలోకొందరు కేసానుపల్లి వారుగాను మరికొందరు చీమకుర్తివారుగాను బాపట్లతాలూకా వల్లూరునందుండినవారు వల్లూరివారుగాను మారినటుల తెలియుచున్నది. ఈ వంశీకులలో వల్లూరి కోటేశ్వరరావుగారి కుటుంబమువారు బాపట్లతాలూకా యిటికంపాడు గ్రామమునందుండి యున్నారు. వీరిచరిత్ర చీమకుర్తివారు కేసానపల్లివారు మొన్నెకంటెవారి చరిత్రలలో చూడవలెను.

(4) పరాశర గోత్రీకులగు వల్లూరివారు. ఆర్వేలనియోగులు ఆపస్తంబులు; యజుర్వేదులు, పరాశర గోత్రికులు, వాసిష్ఠ, శాక్త్య, పరాశర అని త్ర్యార్షేయము. ఈ వంశీకులు పూర్వము బందరు

ప్రాంత్యమునయందు పెదిమద్దాలివైపుల నివశించి యుండెడివారు. వీరిలో కీర్తి శేషులగు రాయబహద్దూరు బిరుదాంకితులగు జగన్నాధరావు పంతులుగారు, వల్లూరి సూర్యనారాయణరావుగారు అచ్చువేయించిన వంశవృక్షములబట్టి వీరిమూలపురుషుడు పరదేశిరాజు అయినట్లును, ఆయన కుమాళ్ళు గురవరాజు, మూర్తిరాజు, సూరపరాజు అను వారిలో పెద్దవాడగు గురవరాజు మనుమడు పేరాజుగారి సంతతిలో జగన్నాధరావు పంతులు బి. ఏ. గారి కుమాళ్లు వెంకట్రావు, శివరామ కృష్ణమోహన్, శ్రీహరిరావు అనువారును పేరాజుగారి తమ్ముడు నార్పరాజు సంతతిలో రామకృష్ణరావు వేంకటసుబ్బారావు, నారాయణగార్లు కలరు.

మూలపురుషుని రెండవకుమార్డుఅగు మూర్తిరాజుగా పెద్దకుమార్డు గంగరాజుగారికుమాళ్లు వెంకన్నగారిపెద్దకుమార్డు వెంకటనర్సు కుటుంబములో వెంకటసుబ్బయ్య, సోమరాజు, గురాజు, వెంకటప్ప, భాను మూర్తి, జగన్నాధరావు అనువారును, ఈవెంకటనర్సు తమ్ముడు [illegible]కుటుంబములో కృష్ణమూర్తిసుబ్బారావు గార్లున్నారు యీ వెంకట నర్సు [illegible]సోదర్లు కామన్నగారి కుటుంబములో వెంకటకృష్ణ 2 నంది రాజు, 3 పేరన్న 4 వియ్యన్న 5 వెంకటాచలం 6 షణ్ముఖయ్య అనువారునుగలరు.

సూర్య[illegible] రాజుగారి [illegible] వెంకటకుమార్డు [illegible] సుబ్బయ్యగారి కుటుం బములో వెంకట జగన్నాధ[illegible] [illegible] అప్పారావుగారును, మూర్తి రాజుగారి మూడవ కుమార్డు సుబ్రాజుగారి కుటుంబలో లక్ష్మన్న సుబ్బ రావు, కామయ్య, పరిశాలంగారున్న యీయన నాలవకుమార్డు నాగలింగము నిస్సంతు.

వీరి అయిదవకుమార్డు కనకరాజుకు దక్షిణామూర్తి, ముత్తం రాజు సోమరాజుగార్లులు, యీయన ఆరవకుమార్డు గోపాల్లుగార్కి

నాయనప్ప, ఎల్లంరాజు, పూర్తిరాజు, క్రిష్ణమ్మ, అచ్చన్నగార్లును వీరి యేడవకుమార్డు కామరాజు యీయన పెద్దకుమారుని మనుమడు తిమ్మరాజుసంతతిలోగణపతిరావు, హనుమయ్య, కామయ్య, ప్రకాశం, భానుమూర్తిగారును, యీ తిమ్మరాజుగారి తమ్ముడు వెంకు పెద్ద కుమార్డు వియ్యన్నసంతతిలో సూర్యనారాయణ, శీతారామారావు, వెంకట్రామకృష్ణయ్య, వెంకటచలపతిరావు, రామారావుగార్లు వీరి పినతండ్రులు సర్రాజు, శేషగిరిరావు, వెంకటేశ్వరరావుగార్లు. వెంకు రెండవకుమార్డు వెంకన్న సంతతి వారిలో శీతారామబ్రహ్మం, కేశవ రావు, అనంత పద్మనాభ రావుగార్లును గలరు.

మూర్తిరాజుగారి కుమార్డు కామరాజుగారి మూడవకుమార్డు కామయ్యగారి మనుమడు పేరయ్యగార్కి నాగభూషణం, కామయ్య, ఆనందరాయుడుగారి తాలూకు మాణిక్యారావు, కృష్ణారావు, జానకి రామయ్యగారు.

ఆనందరావుగారి తమ్ముడు క్రిష్ణయ్యగారి మనుమడు కోటీశ్వర రావుగారికి అనందరావు, పురుషోత్తము, హనుమంతరావు బి. ఏ. యల్. టి. గారును, సీతారామయ్యగారి సంతతిలో సంజీవరావు బల రామమూర్తిగార్లును గలరు.

మూర్తిరాజుగారి కడపటికుమార్డు సరసరాజుగారి పెద్దమను మడు బుచ్చయ్యగారి సంతతిలో కామేశ్వరరావు, వెంకటచలపతిరావు, సీతారామయ్యగారు, రెండవ మనుమడు కామయ్యగారి పెద్దకు మార్డు వెంకటరత్నంగారి సంతతిలో వెంకటసుబ్బారావు, పూర్ణచంద్ర రావుగార్లు వెంకటరత్నంగారి తమ్ముడు కృష్ణయ్యగారి సంతతిలో నారా యణరావుగలరు.

మూలపురుషుడు పరదేశామాత్యుని మూడవకుమార్డు సూరన

రాజుగారి సంతతిలో చాలామంది ఉన్నత విద్యయందు తీర్ణులై రాచ కార్య దురంధరులైన వారనేకులుగలరు. వీసంతతిప్రస్తుతము శాఖోప శాఖలుగా బ్రాకి చాలాప్రఖ్యాతి వహించినది. ఇంకనుఖ్యాతివహించు చున్నది. సూరపరాజుగారి కుమార్డు జగ్గరాజు ఈయన పెద్దకుమార్డుహను మయ్య 2 పెద్దిరాజు 3 సూరపరాజు. హనుమయ్యగారి పెద్దకుమారుని మనుమడు పట్టాభిరామయ్యగారు చిన్నకుమారునికుమార్డు రామలింగ ముగార్కి శేషాచలంగారుదత్తుడు, ఈరామలింగంగారురంపప్రాంత్యమున దివానీగానుండెడివారు ఈయన దత్తకుమార్డు శేషాచలంపంతులుగారు హెడ్డుఅక్కౌంటెంటుగానుండి పిమ్మట తంగెళ్లమూడిమెష్టేటులో కోర్టు ఆఫ్‌వార్డు సువారితరపున మేనేజరుగానుండి బహుసమర్థతతోకార్యము లునిర్వర్తించెడివారు. ఈయనకునలుగురుకుమాళ్లు, వీరందరుపట్టభద్రులై నాల్గురాజ్యమ్లుపాలించుచుండిరాయనునటుల పెద్దకుమారుడు కోదండరా మయ్యగారుయేలూరునందు వెంకటావ్రుగారు నర్సాపురం నందును, సూ ర్యనారాయణగారు చెన్నపట్టణమునందును న్యాయవాదులుగా నుండి పే రు వహించుచుండిరి. కడపటివా రగు వెంకటరత్నంగారు డాక్టరు పరీ క్షయందు కృతార్థులై యేలూరునందే యుండిరి. జగ్గరాజుగారి రెండ వ కుమారుడు పెద్దిరాజుగారు. ఈయన మనిమనుడు రంగప్పగారు యొచట నుండిరో తెలియదు. జగ్గరాజుగారి మూడవ కుమారుడు సూరపరాజుగారు. ఈయన 1700 లలో వాసిరెడ్డివారి సంస్థానములో మేనేజరుగా నుండెను. ఈయన ద్వితీయగోపాలు డను ప్రఖ్యాతి వడ సెనట. ఈయన కిద్దరు భార్యలు. పెద్దభార్యకు హనుమయ్య, జగ్గ రాజు, గురవరాజు, బాపిరాజు. రెండవ భార్యకు కొండయ్య, రామ స్వామి, హనుమయ్యయు మొత్తమేడ్గురు కుమాళ్ళు. అందు మొద టి ముగ్గురికి సంతు తెలియదు. నాల్గవవారగు బాపిరాజు భార్యకనకాం

బ. ఈయనకు ఆర్గురు కుమాళ్ళు. ఈయన కుమారునిచే రచింపబ
డిన భావసారసంగ్రహ మను గ్రంథమునం దీయన నిట్లు వర్ణింపబడెను.

శా॥ శ్రీకృష్ణాంఘ్రి సరోరుహద్వయమహాసేవాసమాసక్తుని
త్యైకసద్వృత్తుఁ డనంతశాంతుఁ డనవద్యైశ్వర్యసంపన్నుఁడ
స్తోకాజస్రపరోపకారి నృపపూజ్యుం డీద్దదుర్వారశో
భాకాంతుండగు బాపిరాజు కనకాంబన్ బెండ్లి యయ్యెన్భువిన్

అనంతర మీయన మునిమనుమనిచే రచింపబడిన ఆంధ్రశారీరక
మను గ్రంథము నందిట్లు వర్ణింపబడిరి.

తే॥గీ॥ అంచు వెలగొందుఁ దారలఁ జందు రువలె
ధైర్య గిరిరాజు సువినీతి ధర్మరాజు
క్షమావిబుధరాజు విజ్ఞాన జనకరాజు
వరయశోరాజు వల్లూరి బాపిరాజు.

ఈ బాపిరాజుగారి పెద్దకుమారుడు నారాయణరాజు నిస్సంతు.
రెండవ కుమారుడు జగన్నాథరాజు. ఈయన పెదమద్దాలయందుండె
డివారు. ఆ కాలమునం [illegible]నగా ఆ 18వ ప్రాంత్యమున ఈయన ఈ
స్టిండియా కంపెనీవారివద్ద త[illegible]శీలుబారుగా నుండెడివారు. ఈయన
గొప్పజ్యోతిష్కుడును, పండితుడు నని యెసగుటచే శాలి 1743 లో నృ
సింహస్తోత్రము, భావసారసంగ్రహ మను జ్యోతిష గ్రంథమును రచిం
చిరి. ఆ గ్రంథము నిటీవల ఆయన మునిమనుమడగు జగన్నాథరావుపంతు
లుగారిచే ప్రచురింపబడినది. భావసారసంగ్రహ గ్రంథమునం దిట్లున్నది.

క॥ ఘనతరమగు పాతివ్ర
త్యనియమముచే సకలసద్గుణాభరణయుచే
వనజాలయాంఘ్రిసేనయు
ననువుగఁ గనకాంబయును సమరె ధరిత్రిన్.

సీ॥ ఆ దంపతులకు నారాయణుం డన జగ
న్నాథరాజన పద్మనాభ నామ
ధేయుండు కృష్ణమూర్తి యనంగ
రామమూర్తియు వాసుదేవమూర్తియు ననంగ
నార్గురు తనయులందు ద్వితీయుండ నగు
నేను మద్దేశికాజ్ఞ వడసి
పరమభక్తిని రమాపతి దివ్యచరణాంబు
జాతయుగ్మంబు మత్స్వాంతముననను
నిల్పుకొని వేడ్క మజ్జననీ జనకుల
కును నమస్కార మొనరించి కువలయమున
వెలయు జ్యోతిశ్శాస్త్రకోవిదులు పొగడ
నీ కృతి యొనర్పఁ బూనితి నెలమిలోడ.

అనుటకంటె తనవిషయ మేమియు చెప్పుకొనలేదు. ఈ జగన్నాథరావుగారి మనుమలు రాయబహద్దూరు జగన్నాథరావుగారు రచించిన ఆంధ్రశారీరకగ్రంథమున తన తాతగారగు భావసారసంగ్రహకర్తలగు జగన్నాథరావుగారి నిట్లు పొగడిరి.

సీ॥ ధీరుఁడై సుమశరాకారుఁడై
యబ్ధిగంభీరుఁడై ధరణిని మించి మించి
ధన్యుఁడై బహుళవదాన్యుఁడై
కవిజనమాన్యుఁడై దీనుల మన్చి మన్చి
పుణ్యుఁడై యార్తశరణ్యుఁడై విప్రా
గ్రగణ్యుఁడై ఖ్యాతిని గాంచి గాంచి
శ్లోకియై దుష్టాహితేకియై పృథుల
వివేకియై ధర్మముఁ బెంచి పెంచి

చెలగు సద్వర్తి వినిహత శ్రితజనార్తి
యలిదయాపూర్తి రాజితాశాంతకీర్తి
సత్యమార్గానువర్తి సచ్ఛక్రవర్తి
నవరసస్ఫూర్తి యా జగన్నాథమూర్తి.

ఈయన భార్య వీరలక్ష్మమ్మ. ఈ దంపతులకు నీలమేఘశ్యామ రావు, కౌస్తుభభూషణరావు, శ్రీవత్సాంకరావు, బాపిరాజు లని నలుగురు కుమాళ్ళు. అందు మొదటివారు నిస్సంతు. రెండవారికి జగన్నాథరావు, బాపిరాజు. మూడవవారు శ్రీవత్సాంకరావుగారికి రాయ బహద్దూరు జగన్నాథరావుపంతులుగారు ఈయన రచించిన ఆంధ్ర శారీరకగ్రంథమునందు తనవిషయము తన తండ్రిగారివిషయము యిట్లు, నుడివిరి.

క॥ శ్రీవత్సాంకుఁడు పురుష
శ్రీవత్సాంకుఁడు మనోవశీకృతలలిత
శ్రీవత్సాంకుఁడు నాస్సా
శ్రీవత్సాంకితను బెండ్లి చెలఁగుచు నాడెన్.

తో॥నృ॥ఇటు లమ్మహా నీయుఁ డక్షీణయశః
పటసంవృతలోకుఁ డపారగుణ
చ్ఛట నిర్మలశీల విశంకట వేం
కటరత్నమఁ బత్నినిగాఁ గొనగాౕ.

మ॥ జననం బందితి నిమ్మహాత్ములకు నేఁ జక్కన్ జగన్నాథరా
వనుపేర న్విలసిల్లువాఁడ వరరామాంఘ్రిద్వయాంభోజసే
వన దివ్యామృతపానమత్తమధుపస్వాంతుండ బహ్మాత్మతా
త్పనిధి ధ్యానపస తత్పరుండ నురుగీర్వాణాంధ్రభాషాజ్ఞుఁడన్.

క॥ చెన్నపురీసర్వకళా
త్యున్నతశాలాసభా నియోక్తుల నొకఁడై
మున్ననరాయ బహాదూ
రన్నట్టి విశేషబిరుదు నందిన వాఁడై.

అని మాత్రమే చెప్పుకొనెను. ఈయన 1846 లో జన్మించి 1920 లో స్వర్గస్తులైరి.

రాయబహదూరు జగన్నాథరావుగారికి శ్రీ వత్సాంకరావు బి. ఏ లక్ష్మీనరసింహారావు. ఈయన కుమారుడు జగన్నాథరావే. జగన్నాథరావుగారి కుమార్తె వాడ్రేవు చలపతిరావుగారి తల్లి. రెండవ కుమార్తెను బుద్ధవరపువారి కిచ్చిరి. జగన్నాథరావుగారి నాల్గనకుమారుడు అనగా బాపిరావుగారి మనుమడు బాపిరాజుగారు. ఈయనకు శ్రీవత్సాంకరావు, జగన్నాథరావు, నృసింహారావు, లక్ష్మీపతి (దత్తుడైనాడు) ఇందు నృసింహారావుగారికి బాపిరాజు గలడు. సూరపరాజు కుమారుడు భాపిరాజుగారికి ఆరుగురు కుమాళ్ళలో మూడవ కుమారుడు పద్మనాభరాజు. ఈయనకు యెనమండుగురు కుమాళ్ళు. 1. లక్ష్మీనా యణ, 2. బ్రహ్మానందం వీరికి నృసింహాము నిస్సంతు. మూడవకుమారుడు శేషశాయి. ఈయనకు పద్మనాభరాజు. 4 శ్రీహరి నిస్సంతు. 5. శ్రీరంగశాయి. ఈయనకు పద్మనాభరాజు బి.ఎ. సన్యాసిరాజు బి. ఏ. యల్. టి. వీరు ఇద్దరు గొప్పఉద్యోగములుచేసి ఉపకారవేతనము పుచ్చుకున్నారు. 6 శ్రీరంగమూర్తి నిస్సంతు. 7 రథాంగపాణిరావుగారు. ఈయన గొప్పఉద్యోగముచేసి ప్రఖ్యాతి నందినవారే. ఈయనకు పద్మనాభరాజు, సూర్యనారాయణరాజు, జగన్నాథరావు, నృసింహమూర్తి అని నలుగురు కుమాళ్ళు గలరు. 8 వెంకటరమణమూర్తి. ఈయన నిస్సంతు. ఇంతవరకు భాపిరాజుగారి

మూడవ కుమారుడు పద్మనాభరాజుగారి శాఖ అయినది. ఇక బాపిరాజుగారి నాలవ కుమారుడు కృష్ణమూర్తిగారు నిస్సంతు. 5 రామమూర్తి, ఈయనకు నారాయణ, కృష్ణమూర్తి. వీరు ప్రస్తుతం గురజయందున్నారు. 6 వ కుమారుడు శ్రీనివాసమూర్తి. నృసింహమూర్తి రామచంద్రమూర్తి అని ముగ్గురు కుమాళ్ళు. 3 అందు శ్రీనివాసమూర్తి సంతతిలో సత్యనారాయణమూర్తి, అనంతపద్మనాభమూర్తి, ప్రభాకరరావుగార్లు గలరు. వాసుదేవమూర్తి రెండవ కుమారుడు నరసింహమూర్తిగారికి నరసింహమూర్తి, వాసుదేవమూర్తిగారు వాసుదేవమూర్తి 3 కుమారుడు రామచంద్రమూర్తికి వాసుదేవమూర్తి, సర్వేశ్వరరావు, బాపిరాజుగార్లు. ఇందు వాసుదేమూర్తి సంతతిలో రామచంద్రమూర్తి, నరసింహమూర్తి రామబ్రహ్మం, శ్రీరంగమూర్తి, భాస్కరరామమూర్తి గార్లు. సర్వేశ్వరరావు మనుమడు సర్వేశ్వరరావు. బాపిరాజుకు రామచంద్రమూర్తి, శేషగిరిరావుగార్లు గలరు. సూరపరాజుగారి అయిదవ కుమారుడు కొండయ్యగారికి సంతతిలేదు.

సూరపరాజుగారి ఆరవ కుమారుడు రామస్వామి. ఈయనకు వెంకటచలం. ఈయనకు సుబ్బారాయుడు, శేషాచలం, రామారావు, బలరామయ్య. ఇందు సుబ్బారాయుడుగారికి సంతులేదు. శేషాచలం - రు సూరపరాజుగారి మనుమడు హనుమయ్యగారి మనుమడు రామలింగముగారికి దత్తత యిచ్చినారు. ఈయనే తరిగొళ్ళమూడి యెస్టేటు మేనేజరుగా చెప్పబడ్డవారు. మూడవ కుమారుడు రామారావుగారు. ఈయన కొంతకాలము రివెన్యూ యుద్యోగమునందుండి విరమించియేలూరులో న్యాయవాదిగా నుండిరి. ఈయనకు ముగ్గురు కుమాళ్ళు. అన్నగారి కుమారులవలె ఉన్నతవిద్యయందుత్తీర్ణులైరి నరసింహారావుగారు డాక్టరుగాను, వెంకటసుబ్బారావుగారు, బలరామకృ

ష్ణారావుగారు యేలూరునందే యెవ్వకేల్లుగా నుంటూయున్నారు. ఈ కుటుంబమువారి పూర్వులు కృష్ణజిల్లానుండి భద్రాచలంద్వారా రంప అచటినుండి కొండపల్లి, శనివార్పేట, యేలూరునందు ప్రవేశించి యే లూరునందు స్థిరవాసులైరి.

ఈ వంశములో మూలపురుషు డగు పరిదేశిరాజుయొక్క 3 వ కుమారుడు సూరపరాజు మనుమడు సూరపరాజుయొక్క 7 వ కుమా రుడు హనుమయ్య. ఈయనకు వెంకటరత్నము, వెంకటకృష్ణయ్య, వెంకటరత్నముకు హనుమంతరావు. ఈ హనుమంతరావుకు సూర్య ప్రకాశరావు బి. ఎ. యల్. టి., వెంకటరత్నం బి. ఎ. యల్. టి. గోపాలరావుగార్లు గలరు. ఇం దొకరు కాకినాడయందు రెండవవారు అనంతపురమునందు ఉపాధ్యాయులుగా నున్నారు. వెంకటకృష్ణయ్యకు సూర్యనారాయణ బి. ఎ. బి.ల్ యల్. టి.యనప్రస్తుతం గోదావరీతీర మగు కొవ్వూరు గ్రామమునందుండి అచట కీర్తిశేషులైన శ్రీ తల్లాప్రగ డ సూర్యనారాయణపంతులుగారిచే స్థాపించబడిన ఆంధ్రగీర్వాణవిద్యా పీఠమునకు శాశ్వత సభ్యులుగా నుండుటయేగాక కార్యనిర్వాహకులుగా నుండియుండిరి. వీరు చాలకాలము మచిలీపట్టమందు న్యాయవాదు లుగానుండి అది విడిచి ఇహపరసౌఖ్యప్రభూత మని యెంచి ఈ గోపాద క్షేత్రమున స్థిరనివాస మేర్పరచుకొనిరి. శ్రీ సూర్యనారాయణరావు గారివలెనే వీరు 12000 రూపాయలను ఒకట్రస్టుడీడ [illegible] వ్రాసిచ్చిరి. అందిచ్చుచున్నది. ప్రస్తుత మా ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము తాలూకు అ మూలభూతములగు ఆస్తులయొక్క విలువ రు 80300 లు అని లెఖతేలినది. ట్రస్టుదస్తావేజు 9 వ ఏప్రిల్ 1931 వ తేదీని వ్రాయబడినది. ఇందలి ముఖ్యాంశము.

1 నా చిరకాలపుస్నేహితుడును నిర్మలసాత్విక త్యాగముతో చిన్నతనము

లోనే తన న్యాయవాదవృత్తిని వదలుకుని సుమారు 15 సంవత్సరము లు కష్టించి తన ధనమును, ఆరోగ్యమును, తుదకు తన ప్రాణములను కూడ నర్పించి కొవ్వూరు గ్రామములో రు 50000 లు యేబదివేలరూపాయల స్థిరాస్తితో 'ఆంధ్రగీర్వాణవిద్యాపీఠ' మను నొకసంస్థాపనను నిర్మించినవాడగు లేటు తల్లాప్రగడసూర్యనారాయణరావు బి. ఎ. బిల్ గారు 6—3—26 తారీఖున శివసాన్నిధ్యమును చేరినారు. ఆయననామము ఆ చంద్రార్కముగనుండు నట్లు తోడ్పడుట నా విధాయక కృత్యమని యెంచిస్వార్జితమగు పన్నెండువేల రూపాయల డిబెంచర్లను ఈ క్రిందిషరతులతో ఈ క్రింద వివరింపబోవువిషయములను నెరవేర్చుటకు కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠపాలకసంఘమువారిని ట్రస్టీలనుగా యేర్పరచి యీ డిక్లరేషను ఆఫ్ ట్రస్టుదస్తావేజును వ్రాయుచున్నాను. అని కొన్నిషరతు లేర్పరచిరి. అందు ముఖ్యమైనది ఈ సొమ్మమీద వచ్చువడ్డీలో కొంత భాగము ఆంధ్రభాషలో సులభశైలిని పండితపామరులకు బోధపడునట్లు చిన్నచిన్న గ్రంథములను ఈ క్రింద నుదహరించు నవిషయములలో విద్యాధికులచేత కొంతపాటిపారితోషిక మిచ్చిగాని ఉచితముగా గాని వ్రాయించి అచ్చొత్తించి ఆంధ్రదేశములోని ముఖ్యమైన గ్రంథాలయములకు ఉచితముగా పంచిపెట్టుటకును, వ్యక్తులకు స్వల్పఖరీదుకు విక్రయించుటకును విద్యాపీఠపాలక సంఘమువారు వినియోగించుచుండవలయును అను నొకవిశేష షరతు నేర్పాటుచేసిరి. వీరి ఉద్దేశప్రకారము యిదివరకు వీరిచే వర్ణాశ్రమధర్మపరిణామము, అంతర్జాతీయధర్మశాస్త్రము, మన స్వాతంత్ర్యము అను గ్రంథములు వారు ప్రచురించుటయేగాక విద్యాపీఠాధ్యక్షులగు జటావల్లభుల పురుషోత్తము యమ్. ఎ. గారిచేవేదకాలపుస్త్రీలుఅనుగ్రంథమును ప్రచురింపజేసిరి మరియు వీరు 1931 లో స్వీయచరిత్రమును 1936లో సూర్యనారాయ

ణీయమను తమ జీవితకథను ప్రచురించిరి. అందుముందుభాగమున తమ కుటుంబవివరము లతిమనోహరముగ వర్ణించిరి. వీరు ప్రథమములో అనుభవించిన బీదతనము పెద్దవారైనవెనుక సంపాదించిన సంపాదన, చేసిన ధర్మకార్యములు మున్నగునవి అతివిపులముగా వివరింపబడినవి. కాన వీరి విషయము సంపూర్ణముగా దెలియగోరువారా గ్రంథమును జదువవలెను. ఈ గోత్రీకులు తరుచుగా చెంగల్వల, వాడ్రేవు, బుద్ధవరపు, వేమవరపు, భీమరాజు, వడ్డాది, గోవిందరాజుల, కొమరిగిరి, పాలపర్తి, పిడపర్తి మున్నగువారలతో విశేషసంబంధములు గలవు. ఈ కుటుంబమువారిలో ప్రస్తుతము విశాఖపట్టణప్రాంత్యమునందుండియుండిన బాపిరాజుగారు సుగుణమణి యను చక్కని నవలను ప్రచురించిరి.

5 వల్లూరివారు కౌశిక. గోత్రీకులు

ఈ వల్లూరివారిలో కౌశిక గోత్రీకులు గలరు. వీరుతిరువళ్ళూరు ప్రాంత్యమున నుండినటుల కనుపించుచున్నది. ఆశ్వేలకులసంజాతుండగు మానవరముయల్లమరాజుగారి తనూజుండగు వీరరాఘవకవి గారు రచించిన హాస్యప్రబంధంబగు పాపచెన్నోపాఖ్యానమను గ్రంథము కౌశికగోత్రీకులగు వల్లూరి నరసింహముగారి కంకితముచేసెను. వల్లూరినరసింహమునకపకీర్తి వచ్చుటకై ఈ గ్రంథము వ్రాయబడినటుల తోచుచున్నది. ఆగ్రంథమునందు వీరివంశమునువర్ణించుచు పూర్వులను అతిగౌరవముగా నుడివెను. ఆపద్యమిట్లున్నది.

సీ॥ శ్రీకర కౌశికాంచిత గోత్రజలధికల్పం
బనజనియించె నాగమంత్రి
తద్గర్భశుక్తి ముక్తాఫలంబన బుట్టె
నరనుత గుణపాళి నరసహేళి
యతని కుమారుండై యవతరించెమనోజ్ఞ

గురు దయాగుణమంత్రి కోనమంత్రి
వానివంశబను వనిశీఁగుతారంబు
తెరగున జనియించె నరసిగాఁడు
దోషముల పేటియల్లధూర్తులకు మేటి
కల్లలకు నిల్లుజనముల కాలిముల్లు
గుల్లబరిగంటు విటులకుఁగూర్చు బంటు
విరసములనాఁడు వల్లూరి నరిసిగాఁడు

తిరువల్లూరు నందలి-పాప-చెన్ను, అను ఇద్దరు వితంతువులను బెద రించుటకై ఈ నరసింహమున కంకితముచేయబడిన యేకాశ్వాసముగల తిట్టుపుస్తకము. వీరిని వర్ణించుటలో నాగమంత్రి యనియు, కోనమం త్రియనియు వర్ణించుటచే వీరు ఆర్వేలనియోగులలోనివారై యుందురు. ఈ వంశపువా రిపు డెచట నుండిరో తెలియదు. పైకథ గవర్నమెం టువారి ప్రాచ్యలిఖితపుస్తకాగారముయొక్క- క్యూరేటరుగారివలన ప్రచురింపబడి నడిస్క్రిప్టివు క్యేటలాగునుండి గ్రహింపబడినది.

తాంబురపల్లి తిమ్మకవి, వల్లూరి జగ్గయ్య దౌహిత్రుడనని శేష ధర్మగ్రంథమున చెప్పుకొనెను. వీ రే గోత్రికులో? యెచ్చటివారో?

ఎవరెచటనుండినసూ, ఏనదేదే గోత్రమైనసూ యీ వల్లూరివారి ఇంటిపేరు వల్లూ రను గ్రామమునుబట్టియే పేరువచ్చినది. వల్లూరను గ్రామములు ప్రస్తుత మాంధ్రదేశములో 15 చోట్ల గలవు. అందు అనకాపల్లి, విజయనగరం, కాకినాడ, తుని, తాడేపల్లిగూడెం, బెజవాడ తాలూకాలోని రెండు, ఒంగోలుతాలూకాలో ఒకటి మొత్తం తొమ్మిది జమీందారీ గ్రామములు, రామచంద్రపురం, నర్సాపురం, బాపట్ల, కడప, ఆదోనితాలూకాలలో 6 గ్రామములు గవర్నమెంటు గ్రామ ములు. ఇవిగాక నెల్లూరుతాలూకాలో వల్లూరు ఖండ్రిక అనియు,

చంద్రగిరి తాలూకాలో వల్లూరివారిపల్లి యనియు రెండుగ్రామములు గలవు. ఇన్ని వేర్వేరు గ్రామములుండుటచేతనే ఈ వల్లూరివారికి వేర్వేరు గోత్రము లుండుటకు కారణమైయుండవచ్చును.

## కందాళమువారు

వీరు శ్రీ వైష్ణవులు. వాధూలసగోత్రికులు ఈవంశీకులు గోదావరి జిల్లా కాగుపాడు- కర్నూలుజిల్లా మార్కాపురముతాలూకాగంగపాలెములో నుండుకందాళంవారికిచాలాఅగ్రహారములు గలవనిజిల్లా మాన్యువలులో వ్రాయబడినది. ఈ కందాళంవారు దక్షిణాది తిరుమల నివాసులనియు అణ్ణామంగారి కుమార్తురామంగారు ఈ దేశమువచ్చిరి వీరికి వెంకటాచార్యులు. క్రిష్ణమాచార్యులు. పాపాచార్యులు. అనుకుమాళ్ళుగలరు. అందుపెద్దవారగు వెంకటాచార్యులుగారికి నరసింహాచార్యులు- రామానుజాచార్యులు- గోవిందాచార్యులు- వెంకటాచార్యులు– బొబ్బిలిసంస్థానాధిపతులు సంకల్పసూర్యోదయ గ్రంథకర్తలునగు రాయడప్పరంగారావు బహద్దరుజమిందారుగారు తమకు కందాళ వెంకటాఖ్యులు గురువులుగా వర్ణించిరి. వీరిలో రామానుజాచార్యులుగారు కవులు. వీరు ద్రౌపదీనాటకము యక్షగానగ్రంథము రచించిరి. వీరికాపురస్థలము బెళుదూరు అగుటచే బెళుదూరుకందాళకామాచార్యులుగారని పిలచెదరు. ఈ కందాళంవారు చాలామందికి గురువులుగానున్నట్లు కనుపించుచున్నారు. వెంటూరిమంగరాజుగారు రచించిన భానుమతీ పరిణయమునందు కందాళశ్రీరంగాచార్యుల వారినిట్లువర్ణించెను.

సీ॥ బహుదేశికులుచూడ బ్రహ్మరాక్షసిం
బాపురంజిత శ్రీ పాద రజమువాడు

పుట్టుమూగను దమ్మిమ్ముపుట్టుగాఁ గై చేసి
పరఁగు ప్రసాదవై భవమువాఁడు
సకలదిగంత విశ్రాంతంబులగు
నిరంతర తదీయారాధనములవాఁడు
పరమదయాదృష్టి భక్తలోకములకు
నుభయ వేదాంతంబులొసగువాఁడు
నన్నూ యాచార్యవర్య ప్రియాత్మజుండు
వసుధ నన్నేలు కందాళ వంశజలధి
ధాన శుభదసుధా ధారుదాళధళ్య
సురుచిర యశుంర శ్రీ రంగ గురువిభుండు

అని వర్ణించెను—నీరిలో అప్పలాచార్యులుగారు తెనాలి రామలింగకవి గారికి—సారంగు తమ్మయ్యకవికి గురువులుగా వర్ణింపబడిరి. కందాళదొడ్డయాచార్యులుగారు చక్రపురివారికి గురువులైనటుల ద్విపదనలచరిత్రమున కలదు.

వీరి కనుశ్రుతముగా తిరుమలవారితోటి— వింజమూరి వారితోటి బంధత్వములు గలవు. కందాళ్ళ యనుపేరెట్లువచ్చినదో గాని దరిమిలాను. వీరు కందాళంవారైనారు. పూర్వము విజయనగరరాజ్యముపాలించిన నదాశివరాయలు కాలములో అనగా క్రీ శ 1544 ప్రాంత్యమున వాధూలస గోత్రులగు కందాళ్ళ అయ్యవార్లగారికి ఉత్తరనారాకోడూరు అనుగ్రామము అగ్రహారముగా యివ్వబడినటుసదాశివ రాయలధర్మశాసనముల యందుకన్పట్టు చున్నది. [కొం. సా. 124)

[ 2 ] కందాళంవారు. వేరూరు ద్రావిళ్ళలో గలరు. వీరిది వాధూలస గోత్రమె. భార్గవ నైతహవ్య సావేదసఅని త్ర్యార్షేయము చెప్పకొనుచున్నారు, ఈ కుటుంబమువారిపుడెచట నుండిరో తెలియదు.

# కంభమ్మెట్టువారు.

ఆర్వేలనియోగులు. ఆపస్తంబ సూత్రము, యజుర్వేదము, భారద్వాజసగోత్రము, త్ర్యార్షేయము, 1 ఆంగీరసుఁడు 2 బారుహాత్యుఁడు, 2 భారద్వాజుఁడు, ఋషులుముగ్గురు. యీ యింటిపేరిటవారిలో గోత్రిభేదముగాని ఋషిభేదముగాని యెవ్విధమైన యితరభేదములును నాకింతవరకెచ్చటను తటస్తించియుండలేదు.

యీ యింటిపేరిటివారుపూర్వము హైదాబాదురాజ్యమునందలి కంభమ్మెట్టుఅనుగ్రామము ఆసమీపగ్రామములునివాసస్తులుగానుండిచాలకాలముక్రిందటనే వారిలోకొంతమందివారివారిపరిస్తితులనుబట్టి యీ ప్రాంతములు వదిలి యెవరికి వీలైనస్థలములకువారులేచిపోయినట్లును ఆ లేచివచ్చినవారిలోకంభమ్మెట్టు మల్లపరాజుగారనునాయన నాకుపూర్వము యేడవపురుషుడు యీ ప్రాంతములకువచ్చి పడమటిగోదావరిజిల్లా యేలూరుతాలూకా చాటపర్రుగ్రామమున నివాసమేర్పరచుకొనినట్లును కొంతమంది యేలూరులోను కొంతమంది పోలవరములోనూ, కొంతమందిపిఠాపురముననూయింకా మరికొన్నిచోట్లనుయెవరికి వీలైనస్తలము ల వారుప్రవేశించిరనియు, ఈకంభమ్మెట్టువారికి, పూర్వము కొండపావులూరు, దుద్దెపూడియను రెండుమొఖాసాగ్రామములుండిపగలుదివిటీలతోఆమొఖాసాదార్లు పాలకీలమీద చుండెడివారనియు పెద్దలవలనవినియుంటినని మాతండ్రిగారుతిరుగు నాకుఁజెప్పుచుండెడివారు,

చాటపర్రు నివాసమేర్పరచుకొనిన కంభమ్మెట్టు మల్లపరాజుగారీగ్రామమున భూములను, యిండ్లను, యీగ్రామమునకు మిరాశీకరిణీకమును సంపాదించినాడు. ఆయన కిద్దరు కుమారులు. వారిలో

పెద్దకుమారుని వంశములోనివాడను నేనయివున్నాను. ఆయనకుమారు లిద్దరును పంచుకుని వేరువేరుగా రెండుకుటుంబములుగా నేర్పడి యెవరికి వారు జీవించుచుండెడివారు. అప్పటిలగాయతు రెండువంశములలోను ఆరవపురుషునివరకు ప్రతివారును నొక్కొక కుమారునిమాత్రముగనుచు నెప్పటికప్పుడే నిత్యకళ్యాణమును పచ్చలతోరణమనునటుల ఆరెండు కుటుంబములలోనివారును ఏకోదరులాయని లోకము భ్రమించునటుల మార్పునుజెందక నివసించుచుండిరి.

యిట్లుండగా మల్లపరాజుగారి పెద్దకుమారుని వంశములోని నాలుగవపురుషుఁడు వెంకయ్యగారు అనునాయన ఆంజనేయోపాసన ధన్వంత్రోపాసనపరుఁడై సిద్ధించి వైద్యమునువృత్తిగాజేసుకుని మల్లపరాజుగారి పెద్దకుమారుని వంశములోనివాడగుటచు బట్టి మిరాశీకరిణీకమును చేసికొనుచు కాలక్షేపముజేయుచుండ, శ్రీ హైదరాబాదు నబాబుగారి కుమారుని కనివార్యమైన వ్యాధితటస్తించి యితరవైద్యులవలన ప్రయోజనము గలుగనందున యీ వెంకయ్యగారావ్యాధిని నివారించి శ్రీనవాబువారివలనఈనాములనుబొందియున్నారు. యీ యనకు స్వరశాస్త్రముఁగూడ సవిస్తరముగఁ దెలియును. యీ యనగారు నాతాతగారి తండ్రి.

మల్లపరాజుగారికి ఆరవతరమున పెద్దవంశములో మాతండ్రిగారయిన వెంకటసుబ్బారాయుఁడుగారును రెండవవంశమున లక్ష్మీపతిగారను నాయనయు జనించిరి.

మాతండ్రిగారికి మేము ముగ్గురముకుమాళ్ళము వారిలో పెద్దవాఁడనునేనే. రెండవయతను బ్రహ్మాజీరావు, మూడవయతను సోమబ్రహ్మానందరావు, నాపెద్దసోదరుడైన బ్రహ్మాజీరావు ధవళేశ్వరం సూపరింటెంటు యింజనీరువారి ఆఫీసులో హెడ్‌డ్రాఫ్ట్సు మనుగ సర్వీసుచేసి

యిప్పుడు పెన్షన్ తీసుకొని బెజవాడ గవర్నరుపేటలోయిల్లుకట్టుకొని నివసించుచున్నారు— యితనికి అయిదుగురు పుత్రులు.

నా రెండవతమ్ముడు సోమబ్రహ్మానందరావు పి. డబ్లియు. డి. యిలాకాను సబుఓవరు సీయరుగపనిచేసి యిప్పుడుపెన్షనుపుచ్చుకొని పవరుపేట రామచంద్రరావు పేటలో యిల్లుకట్టుకొని నివసించు చున్నాడు. ఇతనికి యేడ్గురుపుత్రులు.

నాకు ప్రస్తుతము నిలిచియున్నవారు ముగ్గురుకుమాళ్లు—వారిలో పెద్ద వాడు సీతాపతి. ఇతను మిరాశీకరిణీకమును చేయుచున్నాడు. కవీశ్వరు డు, పాదుకాపట్టాభిషేకమును రామాయణగ్రంథమున నాటకరూప మున వ్రాసి ప్రచురింపించియున్నాడు-యింకమరికొన్ని గ్రంథములను వ్రాసెనుగాని వాటినింకను ప్రచురించియుండలేదు.

రెండవవాడు నారాయణరావు యితను బి ఏ బి. యల్. ప్యా సుచేసి వెస్టుగోదావరీ డి॥ కోర్టులో యేలూరుగ్రామమునందు వకీలుగ పనిచేయుచున్నాడు.

మూడవవాడు, మాధవరావు, యితను యల్. యమ్. పి. ప్యాసుచేసి పూళ్ళగ్రామమున రూరలు డిస్పెన్సరీలో డాక్టరుగ పని చేయుచున్నాడు.

నేనిరువదియేడులు యీ గ్రామమున మిరాశీకరిణీకమును చేసి యుంటిని, గత ముప్పదివత్సరములనుంచి కొవ్వూరు లోకలుకాక్షు- వరం డెస్టేటుజమీన్దారు వారివద్ద మేనేజరుగ సర్వీసుచేసిగతసంవత్సర ములో శరీరమునవ్యాధికలిగి సర్వీసునువదలి అప్పటినుంచిభగవన్నామస్మరణ మును చేసికొనుచున్నాను. నాకాంజనేయభక్తి కొంచెముగలదు. వాత్రా త్మజశతకము— హనుమత్పంచవింశతి— హనుమద్భజనకీర్తనములను చేసి ప్రచురింపించితిని. మారుతిశతకము— హనుమచ్ఛతకములను చేసి

తిని వాటినింక బ్రచురించి యుండలేదు. రామాయణము సప్తకాండ ములను హరికథారూపమున వ్రాసితిని వాటిని బ్రచురించియుండలేదు. మఱియు అగస్త్యసంహిత— సుదర్శనసంహితయను తాటియాకు గ్రంథ ములను బహుప్రయాసను సేకరించిప్రతినివ్రాసియుంచితిని పరాశరసం హితయును నట్లేయుంచితినియీపరాసర సంహితయందలి కొంతగ్రంథ ము చిక్కియుండలేదు. దానినిమిత్తము విశ్వప్రయత్నము జేసితిని. కాని ప్రయోజనకారి కాలేదు. విప్రకులదర్పణమున అడ్వరుటైజు చేయించిన దొరుకునేమో? అది దొరికిన దానినికూడ జేర్చి మూడు సంహితలును నాంధ్రీకరించిలోకముకొసంగెదను.

మఱియును చెరుకువాడవారు, దుగ్గిరాలవారు, పెద్దాడవారు, సుడ్లనల్లేటివారు, విన్నకోటవారు, సంకావారు అనువారలతో నేను వియ్యమందితిని. బసవరాజువారుఅనే నంపూరివారు నా యత్తవారు. మంత్రిప్రగడవారు నా సోదరీయత్తవారు. ఇంకను సమీపబంధువు లలో అనేక యిండ్లపేరులవారు గలరు.

ఇట్లు
సోభనా చిలపతిరావు,

## దామెర్లవారు

అనుపకొండ, యాజ్ఞవల్క్యనియోగులు. కాత్యాయనీసూత్రం శుక్లయజుర్వేదులు, భారద్వాజగోత్రికులు. ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ అని త్ర్యార్షేయము. యీ వంశీకులు కాకినాడ తాలూ కా కూరాడ గ్రామంలోనున్నూ, రాజమండ్రిలోనున్ను, అమలాపురం తాలూకా బెండమూరులంకలోనున్ను, పిఠాపురం తాలూకా కుమార పురంలోనున్ను, పెద్దాపురం తాలూకా కిర్లంపూడి గ్రామంలోనున్న వున్నారు. వీరిలో కొందరు వుద్యోగరీత్యా యితరగ్రామాదులలో

నున్నారు. కూరాడ గ్రామంలో నున్న దామెర్లవారిలో దామెర్ల వెంకన్నగారు, ఆ గ్రామమునకు కరణంగారు, ఆయన కుమారుడు అచ్యుతరామయ్యగారు ఆయనకు మొదటి భార్యా వీరమ్మగారియందు 1 వెంకట్రామయ్య, 2 వెంకట్రాజు, 3 సరోజు అను ముగ్గురు కుమాళ్ళున్ను, లక్ష్మమ్మగారను కుమార్తెయున్ను, రెండవ కళత్రమునందు 1 వెంట్రావు, 2 సూర్యనారాయణ అను యిద్దరు కుమాళ్ళున్ను, వీరమ్మ అను కుమార్తెయున్ను కలిగిరి. అందులో పెద్దకుమారుడు వెంకట్రామయ్యగారికి భార్యా వెంకటరత్నమ్మగారు. వీరికి 1 అచ్యుతరామయ్య, 2 సుబ్బారావు, 3 సూర్యహనుమంతరావు, 4 వెంకటలక్ష్మీరమణారావు, అను నలుగురు కుమాళ్ళున్ను, వీరమ్మ, భాస్కరమ్మ అను యిద్దరు కుమార్తెలున్ను కలిగినారు. నాలుగవ కుమారుడు వెంకటలక్ష్మీరమణారావును వెంకట్రామయ్యగారి సోదరుడైన సరోజు గారికి దత్తత యిచ్చినారు. ఈయన కుటుంబం కుమారపురంలో వున్నారు. కుమార్తె వీరమ్మను కొమరిపాలెం గ్రామస్తులయిన నేలకంటి లక్ష్మీపతిగారి కుమాళ్లు సుందరశివరావుగారు అశిస్టాంటు యింజనీయరు గారికి వివాహం చేసినారు. సదరు వెంకట్రామయ్యగారు చాలకాలం కరిణీకం చేయగా, యిప్పుడు ఆయన పెద్దకుమార్డు అచ్యుతరామయ్యగారు ఆ గ్రామ కరిణీకంయున్నూ; కూరాడ, మామిడాడ కరిణీకమున్నూ; చేస్తూవున్నారు. సదరు వెంకట్రామయ్యగారున్నూ ఆయన భార్యా వెంకటరత్నమ్మగారున్నూ అన్నప్రదాతలు, కూరాడ గ్రామంలో వెంకట్రామయ్యగారు పెద్దశివాలయమును కట్టించి సుబ్రహ్మణ్యేశ్వరుని, శివలింగమును, ధ్వజస్తంభమును, స్థాపనజేసి సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారికి, నిత్యపూజ, ధూపదీపనైవేద్యములు, భోగములు వుత్సవములు, తీర్థములు జరుగులాగునను న్నూ, అర్చనకు ఏకశివద్విజ

కుటుంబమునున్నూ, పిల్లలకు కళ్యాణఖర్చులకు తగినంత భూవసతు
లను యేర్పరచినారు. ఈయన యిప్పటికి సుమారు 80 సం॥ వయ
సుగలిగి భార్యాభర్తలు వృద్ధులైనప్పటికి యెన్నియిక్కట్టులు వచ్చిన
లక్ష్యముచేయక శివపూజాధురంధరులై యీశ్వరాలయమునకు శ్రద్ధా
భక్తులతో సగ స్త్రవిధముల పాటుపడి మరంమత్తు వగయిరాలు చేయి
సూయుంటున్నారు. ఈ వంశములోవారు యీ గ్రామమునుంచే,
దామెర్ల వీరవెంకయ్యగారు తన కుమాళ్ళు 1 వెంకట్రామయ్య, 2 కృ
ష్ణారావుగార్లతో రాజమండ్రిలో కాపుర ముండి యచ్చట నివేశస్తల
ము లోగిళ్ళు వగయిరాలునున్నూ, యితరగ్రామాదులలో యీనాం
భూములున్నూ, సంపాదించుకొనియున్నారు. యీ వీరవెంకయ్య
గారు శివపూజాధురంధరులున్నూ, గొప్పమంత్రవేత్తలున్నూ; వీరు
సన్యాశాశ్రమం పుచ్చుకున్నారు. ఈయన పెద్దకుమార్డు వెంకట్రా
మయ్యగారుకు, నేలకంటివారి ఆడపడుచు భాస్కరమ్మగారిని వివా
హంచేసినారు. ఆమెయందు 1 వీరాజ్రు, 2 కృష్ణమూర్తి, 3 వెంకట
రమణారావు, 4 బుచ్చికృష్ణారావు అను నలుగురు కుమాళ్లూ, శీతన్న
వెంకటరత్నమ్మ యను యిద్దరు కుమార్తెలున్నూ, కలిగినారు. సీత
మ్మను రెంటాల సుబ్బారాయుడుగారికి యిచ్చి వివాహంచేసినారు.
వెంకటరత్నమ్మను నల్లజర్ల సాంబశివరావుగారికి యిచ్చి వివాహం
.చేసినారు సదరు 1 వీరరాజుగారికి జలదుర్గ ప్రసాదరావు అను కుమా
రుడు, పెదశేషమ్మ, రామలక్ష్మమ్మ యను యిద్దరు కుమార్తెలు
న్నూ కలిగినారు. జలదుర్గప్రసాదరావుకు బరంపురం ప్లీడరుగారైన
దిగుమర్తి వెంకట్రామయ్యగారి కుమార్తెను వివాహంచేసినారు. రామ
లక్ష్మమ్మను, నర్సాపురంలో హెడ్‌మాస్టరుగారైన దిగుమర్తి కోదండరా
మస్వామి బి. ఏ. యల్. టి గారి కిచ్చి వివాహంచేసినారు. 2 కృష్ణ

మూర్తిగారికి వకకుమార్తె చ్చి శేషమ్మ, యీమెను శ్రీరాజాపతేలుఖా నా నరసింహారావుగారికిచ్చి వివాహంచేసినారు. 3 వెంకటరమణారావు గారు, యీయన నేటీవు డాక్టరు, చాలప్రశిద్ధుడు. ఈయనకు 1 వెం కట్రావు, 2 రామారావు, 3 రాజారావు, 4 ప్రబోధరావు అను నలు గురు కుమాళ్ళును, 1 భాస్కరమ్మ, 2 వెంకాయమ్మ, 3 బుచ్చికృ ష్ణమ్మ, 4 వుపనిషతమ్మ,4 విష్ణ్వా, అనుఆయిదుగురు కుమార్తెలున్నూ కలిగినారు. 1 వెంకట్రావుగారు యం. ఎ. యల్. టి ప్యాసయి రాజ మండ్రికాలేజిలో టీచరుగా పనిచేస్తూయున్నారు. 2 రామారావు చిత్ర కళాలేఖనముఃలయందు ప్యాసయి చాల నిపుణు లని కీర్తి వహించి మ శూచికమువల్ల కాలధర్మము నొందినారు. 3 రాజారావుగారు డిస్ట్ర క్టుసర్జను పరిక్ష పాస్యయి కొంతకాలం మెడ్రాసులోనున్నూ, వైజాగు హాస్పటాలులోనున్నడాక్టరుగాపనిచేసి ఆ పనిరిజయినుయిచ్చి రాజమం డ్రిలో స్వంతహాస్పటల్ పెట్టిపనిచేయుచున్నారు 4ప్రసాదరావు,ఈయ న యింజనీరింగు ప్యాసయి సౌఖరీలో ప్రవేసించకస్వయంగారాజమండ్రి లో వ్యవహారంచేయుచున్నారు. ఈ దామెర్లవారికి నల్లజర్లవారు, నేలకంటివారు, గాడిచెర్లవారితోటిన్ని దిగుమర్తి, పతేలుఖానా, రెం టాల, పుసులూరు, బొల్లాప్రగడ, ఆదుర్తి; సరిపల్లి, కొత్తపల్లి, గోప రాజు, మిరియాల, కొండవారు, అత్తోట, జోశ్యుల, తోలేటి మున్నగు వారితో సంబధములు గలవు. ఈ దా మె ర్ల వారు వక శాఖయానాము యిలాకా కొ మ ర స నుం డి కొమరగిరి పట్నము వచ్చినట్లున్నూ, వాకలగరువునుంచి వచ్చినవారు రాజమండ్రి వా రనియు చెప్పుచున్నారు. సుబ్బారావుగారి కుటుంబము కొమర గిరి పట్నము చ్చినసుబ్బారావుగారు నర్సాపురం, సూర్యనారాయణగా రు భీమవరం, గున్నేశ్వరరావుగారు ద్రాక్షారామం, రామమూర్తి గారు బం దరు, వెంకటరత్నంగారు గణపవరం, సీతారామయ్యగారు దువ్వ, గు

న్నేశ్వరరావుగారి కుటుంబము విజయనగరమునందు ఉండిరియున్నటుల ప్రస్తుతపువారిలో సూర్యనారాయణగారు తహశీలుదారుగా నున్నట్లు, కొందునవారు ఉద్యోగరీత్యా పైగ్రామములయం దుండినటులను తెలియుచున్నది. ఇందు విశేషభాగము నల్లజర్ల సాంబశివరావు పంతులు గారివల్ల తెలియవచ్చినది

## గార్లదిన్నె వారు—సోదనపల్లెవారు.

ఆర్వేలనియోగులు, ఆపస్తంబులు, యజుశ్వేదులు, కౌండిన్య గోత్రికులు. వాసిష్ట– మైత్రావరుణ– కౌండిన్య అని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరింటిపేరు పూర్వము పేరుకుంతలవారని వాడుక. పేరుకుంతలవారనుపేరుగల ఆర్వేలనియోగులు కౌండిన్యగోత్రికులిప్పుడు కర్నూలు జిల్లా నంద్యాలతాలూకా మిట్నేలయను గ్రామమునందుండిరి గాని వారికిని వీరికిని జాతాశౌచమృతా శౌచములులేవు (పేరుకుంతలవారిచరిత్రి 167 పుటలో చూడుడు) వీరిపూర్వులలో కొందరు అనంతపురముజిల్లా అనంతపురముతాలూకా సోదనపల్లె గార్లదిన్నె అనుగ్రామములలో ఎక్కువభూవసతి సంపాదించి మిరాశిదార్లుగానుండుటచే యిటీవల వీరు సోదనపల్లెవారనియు, గార్లదిన్నెవారనియు వ్యవహరింపబడుచుండిరి. ప్రస్తుతపువారిలో అభినవగౌరనయని ప్రఖ్యాతినొందిన సుబ్బారావుగారను కవికలరు ఈయనపెద్ద నారాయణప్పగారి కుమారుడు ఈయన ఆదవాని డివిజనల్ ఆఫీసులో దివాన్ గానుండిన మేనమామగారగు కందుకూరి ఓబలరావుగారివల్ల పోషింపబడి వారిసాన్నిధ్యమునందె విద్యాబుద్ధు లలవరచుకొనిరి. ఈకుటుంబము వారి ఆదికాపురము సోదనపల్లెయేగాని ఇప్పుడుసోదనపల్లె– గార్లదిన్నె– అనంతపురము– గుత్తి– అనుంపల్లె– బల్లారిజిల్లా ఆదవానిలోనున్నారు.

పయిగ్రామములలో నున్న సోదనపల్లివారికి గార్లదిన్నెవారికి దశరాత్రా శౌచముకలదు పైనుదహరించిన కవికాపురము ఆదవాని. ఈయన కొంతవరకు పురాణవిద్యాభ్యాసులై — 30 సంవత్సరము లుద్యోగ మువల్ల జీవితముగడపి ఉద్యోగము చాలించినవెనుక 'రామకుమారా భ్యుదయము' అనునాయకమహిషు, కృష్ణశతకము, ఉత్తర హరిశ్చంద్రీ యను ద్విపదకావ్యము రచించి సాదరపూర్వకముగా నాకుదయచేయు టచే సాంతముగా చదుట కవకాశముకలిగినది. ఇందు ముందుగారచించి నది కృష్ణశతకము అప్పటికివీరికి

44॥ వయసు అయసను ప్రస్తుతము అల్పాయుష్కుల లక్షణము ననుసరించి సగమాయువు చెల్లినటులు తన కృష్ణశతకమున నిట్లువ్రాసి కొన్నారు.

> క॥ గడిచెను బెద్దయుఁగాలము
> గడిచిరి పెద్దలును గురులు గానున్నజనుల్
> గడిచెను సగమాయువునే
> గడిచెను నాబుద్ధినిన్నుఁ గానకకృష్ణా॥

ఈశతకము 1921 సం॥ న రచింపబడినది. అప్పటినుండియు ఆంధ్రసాహిత్యము వృద్ధిచేసుకొనుట కారంభించినటుల తోచెడిది. మరిమూడు సంవత్సరములపిమ్మట రామకుమారాభ్యుదయనాటకము రచించిరి. అందుత్తరరామచరిత్రకథ ఏడంకముల నాటకముగ రచిం పబడినది. యిది యిప్పటి క్రొత్తకవుల పోకడలు పోకప్రాచీనకవుల త్రోవననుసరించుటచే నాందియందు తనవిషయ మిట్లు స్పష్టపరచెను.

> గీ॥ ధాత్రినెలకొను కౌండిన్య గోత్రజాతుఁ
> డారువేల ప్రసిద్ధ వంశాబ్ధిచంద్రు
> యనఘుఁడగు పెద్దనారాయ ణార్యసుతుఁడ
> ప్రాజ్ఞసంసేవి—గా సుబ్బరాయసుకవి.

అని చెప్పుకొని సూత్రధారునిచే- గా - అనగా గాఙ్లదిన్నెయని యర్థముచెప్పించెను.

ఈ పద్యమునే మఱిమూఁడేండ్లపిమ్మట రచించిన అనసూయా మహిమయను నాటకమునందును బొందుపరచిరి వీరురచించిన కడపటి గ్రంథము ఉత్తరహరిశ్చంద్రీయము, ద్విపదకావ్యము. ఇది బహురసవంతముగ నుండుటచేతనె ఈయనకు అభినవగౌరనయనుబిరుదు వచ్చినది. ఆగ్రంథమునందు కవివంశవివరము నిట్లుదెలిపిరి. ఆర్వేలనియోగులలో కౌండిన్య గోత్రమున అనంతపురము మండలములోని సోదనపల్లెయను గ్రామమున ఈకుటుంబ మూలపురుషుడు నారాయణార్యుడు ఈయన గొప్పవనతిపరుడు ఈయన కుమారుడు అశ్వద్ధప్ప ఈయన భగవద్భక్తిపరుడు, నిగర్వవేత్త ఈయనకు పెద్దనారాయణప్ప, వేంకటాచలమప్ప, సుబ్బారావు, సంజీవరావు, యని నలుగురుపుత్రులు. ఈయన చాలానిపుణుడు. వితరణశాలి. వీరిలో జ్యేష్టుడగు పెద్దనారాయణప్పగారు వెంకట్రామశతకము కొన్నికీర్తనలుఁరచించెను.

వీరికి పుత్రసంతతిలేదు. అతులితభక్తిపరుడు కవి వెంకటాచల రమణశతకమును సులక్షణములగు కీర్తనలను రచించిరి. ఈయన చరిత్ర మిగులగొప్పదిగా నెన్నబడెను. ఈయన గొప్పజ్ఞాని విష్ణుభక్తుడు 'శ్రీరాముని యాలయమొకటి గట్టించి రామాంఘ్రికి జాతసేవసల్పె యని ఉత్తర హరిశ్చంద్రీయమున పొగడబడి యుండుటచే ఈయన యచటనో రామాలయము ప్రతిష్టించినట్లు కన్పట్టుచున్నది. ఈయన తమ్ముడు వెంకటాచలమప్ప ఈయ నిట్లు వర్ణింపబడిరి ' యాతనిచరితమద్భుతంబు వర్ణింనెవనిజము నూటాఱుభూముల నూరారుపసుల, నూరారుచుట్టాల నూల్కొన్నకీర్తి । నేలుచుండెను నతం డిడికల్లగాదు, చాలనిపింపదు సంస్తుతిగాదు, తెల్లనివన్నియ తేజీలపైన నెల్లప్పుడు

ననారి నెసగినవాఁడు । పల్లకీ మొగలాయిబండ్లనే సతము । చల్లఁగా దిరిగిన సౌఖ్యంబువాఁడు” అనియు, భోగశాలి యోగజాతకుఁడు— గార్ల దిన్నె గృహస్థ కుశీరవుండు అని వర్ణించెను గాని ఈ సత్పురుషుడు గార్లదిన్నెగ్రామమున వెంకటేశ్వరాలయము కట్టించి ప్రతిష్ఠించిన సంగతి స్ఫురణకురానందున నుడువరైరి. ఈయన కుమార్డు గురుమూర్తిగారు ఈయన గణితవేదాంత జ్యోతిషశాస్త్రములయం దారితేరిన చేయియని పించుకొనెను. ఈయన సోదెనపల్లెలో ఆంజనేయాలయము కట్టించి ప్రతిష్ట చేయించినటులను, పూర్వము అనంతపురము వద్ద సింగనమల గ్రామములో వీరిపెద్దలెవ్వరిచేతనో త్రవ్వించబడిన గోనేరుకు గండిపడి యెన్నివిధముల ప్రయత్నించి నసుగండి కట్టుపడక నరబలికోరియుండు టచే అపుణ్యాత్ముని పేరెయ్యదియోగాని తనభార్యను సమర్పించి గండికట్టించెనని ప్రఖ్యాతిగలదు. గురుమూర్తప్పగారి కుమార్డు రామే శ్వరరావుగారు. ఈయన అనంతపురములో ఉన్నారు. బిఏ. బియల్ పరీక్షయందు తీర్ణులై కడపలో న్యాయవాదిగానున్నారు ఈయనకు సంస్కృత భాషాపరిచయముగలదు రాయల్ సీమవారిలెరవున చెన్న పురియందు శాసన నిర్మాణసభకు సభ్యులుగా ఎన్నుకొనబడి ప్రజాశే వచేయును ప్రఖ్యాతి గణించుచున్నారు. ఈయన పెద్ద కుమారు ఉన్నతవిద్యాభ్యాసము కొరకు లండన్ నగరమున కు ంపించియున్నారు అశ్వద్ధప్పగారి తృతీయ కుమారుడు సుబ్బరావుగారు వీరు గొప్పవ్యవసా యకుడు. గొప్పపశు సంతతిగలిగి విశేషముగా ధాన్యము పండించు చుండెడివారు. ఈయన కిద్దరు భార్యలు పెద్దభార్య అచ్చమాంబ, ఈ దంపతులకు అశ్వద్ధప్ప, పెదనారాయణప్ప అను ఇద్దరుకుమారులు, ద్వితీయభార్య గిరియమ్మ— ఈమెకు నరసప్ప, లక్ష్మీపతి, శేషయ్య, వెంకట్రావులను నల్గురు కొమారులుగలరు. ప్రథమభార్య కుమార్డు

అశ్వద్ధప్ప అజానుబాహుఁడును నిగులబలశాలి. ఆపదంపైనను అన్నృతమాడని పుణ్యపురుషుఁడు. ఈయన 30 యేండ్లు సోదనపల్లెగ్రామమున కరణముగానుండి ప్రజలచేత పూజ్యతనొందెను. ఈయన కిద్దరు కుమాళ్ళు పెద్దసుబ్బారావు, రామారావు అనువారు. ఈనతమ్ముఁడు పెద్దనారాయణప్పగారు. ఈయనయే ఉత్తర హరిశ్చంద్రీయ గ్రంథకర్తయగు సుబ్బారావుగారి తండ్రిగారు ఈయన మహాభక్తుఁడు. నిష్టాపరుడు, నిష్కపటి, నిత్యసంతోషి. ఈయన యిరువది యైదేండ్లకాలము గార్లదిన్నె కరణముగానుండి రైతుల కష్టనిష్ఠూరములు గుర్తించి బహు ప్రీతిపరుడుగా పరిపాలించెను. ఈయనకిద్దరు భార్యలు పెద్దభార్య వెంకట లక్ష్మమ్మ ఈమె కొక కొమార్తె గలిగి యుండెను. రెండవభార్య సరసమాంబ ఈమెయే కవితల్లి ఈమెనిట్లు వర్ణించెను.

> 'భాషాచమత్కృతిం బరికింప నెట్టి
> యోషయు సరిపోలకుండె నాయమకు
> గీతాధికత నెట్టి కీరవాణులకు
> మాత యనం దగి మహిఁ గీర్తి గాంచె!

ఈమెకు సుబ్బారాయుఁడుగారు జనించిరి. ఆ కాలములో అదవాన్ డివిజల్ అఫీసు దివానుగానుండిన కంబుకూరి ఓబలరావుపంతులుగారు ఈయన మేనమామయగుటచే యీయన వారిచేతనే పోషింపబడి విద్యావంతులైనారు. ఇంగ్లీషు మెట్రిక్యులేషను వరకు జదివి ఉద్యోగరీత్యా ముప్పదిసంవత్సరములు జీవితమును గడపి యిపుడు విరమించి అదవానిపట్టణముననే నివాస మేర్పరచుకొనినారనియు, అనంతరము వీరు గ్రంథములు వ్రాయుటకు ప్రారంభించినారనియు, ప్రథమముననే వ్రాసియున్నాను. అశ్వద్ధప్పగారి మూడవకుమారుడు సుబ్బారావుగారి ద్వితీయభార్యయగు గిరియమ్మకు నలుగురు కుమాళ్ళు.

అందు నరసప్ప, లక్ష్మీపతి, శేషప్ప, వెంకటరావు అనువారు. ఇందు శేషప్పగారు మంచిరూపసి యనియు, గణితశాస్త్రమునందు మంచిప్రవీణు డని కరణములలో ప్రఖ్యాతినొందెను. వెంకటరావు ఈయన నిట్లుపొగబడిరి—

'కష్టమే సుఖ మని గణియించువాడు
నష్టమే ధృతి సమున్నతి యనువాడు
పరహితమె యాప్తబంధు వన్నవాడు
గర్వమే చంపు పగతు డనువాడు
పూర్వపద్ధతియే సంపూజ్య మనువాడు,,

మరియు పాపమున కొడిగట్టక సోమరితనమును చేరనీయక కాముకత్వము విడిచి పే రెన్నికగన్న ప్రఖ్యాతపురుషుడు. ఇతని కొమార్డు కృష్ణమూర్తిరావు. ఇక నీ వంశములో అశ్వత్థప్ప నాలుగవ కుమారుడు సంజీవప్పగారి విషయము చెప్పవలెను. ఈయన బహుచతురుడై నిరంతరము పురాణకాలక్షేపమున ప్రొద్దుపుచ్చుచు నిత్యము అనేకమంది అతిథిఅభ్యాగతులను పూజించుచు బహుసమర్థతో సంసారచక్రమును త్రిప్పుకొనెను. ఈయనకు చ్నినారాయణప్ప, వెంగన్న యను నిద్దరు కుమారుళ్ళు. అందు చిననారాయణప్ప యిట్లు వర్ణింపబడిరి.

'తన ధైర్యరమ పర్వతములు పూజించు
కొనదగు వేలుపై కొమరారియుండ
తనదు శేముషి యుగంధరుని నామంబు
గొనివచ్చి మనముల గూర్చుచునుండ
తన పట్టుదల యోగితండంబులైన
గనుగొని తలలూపగా గల్గియుండ
తన గొప్పతనము నెంత్రటి యధికారి

దన కీడ్పు జంత్రపు రూపు నొప్ప
తన గృహం బలిభి సంతాన భృంగముల
దనిపించు కంజాతంబయి యొప్ప
తన కరస్పర్శయే తిరుసస్యములకు
ననలెత్తఁ జేయు ప్రాణరసంబుగాఁగఁ
గాంచిన సుతచతుష్కంబుచేఁ దనకు
సంచిత సుకృతముల్ సమకూరు ననఁగఁ
గ్రాలిన చిన్ననారాయణార్యుఁ
డేలీల నుడువంగ నెంతయు గొఱమె!

ఈ చిన్ననారాయణప్ప కొమారులు—1, శ్రీనివాసరావు, 2, వెంకటాచలమప్ప, 3, సంజీవరావు, 4, కృష్ణరావు. ఈయన తమ్ముడు వెంగన్న. ఈయన తనవారు ఒరులు అను తారతమ్య ముంచక అందరిని సమముగా చూచుచు 'గార్లదిన్నె వంగసపుఁగలిమికి మేరమై పొల్చిన మేటి వెంగనయే' అని యనిపించుకొనెను. వీరి కనుశ్రుతముగా భారద్వాజగోత్రీకులగు కందుకూరివారితోనూ, విద్యాగురువు కేశవరావుగారితోనూ— పులిపాకవారితోనూ— అనుంపల్లివారితోనూ—గజరాంపల్లివారితోనూ—అయితంరాజువారితోనూ- యర్రగుడివారితోనూ రాయలచెర్వువారితోనూ—సిట్రగారివారితోనూ- పెనుగుప్పవారితోనూ ధర్మాపురమువారితోనూ—నెకనల్లివారితోనూ—రాజవోలువారితోనూ జూలాకాలరువారితోనూ -సీబుర్సివారితోనూ నిచ్చెనమెట్లవారితోనూ సంబంధబాంధవ్యములు గలవు అని సుబ్బారావుపంతులుగారు వ్రాసిన గ్రంథములవల్లను; రామేశ్వరరావు పంతులుగారివల్లను తెలియవచ్చినది.

N. B. వీరి బంధుగులుగా నుండు యింకనేక్లు గలవారి చరిత్రలు యింతవరకు తెలియకున్నవి. తెలిసిన వారాదరించి పంపెదరుగాక!

## రావులవారు

ఆర్వేలనియోగులు తైత్తిరీయశాఖ. యజుర్వేదము. ఆపస్తంబ సూత్రము. కౌండిన్యసగోత్రము వాశిష్ట—మైత్రావరుణ—కౌండిన్య—అనిత్రార్షేయము చెప్పుకొనుచున్నారు. వీరింటిపేరుపూర్వము మంచికంటివారని వాడుకగలదు గనిదానికితగు నిదర్శనములులేవు. గోపరాజు రామప్రధానిగారి కాలములో బాపట్లతాలూకా పేరాలగ్రామముకుపోతరాజువారికి మంచికంటివారికి సంప్రతికరణీకము లిప్పించబడినవి. ఇందుపోతరాజువారి ప్రస్తుతనామమురావులవారు (భట్టిరాజువారు)అనియు, మంచికంటివారికి పేరాలవారు(వెంకటపతి) అనికొండవీటిసామ్రాజ్యమునందు ప్రచురింప బడినది. వీరి అనాదికాపురము పూర్వము—కృష్ణాజిల్లా బాపట్లతాలూకా కారంచెడు—పై సంగతులను బట్టి చూడగా మొదట పేరాలవారు అనంతరము మంచికంటివారు పిమ్మట రావులవారు అయినట్లు తోచుచున్నది గాని యందువల్ల ఏకాలము నందిట్లు మారినవో తెలియవు.

యిపుడు యీక్రింది గ్రామములలో నున్నారు

1 గుంటూరుజిల్లా బాపట్లతాలూకా కారంచేడు.

2 గుంటూరుజిల్లా బాపట్లతాలూకా పేరాల

3 నెల్లూరుజిల్లాలోనిమేము ఆంధ్రదేశమురాజులలో విమలాదిత్యుని కడమంత్రిగనున్న వజ్జియప్రగడ వంశీయులము—వజ్జియప్రగడ కారంచేడువాస్తవ్యుడు.కౌండిన్యస గోత్రుడు. వీరిచరిత్ర శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాసిన ఆంధ్రులచరిత్రయందు చూడదగును. రావులవారు యిప్పటికిని శివపూజా దురంధరులు—పేరాలలోయుండు శ్రీ పునుగు రామలింగ మల్లేశ్వరస్వామివారి యాలయమునకును కారంచేడులో యుండే శ్రీ వీరభద్రస్వామి వారియాలయమునకును ధర్మకర్తలు

(1) వీరిలో పేరాలలో కాపురముంటూవచ్చినకీర్తిశేషులగు రావుల వెంకట సుబ్బయ్యగారు అమితకర్మిష్టి—నిరతాన్నదాత—వీరు అంతమున సన్యసించి శ్రీ శ్రీ శ్రీ నారాయణ పరబ్రహ్మేంద్రియస్వాములవారు అను పేరుతో అంతరించినారు.

(2) కారంచేడులో కాపురముండు కీర్తిశేషులగు రావుల వెంకట సుబ్బయ్యగారు శివపూజాధురంధరుడు—నిరతాన్నదాత—వీరికి ప్రభుత్వమువారు రావుసాహేబు బిరుద మిచ్చినారు.

రావుల శ్రీరాములుగారు, వీరు సర్కారు ఉద్యోగమున నుండి గతించినారు. వీరు సంగీతమందును, కవిత్వముననుయసమాన పాండిత్యము గలవారు. వీరు 'మోహనరామచరిత్ర' మనుగ్రంథమును వ్రాసినారు గాని యది అముద్రితము.

రావుల లోకనాథంగారు—వీరిప్పటికి 42 సంవత్సరములనుండి పేరాల కరణము గాపసచేయుచున్నారు. వీరుప్రజానురంజకు లగుటయె కాక గ్రామోద్యోగసంఘముల నేర్పాటుచేసి 1918 సం. మొదలు గుంటూరు జిల్లాగ్రామోద్యోగసంఘాధ్యక్షులుగ నుండి సంఘమునకు జేసిన సేవను గుర్తించి—గుంటూరు జిల్లాగ్రామోద్యోగసంఘమువారు వీరికి 'సంఘోద్ధారక' అను బిరుద మిచ్చినారు. వీ రింకను కరిణీకము జేయుచున్నారు.

వీరి కనుశ్రుతముగా బాపట్లవారితోను, కోనవారితోను, మునిపల్లివారితోను, పులిచివారితోను, కొమరవోలువారితోను, బందావారు, గంగవరపువారు, మున్నగువారితో సంబంధములు గలవు, అని సంఘోద్ధారకరావుల లోకనాథంపంతులుగారివల్ల తెలియవచ్చినది.

---

# అనుబంధము.
# తల్లాప్రగడవారు.

తల్లాప్రగడవారి చరిత్ర ప్రచురించినవెనుక తెలియవచ్చినవిష యములు— 160 పేజీ తరువాయి చేర్చుకోవలెను.

పూర్వము కామవర్పుకోట సర్కారులోను— పెంటపాడు సర్కారు దేశపాండ్యాహోదా అందుకు సంబంధించ్ని మిరాశీలు ప్రత్యేకము గాను. కొవ్వూరుసీమ మిరాశీ శ్రీపాదన్నవారు తల్లాప్రగడవారు చెరిసగము అనుభవించెడివారు. దాని మిలాను శ్రీపాదన్నవారి మిరాశీ మంచిరాజువారి కిచ్చివేశిరి. గుండుగొల్లుసీమ— కొవ్వూరు సగము ముక్క వారు అనుభవించుచూ చింతలపూడి సముతుయందున్నారు. అప్పుడు గుంటూరు ప్రాంత్యమున పేరెన్నికగన్నకోట సింగరాజుగా రుండెడివారు. ఆయనకు పుత్రసంతతిలేక ఏకపుత్రికను తల్లాప్రగడ వారి చిన్నవానికిచ్చి తనమిరాశీయావత్తూ అల్లుని కిచ్చివేశిరి. ఈ సింగరాజుగా రుచ్ఛదశలో నుండుకాలమున ఉంగుటూరు సమీపమున సింగరాజు పాలెమను గ్రామముకట్టించిరి. ఈ సింగరాజుగారి అల్లుడు సోమరాజు. ఈయన కాలములోనే ఈ తల్లాప్రగడవారికి ఉంగుటూరు నివాస్థానమైయుండవచ్చు—ఈయన మునిమనుమడు విస్సంరాజు ఈయన దాతలలో చేరినవాడే- ఈయనమనుమడే గొప్పమేడకట్టించిన ప్రకాశ రాయుడుగారు. ఈయనకు యిద్దరుభార్యలు పట్టెమ్మ బాపనమ్మయని— ఈ బాపనమ్మవల్ల తురగా రామకవి తోబుట్టువు. ఈ ప్రకాశరా యుడుగారు కోటసింగరాజువలె ఖ్యాతిగడించిరి. అప్పుడే రాయుడు చెర్వనుపేర నొక గొప్పతటాకము త్రవ్వించుటయేగాక పట్టెమ్మపేరట ఒకచెర్వు బాపనమ్మపేరట నుయ్యిత్రవ్వించిరి. యిపుడు ఉంగుటూరు సంతెసమీపములోనుండు బాపనమ్మ నుయ్యియనునది అపత్రివలపేర త్రవ్వించబడినదే. ఈయన మనుమడు సైదంతరాయుడుగారు ఈయననే ఉంగుటూరు కుటుంబమువారు తమ మూలపురుషునిగా వాడుకొను

చుండిరి. ఈయనకు సర్వన్న— పానకాలు— గుర్వన్న వీరుముప్పవరు కలసి శనివారపేట రాజావారిని మెప్పించి తల్లాపురము మొఖాసా సంపాదించిరి.

రామాపప్రెగడవారు వీరిద్రాహాహోత్రులగుటచే చిరకాలమామొ ఖాసాపై రెండుకటుంబములవారు అనుభవించినపిదప అన్యాక్రాంతము కాబడినది. దరిమిలాను సర్వన్న గుర్వన్నగార్ల కుటుంబములవారు కరిణీకములుచేయుచూ, సర్వన్నగారి సంతతివారగు లక్ష్మీపతిగారు తమ కరిణీకము తురగావారికిచ్చి వేశిరి. యిప్పటికి ఆకరిణీకము ఆకు టుంబమువారే చూచుచున్నారు. ఈ లక్ష్మీపతిగారి కుమారుడే B. A ప్యాసై హోమియో గ్రంథములువ్రాశి ప్రచురించుచున్న కామేశ్వర రావుగారు.

గుర్వన్నగారి కుటుంబమువారిలో నొకరు వెల్లమిల్లియందు మరి యొకరు పట్టెంపాడుఅను గోపినాథపురము కరిణీకములు సంపాదించుకొని అచట స్థిరపడిరి. ఈగుర్వన్న సర్వన్నగార్లకు 6-7 తరములవారగు నర సింహముశర్మ ప్రకాశరాయుడుగార్లు వీరు చాగల్లు స్టేషనువద్ద ఆనంద నికేతనా శ్రమము స్థాపించిరి. ప్రకాశరాయుడుగారు M. A. ప్యాసు అయిరి వీరు కొన్నిగ్రంథము లాంధ్రీకరించిరి. వీరికుమార్డు భీమేశ్వర రావుగాడు వీరు B, A. పరీక్షయందు తీర్ణులైనారు వీరివల్లనే యిపుడు ఉంగుటూరు గ్రామమునకు చాలాసదుపాయములు జరిగినటుల చెప్పు కొనుచున్నారు ప్రస్తుత మేలూరునందు- కొవ్వూరునందు న్యాయవాదు లుగానున్న పానకాలురావుగారు. సుబ్బారావుగార్లు వైకుంఠరాయుడు గారి కుమార్డు పానకాలరాయుడుగారి సంతివారు అయినట్లు తెలియు చున్నది.

## కామరాజువారు (208 పుట తరువాయి)

ఈ కామరాజు వంశీయులలో నాదిపురుషుడగు కామరాజు యొక్క ప్రాముఖ్యత నిదివరకే వచించియుంటిమి. ఈతని కాలములో, వీరియొక్క దాతృత్వమునకును, దీనబాంధవత్వమునకును, మేరలుండె డివికావట. ఆయనయొక్క దర్పదాతృత్వములును, ధీకుశలతయును నేటికిని యీ వంశీయులలో చాలమందియందు పొడగట్టు చున్నయవి. వీ రద్దంకి నివాసులై నద్దంకి కరణీకము సంపాదించిరి.

ఈ యద్దంకి చాలాగొప్పపట్టణ రాజధానియైయుండెడిది, గనుక యీపురికి పదియారుగురు కరణములు. అందు కామరాజువారు నల్గురు. వారగ్రగణ్యతనపహించి, ఎదురుమాటలేక నిరంకుశప్రభుత్వము సాగిం చుచుండెడివారు. ఆకాలముననే యీ వంశీయు లతిభోగభాగ్యసమ న్వితులై యుండెడివారు. ఈ కరణములలో అచ్చయ్యగారిపేరు చాల ప్రతీతి. వీరు వీధినిబయలుదేరెన, వీధియందు రాకపోక నిలుపవలసి నదే. పేరునకు కరణమైనను అధికార చలామణియందును, అచార వ్యవహారములందును ప్రభువుబోలె ప్రవర్తించెడివారు. వీరేడ్గురన్న దమ్ములు. మిగిలిన యార్గురును సంస్థానముతరఫున తహసీలుదారు పదవిలో నుండియుండిరి. అట్లా యాస్థానమం దుద్యోగియులై కోట లోనేనిలచిపోయి, అద్దంకిగ్రామ కామరాజువారితో సంబంధములేగ్గి పోయిన కామరాజువంశీయులు కోటకామరాజువారని పిలువబడజొచ్చిరి. కాని యీ యిరుతెగల కెందును భేదముకన్పింపదు.

మరియు నీకామరాజు మనుమలేడ్గురు. అందు చివరవాడగు చిన్నమూర్తిరాజుయనునాతడు దక్షిణాదికివెళ్ళి కంచీపురములో నిలచి పోయిరి. వా వంశీయులు నేటికిని, ఆచారవ్యవహార భాషాదులు వేరయ్యును యిదే వంశనామమునుంచుకొని, కంచపురము, నమతేం భూరు ప్రాంతములనున్నారు.

తరువాత సందొమ్మిదవ శతాబ్దమున కృష్ణయ్యగారను నీవంశజుడు, పొదిలి, దర్శి, రామకూరు మొదలగు చోట్ల దహశీలుదారుడై తన సుగుణసంపత్తిచేత, ప్రభుత్వమువారిచేతను, ప్రజా సామాన్యము చేతను యనేక మన్ననలను గౌరవమును బడసిరి. వారు, ఆప్రాంతముల వారు వేసవికాలమున నీటికై పడుబాధలచూచి యౌదార్యజాలక, కరుణార్ద్రాంద హృదయుడై, అనేకగ్రామములలో దిగుడుబావులను, తటాకములను, చెరువులను, త్రవ్వించిరి. వానికి నేటికిని, కొన్నిచోట్ల 'కామరాజువారి బావుల' నియును, 'కామరాజువారి చెరువుల' నియు చాలప్రసిద్ధి. అయ్యవి, కొణిదెవ, రామకూరు మొదలగు గ్రామములోగలవు. కొన్నిచోట్ల వీరికి 'కృష్ణయ్యగారి బావుల'నియును వాడుకలోగలవు.

ఈ కామరాజువారిలో నొకరు కామరాజుమన్నారు కృష్ణారావుగారు, గుంటూరులో (పబ్లిక్‌ప్రాసిక్యూటరు) గవర్నమెంటుద్యోగను చాలవత్సరములు చేసి విరమించుకొని గుటూరులో నున్నారు శ్రీ శ్రీకోటీశ్వరదీక్షితులవారు వేదవేదాంగ పారాయణులై పండితసభలయందు సభాతాంబూల మర్యాద స్వీకరించు గౌరవాస్పదులై యజ్ఞముచేయుటచే దీక్షితనామము నడసిరి.

చిరకాలమునుండి శ్రీనందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితులవారి వర్ధంతులు జరుపుచు నియోగిమతాభిమానులై సమ మతవ్యాప్తికి ఆంధ్రదేశ మంతయు పర్యటనముచేసి నియోగిసభలు జర్పించి చాలమంది నియోగులు కర్మానుష్ఠానపరులగు నటుల తాము నిత్యకర్మానుష్ఠానపరులై స్వశాఖీయుల కుదోభ్బధముకలుగజేసిన మహాపురుషులు. వీరు చిరకాలము స్వధర్మప్రకాశిని, నియోగి యను మాసపత్రికలు నడిపిరి.

వీరి తమ్ముడు మార్కండేయ శర్మగారు. వీరు కనుపర్తి వారికి దత్తుల యిరి. వీరి చరిత్ర కనుపర్తి వారి చరిత్రలో గలదు.

తరువాత కామరాజు శింగరిదాసుగారి తృతీయపుత్రులైన వేంకటప్పయ్యగారు గుంటూరు, కృష్ణ, గోదావరిజిల్లాలలో తహశీలుదారుద్యోగిగా నుండి యుపవేతనము తీసికొనుచు 1933 లో బాపట్లలోగల స్వగృహమున మరణించిరి. వీరి ప్రథమపుత్రులు కృష్ణమూర్తి ప్రస్తుతము రాజమహేంద్రికళాశాలకు ప్రధానోపాధ్యాయులుగానున్న పాకనాటి ఆర్వేల నియోగులగు శ్రీ దిట్టకవి సుబ్రహ్మణ్యశర్మగారి ప్రథమ పుత్రికను వివాహమాడి, ప్రస్తుతము మద్రాసులో హైకోర్టు ప్లీడరీవృత్తిలో నున్నారు. ద్వితీయపుత్రులు డాక్టరు నరసింహారావు ఎం. బి. బి. యస్; ఎం. డి; ఎఫ్. ఆర్. సి. యస్ పరీక్షలలో నుత్తీర్ణులై ప్రస్తుతము బి. యన్. ఆర్ రైల్వేలో వైద్యాధికారిగా నుండిరి. వీరు ప్రపంచప్రఖ్యాతులగు శ్రీసర్వేపల్లి రాధాకృష్ణయ్యగారి పుత్రికను పరిణయమాడిరి.

ఇంతకు పూర్వము చెప్పబడిన తహశీలుదారు డగు కృష్ణయ్యగారి ప్రథమ పుత్రులు సింగరిదాసుగారు. ఈ కామరాజువంశము ఆదిపురుషుడగు కామరాజుకు మనుమలలో నొకడగు రంగప్ప యను నతడు పదియవ యేటనే, చాలభక్తిజ్ఞాన వైరాగ్యములు పూర్వపుణ్య విశేషమున గలిగి, శుకబ్రహ్మవలె, ధ్రువునివలె సర్వసంగపరిత్యాగ మొనర్చి పరమహంసశిరోమణియై సుమారు రెండువందల వర్షములు జీవించి రని ప్రతీతి. ఆ రక్తబిందువులు వంశపరంపరాగతముగ నుండుట చేతనే, యీ కామరాజువారు అద్దంకిలో గోప్పరామస్వామి దేవాలయమును, శింగరెగిరి నరసింహస్వామి దేవాలయమును, వెంకటాపురములో శ్రీరామాలయమును గట్టించి యీనాము సంపాదించిరి. అట్టి ఆధ్యాత్మిక

సాంప్రదాయము గలుగుట నీ శింగరిదాసు చిన్నతనమునుండి యతిభక్తి శ్రద్ధగలవారలై, భూతదయాపరతంత్రులయి శింగరిగిరి నరశింహస్వామి కారుణ్యవిశేషమున సీతమాంబ యను యోగినివద్ద యుపదేశమునొంది నారసింహోపాసనా సిద్ధియు, ఆంజనేయోపాసన సిద్ధియు, తారకోపాసనాసిద్ధియు నొందిరి. వీరు వివాహితు లయ్యును ఏకాంతముగా తిరుపతి కొండలోను మరి యితర గుహాంతరముల తపం బాచరించి తపోగరిష్ఠులైరి. వీరు తన యిష్టదైవమగు శింగరిగిరి నరసింహస్వామిని గూర్చియు, ప్రత్యక్షదైవమగు రామస్వామిమీదను, ప్రసన్నస్వరూపమగు హనుమంతునిమీద ననేక కృతులను కీర్తనలను రచించిరి. కొన్ని మాత్రము 'మోక్షచరిత్రి' యనుపేర ముద్రింపబడినది. మిగిలినవి అచిరకాలములోనే ముద్రిత మగును. వీ రనవరతము ధ్యాననిష్ఠాగరిష్ఠులై బ్రహ్మానందతరంగడోలికల నూగుచు కన్నీరు మున్నీరుగా ప్రవహించుచుండ పులకాంకిత దేహులయి నిశ్చలసమాధిసౌఖ్యముల నధిష్ఠించుచుండెడివారు. వీరి దివ్యపాదసేవనమున గొందర కాశుధార వెడలుచుండును. అట్టివారిలో బాపట్ల తాలూకా కోడూరు వాస్తవ్యులు తాడేపల్లి యజ్ఞమహలక్ష్మమ్మగారు తారాగ్రణము. వీ రనేక గ్రంథముల రచించిన గొప్ప కవయిత్రి. విదుషీమణి. ఈ సింగరిదాసుగారి పావన చరిత్రగూడ నచిరకాలములో వెలువడ గలదు. వీరి శిష్యులసంఖ్యాకులు. శ్రీ శింగరిదాసుగారు తమయంత్యదశయందు సన్న్యసించిరి. వీ రపుడు 'బ్రహ్మానంద సరస్వతీ స్వాముల వా' రని పిలువపడిరి. వీరి సోదరులగు వెంకట సుబ్బయ్యగారుకూడ సన్న్యాసించిరి. వీరిని 'బ్రహ్మానందస్వాములవా' రని పిలిచెడివారు.

ఇక నీ శింగరిదాసుగారికి ద్వితీయపుత్రులు చెన్న కేశవులుగారు. వీరును తండ్రిని బోలిన పుత్రులు. ప్రపంచవ్యామోహములు లేశమేని

యు లేక, అనవరతము రామనామజపసుధాలోలులై, నిద్రయందు గూడ తన యిష్టదైవమును మరువని మహాత్ములు. వీరు రామకోటిని కూడరచించిరి. వీరు వైరాగ్యసంపన్నులు; శింగరిదాసుగారి నాలవపుత్రులు హనుమంతరావుగారు- వీ రతిదయాస్వరూపులు. నిష్కళంకులు; భగవచ్చింతనాయత్తచిత్తులు. వీరు చిన్నతనమున తన దైవచింతనా వేశమున శ్రీ కందుకూరి వీరేశలింగముగారి సాంగత్యమున బ్రహ్మసమాజసభ్యులయిరి. వీ రిపుడు రాజమండ్రిలో ప్రాక్ప్రతీచీ గ్రంథమాలా సంపాదకులై యుద్గ్రంథముల రచించుచు, వ్రాయించుచు ప్రకటించుచుందురు. ఈ గ్రంథమాలయందు అధ్యాత్మిక గ్రంథములే ప్రదర్శిచబడుచుండును. 'హిందూజీవనపథము' 'పాశ్చాత్యభావప్రపంచము' 'నవ్యభారతోదయము' లు వానిలోకొన్ని.

చెన్న కేశవులుగారి పుత్రులైదుగురు. కృష్ణారావు, రామారావు, ప్రసాదరావు, నరశింహరావు, ముకుందరావు లనువారు. వీరందరును ఆంగ్ల విద్యాపారంగతులైరి. వీరిలోపెద్దవారగు కృష్ణారావు నెల్లూరులో శ్యానిటరీ యినస్పెక్టరు నౌకరీజేయుచు నధికారుల సంతత సమ్మానగౌరవముల కాస్పదులై ప్రపితామహుడగు కృష్ణయ్యగారి పేరునిలుపుచున్నారు. రామారావు ప్రసిద్ధ చిత్రకళాకోవిదులు. సంఘసేవారతులు. ప్రసాదరావు పోలీసు సబుయినస్పెక్టరు నౌకరీజేయుచు జనిపోయిరి. నరసింహారావు వ్యాసరచనా నిపుణులు. సంఘసంస్కర్తలు. ముకుందరావు వైరాగ్యయుతులై భగవచ్చింతనాలోలులు. వీరు రామకృష్ణ పరమహంసయను చరానుచరులు. వీరు 'రామకృష్ణాంజలి' యను నొక పద్యకావ్యమును రచించిరి. మరియు నింకే అప్రకటిత గ్రంథములగు 'వివేకాందోపన్యాస ప్రవాహములు' 'శింగరిదాసు' మొదలుగాగలవి పెక్కు. వీరు ప్రఖ్యాత చిత్రకళాదురంధరులు.

ఇక హనుమంతరావుగారి ప్రథమపుత్రులు రసాయనశాస్త్రజ్ఞులు వీరిపేరు బాపయ్య వీరు వక్తృత్వమున కధినాయకులు. ఆదిపురుషు నుండి ప్రస్తుతము 9–10–11 తరములు జరుగుచున్నవి.

ఈకుటుంబమువారిలో వెంకటమంగయ్య శర్మ, వెంకటప్పయ్య పంతులు గ.త్తయ్యపంతులుగార్లు చాలాప్రఖ్యాతి పురుషులు ఇందు రత్తయ్యగారనువారు గుళ్ళకమ్మనదియొద్ద కట్టించిన పెద్దభవంతి చాల మందిచే ఆశ్చర్యముగా కొనియాడబడుచున్నది.

వీరి కనుశ్రుతముగా ధేనుగొండ, మామిళ్ళపల్లి, దేశిరాజు, పులిపాక, మునిపల్లె, కల్లపాలెము, అడవికొలను, లక్కరాజు, పమిడిపాడు, పోలవరపు లింగరాజు మున్నగుకుటుంబములవారితో సంబంధ బాంధవ్యములుగలవు. ఈ కామరాజు కుటుంబమువారిపుడు అద్దంకి వద్ద చక్రాయపాలెం నరసారావుపేటవద్ద అనంతవరము, నెల్లూరు, తత్సమీపములోని కోవూరు, బెజవాడ, బాపట్ల, ఏలూరు, అద్దంకి వద్ద వెంకటాపురము, రాజమండ్రి, గూడూరు మున్నగు ప్రదేశముల యందుండిరని ఈ వంశమువారగు కామరాజు వాసుదేవముకుంద రావు గారివల్ల తెలియవచ్చినది.

(౨) శ్రీవత్సగోత్రికులగు కామరాజువారు:— ఆర్వేలనియోగులలో ఈ కుటుంబము వారిలో శ్రీవత్సగోత్రికులు గలరనియు—వారు ప్రస్తుతము- శేపల్లె- అద్దంకి వెంకటాపురం గ్రామముల యందున్నటును వీరు బాపట్లలో నుండు దేశిరాజువారి చుట్టము లనియు తెలియుచున్నది.

(౩) కామరాజువారిలో యాజ్ఞవల్క్యులు వంగవోలు తాలూకా పూసపాటిగ్రామముకు రామప్రధానిగారి కాలములో శాండిల్యగోత్రీలగు ప్రథములకు సంప్రతియివ్వబడినట్లున్ను, బాపట్లతాలూకా నూతుల పాడుగ్రామములోనివారు కాశ్యపగోత్రీకులగు ప్రథము లని కొండవీటి దండకవిలెయం దున్నది. కాశ్యపగోత్రీకులగు కామరాజువారు యాజ్ఞవల్క్యులయందు గలరా నూతులపాడు గ్రామములోని వారు ప్రథములనుట పొరపాటో తెలియదు. శాండిల్య గోత్రీకుల్ల ప్రథము లిపు డెచట నుండిరో తెలియదు.

# అనుబంధము.

శ్రీగిరిరాజువారు:— 1 పుటలోచేర్చునది శ్రీగిరిరాజు సుబ్రహ్మణ్య బ్రహ్మణ్యుడు మహావాక్య దర్పణము అను పద్యకావ్యము రచించెను. సమగ్రప్రతి చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తకాగారమున నున్నది.

నారాయణంవారు:— 64 పుటలో చేర్చవలెను. శైవగోత్రీకులు ఆరామద్రావిడులు అని తెలియుచున్నది. ఈ నారాయణంవారి పూర్వపుయింటిపేరు పొన్నూరివారనియు, పొన్నూరు నారాయణ అను వారిని నారాయణపురం- తురుమెల్ల- ఆలయములలో అర్చకులుగా నియమించబడిన వెనుక నారాయణం వారైనట్లు చెప్పుచున్నారు.

శ్రీ పాదన్నవారు:— 71 పుటలో చేర్చవలెను. శ్రీపాదన్న వారికి పూర్వము కామవరపుకోట పెంటపాడు పరగణాలకు తల్లాప్రగడ వారితో దేశపాండ్యా భాగములుండెడివి, వీరిభాగము దరిమిలాను మంచిరాజువారి కిచ్చివేసినట్లు తల్లాప్రగడవారి చరిత్రలో కలదు.

నండూరివారు:— 85 పుట చివర. పైనుదహరించిన గోత్రీకులలో నండూరి సీతయ్యగారు, విజయగోపాలముగారు, మూర్తి రాజుగారు, రామలింగయ్యగారు, లక్ష్మణరాజుగారు, కామయ్యగారు, తిమ్మరాజుగారు, విస్సంరాజుగారు, వీణతిమ్మరాజుగారు, వెంకటాచారిగారు, నరసింహముగారు, భీమప్పగారి కామరాజుగారు, వెంకట సుబ్బారావుగారు అనువారందరు కవులు. వీరు రచించిన గ్రంథములు వివరముగా తెలియనందున నిటవివరించలేదు.

శిష్టావారు:— 35 పుటలోచేర్చవలెను. యజుశ్శాఖ- ఆపస్తంబ- కౌండిన్య- వాసిష్ఠ- మైత్రావరుణ కౌండిన్య అని త్ర్యార్షేయము. వీరుకాసలనాటి వైదికులు. వీరిపూర్వము కాపురము గోదావరి జిల్లా

లోని అమలాపురము తాలూకా బోడసకుర్రు 200 సంవత్సరములకు పూర్వము కాశీపతి సోమయాజులుగారి కుమాళ్లు దక్షిణామూర్తి హావి ర్యాజిగారు బందరులోనున్న శ్రీ కాంద్రేగుల జోగీ జగన్నాథరావు బహద్దరుగారి జమీకి దివాన్‌గా వచ్చిరి. ఆపదవినుండి దివితాలూకా తహాశ్శిలుదారుగా పనిచేసి ఆతాలూకా నా.గాయలంక గ్రామములో వసతిసంపాదించుకొని అచటనే కాపురముండిరి. వీరి మనుమలగు దక్షిణామూర్తి శాస్త్రిగారు నాగాయలంకలో రెండుదేవాలయములును, అమలాపురం తాలూకా బోడసకుర్రులో ఒకఆలయము కట్టి ప్రతిష్టచేసిరి. ప్రస్తుతము బుచ్చమ్మ అగ్రహారం వగయిరా ప్రదేశములలో నున్న శిష్టావారు వీరుజ్ఞాతులే సోమయాజులుగారి కుటుంబము నర్సాపురములోగలదు వీరి కనుశ్శృతముగా దవేజివారు చక్రావ ధానుల వారితోనూ- పొన్నపల్లివారితోనూ- సంబంధములు గలవని నాగాయ లంక కాపురస్తులగు శిష్టా పిచ్చెయ్యగారివల్ల తెలియవచ్చినది.

కస్తూరివారు:— 125 పుటలో 'తాళపత్ర గ్రంథములలో అనేకములు గౌతన్నగారి వలన వ్రాయబడినట్లు కనుపించుచున్నవి. అను వాక్యము పిమ్మట చేర్చునది.

కస్తూరివారి సానరములోనుండు శివయ్యగారి కయిదుగురు కుమాళ్లు ఈయనతమ్ముడు సోమప్ప ఈయన దత్తపుత్రుడు సుబ్బారాయుడు. ఈయనకు సోమప్ప, శివశంకరం అనుకుమాళ్ళు వీరి తండ్రిగారు సానరమువిడచి రాజోలుతాలూకా విశ్వాసరాయ పురమున నివాసమేర్పరచుకొనిరి. అచట వీరికి కొంతఆస్థి దఖలుపడినది, రెండవవారగు శివశంకరముగారే కవి ఈయన గానవిద్యాప్రవీణుడు ఈయన కొచ్చెర్లకోట కామరాజుగారి శిష్యుడు. ఈయన కిద్దరుభార్యలు ప్రథమము గూడవిల్లి కాపురస్తులగు కొమరగిరి పట్టెయ్యగారి కుమార్తె

ద్వితీయము తాడిమేటి పరదేశరాజుగారి కుమార్తె ఈయనకు పుత్రసం
తతిలేకపోవుటచే అవసానకాలమున తన ఆస్తినంతయు కుమార్తెలకు దఖ
లుపరచి స్వర్గస్తులైరి. అనుమాటలు చేర్చి 'రాజోలు తాలూకాలోని
విశ్వాసరాయపురమున కస్తూరి శివశంకర కవియను నొక బాలకవి
యుండెడువారు' అను మాటలు తగ్గించుకోవలెను.

## ఏనుగువారు

వీరి చరిత్ర 90 పేజీలో ప్రచురమైన 'వెనుక ఈ వంశస్థులలోని
వారగు యేనుగు తమ్మిరాజు పంతులుగా రీ దిగువ విషయములు తెలి
యపరిచిరి గాన వాని నీ దిగువ నుదహరించుచున్నాము.

మా వంశచరిత్ర సుప్రసిద్ధముగా నాంధ్రకవుల చరిత్రమునందు
శతకకవుల చరిత్రమునందు భర్తృహరి పీఠికయందు చాలభాగము వ్రా
యబడియున్నది. మా పితామహులగు విస్సయ్యగారివరకు మాకు
పెద్దాడ గ్రామమె నివాసము. మా పూర్వులు లక్ష్మణకవి ప్రభృ
తులే గాక పెక్కుమంది కవిత్వమునీదనే ఆధారపడి వెలుగు రాజు
లను, రాజబంధుగులను ఆశ్రయించి పెక్కు భూవసతులు సంపాదించిరి.
ఇందు అనంతుడను కవిశిఖామణి సంపాదించిన భూమి నా కిప్పటికిని
నొక యెకరము భుక్తములో నున్నది. ఈ అనంతునిగురించి ఆంధ్రక
వుల చరిత్ర పేర్కొనుచున్నది. మాకు మా తాతగారి కాలములో
ముప్పది యెకరముల భూమి నివాస స్థలమును గలవు. తదుపరి మా
తండ్రిగారు బుచ్చిరాజుగారి కాలములోనూ, మాతామహక్షేత్రము నాకు
సంక్రమింపగా నీ తాపేశ్వరము వచ్చినాము. ఇయ్యది ద్వారపూడి
రైలు స్టేషనుకు సమీపమున గలదు. మా మాతామహులు సత్య
వోలు తమ్మిరాజుగారు. మాకు సత్యవోలువారితోనూ, అడ్డరపువా

రితోనూ, పుణ్యమూర్తులవారు పులుగుర్తవారితో కూడ సంబంధము లు గలవు. మా అనంతుడుగారి కాలములోనే పెద్దాడ గ్రామమునకు కరణీకము సంపాదించి రనియు, నది కాలక్రమమున అన్యాక్రాంతమైన దనియు, మా పెద్దలవలన వినియుంటిని. మా పూర్వులు వ్రాసిన తాళపత్రగ్రంథములు మాతృకలు, పీచుకాగితములు మున్నగునవి ఇప్ప టికి మా బంధుగులగు చాగంటి సుబ్బారాయుడుగారివద్ద నున్నవి.

వీరు మా తండ్రిగారి మేనత్త కుమారులు. వయోవృద్ధులు. కాకినాడ తాలూకా కరప గ్రామమునకు గ్రామాధికారులు. వారిచ్చి న మా వంశవృక్షమును నాచే రచింపబడిన శ్రీరామ, శ్రీకృష్ణ, మహా త్మశతకము, బుచ్చిరాజీయముఅనుగ్రంథము లిందులో పంపించితిని.

ఇట్లు,

ఏనుగు తిమ్మిరాజు.

వారు దయచేసిన వంశవృక్ష మిట్లున్నది. మూలపురుషుడు 1 పైడిపాటి సింగనమంత్రి. ఈయన కుమారుడు 2 జలపాల సచివుడు. ఈయన ఏనుగు బహుమతిగా గైకొనెను. ఈయన కుమారుడు 3 గరికిరాజు. ఈయన కిద్దరు కుమాళ్ళు. 4 గురుమూర్తి. 5 గురవరాజు ఈయన వత్సవాయివారివద్ద మంత్రి. ఈయనకు 6 పెదలక్ష్మణకవి. ఈయ న పెద్దాపుర సంస్థానకవి. ద్రౌపదీ పరిణయ కర్త. ఈయన కుమార్తు 7 తిమ్మన్న. 8 గురురాజుగార్లు. ఈ తిమ్మన్నగారి భార్య పేరమ్మ. ఈ దంపతులకు 9 అనంతుడు గౌరీ పరిణయకర్తయై 12 పుట్ల ఈనాం సం పాదించెను. 10 లక్ష్మణకవి సుభాషితరత్నావళి కర్త. 1729 నాటి వాడు. 11 వీరభద్రుడు అను ముగ్గురు కుమాళ్లు. ఇందు 9 అనం తునకు 12 గురురాజు, 13 తిమ్మన్న అను ముగ్గురు కుమాళ్ళు. అందు పెద్దవాడగు 12 గురురాజునకు 14 చినవీరభద్రుడు—ఈయనకు 15 గు ర్రాజు—ఈయనకు 16 కామరాజు—17వీర్రాజు. ఇందు కామరాజుకు

18 గురురాజు. ఈయనకు 19 కామరాజు. 20 వెంకట్రాజు—21వీరరాజు అని ముగ్గురు కుమాళ్ళు. అందు పెద్దవాడగు 19 కామరాజుకు 22 గురురాజు. ఈయన యిప్పు డున్నారు. ఇంతవరకు 9 అనంతుని పెద్దకుమారు డగు 12 గురురాజుగారి సంతతి.

ఇక 9 అనంతుని రెండవకుమారు డగు 13 తిమ్మన్నగారి సంతతి దెలిపెద.

13 వాడగు తిమ్మన్నకు 23 సుందరప్ప, 24 గురురాజు అను ఇద్దరు కుమాళ్లు. 23 సుందరప్పకు 25 తిమ్మన్న. ఈయన విశ్వేశ్వర శతక కర్త. [అముద్రితము.] ఈయనకు 26 సుందరప్ప 27 విస్సయ్య. ఈయన కుమారుడు 28 బుచ్చిరాజు. ఈయన కుమారుడు 29 తిమ్మరాజుగారు—యిప్పుడున్నారు. శ్రీరామ—బుచ్చిరాజీయాది గ్రంథకర్త. ఈయన తండ్రిగా రొకనా డీయనతో నిట్లనియెనట—

సీ॥ మన లక్ష్మణుం డార్య వినయ విధేయుండు
విరచించె ద్రౌపదీ పరిణయంబు
మన లక్ష్మణకవి రామవిలాస మాదిగా గల
గ్రంధములు పెక్కుగా రచించె
మన యనంతుండు మహామాన్యుండు రచించె
గౌరీపరిణయాది కావ్యములను
మన తిమ్మకవి సార్వభౌముండు విరచించె
బహుశతక గ్రంథపద్యములను
మన తిమ్మరాజు సుజన సమ్మతమ్ముగా
రచించె విశ్వేశ్వర శతకము

గీ॥ నీవు నాపేర నొక గ్రంథ మిపుడు సుకవి
సార్వభౌముల హృదయరంజకముగాగ,

మెచ్చుకొనునట్లు రచియింపుమిా కుమార!
వీరగుణాధార! విమల సాగరగభీరా!

అనిచెప్పుటచే తామిాగ్రంథము రచించి, కడపట నిట్లు ముగించిరి.

క॥ ధరబుచ్చి రాజు మంత్రీ
శ్వరుకీర్తి వదాన్య రూప శౌర్యంబులు నా
హరిసూనుని హరిసూనుని
హరిసూనుని హరుని సూను ననిశము జెగడున్.

వీరిలో 7 తిమ్మకవిగారి పెద్దకుమారుడు 9 అనంతుడుగారి రెండవ కుమారుడు 13 తిమ్మన్నగారి వంశము చెప్పబడినది.

ఇక 7 తిమ్మకవి 2వకుమారుడు సుభాషితరత్నావళి గ్రంథకర్తయగు 10 లక్ష్మణకవిగారివంశము—చెప్పెదను. ఈలక్ష్మణకవికి 30 తిమ్మన్న 31 పేరయ్యఅనుయిద్దరుకుమాళ్లు. 30తిమ్మన్నకు 32 వీరభద్రుడు 33 లక్ష్మణమంత్రి.ఇందు 32వీరభద్రునికి 34పేర్రాజు 35 తిమ్మన్న-36లచ్చన్న-అనిముగ్గురు ఇందు 34 పేర్రాజుకు 39 ఉమాపతి- 35 తిమ్మన్నకు 40 లచ్చన్న యీాయనకు తిమ్మన్న- లక్ష్మణమంత్రి మూడవ కుమార్డు 36 లచ్చన్నకు 42 రామన్న 43 పట్టాభిరామయ్య ఇందు రామన్నకు 44 లచ్చన్న-ఈయనకు 45 రామన్న-46 సూరయ్య- 47 వెంకటరావు- 48 పట్టాభిరామయ్య-43 నెంబరు పట్టాభి రామయ్యకు 49 లక్ష్మీకాంతంగారు ఈ కడపటివారందరు యిప్పుడున్నారు. 33 లక్ష్మణమంత్రికి 37 సుబ్బన్న 33 తిమ్మన్న అనుకుమాళ్లుగలరు ఇది ఏనుగువారి వంశవృక్షము. ఈవంశీకులలో గొందరిప్పుడు కాకినాడ, కాంద్రకోట, దొడ్డంపేట మున్నగుగ్రామములలో నున్నటుల తెలియుచున్నది.

☞ రెండవభాగ మచ్చుపడుచున్నది.

అయ్యా? దయచేసి తమకుటుంబచరిత్రనుబంపిన వెంటనేబ్రచురింప బడును. ఇపుడు మీరు బంపనిచో మీ చరిత్ర విడువవలసివచ్చును.

విజ్ఞాపన

ఆర్యసోదర మహాశయులారా,

ఇప్పుడు నేనారంభించిన 'విప్రకులదర్పణ' మనుగ్రంథమున:—

1. నియోగులు:—వీరిలో [a] ఆర్వేలనియోగులు (వెలనాటి) [b] పాకనాటి; [c] తెలనాటి; [d] వేగినాటి; [e] పెసరవాయ; [f] లింగధారి; [g] బడగలనాటి; [h] యాజ్ఞవల్క్య, [i] నందవరీక, [j] ఆర్వేల కమ్మనియోగులు.

(2) వైదికులు:[a] తెలనాడు, [b] వెలనాడు, (c) కాసలనాడు (d) ములికినాడు, (e) బడగలనాడు, (f) వేగినాడు, )g) యాజ్ఞవల్క్య, (h) నందవరీక, (i) ఉల్చుకమ్మ మొదలగు తెగలు.

(3) ద్రావిడులు, పేరూరు, ఆరామ, తుమ్మగుంట, దిమిల, పుదూరు

(4) శ్రీవైష్ణవులు:—వడగల, తెంగల, ఆంధ్ర.

(5) వ్యాపారులు:—మధ్వ, కర్ణకమ్మ, గోలకొండ.

(6) వైఖానసులు:—

(7) శైవులు (లింగధారులు)

(8) వెలనాటి పూజారులు: (ఒకవైదిక తెగ)

(9) అదిశైవులు లేక శివద్విజులు

ఈ శాఖలవారిఅన్ని కుటుంబముల చరిత్రలు ప్రచురింపబడును—గాన బ్రాహ్మణులలోని పై శాఖల వారందరు దిగువ ప్రశ్నల కుత్తరువులు వ్రాయుఁగోరెదను.

## ప్రశ్నలు

1. మీరే శాఖా బ్రాహ్మణులు అనగా వెనుక పుటలోని శాఖలలో వివరములు.
2. మీరే వేదము ననుసరించుచున్నారు?
3. మీ సూత్ర మెయ్యది?
4. గోత్రమేమి?
5 ప్రవర యెట్లు చెప్పుకొనుచున్నారు?
6. మీ ఇంటిపేరెయ్యది? పూర్వ మింకొక ఇంటిపేరుండి దరిమిలా మారినదా? మారినచో కారణమేమి?
7. మీ ఇంటిపేరుగలవారిలో మీ గోత్రముగాక భిన్నగోత్రీకులుండిరా? ఉండిన వారెచటనున్నారు?
8. మీ కుటుంబమువారి అనాదికాపుర మెచట యిపుడేయే తాలూకా ఏ ఏ గ్రామాదులలో మీ ఇంటిపేరుగలవారున్నారు.
9, మీకుటుంబమువారనుక్రమముగా యే యే కుటుంబములవారితో సంబంధములు చేయుచున్నారో దెలసినచో వారిగోత్రములు వారునివసించు గ్రామముల పేర్లు వేరు వేరుగా వ్రాయించుడు
10 మీకుటుంబమువారిలో ప్రఖ్యాతపురుషులు, దాతలు, కవులు, కర్మిష్ఠులుండినచో వారిచరిత్రసంగ్రహము వారురచించిన గ్రంథములు, చేశ్ని ధర్మకార్యములు, వారికిగలబిరుదులు, పూర్వము పుట్టబడిన పర్మావాలు, మున్నగు వివరములు దెలుపగోరెద. ప్రస్తుతముండువారిలో ఎన్నదగినవారుండిన వారిపేర్లతో వారిచరిత్రమతి క్లుప్తముగా వ్రాయించగోరెద.

# అభిప్రాయములు.

ఆర్యవర్యా!

పాశ్చాత్యవిద్యా ప్రభావమున సంధ్యావందనాదులు మాని బ్రాహ్మణ బాలుర తమగోత్రమేదియోకూడఁ జెప్పుకొనలేని స్థితిలో నున్నప్పుడు మీరీ పత్త్రికను బ్రకటించుట యెంతయు సంస్తవనీయము.

ఆంధ్రదేశమందలి విప్రకుటుంబముల యింటిపేరులు, ఉనికి పట్టులు, వేద శాఖలు, గోత్రములు, అందు సుప్రసిద్ధులైన పూర్వపురుషులు, ఇత్యాది విషయములను గురించిన వృత్తాంతములు శ్రమపడి సంపాదించి మీపత్త్రికాముఖమున వెలువఱుచుచు లోకోపకారముచేయ మీరు సమకట్టినారు. పరమేశ్వరుని కృపవలన మీ సముద్యమము నిర్విఘ్నముగా నెఱవేఱుఁగాక.

ఇట్లు భవన్మిత్రుఁడు,

కూచి నరసింహము, బి. ఏ. యల్. టి.,

మహారాజశ్రీ విప్రకుల దర్పణాధిపతిగారికి, అయ్యా! మీరు ప్రచురించుచున్న విప్రకుల దర్పణము మహోపకారముగ నున్నది. విప్రులు వారి పూర్వుల యున్నత చరిత్రములు జూచి యట్లే తమరు నభివృద్ధి బొందుటకు సహకారియగుచున్నది. ఇది విప్రులకేగాక యితరులకును లాభకరము. మఱియు నిదియొక విధముగ బండితకవుల చరిత్రముగ నుపచరించుచున్నది. మీ యీ యుద్యమము స్థైరము కొనసాగించునుగాక. దీనికందఱు సహాయభూతులు కాఁగోరువాఁడ.

నిడమర్తి జలదుర్గప్రసాదరాయుడు, బి. ఏ.

రాజమండ్రి, 19—2—37.

అయ్యా!

మీరు పూనుకొని చేయుచున్న యుద్యమము చాలాగొప్పది. ఉత్కృష్టమైన బ్రాహ్మణ కుటుంబములు వేనవేలుగ వ్యాపించి యున్నవి. వాటి అన్నిటి చరిత్రి సంపాదించుట దుర్ఘటముగాని మీ ధైర్యసాహసములు కడు ప్రశంసనీయము. మనుష్య ప్రయత్నమునకు దైవసహాయము కలిగినయెడల నెట్టియుద్యమమైనను దప్పక కొనసాగగలదు. ఈపద్యము పూర్తిగా కొనసాగించుటలో దైవము దమకు తగు శరీరదారుఢ్యము ఆయురారోగ్యాభివృద్ధులుఅను గ్రహించుగాత అని నాప్రార్థన.

పాలకోడేటి వీర్రాజు పంతులు బి. ఏ. యల్. టి., రిటైర్డు సీనియరు,

డిప్యూటి యిన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్సు,



కొవ్వూరు,